# ఆంధ్ర కవితా పితామహుడు

రచన

జి. ఆంజనేయులు B. A., B. Ed.



**Andhra Kavitha Pithamahudu**

a Historical Novel

by Sri G. Anjaneyulu, B. A., B. Ed,,

Published by Premchand publications, Vijayawada.



మూల్యము :

రూ. 12/-

సంపాదకుడు :
“ఛాయేశ్వర్”

ముద్రణ :
స్వరాజ్యలక్ష్మి ప్రింటర్స్,
విజయవాడ-2

# ప్రవేశకము

'ఆంధ్ర కవితా పితామహుడు' అనే ఈ చరిత్రాత్మక నవలను శ్రీ ఆంజనేయులుగారు ఆనాటి చరిత్రను ఎంతో శ్రద్ధగా పరించి భావనా బలము జోడించి హృద్యముగా రచించినారు. శ్రీ కృష్ణదేవరాయలకన్నులు పీకించమని ఆజ్ఞాపించిన అన్న వీరనరసింహరాయల అంత్యకాలముతో ఈ కథ సరిగా ఆరంభమై శ్రీకృష్ణదేవరాయలు పరమపదించుటతో సమాప్తమవుచున్నది. అందువలన నిందులో శ్రీకృష్ణదేవరాయల పరిపాలనా కాలమంతయు వర్ణితమైనది. కథా సందర్భమును బట్టి ప్రధాన సంఘటనలు కొన్ని విస్తరించియు, కొన్నిటిని స్పృశించియు నవలాకర్త ప్రదర్శించిరి. తారణ సంవత్సరములో రాయలు మరణించెనను చాటువును గ్రంథకర్త అనుసరించినందున క్రీ. శ. 1509_1525 మధ్యకాలములో జరిగిన 16 సం॥ల పరిత్ర ఈ నవలలో చిత్రించిరి. శ్రీ కృష్ణదేవరాయల రాజ్యపరిపాలనమును, విజయ యాత్రలును, కవితాగోష్ఠులును తెలిసికొన గోరు వారికిది దిక్ప్రదర్శనముగా ప్రపంచించుచున్నది.

పెద్దనామాత్యుడు మనుచరిత్ర రచించిన మహాకవియనియు, రాయల యాస్థానములోని అష్ట దిగ్గజకవులలో నగ్రగణ్యుడనియు మాత్రమే కవి పండితలోక మెరుగునుగాని, ఆయన సీమాధిపత్యము కూడ నిర్వహించిన రాజపురుషుడుకూడనని చరిత్ర విద్వాంసులకు మాత్రమే ఇంతవరకు తెలిసియున్నది. రాయలు నాయంకరముగా తనకు ప్రసాదించిన కరవాచిసీమలోని అన్నూరు గ్రామమున వరదరాజస్వామి వారి ఆలయము నిర్మించినట్లు ఆంధ్ర కవితా పితామహ బిరుదాంకితులును, అల్లసాని చొక్కరాజుగారి పుత్రులునైన పెదిరాజుగారు ఆర్కాటు జిల్లాలో పసుమలై గ్రామములో శ. వ. 1442 ప్రమాదిలో (క్రీ. శ. 1519) వేసిన శాసనములో కలదు. ఈ నవలలో ఆంధ్ర కవితా పితామహుని కవిత్వాతిశయముతోపాటు రాజపురుషత్వముకూడ ఆది నుండి యంతము వరకు పోషింపబడుట ఎంతయు పమ్మోదావహము.

నవలకు గ్రంథకర్త పెద్దన బిరుదమే పేరుగా  ...ినను శ్రీకృష్ణదేవరాయల చరిత్రము ఇందులో సమాన ప్రాధాన్యము  ...ంచుచున్నది.

శ్రీకృష్ణదేవరాయలను కన్నులు పీకివేయుంపక తప్పించి తిమ్మరుసు ఆయనను రక్షణార్థము ఆదవాని దుర్గమునకు మారువేషముతో చొక్కనా మాత్యులకడ కంపుటతో కథ ప్రారంభమైనది. అక్కడనే రాయలకును పెద్దనకును స్నేహానుబంధ మేర్పడినది. తుదకు రాజద్రోహుల కుట్రయని తెలియక తిమ్మరుసు ద్రోహియని భ్రమపడి ఆయనను రాయలు శిక్షించుట, ఆ పిమ్మట పెద్దన సాహసప్రబోధముచే సత్యమెరిగి పశ్చాత్తప్తుడై రాయలు ప్రాణములు వదలుట, అంతట పెద్దన విరక్తుడై తిరుమలపతి శ్రీనివాసుని సన్నిధానమునకు చేరుకొనుటతో కథ ముగియుచున్నది. ఈ విధముగా పెద్దనామాత్యునకును, రాయలకును గలిగిన గాఢస్నేహానుబంధకథగా గూడ ఈ నవలను భావింపవచ్చును.

ఇందంతట ననుస్యూతముగా తిమ్మరుసు సర్వతోముఖప్రజ్ఞ గోచరమగును. ఆదవాని దుర్గాధిపతియైన అజపర్కె తిమ్మన మొదటి నుండి తుదివరకు రాజద్రోహిగా చిత్రింప బడినాడు. ఆ ద్రోహము ఆదిలో ఫలింపకపోయినను, తుదకు తిమ్మరుసుపై రాయలకు సందేహము కలిగించుటలో ఫలవంతమైనది. ఇందులో వీరమల్లు, కొండోజీ, గోవింద రాజు పాత్రలును విశిష్టశక్తితో చిత్రితమైనవి.

రాయల విద్యాగోష్ఠులు, మనుచరిత్ర కృతిసమర్పణోత్సవాదులు విద్యానగర యోధుల వీరవిహారములతోపాటు మనోజ్ఞముగా నిందు కాన నగును. గ్రంథకర్త ఆనాటి చరిత్రను మధించి ఈ నవల నిర్మించెను. కేవల మనుమేయములైన విషయములలో వ్యక్తిగత భేదములనుబట్టి అభిప్రాయ భేదములుండుట సహజము. గ్రంథకర్త చేసిన నిశ్చయము లలో ఇతరులేకీభవింపని సంశయములలో గూడ వారి పరిష్కారములు సర్వథా విచారణీయములుగానున్నవి.

ఈ నవలను పఠించు పాఠకులు కథాకల్పనచే పొందు వినోద ముతోపాటు శ్రీ కృష్ణదేవరాయలనాటి శ్రీ విద్యానగరౌన్నత్యమును గూడ కన్నుల గట్టినట్లు దర్శింపగలరనుటకు సందేహములేదు.

రేపల్లె
22.11

నోరి నరసింహశాస్త్రి

# పరిచయము

## శ్రీ శివశంకరస్వామి

సామాన్య కవులనుగూర్చి నవలలు వ్రాయుట అరుదు. అందులో సుప్రసిద్ధులై కాలము గడచిన వారినే నాయకులుగా చేకొనుట సహజము. ఆంధ్రసాహిత్యములో ఈ విధముగా తొలుత రచన చేసినవారు శ్రీ నోరి నరసింహశాస్త్రి.

ప్రసిద్ధ కవిని గాని, చిత్రకారుని గాని, తత్త్వవేత్తను గాని నాయికునిగా గైకొని రచన ధారాళముగ సాగించినవారు ఐరోపా, అమెరికా రచయితలు ఈ శతాబ్దిలో ద్వితీయ దశకాంతము నుండి France, England, United States మొదలగు ప్రదేశములలో రచయితలు సుప్రసిద్ధులైన శిల్పులను చిత్రకారులను కొలదిగా కవులను గూర్చి గొప్ప గొప్ప గ్రంథములను రచించి ప్రకటించినారు. అవి భరత భూమికి వ్యాపించినవి. అనేకులు చదివి రమ్యమార్గము లవలంబించినారు.

మన ప్రాచీనాంధ్ర కవుల చరిత్రలు నవలా కల్పనలకు తగినంత వివరములతో లభింపవు. కొంతలో వట్టి పుక్కిటి పురాణములు, కొన్ని కొన్ని ఐతిహ్యములు కథా కల్పనకే అనుగుణములు కావు. కొన్ని అభూత కల్పనలతో నిండి సంభావనా శ్రేణికి చెందనేరవు. ఎట్లో సరిపెట్టి వానిని కథాబద్ధము చేసినను హేతువాదులు నమ్మరు. కావున సంభావ్యశ్రేణి లోనికే వచ్చు ఘట్టములను అవలంబించి వర్ణించి నచో నవలలో నవ్యత్వమేకాక సహజత్వముకూడ విలసిల్లును.

ఈ నవల రచించిన ఆంజనేయులుగారు రచనలో సిద్ధహస్తులు ఈయన దేశచరిత్రము బాగుగా అధ్యయనము చేసి అందలి హృదయంగమ ఘట్టములను కథలుగా రచించినారు. దీర్ఘమగు వృత్తములను వర్ణించి నవలలుకూడ రచించి, పేరుగాంచినారు. ఇప్పుడు 'ఆంధ్రకవితా పితామహుడు' అను పేర ఐతిహాసిక నవల రమణీయముగా రచించినారు.

ఐతిహాసిక నవలలలో నాయకుని విషయము కొలదిగను, దేశము లోని కల్లోలములు, కుట్రలు, అన్యరాజ వైరములు, అంతఃకలహములు, యుద్ధములు మొదలగునవి అధికముగను స్థానము నొందుచుండును. నడుమ నడుమ మాత్రము నాయకుడు కొలదిగా తొంగి చూచుట సంభవించుచుండును. ఈ నవలలో వివిధ ప్రకృతులు కల స్త్రీ పురుషులు, బాలురు వృద్ధులు, వీరులు భీరులు, రాజభక్తులు ద్రోహులు, మంత్రులు దండనాయకులు, హిందువులు ముసల్మానులు, బుడతకీచులు ఇత్యాదు లెందరో సందర్భానుసారముగ రంగముమీదకు వచ్చి రాలిపోవుదురు. ఇన్ని జరుగుచున్నను 'ఆంధ్ర కవితా పితామహుడు' అను బిరుదము పొందిన అల్లసాని పెద్దనకు అన్నిటను ప్రాముఖ్యము కలదు అట్లు సంభవించుట రచయిత ప్రతిభకు నిదర్శనమని చెప్పనొప్పును.

పూవు పుట్టగనే పరిమళమన్నట్లు కథాప్రారంభముననే పెద్దన స్వరూప స్వభావములు ప్రస్ఫుటముగా తెలియవచ్చును. తత్పాత్రచిత్రణము మానవ స్వభావమును, మన స్తత్వమును, శీలమును బట్టి సుహోజ్వలముగా జరిగినది. ఏదైన ధర్మగ్లాని సంఘటిల్లినపుడు పెద్దన ఎట్లు ప్రవర్తించెనో ముందుగనే ఊహింపవచ్చును. ఈ నవలలో కల్పన, రచన, నిర్వహణ, అన్నియు నిపుణము గా నున్నవి. ఇతిశివమ్ !

శివశంకరస్వామి

సాహితీ సమితి

ఒంగోలు.

# అభినందనం

ఈ నవల నన్ను ఆసక్తితో చదివించింది. రెండు మూడు విధాల నచ్చింది కూడాను.

చారిత్రక నవలల్లో కథ చాలా అల్పంగానూ, కథా కాల వాతావరణ సృష్టికోసం జరిగే వర్ణన అత్యధికంగానూ ఉంటూ ఉంటాయి. ఇందులో అలాకాక మొదటినుంచి చివరి వరకూ చెప్పుకోదగినంత కథా కల్పన ఉంటూ అనేక సన్నివేశాల్లో హృదయాన్ని కదిలిస్తూ ఉంది. కథ అందుకోవటానికి ఈ పేజీలు దాటివేయవచ్చు ననిపించే భాగాలు లేనే లేవు.

ఇందులో పెద్దనగారి జీవితాన్ని సమగ్రంగా చిత్రించే ప్రయత్నం సముచితంగా జరిగింది. పెద్దనను గూర్చి తెలియవస్తున్న ప్రతి చిన్ని అంశానికీ చక్కని సన్నివేశాలు కూర్చబడ్డాయి. రాయలు రాజూ, పెద్దన ఆస్థాన కవీ అన్న అనుబంధమేకాక వారిరువురికీ గాఢమైన మైత్రీ బంధం ఉంది ఉండాలని రాయ లాయన్ని గౌరవించిన విధానాన్ని బట్టీ ఎవరికైనా అనిపిస్తుంది. ఆ మైత్రీబంధ మెలా ఏర్పడిందో దానివల్ల వారు పరస్పరం ఎలా ప్రభావితులయ్యారో ఈ నవల రసవంతంగా నిరూపిస్తోంది.

పెద్దన మనుచరిత్రలో వరూథినీ ప్రవరాఖ్యుల ఘట్టం తక్కిన ఘట్టాల కంటె ఎంతో ఎక్కువ ప్రచారం పొందింది. విజ్ఞులు పెద్దనగారి కవితాశక్తి ఆఘట్టంలో కంటె తక్కిన ఘట్టాల్లోనే ఎక్కువ ఉందని వాదిస్తే వాదించవచ్చు. కాని దానికున్న ప్రచారాన్ని కాదనడానికి వీలు లేదు. ఆ ఘట్టాని కంత ప్రచారం రావడానికి అందులో కవి ఆత్మీయత తొంగిచూస్తూ ఉండడమే హేతువని ఈ నవలా రచయిత అభిప్రాయం. అందుకనే అట్టి సన్నివేశం కవి జీవితంలోనే తటస్థించి ఉండాలని మేఖలా వృత్తాంతాన్ని కల్పించారు. ఈ మేఖల కేవలం వరూథినికి ప్రతిబింబం మాత్రమేకాక రమణీ ప్రియదూతిక గూడా అయి పెద్దనగారి

ఆర్ద్రహృదయాన్ని మారగొన్నది. ఆమె ఉమాదేవి నాయన కల్పగించిన ఘట్టాన్ని ఒక పట్టాన మరిచిపోలేము. ఇంతటి సజీవ పాత్ర నిర్మాణానికి రచయిత నిజంగా అభినందనీయులు.

గజపతి కుమార్తె అన్నపూర్ణాదేవి కథ ఈ నవలలో కొత్తదారులు తొక్కింది. పెద్దన అగ్నిద్యోతను డై రాయల కామె ప్రేమ సందేశాన్ని తెలియజేశాడు. సంగీత వశంవదయై ఆమె అంతఃపుర నియమాల నతిక్రమించి రాత్రివేళ ఉద్యానవనంలోకి వెళ్ళగా అది రాయల వైముఖ్యానికి హేతువు కావడమూ, ఏపాపము ఎరుగని ఆమె పట్ల రాయల సౌముఖ్యాన్ని సాధించడానికి అన్నపూర్ణా విరచిత భృంగ గీతికాలాపాన్ని మేఖలా భట్టుమూర్తులచే పెద్దనగారే చేయించడమూ ఎన్నో విధాల సముచితాలైన కల్పనలు. తలవైపు కాళ్ళు పెట్టుకొన్నందు వల్లనే రాయలు వైముఖ్యాన్ని పొందాడంటూ వినవచ్చే కథలో ఉన్న చులకన తనం ఇందులో లేదు. అరణపు కవి తిమ్మన కాక అలు మగలను కూర్చిన పెద్దనగారే వారి సామరస్యానికి తోడ్పడ్డారనడం బాగున్నది. నిజమైన మైత్రికి మంచికీ చెడకూ ఆదుకోవడమే ముఖ్యలక్షణం గదా! అందుకే రాయలూ, పెద్దనా జీవికా జీవులన్న విఖ్యాతి వచ్చింది.

తిరుమలరాయల హత్య సందర్భంలో రాయలు తిమ్మరుసు ననుమానించినప్పుడు కూడా పెద్దనగారు తిమ్మరుసు పక్షాన ఉండి రాయలను మార్చడానికి ప్రయత్నిస్తారు. ఇక్కడ పెద్దనగారి ప్రవర్తన ఆయన పెద్దరికానికి ఎంతో తగినదిగా ఉన్నది. వీటికి చరిత్రలో మనకేమీ ఆధారాలు లభించకపోవచ్చు. కాని ఆ సన్నివేశంలో పెద్దనగారు అచ్చం ఇలాగే ప్రవర్తించి ఉంటారని మనం గట్టిగా నమ్మవచ్చు. రాయల శ్రేయస్సును కోరే ఆప్తమిత్రులు కాబట్టే ఆయన చేతలు దురదృష్టవశాత్తూ వక్రమార్గాన్ననుసరిస్తే వాటిని సమర్థించక ఆయనను సంస్కరించడానికి ప్రయత్నిస్తారు. ఈ దృక్పథంలో పెద్దనగారి పాత్రను పోషించడం ముదావహంగా ఉన్నది.

ఈ నవల నాంజనేయులుగారు ముందు కొన్ని కథలుగా ఊహించి వ్రాసి వాటి నన్నిటినీ కూర్చి తర్వాత నవల చేశారేమో అనిపిస్తుంది. లేక ముందు నవల వ్రాసి అందులో కొన్ని ఘట్టాలను కథలుగా మార్చి పత్రికలలో ప్రచురించారేమో తెలియదు. ముద్దునాగ మొదలైన కథలు అలాంటివే అయి ఉండాలి. ఎలా చేసినా నవలగా ప్రచురించేటప్పుడు ... మరి కొంచెం సంస్కరింపజేసి ఉంటే ఈ నవల పండితలోకాన్ని గూడా మరెంతగానో రంజింప జేస్తుంది. ఉన్నదున్నట్లుగానైనా ఈ రచన ఆంధ్ర సాహిత్యాభిమానులందరూ చదివి ఆనందింప తగిన దనడంలో ఏమాత్రమూ సందేహం లేదు.

విజయవాడ.

జమదగ్ని

# అంకితము

సుమపేశలంబైన సూక్తుల మాధురి
సంరెడి మనుచరిత్రాదు లరసి
రాయలు మీటను రాజ్యభోగంబుల
భేదంబులేక జీవించుటెఱిగి
గండపెండేరంబు ఘనతమై దొడిగింప
తావులుచిమ్ము మర్ప్రము గాంచి
రాయలు దివికేగ రహించెడి జీవచ్ఛ
వంబైన పరిదేవనంబు వినియు

నవరసోపేత మీగాథ నవ్యసరణి
రచన మొనరించినాడనో రాజమాన్య
ఆంధ్ర కవితాపితామహ ! అల్లసాని
పెద్దనామాత్య నాకృతి పేర్మిగొనుము

స్మరణీయుండవు పెద్దనార్య ! కవితామాధుర్యధుర్యుండవై
పరసాగ్రేసరుడైన కృష్ణ విభు సత్సాంగత్య సంబంధ బం
ధురతన్ రాజ్యసుఖంబులబ్బె. కృతులెందున్ మీరు గైకొన్నయ
ట్లెఱుగంజాలక అస్మదీయకృతి మీకేనిత్తు సంప్రీతిమై

— రచయిత



# తొలి మాట

అల్లసాని పెద్దనామాత్యుని జీవితం శ్రీకృష్ణదేవరాయల జీవితంలో ముడిపడిఉన్నది. శ్రీకృష్ణదేవరాయని జీవితాన్ని ఎందరెందరో నాటినుండి నేటివఱకు అనేక రూపాలలో వ్యక్తంచేస్తూ వచ్చారు. పెద్దన పేరు పెట్టుకొని కృష్ణరాయలును గూర్చి వ్రాయడం చర్వితచర్వణమే. అందువల్ల పెద్దన జీవితంతో సంబంధమున్నంతవఱకే రాయల జీవిత చరిత్రను గ్రహించాను.

ఆంధ్ర కవితా పితామహుని సాహిత్య జీవితాన్నిగూర్చి మాత్రమే మనకు తెలుసు. అందునా ఆయన వ్రాసిన హరికథాసారం అలభ్యం. అతని నిజ జీవితాన్ని అతని చాటువులలో మనుచరిత్రగ్రంథంనుంచి అతని సమకాలికుల గ్రంథాలనుండి గ్రహించి నిగ్గు తేల్చవలసిందే. ఆ చాటువులను పుస్తకాలను ఆధారం చేసికొనే చారిత్రక సత్యాల హద్దులను మీరకుండ ఈ రచనను సాగించాను.

పెద్దనామాత్యుడు మనకు జ్ఞప్తికివస్తే "ఎదురైనచో తన మద కరీంద్రముడిగి" అనే పద్యం జ్ఞప్తికి వస్తుంది. ఈ పరిదేవనంలో అంత ర్నిహితమైన జీవిత సత్యాలు కాదనడానికి వీలులేనివి. తనగొప్పను చెప్పు కొనే సమయం కాదది. విజయనగర రాజ్యాస్థానంలో రాయలతో అంతరిం చిన తన స్థానాన్ని పెద్దన యెంతో మనోవేదనతో ఈపద్యంలోఇమిడ్చాడు.

చరిత్రకారులు నుడివినట్టు ఈ పద్యం రాయలకున్న కవిత్వ వాత్సల్యములందలి అభిమానాన్ని మాత్రమేకాదు తెలిపేది.రాయలు పెద్దనల మధ్యనున్న సౌహృదాన్ని వారిహృదయాలలోని రాజభృత్యభావాభేదాన్ని తెలుపుతుంది. ఎంతటి మహాకవికీ ఏమహారాజూ కాలంలో జరుగని మహా గౌరవాలు పెద్దనకు రాయలవల్ల జరిగినవి. ఎదురైన ఏనుగు నెక్కించు కొనడం, గండపెండేరము కాలికి తొడగడం, పల్లకీపట్టి యెత్తడం వంటి సన్మానాలు ఆ రాజేంద్ర కవీంద్రుల సన్నిహిత సంబంధాన్నే సూచించునవి. ప్రతీరక ఒకదానికన్న మరొకటి మిన్నగా ఉండవలెనని వేసినగౌరవాలు కావాయివి? దీనికి కారణం ఆ వంశంమీద రాయల అభిమానం కావచ్చు. వారిలోని రాజభక్తి శక్తి సామర్థ్యాలు కావచ్చు. లేక తొలినాటి పెద్దన స్నేహసాంగత్యాలు కావచ్చు. అందువల్లనే పెద్దన ఆస్థాన ప్రథమ కవిగా, దండనాయకుడుగానేగాక రాయలకు మంత్రాంగాన్ని ఉపదేశించే అమాత్యుడుగాకూడ జీవించాడని భావించడానికి అవకాశమున్నది. రాయల మరణానంతరమందుచేతనే పెద్దన తాను జీవచ్ఛవమైనట్లు భావించాడు.

అప్పాజీపై రాయల గౌరవం భక్తి పూరితమైతే పెద్దనపై అతని గౌరవం ప్రేమపూరితమైనది. ఈ ఊహను బలపరిచే చారిత్రకసత్యాలు చరిత్రనవలోడింపితే మనకు కన్పించుతవి. నాయీరచనకు"ఎదురైనచో" అన్న పద్యంప్రాణమైతే నేను సేకరించిన చారిత్రక కాధారాలు శరీరం.నా ఊహాలు మిగిలిన కల్పనలు అంబరాభరణాలు.

ఈ రచనలో నేనూహించగలినంతగా పెద్దనను చిత్రించలేక పోయినాననుకుంటాను. అతడు ఏలోపమూలేని పరిపూర్ణ వ్యక్తిగా పాఠకు నికి గోచరిస్తే నా శ్రమ ఫలించినట్లే.

ఇది నా రెండవ చరిత్రాత్మక నవల. చారిత్రిక నవలారచనలో అగ్రిణ్యులైన పూజ్యులు శ్రీ నోరినరసింహ శాస్త్రిగారు తమ రచనలలో నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, ధూర్జటి కవులనుగూర్చి వ్రాశారు. వారు స్పృశింపక వదలినవారిలో నన్నెచోడుడు, పెద్దనామాత్యుడు ముఖ్యులైన మహాకవులు. నారాయణభట్టు, రుద్రమదేవి నవలలు నన్ను చారిత్రిక నవలారచనకు పురికొల్పినవి. వారి అడుగు జాడలలో నడచి చారిత్రిక నవల నొకదానిని వ్రాయవలెననే ఆకాంక్ష నాలో కలిగింది. ఆబలీయమైన కోరిక ఫలితమే నా తొలినవల "విజయపతాక". కృష్ణాపత్రికవారు నడపిన వజ్రోత్సవనవలల పోటీలో ఆనవల బహుమతి పొందింది. అందు జీవించిన కవి నన్నెచోడుడు. ఆ ప్రోత్సాహమే రెండవ రచన.

ఈ నవలకు పరిచయం శ్రీ నోరి నరసింహశాస్త్రిగారిచేత వ్రాయిద్దామనే కోరిక నవల పూర్తి అయినప్పటినుండి నాలో ఉన్నది. వారికి అవకాశముండునేమోనని వ్రాశాను. నేనెవరో ఎరుగకపోయినా వెంటనే ఉదార హృదయంతో వారు అంగీకరించారు. దాన్ని అదృష్టంగానే భావించాను నేను. ఆ ఉదారహృదయుడికి నేను చేయగల్గిన దేమున్నది కృతజ్ఞతాపూర్వకమైన ఒక నమస్కారం తప్ప?

పూజ్యశ్రీ శివశంకరస్వామివారి పుస్తకాన్ని సాకల్యంగా చదివారు. వారు దయతో తమ అమూల్యాభిప్రాయాన్నివ్రాసి ఈ పుస్తకానికొక మన్నన చేకూర్చారు. వారికి కృతజ్ఞుణ్ణి.

శ్రీ చెరుకూరి జమదగ్నిశర్మగారి "అభినందనం"లో చివర వారిచ్చిన సలహా శిరోధార్యంగా భావించి కృతజ్ఞత తెల్పుకుంటున్నాను.

చివరన ఒక చిన్నవిషయం చెప్పక తప్పదు. ఎన్నిపర్యాయాలు శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు ప్రూఫులుదిద్దినా పుస్తకంలో అచ్చుతప్పులు దొర్లినవి. అది దురదృష్టం. శ్రీ నోరి నరసింహశాస్త్రిగారన్నట్లు రచయిత దోషాలుగా భ్రమింపజేసే ప్రవరునికి బదులు బ్రివుడులాంటి ముద్రణ

స్థాలిత్యాలు దొర్లినవి. తప్పు ఏదైనా ఎవరిదైనా తప్పుగానే పరిగణింపబడుతుంది. 'ప్రమాదోధీమతామపి' స్వల్ప భాషాదోషాలుకూడ ఉండవచ్చు. వాటిని పునర్ముద్రణలో సరిజేసుకుంటానని సహృదయులైన పాఠకులకు సాహిత్యాభిమానులకు మనవిచేస్తున్నాను.

నేనొక నవలా రచయితగా నిలచి కృషిచేయడానికి మార్గం కల్పించిన ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్ అధిపతి శ్రీ కందికొండ సూర్యనారాయణ శాస్త్రిగారికి నేనెంతైనా కృతజ్ఞుణ్ణి.

ఉప్పుగుండూరు
24_10_67

విధేయుడు
జి. ఆంజనేయులు

— ० —

*

# ఆంధ్రకవితా పితామహుడు

ఆరోనిమర్గ పరిసర ప్రాంతారణ్యమున ముగ్గురాశికులు పయన మొనరించుచున్నారు. సాయంత్రము మీరి కనుచీకటి పడినది. అంత కంతకు చీకటి ముసిరి త్రోవ సరిగా కానవచ్చుటలేదు. తమ తమ గూండ్లు చేరిన పక్షి సముదాయ మొనర్చు ధ్వను లంతకంతకు సన్నగిలి సన్నని నక్కల కూతలు వినిపించుచున్నవి. అశ్వములు మాత్రము తమ వేగమును తగ్గింపక నడచుచున్నవి. ముందరి యశ్వముపై నున్న యాతడు యాజమానివలె నున్నాడు. జరీపుట్టము. బంగారుజరీ తలపాగ. కనవము పై సన్నని అంగరఖా. అన్నియు నాతని సంపదను సూచించుచున్నవి.

ఆతనితరువాత అశ్వముపైనున్న యాతడు ఆజానుబాహుడు. స్ఫురద్రూప ముఖము కాంతివంతమై తేజోమయ మైయున్నది. ఆ వదన మందలి ముకుళిత లాతని హృదయమం దలి ఆలోచనాభారమును తెలియ జేయుచున్నవి. ఆతని వస్త్రములు మొదటివానివంటి విలువైనవిగాక యున్నవి. ఆతడు తలపై ధరించిన కుళాయి ఆతడొక సామాన్యుడైన సిపాయి యేనని తెలియజేయుచున్నది. మూడవవాడు సామాన్య పరివారకుని వేషమును ధరించియున్నాడు. ఆతని హస్తము మాత్రము ఖడ్గముపై నున్నది. ఆతని హృదయ మందలి భావములేవో తెలియవు.

వారెంత దూరమునుండి ప్రయాణ మొనర్చుచున్నారో వస్త్రములు మాత్రము చెమటచే తడిసియున్నవి. అశ్వములు రొప్పుచున్నవి. వాని శరీరములనుండి స్వేదము కారిపోవుచున్నది. అవి తమయజమానుల హృదయభావముల చదివినవానివోలె తమ వేగమును తగ్గింపక యట్లే పరుగిడుచున్నవి.

ఆపవాని మార్గము ఒక క్రోసెడు దూరమున నున్నది. జాముప్రొద్దు పోయినది. కొద్దికాలములో కందకముపై నున్న వంతెన నెత్తివేసి కోట

ద్వారములు మూయుదురు. రాలోపల వారువంతెనను వేసకున్న ఆరాత్రికి కోటబయట ఉండవలసినదే.

కోటలోనుండి తొలిజాము గంట కొటినారు. కోటబయట నున్న వారలకు అదిహెచ్చరిక. ఇక గడియతగి కోటద్వారము మూయుదురు. ఆశ్వికులా శబ్దములు వినినారు.

అశ్వముల వేగములు హెచ్చినవి. కోటద్వారములు మూయుట కై ప్రధాన ద్వారరక్షకుడు సెంచినాడు సేవకులు తలుపుల గొలుసులు తీసివేసినారు. గుఱ్ఱములు మూసుకు ద్వారము సమీపము చేరినవి. సేవకులు గుఱ్ఱములను లోనికి వదలినారు. కోట తలుపులు మూయబడి అగడ్తపై నున్న వంతెన మెత్తివేయబడినవి.

ప్రధాన ద్వారరక్షకుని ఆజ్ఞపై గుఱ్ఱము లాపబడినవి. వారు గుఱ్ఱములపైనుండి దిగలేదు.

"ఎవరు మీరు?" ద్వారరక్షకుడు ప్రశ్నించినాడు.

"మేము వర్తకులము అరణ్యమున దారితప్పి కోటను చేరుసరి టికి ఆలస్యమైనది." జవాబు చెప్పినాడు జరితలపాగ ధరించిన ప్రధాన ఆశ్వికుడు.

అతడు ధనవంతుడైన వ్యాపారిగ మిగిలినవారతని రక్షకులుగ అరమొనర్చుకొనినాడు ద్వారరక్షకుడు.

"ఈ సమయమున క్రొత్తవారు నగరమున తిరుగుట కనుజ్ఞలేదు. అందువలన మీరు రాజభటుల యధీనమందలి సత్రమందుండవలయును."

"అట్లు మేమొప్పుకొన సప్పుడు దుర్గాధ్యక్షు నొద్దకు కొనిపోదువు గదా?" వ్యాపారి గుఱ్ఱముపై నుండియే ప్రశ్నించినాడు.

రాజ్యమందలి కట్టుబాట్ల నాతడెరిగినవాడని గ్రహించినాడు ద్వార రక్షకుడు.

"మీరు కోరిన దుర్గాధ్యక్షునొద్దకు కొనిపోగలను కాని దానికి తగిన కారణము దుర్గాధ్యక్షునకు చెప్పుకొనలేకపోయిన మీరు శిక్షింప బడుదురు." అనుచు కోటద్వారమునకు తాళము వేసినాడు ప్రధానద్వార రక్షకుడు. మరల గంట మ్రోగింపబడినది. అది కోటద్వారము మూయు

బడినగుట్టు. ఇక కోటబయటనున్నవారు ఆరాత్రి గడపుటకు తగిన నెలవు వెదకికొనుచుండిరి.

ప్రధానద్వారరక్షకుడు గుఱ్ఱమెక్కినాడు. ఆ గుఱ్ఱమువెనుకనే యీ మూడుగుఱ్ఱములు సాగినవి. మంత్రాధ్యక్షునింటిముందాగినవా గుఱ్ఱములు. ప్రధాన ద్వారరక్షకుడు లోనికరిగి నమస్కరించి విషయమంతయు వివరించినాడు.

అప్పుడే భోజనమొనర్చి తమ్ములము నములుచున్న మంత్రాధ్యక్షుడు వాకిటిలోని కరుదెంచినాడు. గుఱ్ఱములను దిగిన ముగ్గురు ఆతని కెదురు వచ్చినారు. మొదటిపరుగుడు ముందునకు పోయి "చొక్కనామాత్యులకు నమస్కారము" లనినాడు. మూడవ యాతడువంగి నమస్కరించినాడు ఆజానుబాహుడైన శిష్యుడు కడపటగా నమస్కరించినాడు.

ఆ స్వరమెప్పటనో వినినట్లు తోచినది చొక్కనామాత్యునకు. తానెప్పట వినినాడాస్వరమును? ఆతడెవడు? జ్ఞప్తికి దెచ్చుకొనుట కొక్క క్షణ మాగినాడు. ఆతనికేమి స్ఫురించినది? ఆ సంభ్రమమేమి?

"ఎవరు? ఎవరు?" అనినాడాతడు సంభ్రమముతో! పరుగుని కుడిచేతి చూపుడువ్రేలు నాసికపైకిపోయి నిలచినది. మాట్లాడవద్దని ఆతడాజ్ఞాపించినట్లు తోచినది. గ్రహించినాడు మంత్రాధ్యక్షుడు.

"సరియే, వీరిని నేనెరుగుదును. నీవికపోవచ్చును." అని ప్రధాన ద్వారరక్షకుని జూచి యనినాడు. ఈ వ్యవహారమేమియో అర్థముకాలేదాతనికి. తనవద్దనున్న తాళమును తీసికొనకుండ మంత్రాధ్యక్షుడేల పొమ్మను చున్నాడో ఆతడు ఆలోచింపలేక పోయినాడు.

"కోట తాళపుచెవితీసికొననిది ద్వారరక్షకుడు వెడలిపోవవలెగదా?" ప్రశ్నించినాడా పరుగుడు. యాంత్రికముగ చేయి చాపినాడు చొక్కనామాత్యుడు. ద్వారరక్షకుడు తాళము నొసంగి నమస్కరించి వెనుదిరిగి పోయినాడు.

చొక్కనామాత్యుడు మాటాడకుండ పరుగుని చేయిపట్టుకొని లోనికి నడచినాడు. వారివెనుకనే మిగిలిన యిద్దరు అభ్యంతర

మందిరములోనికరిగినాడు. వచ్చుటకు తాను తగిలించుకొనిన చిన్నగడ్డమును తీసివైచి తలపాగ తీసివైచినాడు.

"గోవిందరాజా! ఈ వేషమేమయ్యా? ఈ రాజ్యమునందే వేషము వేయుస్థితి యేమికలిగినది? మీరెవరో నేను తెలిసికొనలేకున్నాను. మీరును వేషధారులా?"

"చౌక్కనామాత్యులు మమ్ము గుర్తింపలేకపోయినారా?" చిరునవ్వుతో ప్రశ్నించినాడు సిపాయి వేషధారి.

అల్లే కన్నార్పక చూచినాడు చౌక్కనామాత్యుడు కాని ఆతడెవరో తెలియలేదు. తీవ్రముగ ఆలోచించియు విఫలుడైనాడా దుర్గాధ్యక్షుడు.

సిపాయి వేషధారి తన ముఖమున నంటిపెట్టుకొని యున్న నొక చర్మపు వస్తువు లాగివైచినాడు.

చౌక్కనామాత్యుని ఆశ్చర్యమునకు మేరలేదు. ఆతడెవరు? విజయనగర ప్రభువులు వీరనరసింహరాయల సోదరుడు శ్రీకృష్ణదేవరాయలు!

చౌక్కనామాత్యుడాతని నాపాద మస్తకము తిలకించినాడు. ఈ వేషములేమి? ఈ వచ్చుటయేమి? రాజధాని యందేదియో జరిగినది! తన కర్తవ్యమేమి? ఆతని యాలోచనను గమనించిన గోవిందరాజు "చౌక్కనామాత్యా! రాజధాని యందలి పరిస్థితులు విషమించినవి. మహామంత్రి మాయందొక మహత్తర కార్యభారము నుంచినారు. దానిని మీరు సక్రమముగ నిర్వర్తింతురని విశ్వసించి ఇటు వచ్చినాము" అని ఆగినాడు.

చౌక్కనామాత్యుని యూహలెంత దూరమో పోయినవి? మరల గోవిందరాజందుకొనినాడు. "మహారాజునకు తీవ్రమగు రుగ్మత ప్రవేశించినది. అదియాతని హృదయమునే పాడొనర్చినది. మన మీ విజయనగర సామ్రాజ్యమునకు కృష్ణరాయని వారసునిగా తలంచుచున్నాము. కాని విధి వైపరీత్యము!" ఆగినాడు గోవిందరాజు.

"ఇప్పుడేమి జరిగినది?" వ్యగ్రతతో నడిగినాడు చౌక్కన.

"ఆ కృష్ణరాయల జీవితమునే హరింపబూనినాడా మహారాజు. తన కుమారునికే రాజ్యము రావలయునని ఆతని యాకాంక్ష. ఆతని మార్గమునకు ఆటంకములేకుండ ప్రథమమున నీతని తుదముట్టింపవలసినాడు. అన్నగారినమ్మల్లమై ప్రోత్సహించినాడు అచ్యుతరాయలు. ఇకపై రాజధానియందు రాయలమనుగడ క్షేమముకాదు. అచ్యుతరాయలుకూడ నీ కుట్రయందున్నాడు. ఆతడు బాలునే రాజుగ నొనర్పవలయునని మహారాజు పక్షమున బల్కినాడు. ఇక మిగిలిన యాటంకము కృష్ణరాయడే. కృష్ణరాయని అడ్డు తీరినతర్వాత బాలుని తుదముట్టించి తాను సింహాసన మెక్కవలయు నచ్యుతరాయల ఆంతర్యమందలి ఆలోచన. అందులకై కృష్ణరాయలకన్నుల నూడపెరికివేయవలెనని మహారాజునకు సలహా నొసంగినాడు. మహారాజు నరసింహరాయ మహామంత్రులు తిమ్మరుసుగారి కట్లాజ్ఞాపించినారు."

"సేనానాయకులందుల కొప్పుకొనినారా?" చొక్కన ప్రశ్నించినాడు.

ఆతని హృదయమున ఆలోచనాతరంగములుప్పతిల్లి యణగిపోవుచున్నవి. తాను రాజద్రోహియగుటా? కృష్ణరాయలకు సహాయమొనర్చుటా? సద్గుణసంపన్నుడు సమర్థుడునైన కృష్ణరాయలను వదలుకొనుట సమంజసమా?

"సేనానాయకుల విషయమేమియు తెలియదు. వారందరును కృష్ణరాయలవైపు వారే:" జవాబొసగినాడు గోవిందరాజు.

"మహామంత్రుల యాజ్ఞయేమి?"

"కృష్ణరాయలను కొంతకాలము కాపాడి తిరిగి యొప్పగింపుడని."

గోవిందరాజు జవాబువినినాడు చొక్కన. కొంచెమాలోచించి యనినాడు. "అవశ్యము వీరనరసింహరాయల మరణపర్యంతము కాబోవు సార్వభౌముని నా ప్రాణములతో సమానముగ కాపాడగలను. మహామంత్రులకీ మాటలు విన్నవింపుడు."

"ఈతడెవరు?" మూడవవ్యక్తినిజూచి ప్రశ్నించినాడు చొక్కన.

"ఈతడు నా అంతరంగిక సేవకుడు కొండోజీ" జవాబొసగినాడు రాయలు.

"ఇక మీరు భోజనములొనర్చి నిద్రింపవచ్చును" అనుచు చౌక్కనామాత్యుని పుత్రుడు పెద్దన గదిలోనికి ప్రవేశించినాడు.

అతడు తేజస్వి. చక్కని అంగసౌష్ఠవము. వేదవేదాంగముల జదివి తర్కవ్యాకరణముల లోతులనెఱింగిన ప్రౌఢ. తండ్రితో మాటాడుచున్న వ్యక్తుల నాతడింతకు పూర్వము చూడలేదు. ఏదియో రహస్య సంభాషణ మని యూహించి గదిలోనికడుగిడి వెనుకకు మరలిన పెద్దనను తండ్రి పిలుపు మరల్చినది.

లోనికివచ్చి తండ్రికినమస్కరించినాడు పెద్దన. నిద్రకుపక్రమించుటకు ముందు తండ్రికి నమస్కరించి అనుమతితో నిద్రించుట పెద్దన కాచారము.

"వారికి నమస్కరించు పెద్దనా? వారు విజయనగర సామ్రాజ్య దండనాథులు మహామంత్రి తిమ్మరుసుల సోదరులు." అనుచు పరిచయ మొనర్చినాడు చౌక్కన.

పెద్దన కనులు పెద్దవి యొనర్చి ఆవ్యక్తిని తేరిచూచినాడు. తన గోత్ర నామములతో అహంభో అభివాదయే అని గోవిందరాజునకు నమస్కరించి కృష్ణరాయలవైపు చూచి ప్రశ్నార్థకముగ తండ్రివైపు చూచినాడు.

"వారు గోవిందరాజునకు సంబంధించినవారు. కొంతకాల మిట మనయింట నుండుటకు వారి నాహ్వానించినాను. మీరిద్దరు సహాధ్యాయులు" అనుచు చౌక్కన సంబంధ మొనర్చినాడు.

ఈ రహస్యము కుమారునకైన తెలియుట అతని క్షేమముకేదని గ్రహించి గోవిందరాజు ఆనందము నెందినాడు.

భోజనము లొనర్చి విశ్రమించినారు వారు కొండోజీ ఖడ్గపాణియై వాకిట నిలచినాడు. రాయల రక్షణమే అతని కర్తవ్యము.

వేకువ యైనది. పక్షుల కిలకిలారావములతో ప్రకృతి రమణీయమై తనర్చినది. వేకువనే సెలవు తీసికొని వెడలిపోయినాడు గోవిందరాజు.

చీకటితోడనే నిద్ర మేల్కాంచి గోవిందరాజును పంపి, తిరిగి

పమండిన కృష్ణరాయునికి నిద్ర రాకున్నది. ఆతనికి భవిష్యత్తు గూర్చియే ఆలోచన కొండోజీ అట్లే నిద్రింపక ఖడ్గపాణియై యున్నాడు.

"కొండోజీ !"

కృష్ణరాయని పిలుపున పలికిపడి, "ఏమి ప్రభూ !" యనినాడు కొండోజీ.

"నీవును నాతోడి ప్రస్థానమునకు రావలసివచ్చినది. నీ భార్య బిడ్డల గతియేమి కొండోజీ ?"

"అక్కడ మహామంత్రులున్నారు గదా ప్రభూ !"

"నీవిషయమై వారికి జెప్పియుంచితివో లేదో ?"

"ఆ బాధ యవసరములేదు ప్రభూ ! నావారి కేవిధమైన కష్టములు కల్గవు. ఈ విషయము నాకు తెలియజేయునప్పటికి కొంత ధనము యింటి యందున్నది. అది పూర్తిగా వైపోవునప్పటికి మనము ధనము పంపవచ్చును."

"నావిషయమున నీకింత శ్రద్ధయేల కొండోజీ !"

"ప్రభువులను నేనెత్తి పెంచినాను. నాకు మీకన్న కావలసినదేమి? ప్రాణములనైన పణముగా బెట్టుటకు నేను సిద్ధము."

"అన్నగారెంత క్రూరులైనారు ? అప్పాజీ చేతులలో నేవిప్పటి కేమగువాడనో ?"

"రాజ్యాశ అట్టిది ప్రభూ ! అది రక్తసంబంధమును మరచును. మహామంత్రులే మనకు రక్ష !"

"మన ఉనికి కుమారునకు నైతము తెలియుట కిష్టపడలేదు చొక్కనామాత్యుడు."

"అంతటి విశ్వాస పాత్రుడు కావుననే మహామంత్రుల కిది సురక్షితస్థానముగ దోచినది."

"మనమిట నెంతకాల ముండవలయునో ?"

"వీరనరసింహరాయల మరణమువఱకునని చొక్కనామాత్యులు నిన్న తెలవిచ్చినారు."

"ఈ దుర్గాధిపతి యెట్టివాడో ?"

"దుర్గాధిపతి అజపస్కృతితిమ్మనాయకుడు కదా ప్రభూ !"

"అవునా. తిమ్మనాయకుడు వీరనరసింహుని వైపుకదా ? మన కిది సురక్షిత ప్రదేశము కాదేమో ?"

"మరి అట్టి ప్రదేశమునకు మహామంత్రులేల మనలను పంపును ప్రభూ? నాకు నదియే అవగాహన యగుటలేదు."

మూసియున్న తలుపుపై సన్నని శబ్దమైనది.

కొండోజీ ఖడ్గముపై చేయివైచినాడు.

"లోనికి రావచ్చును" కృష్ణరాయడనినాడు.

తలుపు నెట్టుకొని లోనికరుదెంచినాడు పెద్దన. కృష్ణరాయలనుచూచి నప్పటినుండియు నాతనితో మాటాడవలయునని యున్నది పెద్దనకు. తనకు కాబోవు సహాధ్యాయు డెట్టివాడో యను నుత్కంఠయు నాతని యందు లేకపోలేదు. ఆయ్యుత్సాహము రాయల కాతని సన్నిహితు నొనర్చినది. తెలతెలవారకమున్నె రాయలయొద్ద కరుదెంచినాడు.

"మీరిప్పుడే నిద్రమేల్కాంచి యున్నారా ? నేను మీ నిద్రాభంగ మొనర్పవలసివచ్చునేమో యని భయపడుచు వచ్చితిని." అనినాడు పెద్దన.

"గోవిందరాజుగారు వెడలిపోవుటచే పెందలకడనే లేచినాము"

"దండనాథులప్పుడే వెడలిపోయినారా ?"

"వెడలి పోయినారు ! ఏమట్లు ప్రశ్నించినావు పెద్దనా ?" ప్రశ్నించినాడు రాయలు.

పెద్దనముఖమందొక వింతభావము మెదలినది. ఆతనికాభావముతో నవ్వు వచ్చినది.

"సైన్యాధిపతులతో పనియైన సైన్యవిషయమై యుండవచ్చును" అనినాడు కొండోజీ నవ్వుచు.

తల యెత్తి చూచినాడు పెద్దన ఆతనివైపు.

"ఏమి పెద్దనా, పరశురాముడవు కావలయునని యున్నదా ?" రాయలనినాడు.

"క్షాత్రము నే కోరునదే కాని పరశురామునివలె మాత్రము కాదు. ఆ విషయము లిప్పుడెందులకు? మీరు గరిడీశాలకు వత్తురా?" ప్రశ్నించినాడు పెద్దన.

"ఎచ్చట నున్నదది? దూరమా?"

"లేదు మన ప్రాకారములోపలనే. ఈ వీధి యందలి యువకు లందరును అచ్చటికి వత్తురు. మేమచ్చట యుద్ధవిద్యలు నేర్చికొను చున్నాము."

"అచ్చట నేర్చికొను యువకులెందరు?"

"ఏబదిమందికి పైగానున్నారు. అందరికన్నను వీరమల్లు జగజెట్టి"

కొండోజీతో సహా కృష్ణరాయపెద్దనలు మల్లయుద్ధశాలకు చేరినారు. అప్పటికే అచ్చటకు యువకు లందఱును చేరినారు.

ఆ విద్యాలయము చౌక్కనామాత్యుడు స్థాపించినది. అందున్న వారికి యుద్ధవిద్యతోపాటు సాహిత్యమును నేర్పబడును. మల్లయుద్ధము, బాణవిద్య, ఖడ్గచాలనము, అశ్వశిక్షణ కూడ ఆవిద్యలోని భాగములు. ఈ విద్యాధికారి జగపతి మల్లు. జగపతి మల్లు కృష్ణరాయల తండ్రి కాలమున నొక సేనాపతి. ఒక యుద్ధమున తుపాకి గుండు తగులుటచే నాతడు సైన్యమునుండి తొలగినాడు. ఆతని సామర్థ్యమును గమనించిన చౌక్కనామాత్యు డాతని నీవిద్యాలయాధికారిగా నియమించినాడు.

ఆ విద్యాలయ మందలి విద్యార్థులందఱును బలశాలురు. వీర మల్లొక నడగొండ. ఆ శరీరపరిశ్రమ ఆశరీర బలము అరుదు. యమునైన నెదుర్కొనెడు సాహసమున్న దాతనిలో. ఆతనికి బలమునకు తగిన నమ్రత పౌరుషములు రెండు నున్నవి. అందుచే నాతడందరు విద్యార్థుల కాదరణీయుడును ఆదర్శపాత్రుడు నైయుండెను.

పెద్దన రాయలు కొండోజీలతో శాలలో నడుగుపెట్టినాడు. అందర చూపులు రాయలమూర్తిపై నిలచినవి. అచ్చటి వారలెవ్వరు రాయల నెఱుగరు. విద్యాలయాధికారి జగపతియు రాయల నెఱుగడు. జగపతి అంతవఱకును రాలేదు. గుసుగులు వచ్చునంత వఱకును వారందరును

శరీర పరిశ్రమ చేయవలసినదే. గురువు రోజునకొక జట్టును విడదీసి వారిచే పోట్లాడింపజేసి మల్లయుద్ధము నందలి మెలకువలు వారికి తెలియ జెప్పుచుండుట యలవాటు.

బాగుగ మల్లయుద్ధ మొనర్చువారిలో పెద్దన యొకడు. ఆ ఏబది మందిలో వీరమల్లుపైకి మల్ల చలమువాడు లేడు. ఒకటి రెండు సార్లు పెద్దన ధైర్యముచేసి పోట్లాడి ఓడిపోయినాడు. కాని యాతని కందువలన నీర్ష్యలేదు. వీరమల్లుకూడ పెద్దన యనిన యమిత గౌరవము చూపువాడు. పెద్దన యొక గొప్ప జ్ఞాని, పండితుడు, కవి, విమర్శకుడు అతని దృష్టిలో. వీరమల్లొక పెద్ద యోధుడు పెద్దనదృష్టిలో. ఇద్దరిలో వీరమల్లు కొంచెము పెద్దవాడు.

"ఏమి పెద్దనామాత్యా! ఆలస్యమైనది?" ప్రశ్నించినాడు వీరమల్లు కృష్ణరాయలవైపు చూచుచు.

"వీరినికూడ తీసుకొని వచ్చుట యాలస్యమునకు కారణము. ఇక నుండి మనశాలలో వీరుకూడ కొంతకాలము పరిశ్రమ యొనర్తురు."

"ఎచ్చటివారు?"

"విజయనగరపు మల్లవిద్యాశాలయందు పరిశ్రమ యొనర్చి నాను". కలిగించుకొని కృష్ణరాయలు జవాబొసంగినాడు.

"తమ నామధేయము?" వీరమల్లు ప్రశ్నించినాడు.

ఆ ప్రశ్నకు జవాబు వారాలోచించుకొనలేదు. పేరు కొఱకు వెదకుకొనినాడు కృష్ణరాయలు. ఆ ప్రశ్న విననట్లు నటించుచు మిగిలిన మల్లురవైపు చూచుచు.

"కన్నప్ప" కొండోజీ యందుకొని వీరమల్లునకు జవా బొసంగినాడు. కృష్ణరాయలకు కొంత బాధతీరినది. తనపేరు నెట్లుమార్చి చెప్పినాడు కొండోజీ.

వీరమల్లు అనుమానముగ చూచినాడు పెద్దనవైపు. పెద్దన యింత వఱకు తాను పేరడగ నందులకు బాధపడినాడు.

"మీరేమి విద్య లట నేర్చికొనినారు?" వీరమల్లు ప్రశ్నించినాడు

రాయలవైపు తదేకముగ చూచుచు. మిగిలిన వారా సంభాషణను విన చున్నారు.

"అన్నిటిని కొద్ది కొద్దిగ చదివిచూచినాను." నవ్వుచు రాయలు జవాబొసగినాడు.

రాయల ఆ కండలు తిరిగిన దేహమును చూచి యందరు వీరమల్లు పై నీతడు పోరిన బాగుండు ననుకొనిరి.

గురువు జగపతి యచ్చట కరుదెంచినాడు. విద్యార్థులందరు నొకే పర్యాయము గురువున కభివాదము నర్పినారు. చివరగా కృష్ణ రాయలు నమస్కరించినాడు

"మన పెద్దనామాత్యుడు మరొక శిష్యునిటకు గొనివచ్చినాడు. విజయనగరపు వాడట" అనుచు వీరమల్లు కృష్ణరాయలను పరిచయ మొనర్చినాడు.

"నీపేరేమినాయనా! విజయనగరపు వాడవా?" అని కృష్ణరాయ లను కన్నార్పక చూచినాడు జగపతి. అతని హృదయమందేవియో ఆలో చనలు రేగినవి. ఆరూపు వాలిక లీతనియందున్న వేమని ప్రశ్నించిన దాతని హృదయము. ఆ ప్రశ్నకు ప్రత్యుత్తరము లేదు.

"పెద్దనా ఈతడిచ్చటకు వచ్చుటకు నాయనగారి యాజ్ఞ యొసదా?"

తానే మొనర్చినాదో పెద్దన కప్పుడు తెలియవచ్చినది.

తానొనర్చినది పొరపాటు. తండ్రి యనుజ్ఞ తీసుకొనకుండ ఈ వ్యక్తిని గరిడిశాలకు కొనివచ్చుట లోపమే. పెద్దన మాటాడలేదు.

జగపతి చిరునవ్వు నవ్వినాడు.

చొక్కనామాత్యుడు లోనికి ప్రవేశించినాడు ఆసమయముననే.

"జగపతీ! ఈతనిని కూడ నీశాలయందు చేర్చుకొని జాగ్రత్తగా కనిపెట్టియుండవలసినది. కొంతకాలమీత డిటనుండగలడు."

చొక్కనామాత్యుడే స్వయముగా వచ్చి చెప్పుట వారి కాశ్చర్య మైనది. అది అపూర్వమేమీ కాదు కాని అరుదైనది.

"మా పెద్దనతోనే వారును వత్తురు." మరల నచటి వారు విశ్రాంతి నొందినారు.

ఈ బహువచన ప్రయోగమేమి? ఆ యువకుని ముఖము నొకపరి తిలకించినాడు జగపతి. తన పొరపాటును గమని చుకొని సరిదిద్దుకొని నాడు చొక్కన —

"కొండోజి కూడ వెంట నుండుట కనుమతించినాము మేము" ఈ వాక్యముతో బహువచన శబ్దార్థము పర్యాప్తమైనది. కృష్ణరాయల ముఖమున ఒక చిరునవ్వంకురించి యంతరించినది.

ఆనాటి ప్రభు భృత్యుల సంబంధ మట్టిది.

చొక్కన వెనుకకుదిరిగి తన మందిరమున కరిగినాడు.

"నీ వెవరి బిడ్డవు నాయనా!" ప్రశ్నించినాడు జగపతి రాయలను. ఆతనిలోని శకాంకురము పెరిగి వృక్షమగుచున్నది.

"నేనొక క్షత్రియుడనని మాత్రము మనవిచేయగలను. మిగిలిన విషయములు చొక్కనామాత్యులు గురువులకు వివరింపగలరు."

"నేనుపోరాడ వలసిన జట్టును గురువులు నిర్ణయింపవలెను." అనినాడు వీరమల్లు. ఆతనికి కృష్ణరాయలతో పోరాడవలెనని యున్నది. విజయనగర పట్టణ వస్తాదు యెట్టివాడో తెలిసికొనవలెనని ఆతని జయింపవలెనని ఆతని తహ తహ. కాని తానుగా కోరుట అసంబద్ధముగ నుండును. అందున కన్నప్ప తనకన్న వయసున ఐదారేండ్లు చిన్న యని ఆతని ఆలోచన.

విజయనగరపు యువకునితో తాను పోరుదు ననినాడొక మల్లుడు. అందరి దృష్టులు వాని పైకి తిరిగినవి. ఉన్నవారిలో బలహీనుడాతడు.

కన్నప్పను చూచి ఆ యువకుని వైపు చూచినాడు పెద్దన. హస్తిమశకాంతరమున్నది. ఆతనికి నవ్వు వచ్చినది.

"నీ ధారుసమును పోనిచ్చితివికాదు శంకరా!" అనినాడు పెద్దన నవ్వుచు. అందరు నవ్వినారు. జగపతియు నవ్వినాడు. కాని అందరి హృదయములలో నాతని పోరాటమును తిలకింపవలెనని యున్నది.

"మార్గాయాసమేమియు లేక పోరాటమునకు సంసిద్ధుడవా నాయనా?" ప్రశ్నించినాడు జగపతి.

"పోరాటమునకు ఆహ్వానింపబడి నిరాకరించుట క్షాత్ర లక్షణము కాదుగదా?" అనుచు తన సంసిద్ధతను ప్రకటించినాడు కన్నప్ప.

"ఏమి శంకరా పోరాటమునకు సిద్ధమా?" నవ్వుచు ప్రశ్నించినాడు జగపతి.

నవ్వుచు తలవంచినాడు శంకరుడు. అందరు నవ్వినారు. వాడొక వినోదకుడు, ఎవ్వరినైన పిలుచును ఎదుర్కొనుటకు. కాని ఒక్కరితోను పోరాడడు. అందర కావిషయము తెలియును. కృష్ణరాయలు నవ్వినాడు.

కృష్ణరాయల హృదయాంతరమున వీరమల్లుతో పోరాడవలెనని యున్నది.

"నాయనా నీ యిష్టమువచ్చిన మల్లు నెన్నుకొని పోరాడు. గెలుపోటముల కిప్పుట ప్రాధాన్యత లేదు. ఈ పాఠశాలా సభ్యుల హృదయములు ఈర్ష్యయసుదాని నెఱుగవు."

"ఈ పోరాటము విషయమై బయటవారికి తెలియకూడదు. మన సభ్యుల మధ్యనే యిది యిమిడిపోవలయును." కృష్ణరాయలు కోరినాడు.

సభ్యులందరది రహస్యముగ నుంచుటకే ఒప్పుకొనినారు.

కృష్ణరాయ లెవ్వని కోరునో అని ఎదురు చూచుచున్నారు వారు.

కృష్ణరాయలు వీరమల్లు హస్తమును స్పృశించినాడు. అది పోరాటమునకు పిలుచుటకు గురు. అందరి హృదయ వాంఛయు నదియే.

చిరునవ్వుతో వీరమల్లంగీకరించునాడు. పెద్దన హృదయమేమియో భయము చెందినది. కొండోజీలో నెట్టిమార్పును లేదు.

వీరమల్లు రంగములోనికి దిగినాడు ఆ ఆకారమొక చిన్న ఏనుగు వలె నున్నది. కృష్ణరాయలకు లోనుండి వుస్తువులను కొనివచ్చినాడు పెద్దన వానిని ధరించి వీరమల్లుతో కరవాలన మొనర్చినాడు. బాగుగ బలసి కండపుష్టికల వీరమల్లు దేహమును. ఇనుప కమ్మీలవలె కండలు కండలు గల్గిన కృష్ణరాయల దేహమును జూచినాడు జగపతి. ఆమూర్తిమత్వము తేజము జగపతిని ముగ్ధునొనర్చినది. కాని యాతడు జయింపగలడా యనునది అతని శంక. నిర్ణీత ప్రదేశమున జగపతి కూరుచు

న్నాడు. మిగిలిన విద్యార్థులందరును రంగమునకు చుట్టును కూరు చున్నారు. మధ్య వీరమల్లు కృష్ణరాయలిరువురు కరచాలనమొనర్చి భుజా స్ఫాలన మొనర్చినారు. ఆ శాల యంతయు మారుమ్రోగినది ఆ ధ్వనికి. జగపతి "మీ రిరువురును స్నేహితులు. విరోధులు కారు. మీ మధ్య ఈర్ష్యా ద్వేషములు ఈ పోరాటము కారణముగ కలుగవు." -అనుచు పోరాడుట కాజ్ఞనొసంగినాడు.

మల్లు లిరువురును కలియబడినారు. పోరు సాగుచున్నది. వీరమల్లు బలము కన్నప్పయందు లేదు. కన్నప్ప మెళుకువలు వీర మల్లుకు లేవు. మిగిలిన యోధులెవ్వరును వీరమల్లుతో నొక గడియ కాలము పోరాడలేరు. కన్నప్ప చాతుర్యమునకు యువకులలో నొకవిధ మగు నాశ్చర్యముకన్పించినది. జగపతియు నాయువకుని ప్రావీణ్యమునకు సంతసించినాడు.

వీరమల్లు తనకు చిరపరిచితమైన నొక పట్టుతో కృష్ణరాయలను క్రిందకు పడగొట్టినాడు. ఇక కన్నప్పపని యైపోయినట్లేయని తలంచినారు మిగిలిన ప్రేక్షకులు. కృష్ణరాయని కన్నులు జేవురించినవి. ఒకక్షణములో వీరమల్లు చిత్తుగా పడిపోయినాడు. ఆతడు తిరిగి లేచుటకు కొలది క్షణ ములు పట్టినది. అప్పటికే రాయలు లేచి నిలబడి చిఱునవ్వుతో వీరమల్లు వైపు చూచుచున్నాడు. క్షణములో జరిగిన యద్భుతమేమో సభికులకు తెలియులేదు. అంతటి శరీరము కలిన వీరమల్లు అంత ఎత్తునకు లేచిపడి పోవుట మాయగా తోచినది వారికి. వీరమల్లు రోజుచు లేచి నిలచినాడు. ఆనాడాతనికి ఓటమి సంభవించినది. అదవాని దుర్గమున తన్నెదిరించిన వాడు లేడు.

వీరమల్లూ! మనము స్నేహితులము. ఇకపై ప్రాణ స్నేహితు లము. ఈర్ష్యా ద్వేషములు మన కంటరాము. ఇది గుర్వాజ్ఞ" అనుచు నిలువబడిన వీరమల్లును కౌగలించినాడు రాయలు.

అందరి హృదయము లీ చర్యతో నీ వాక్కులతో ద్రవించినవి. వారి కన్నులు బాష్పపూరితము లైనవి. అవి ఆనంద బాష్పములు. వీర మల్లులో నొక క్షణము ముందావేశించిన ద్వేష పిశాచము ఈ పరిష్వంగ

ముతో నాతనిని వదలిపోయినది. ఆతని హృదయ మార్ద్రమైనది. కన్నుల జల జల రాలినవి బాష్పములు.

"కన్నప్పా. నీవు మహాపురుషుడవయ్యా! ఒక్క క్షణమైన నీపై ద్వేషము కలిగినందులకు క్షంతవ్యుడను." అనుచు మఱియు బిగ్గఱగా కౌగలించినాడు పీరమల్లుడు.

నడచిన పోరాటముల కన్న ఈ దృశ్యమే అందరి హృదయముల నాకర్షించినది.

"మీరు వీరులవలె నడచినారు. మీ స్నేహము చిరస్థాయిగా నుండుగాక" యనుచు నాశీర్వదించినాడు జగపతి నమస్కరించిన యిరువురు శిష్యులను.

ఈ మహా వ్యక్తి యెవ్వరి యాకర్షణ మేమి? ఈ వ్యక్తిత్వమేమి? ఈశక్తి యేమి? ఇవి పెద్దనలోని యాలోచనలు.

ఇంతలో శంకరుడు ముందుకు వచ్చి కృష్ణరాయల కెదురు నిలచినాడు. అతదేమొనర్ప నున్నాడో యెవరి కర్థము కాలేదు. చేతులు కట్టుకునినిలచిన యా యువక మల్లుడు తన చేయెత్తి శ్రావ్యముగా ననినాడు.

"కన్నప్పా! నీతో మల్లయుద్ధము చేసి జయించుట కల్ల. నిన్నిప్పుడు బహూకరింపకుండుట ఈ సదస్సునకే యగౌరవము. ఈ నా పద్యమే నీకు బహూకృతి."

అన్నన్నా నే డెంతటి
అన్యాయము జరిగె మల్లు కందర యెదుటన్
కన్నడు కృష్ణుని బోలెను
కన్నప్పా! నీకు నీవు కలరే జగతిన్"

— అని చదివి యూరకున్నాడు.

ఆ యువకుల నవ్వులకా మందిరమే ప్రతిధ్వనించినది. వీరమల్లాతని పట్టుకొని తన భుజముల మీది కెత్తుకొనినాడు. ఆనాటి వారి యానందమున కంతమే లేదు. జగపతియు నా యానందమున భాగము

పంచుకొని ఉల్లాస హృదయముతో తన మందిరమున కరిగినాడు. పెద్దన కృష్ణరాయలతో తన గృహమున కరుదెంచినాడు.

# రెండు

ఒక దినము సూర్యోదయము తోడనే ఆనవాని మధ్యమున నొక విషాద వార్త కార్చిచ్చువలె వ్యాపించినది. భావి విజయనగర రాజ్య చక్రవర్తి యని అందరిచే భావింపబడుచున్న శ్రీకృష్ణదేవరాయల మృతిని గూర్చిన వార్తయది. నల్గురు ప్రజలెచ్చట జేరినను తద్విషయమును గూర్చియే చర్చించుచుండిరి. వారికి రాయలపై నంతటి యభిమానము. అతని నెఱుంగని చూడని వారలుగూడ ఆతని గుణాకర్ణనమున చొక్కినామాత్యుని మూలమున అశేష సైన్యము ప్రజలు కృష్ణరాయల యందొక విధమగు నభిమానమునే కలియుండిరి. వీరనరసింహునికి తన పితరులను విష్ణు సాన్నిధ్యము జేర్చిన రోగమే యంకురించుటచే నాతని మరణము తథ్యమనియు కృష్ణరాయలిక తమ కేలికయగుననియు వారు భావించుటచే తమ భావి సామ్రాజ్యమందు వారి యభిమానము ద్విగుణీకృతమైనది. వీరనృసింహరాయల కుమారుడు ఆరేండ్లవాడు. ఆతడు రాజ్యార్హుడు కాదు. కృష్ణరాయలకన్న అచ్యుతరాయలు చిన్నవాడు కావున రాజ్యార్హుడు కాడు. అందుచే కృష్ణరాయలే విజయనగర చక్రవర్తియని వారి భావన.

ఆ ఆలోచనల కీవార్త యాతంకము కల్పించినది. గుఱ్ఱముపై స్వారి యొనర్చుచు గుఱ్ఱము నాపలేక పడిపోయినాడనియు, బలమైన గాయములచే మరణించినాడని తొలివార్త వచ్చినది. అర్ధరాత్రి యాతని శత్రువు లెవ్వరో చుట్టుముట్టి మడియింప జేసినారనియు వీరనరసింహరాయలు హంతకులను పట్టించి ఉరిదీయించినాడని మఱియొక వార్త. వీరనృసింహరాయలే తన కుమారుని రాజ్యాభిషిక్తుని జేయదలచి తన కుమారుని కీత డాటంకమగునని తమ్ముడైన అచ్యుతరాయలతో కుట్ర యొనర్చి ఆతడే హత్యచేయించినాడని మఱియొక వార్త. వీరనృసింహరాయలయందు మగ్నత ప్రవేశింపగనే మహామంత్రి తిమ్మరుసును కృష్ణ

రాయలను వధించి ఆతని కన్నులను చూపవలసినదిగా యాజ్ఞాపింపగా మంత్రితిమ్మరు సాతనిని తన తమ్ముడైన గోవిందరాజుచే హత్యచేయించి ఆతని కన్నులను తెప్పించి వీరనృసింహునకు జూపించినాడనియు. ఇక అచ్యుతరాయలను హతమార్చుటకు ప్రయత్నములు జరుగుచున్నవనియు. ఇంకొకవార్త. ఈ విధమగు నీలివార్తలతో ఆనవాని పట్టణము కల్లోలమై పోయినది.

దుర్గాధిపతి ఆజపర్క తిమ్మనకు అధికారికమైన వార్తలేమియు లేవు. ఆతడు చొక్కనామాత్యుని బిలిపించినాడు.

"ఏమి చొక్కనా, యీ నీలివార్తలు? నమ్ముటా నమ్మకుండుటయా తెలియకున్నది?" తిమ్మన ప్రశ్నించినాడు.

"నేనును వినినాను. అధికారవార్త రాకుండగ మన మేమియు నిర్ధారణ యొనర్పజాలముగదా!"

"ఏమైనను రాజధానియందు విపరీత పరిస్థితు లేర్పడియుండుట నిజము. ఇప్పుడు అచ్యుతరాయలు తిరుగుబాటొనర్చునేమో?"

"ఆతనివెనుకుండెడు దండనాయకు లెవరు? ఆతడెట్లు తిరుగుబాటు నొనర్పగలడు? సైన్యములన్నియు తిమ్మరుసు యధీనమున నున్నవిగదా? రాజధానియందు విపరీతపరిస్థితు లేర్పడుట కవకాశము లేదు."

"రాజధానియందు లేకున్నను సామంతులలో కృష్ణరాయలతర్వాత అచ్యుతరాయలను ప్రేమించువా రెక్కువ."

"కృష్ణరాయలు జీవించియున్నది లేనిది నిదమిత్థమని మనకు తెలియదు గదా? ఇందు కొంత సత్యముండకపోదు. అచ్యుతరాయలును దీని వెనుక నుండవచ్చునని నా భావన."

"కాని తిమ్మరుసు కృష్ణరాయలను కంటికిరెప్పవలె కాపాడుచున్నారని మనకు తెలియును. ఆతనినే పరిమార్చునని నే నూహింపలేకున్నాను" అనినాడు చొక్కన.

"రాజ్యకాంక్ష యెంతపని చేయింపదు? మహారాజకుమారుడు పిన్న

వాడు. అట్టివాడు రాజైన నామమునకే రాజు. అప్పుడు తిమ్మరుసే రాజు గదా? ఈ విషయమూహించిన తిమ్మరుసు చేయదలకొను టెట్లు? దీనికి కారణము మహామంత్రియే యైయుండునని నా యూహ." అని తనకుతిమ్మరుసుపై గల యనుమానమును వెల్లడించినాడు తిమ్మన.

ఆతనిలోని ఆంతర్యమును బయల్పరచుట కనినాడు చొక్కన — "మన మీ పరిస్థితులలో నెవరిపక్షము వహింపవలయునని దుర్గాధిపతు లనుకొనుచున్నారు?"

తిమ్మన సందేహించినాడు. కాని చొక్కన సహాయములేనిది ఆదవానిదుర్గము తనమాటను పూర్తిగా వినదు.

"నా ఉద్దేశము కృష్ణరాయల తరువాత అచ్యుతరాయలే అర్హుడని" మెమ్మదిగా ననినాడు తిమ్మన. చొక్కన ముఖభావములను పరిశీలించుచు.

చొక్కన ముఖమున నెట్టిమార్పులు లేవు.

"వీరనృసింహరాయలు ఎక్కువకాలము బ్రతుకడనుట నిర్వివాదము. మన మెంతకాల మస్వతంత్రులుగా నుండుట? ఈ సమయమున అచ్యుతరాయలు మనల నేమియు నొనర్పజాలడు. మన స్వాతంత్ర్యమును ప్రకటించుకొనుట కిది తగిన యదనని నా యభిప్రాయము!" ఆవేశముతో ననినా డీ మాటలు తిమ్మన.

"నీ యభిప్రాయ మేమి చొక్కనా?" తిరిగి ప్రశ్నించినాడు.

"మీ తోడిదే నా కర్తవ్యము. నే నింకొకవైపుండు టెట్లు సంభవము?" అనినా డాతని స్వార్థమునకు ఏవగించుకొనుచు.

"మనసన్నాహములందు మెలకువుండుట శ్రేయస్కరము." తిమ్మన యాలోచనమున బడినాడు.

చొక్కన సెలవుతీసికొని యిలుజేరినాడు.

వ్యాయామశాలయం దీవిషయమే చర్చనీయాంశమైనది. పెద్దన ముఖము చిన్నబోయిన దీవార్త వినుటతోడనే. ఆత డెవ్వరితోడను బలుకక యొకవైపుగా గూర్చుండినాడు. ఆతని యూహాసౌధములన్నియు నొక్క తాపుతో నేలగూలినట్లయినవి.

గరిడీశాలయందు వీరమల్లుని యుద్రేకమున కంతులేదు. చొక్కనా

మాత్యు డాయువకుల నట్లు మల్చుకొని వచ్చినాడు. వారిల హృదయరు లన్నియు కృష్ణరాయల గుణగణములతో నిండిపోయినవి. ఆతని వా రెము గరు. గోపికల గోపకుల హృదయముల కృష్ణ దెట్లాకట్టుకొనెనో వారి హృదయముల కృష్ణరాయ లట్లాకట్టుకొనినాడు.

"తన కాటంకమగునని మహారాజే రాయలను తుదముట్టించి యుండును" ఆతని కన్ను లెఱ్ఱవారినవి.

"నే నొక్కడనే వీరనృసింహరాయలను తుదముట్టింపగలను" అని యరచినాడు వీరమల్లు.

"వీరమల్లూ! ఉద్రేకముతో కార్యములు సానుకూలత గాంచవు. ఈ నీ ఒక్కవాక్యమే నీ తలగొట్టించివేయుటకు చాలును మహారాజునకు" అనినాడు కొండోజి.

"అయినను నాకు భయములేదు. మహారాజొనర్చినది ద్రోహము. రాజ్యమున కధికారిగా తన కుమారు నుంచుకొనవచ్చును. కాని సమర్థుడు, సద్గుణవంతుడైన రాయలను కుతంత్రముగ మట్టుపెట్టించుట గర్హనీయము కాదా?" రెట్టించిన క్రోధముతో ననినాడు వీరమల్లు

"ఆ కృష్ణరాయల నెఱుగుదువా వీరమల్లూ నీవు?" అని ప్రశ్నించి నాడు కన్నప్ప.

"ఎఱుగను."

"మఱి ఎఱుగనివానికొఱ కీ రాజద్రోహపు తలంపు లెందులకు?"

"వీరెవ్వరు? విజయనగరపు గూఢచారులు కాదుగదా?" ఈ ఆలో చనతో వీరమల్లు ముఖమెత్తి కృష్ణరాయలను తీక్ష్ణముగా జూచినాడు. కాని ఆతనిలోని భావములను చదువలేక మిన్నకున్నాడు.

"నన్ననుమానించుచున్నావా? నేను నీకు ప్రాణస్నేహితుడను"అని నాడు రాయలు.

"లేదు కన్నప్పా! రాయలు మా కారాధ్యదైవము. మహారాజు తర్వాత రాయలే మాకు రాజగునని, ఆతని రాజరికమున ఆంధ్రదేశము తన విఖ్యాతిని దిగంతములవఱకు కొనిపోగలదని అందులకు సమర్థు డాతడేనని మాలోని యభిప్రాయము. ఆ యభిప్రాయములు సమూలముగ

పెకలించివేయబడినవి. ఆ యుద్రేకమిది? ఆ యువరాజు నెప్పుడో చూతుముగవాయని యువ్విళ్ళూరెడి మాకోర్కె యన్యథాజరిగి అంతటి సద్గుణవంతుడు మరణించిన ....... "అతని కంఠము రుద్ధమైనది.

తనమీద వారల భక్తిభావము కృష్ణరాయల కద్భుతమైనది. చొక్కనామాత్యు డెట్టిపరిస్థితిని గల్పించినాడు. తన తండ్రి మరణించినప్పుడు తన నప్పగించుకొనినవారిలో నీ చొక్కన తిమ్మరుసు లిద్దరు నున్నారు. ఎంతటి స్వామిభక్తి. ఈ యువకులలో నీ విధమగు భావన నెంతకాలము నుండి ప్రోదిసేయుచున్నాడో చొక్కన?

చొక్కనామాత్యునిపై అతని యభిమానము శతాధికమైనది.

"మన పెద్దన ముఖమువైపు చూడు కన్నప్పా! అతనిలోని దుఃఖ మున కవధులున్నవేమో!" యనినాడు వీరమల్లు.

దూరముగ గూర్చుండి యాలోచించుచున్న పెద్దనవైపు చూచినా రందఱు. కృష్ణరాయల హృదయము తరుగుకొని పోయినది.

జీవించి తమ యెదుటనున్న నొక యజ్ఞాత స్నేహితునికొఱకు వీరి బాధయేమో తెలియలేదు కృష్ణరాయనికి.

వ్యాయామ గురుపు జగపతి యరుదెంచినాడు. అతని ముఖమును అందోళితమై యున్నది.

"తాము వినినారా కృష్ణరాయల విషయము?" ప్రశ్నించినాడు కన్నప్ప.

"వినినాను నాయనా! హృదయవిదారకమగు నీ వార్త వినినాను. కాని నా యంతరాత్మమాత్రము కృష్ణరాయలు నిహతుడు కాలేదని యను చున్నది. నా హృదయ మందుచే ఆందోళనమందుచున్నది కాని యావే దన ననుభవించుటలేదు" అనుచు రాయలముఖమును తీక్ష్ణముగజూచినాడు.

"ఏమో తమకువలెనే నాకును తోచుచున్నది. తిమ్మరుసుప్రాపకము గల్గిన రాయలను జంపించుట సామాన్యము కాదుగదా?" యనినాడు కృష్ణ రాయలు.

"నీవు కృష్ణరాయల నెఱుగుదువా కన్నప్పా!" ప్రశ్నించినాడు జగపతి.

"నాకన్నను కొండోజి యాతని బాగుగ నెఱుగును" అనినాడు రాయలు.

కొండోజిపై ప్రశ్నలవర్షమే కురిసినది. ఇంతటి జడివాన తనపైకి వచ్చునని యాత డూహింపలేదు. తడబాటుతో నా ప్రశ్నలకు జవాబొసంగినాడు కొండోజి.

కృష్ణరాయలు మరణించియుండడనియే ఆతని భావమును. దీనితో వారల హృదయముల కొకింత తెరపి చిక్కినది.

ఆనాటికి వ్యాయామశాల మూయుడని కోరినారు యువకులు. జగపతి యంగీకరించినాడు, శాల మూయబడినది.

పెద్దన ననుసరించినాడు కృష్ణరాయలు,

"పెద్దనామాత్యా! విచారమేలనయ్యా?"

కన్నులెత్తి కృష్ణరాయలను జూచినాడు పెద్దన.

"కన్నప్పా! నా యూహాసౌధములన్నియు నేలపాలైనవయ్యా! ఇక విచారముగాక మిగిలినదేమి?"

"అదేమి పెద్దనా! రాయలు మరణించినంతనే నీకేమయ్యా! నీవు పండితుడవు, కవిశిరోమణివి, ఏరాజు నిన్ను తన ఆస్థానమున కాహ్వానింపడు?"

"నే నొక్కకవిగానే జీవనము చేయగోరలేదు కన్నప్పా! నా నేర్చిన యుద్ధవిద్య, రాజకీయశాస్త్రము సార్థక మొనర్చుకొన గోరినాను. కాని కాలము నా కృష్ణరాయని పొట్టనబెట్టుకొనినది. మాతండ్రి రాయలను గూర్చి చెప్పిన విషయములన్నియు జరుగుననుకొని సంతసించినాను. విధివిధానమిట్లు మారునని యెవ్వరెరుగుదురయ్యా!"

"రాయలు మరణించినవిషయము నిర్ధారణగ తెలియదుగద?"

"మా తండ్రియే యనినాడు, ఇక నమ్మకుండుటెట్లు?"

చొక్కన రహస్యము నెట్లు దాచుచున్నాడో-ఆతని కాశ్చర్యమైనది

"మహారాజింతటి దుర్మార్గమున కొడిగట్టునని నే నూహింపను పెద్దనా!" అనినాడు కన్నప్ప.

"రాజ్యాశ ఎంతపని జేయింపదు కన్నప్పా! దానికి తండ్రి, సోద

రులు కూడ లేరు. అందువలననే రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మనినారు పెద్దలు.

"పెద్దనామాత్యా! నే జెప్పువిషయమును రహస్యముగ దాచగలవు కదా?" అనినాడు కన్నప్ప.

తమ రహస్యము రాయలు బయటపెట్టునేమో యని కొండోజి అందోళనపడినాడు.

"రహస్యమా? ఏమది కన్నప్పా?"

"కృష్ణరాయలు జీవించియే యున్నాడు."

"నీవెట్లెరుగుదువు కన్నప్పా?" పెద్దనముఖము వికసించినది.

"ఈ విషయము మీ తండ్రితోనైన యనరాదు. విజయనగరపు గూఢచారియొక డీవిషయము తెల్పినాడు. తిమ్మరుసు రాయలకురక్షకుడు."

"ఇది నిజమా కన్నప్పా? రాయలు మనకు ప్రభువగునా? నే నాతని కొక కావ్యమువ్రాసి యంకిత మొనంగవలయును" ఆనందతన్మయతలో నేమో యనినాడు పెద్దన.

"కృష్ణరాయలపై నీవొనర్చిన కవిత నొకింత మాకు విన్పింప రాదా? నీ కవితామాధుర్య మాస్వాదించుటకు మేముమాత్రము తగమా పెద్దనా?" ఉల్లాసమాడినాడుకృష్ణరాయలు.

ఈ మదురసమయమున ఇంతటి మదురతరమగు వార్తచెప్పిన నీకు వెనుకటి పద్యము లేలనయ్యా! అపూర్వుగ జెప్పెద నిప్పుడే. కన్నులు మూసికొని పెద్దన వీణియమీటినట్లనినాడు పద్యమును.

శ్రీ వక్షోజ కురంగనాభ మెదపై జెన్నొంద విశ్వంభరా
దేవిన్ తత్కమలాసమీపమున బ్రీతిన్ నిల్పినాడో యనం
గావందారు సనందనాది నిజభక్తశ్రేణికిన్ దోచు రా
జీవాక్షుండు గృతార్థు జేయు శుభదృష్టిన్ కృష్ణరాయాధిపున్.

తన్మయుడై చదివినాడు పెద్దన. కృష్ణరాయల ఆపదకై అరాటమందెడి యా హృదయము అతని కృతార్థునొనర్చుటకై యాక్రోశించినది రాజీవాక్షుడగు విష్ణునిగూర్చి.

తన్మయుడై వినినాడా కన్నప్పనామాంకితుడు కృష్ణరాయలు.

"రాయలపైనీ ప్రేమకు నిదర్శన మీపద్యము పెద్దనా! రాయలు వినిన ఈ పద్యమున కొక యగ్రహారమైన నీయగలడు, అక్షరలక్షలైన నీయగలడు."

"అతడంత వదాన్యుడా కన్నప్పా?" పెద్దన ప్రశ్నించినాడు.

"ఆతనిచేతి కెముకలేదు పెద్దనామాత్యా!" కొసరినట్లనినాడు కొండోజీ.

"ఇంతటి రసవత్తరమగు పద్యము నాశువుగా చెప్పగల్గిన నీవా రాయల ప్రథమాస్థానకవివగుట నిక్కము పెద్దనా!"__రాయలు.

"నన్ను హేళనమొనర్చుచున్నావా కన్నప్పా?"

"నా హృదయానంద మట్లు వెల్లడించినానంతియే పెద్దనకవీంద్రా!"

"నేను కవీంద్రుడను కానయ్యా! కవిత్వమల్లగల్గిన చిన్న కవిని మాత్రమే" అనినాడు పెద్దన నవ్వుచు.

"నీవు నాకిక కవీంద్రుడవే. పెద్దన కవీంద్రుడవు. నే విజయ నగరమున కరిగినపిదప నీ కవిత్వ ప్రతిభ వ్యాప్తిచేయుటకు కృషి యొనర్తును."

"కన్నప్పా! రాయలు రాజైన నీ యజపక్ష తిమ్మన తప్పక తిరుగుబాటొనర్చుననుట నిజము. ఈతడు అచ్యుతరాయలవైపు నాటక మాడి స్వతంత్రుడగుటకు ప్రయత్నించుచున్నాడు. ఈ విషయము ముందుగ రాయలకు తెల్పుట యవశ్యము."

"తిమ్మరుసు మహామంత్రులున్నంతవఱకు నిట్టివారియాట లొక్క నిముసము సాగవు" అనినాడు కొండోజి.

రాయలు దీర్ఘాలోచనామగ్నుడైనాడు.

## మూడు

విజయనగరరాజ్యాధీశుడువీరనృసింహరాయలకు రుగ్మత యంత కంత కెక్కుడై పోవుచున్నది.దేశునవైద్యు లెందరో మహారాజుచుట్టు నున్నారు. వారిలో మహమ్మదయవైద్యుడు ముస్తాఫాకూడ నొకడు.

ఆతడు రాయల రుగ్మతవిషయమై విని బిజాపూరునుండి వచ్చి చేరినాడు. తిమ్మరుసాతని నాదరించి వైద్యముచేయుట కనుమతించినాడు. రాజ వైద్యుడు గోపాచార్యుడు మహారాజువిషయమై ఆందోళన వెల్లడించినాడు తిమ్మరుసుతో.

ప్రధాన దండనాయకుడు గోవిందరాజును, దుర్గాధిపతి త్రయంబక నాయకుడు పీ రిరువురును రాజధానియం దెట్టి యలజడులు కలుగకుండ చూచుచుండిరి. తుంగభద్రాతీరమున ఓడరేవునను అశ్వికసైన్యములు కాపున్నవి. విజయనగరమం దంతటను మూలమూలల అశ్వికులు అప్రమత్తులై కావలికాయుచున్నారు. రాజాంతఃపురము నలువైపుల సైన్యము లున్నవి. మహారాజు మరణించునను భయమున మహామంత్రి ఈ ముందు జాగ్రత్తలన్నియుదీసికొనినాడు.

విజయనగరమం దంతటను తమ మహారాజు మరణశయ్యపై నుండుట, తమకు సరియగు మహారాజులేకపోవుట యను విషయముపై అనేక విధములగు చర్చలు జరుగుచున్నవి.

మహారాజకుమారుడు తిమ్మరాజు బాలుడు. అచ్యుతరాయలు రక్షకుడుగ తిమ్మరాజు చక్రవర్తియగునని తలంచుచుండిరి. కృష్ణరాయల మరణ వార్త జనపికివచ్చినది. మహాచక్రవర్తి లక్షణయుతుడైన కృష్ణరాయలను జంపించిన వీరనృసింహరాయలపై వారి హృదయములో ద్వేషభావము లేకపోలేదు.

అచ్యుతరాయల రాజత్వమునకు సామంతులలో స్వతంత్రులుగాదల చిన అజపర్క తిమ్మనయు, ఉమ్మత్తూరి గంగరాజును, మైసూరుప్రాంతమును పరిపాలించు చిన్నప్పనాయకుడు ముఖ్యులు. వారి ముప్పొరకును అచ్యుతరాయలు వార్తల నంపినాడు, తిమ్మన తన సైన్యమునంతయు సిద్ధమొనర్చినాడు. ఏమైనను విపరీతపరిస్థితులేర్పడిన సైన్యమును విజయనగర ప్రాంతములకు అచ్యుతరాయల కండగాపంపుటకు. అచ్యుతరాయలు మహామంత్రి తిమ్మరుసును నమ్మలేదు. అందుచే సైన్యములో కొందరు

సరదారులను తనవైపునకు తీసికొనినాడు. ఆ విషయములన్నియు తిమ్మ రుసునకు తెలియును కాని మిన్నకున్నాడు.

ఆ దినము సాయంకాలము మహారాజునకు స్పృహ వచ్చినది. తన మరణము తథ్యమనుకొనినాడు వీరనరసింహరాయలు.

అచ్చటనేయున్న మహామంత్రివైపు జూచినాడు.

మహారాజు తనతో రహస్యము మాటాడదలచినాడని గ్రహించి మహామంత్రి అందర నావలకు బంపినాడు.

"మహామంత్రీ!" నరసింహరాయల స్వరము క్షీణించినది.

"ఏమి మహారాజా!"

"ఇక నావిషయమై భయము తీరినది."

"మహారాజుల యారోగ్యము తప్పక కుదుటబడునని రాజవైద్యులు సెలవిచ్చుచున్నారు." ఆ మాటను మహారాజు వినుపించుకొనలేదు.

"నారాజ్యము అచ్యుతరాయల చేతబడకుండ చేయుట నీపై బెట్టుచున్నాను. దానికి నాబిడ్డడు తిమ్మరాజును అధికారిగ జేయుమనని నాకు మాట యివ్వవలయును మహామంత్రీ?"

"తిమ్మరాయల కేవిధమగు లోటును రానీయను మహారాజా; ఈ సేవకుని ప్రాణము లున్నంతవఱకు అతని ప్రాణములకు నా ప్రాణము లడ్డువైచి రక్షింపగలను."

వీరనృసింహుని ముఖమందొక సంతృప్తి తాండవించినది. ఆ మాటలోకింత యర్థముకాగనే శంకాలేశ మొంతు అతని హృదయమున నాడినది. దాని నాతడు లోలోననే యణచుకొనినాడు. ఏమైనను కృష్ణదేవరాయలు మరణించినాడు తన యధికారము కొరకైన తన కుమారుని సింహాసన మెక్కించకపోడు తిమ్మరుసు. అది వీరనరసింహరాయలలోని యాలోచన.

ఆతనికి దగుతెర వచ్చినది. మరల వివశుడైనాడు మహారాజు. పదమూడేండ్ల వయసుగల కుమారుడు తిమ్మరాజటనే యున్నాడు.

(5)

మహామంత్రి రాజవైద్యుడు గోపనాచార్యుని పిలిపించినాడు.

"మహారాజుల ఆరోగ్య విషయమై మీరేమి చెప్పదలచినారు?" ప్రశ్నించినాడు తిమ్మరుసు.

"రేపు చంద్రోదయవేళ గడచిన మహారాజు జీవింతురు. అంతవఱకు బ్రతుకుటయే దుర్ఘటము."

"మరి యితర వైద్యులేమందురు?"

"అందఱిదియే నిర్ణయమునకు వచ్చినారు."

"ముస్తఫా యేమనుచున్నాడు?"

"అత డీ దినమే మహారాజు మరణింపవచ్చు ననుచున్నాడు."

"సరి. మీరిక పోవచ్చును."

మహామంత్రి లేచి అంతఃపురము క్రిందకు నడచినాడు. మహారాజ ద్వార రక్షకుడు తిమ్మయ్య నమస్కరించినాడు. ప్రక్క ద్వారమున నిలచియున్న నరసనాయకుడు వచ్చి నమస్కరించి నిలచినాడు.

"దళవాయి త్రయంబకనాయకునితో ఇపుడు వచ్చిన ముసల్మాను వైద్యుడు ముస్తఫాను బంధించుకొని పోయి కారాగారమున వేయ నే నాజ్ఞాపించినట్లు తెల్పిరావలయును."

నరసనాయకుడు నమస్కరించి వెడలిపోయినాడు.

"తిమ్మయ్యా! మహారాజు మిక్కిలి ప్రమాద స్థితియందున్నాడు. అంతఃపుర భారమంతయు నీపై నున్నది. యువరాజు తిమ్మరాయలు మహారాజువద్ద నున్నారు. జాగ్రత్తగా మసలుకొనవలసిన సమయమిది."

తిమ్మరుసు అశ్వమెక్కి అచ్యుతరాయల భవనమున కరిగినాడు. అచ్యుతరాయలు గంగరాజు పంపిన రాయబారితో మాట్లాడుచున్నాడు. తిమ్మరుసు అచ్యుతరాయల యనుమతి కొఱకు సేవకుని లోనికంపి ప్రక్క నున్న సేవకునితో నటనున్న అశ్వమును జూపి అదెవ్వరిదని ప్రశ్నించినాడు. యువరాజులతో మాటాడుటకై వచ్చినాదెవ్వరో! చాలదూరమునుండి వచ్చినట్లున్నది." అనినాడు వినమ్రుడై సేవకుడు. ఇంతలో లోని కరిగిన భటుడు తిరిగివచ్చి మహామంత్రిని లోనికి గొనిపోయినాడు.

నలువైపుల జూచినాడు మహామంత్రి. అతని జాడలేదు. ఎవ్వరా తడనునదియే మహామంత్రి యాలోచన.

రత్నకంబళము పరచిన ఆ నేలపై సింహాసనమున నున్న అమ్యుతరాయల కెదురుగానున్న ఆసనముపై గూరుచున్నాడు మహామంత్రి

"మహారాజుల స్థితి ప్రమాదముగా నున్నది. మీరచ్చట యుండుట ప్రస్తుతము మంచిది."

"తమరచ్చటనే యున్నారుగదా? ఇక అన్నగారి యోగక్షేమములకై నేనంత యారాటపడ నవసరములేదని యెంచినాను."

ఆ మాటలలో నేదో వికృతమైన ధ్వని విన్పించినది మహామంత్రికి. "నేను కేవలము మంత్రిని మాత్రమే. ఇది ఆప్తులైన వారుండ పిలసిన సమయము. అందున ఈ విషమ సమయమున మీ రచ్చట నుండుట కర్తవ్యముకూడ." "నే నచటకువచ్చి మహారాజ దర్శనము చేసికొనగలను. కాని మహారాజు నన్నచటకు పిల్పింపలేదు. వారి కిష్టములేని పని"జేయుటెందులకని విరమించుకొంటిని. "ప్రస్తుతము వారు మన లోకమందులేరు. మీ కర్తవ్యమును మీకు జ్ఞప్తి యొనర్చుట నావిధి. సామ్రాజ్యమున కిది ప్రమాద సమయము."

"ప్రస్తుతము సామ్రాజ్యమున కేమి ప్రమాద మేర్పడినది?" ప్రశ్నించినాడు రాయలు.

"తూర్పునుండి, ఉత్తరమునుండి, దక్షిణమునుండి దండయాత్రా ప్రమాదములున్నవి. జాగ్రత్త వహించుట అవసరము. సెలవు పుచ్చుకొందు"ననుచు తిమ్మరుసు బయటకువచ్చి తన యశ్వమధిరోహించి వెడలిపోయినాడు.

కృష్ణరాయల కొఱకంతకు మునుపే తన యనుచరుల నంపినాడు తిమ్మరుసు.

దళపతి యయ్యమరసు తిమ్మరుసు ఇంటి యందు మంత్రుల కొఱకు వేచియుండెను. అతడు గూఢచారాధ్యక్షుడు. అందువే విశేష

విషయము తెలుసుకొనుటకు మంత్రి యాతనితో రహస్యాలోచనా మందిర మునకరగినాడు.

"గూఢచారాధ్యక్ష లేమి విశేషములు వినిపింపగలరిప్పుడు?" ప్రశ్నించినాడు తిమ్మరుసు.

"అచ్యుతరాయల పక్షము వహించుటకును తిరుగుబాటు లేవదీయు టకును నగరమందలి దళపతులలో ఇరువురు ప్రముఖులు కుట్రలు పన్ను చున్నారు."

"ఆ దళపతు లెవ్వరు?"

"పెదసాని అక్కప్పనాయడు, కమ్మదొర వెలుకొంటి నరసన్న వీరిరువురు ముఖ్యులు. దూరపు సామంతులలో ఉమ్మత్తూరి గంగరాజు అజపర్కె తిమ్మన, చిన్నప్పనాయకుడు వీరు మువ్వురు ముఖ్యులు."

"ఆర్వీటి బుక్కరాజు విషయమేమి?"

"బుక్కరాజు తన కుమారుడు సైన్యాధిపతి కావలయునని కలలు గనుచున్నాడు. అందుచే అతడంత త్వరపడడు."

"ఇంకను విశేషములు?"

"బీజాపూరువారు మనపై దండెత్తుటకు సర్వము సిద్ధమొనర్చుకొని నారు. ఉదయగిరి దుర్గముపైనిక శిబిరము. గజపతులచ్చట విడిది యొసంచి యున్నారు. తిమ్మరాయలు రాజైన మరుక్షణమే దండయాత్ర సాగించుటకు సిద్ధపడియున్నట్లు లింగరాజు తెల్పినాడు."

"ఈ దినము అచ్యుతరాయల భవనమున కరుదెంచిన వార్తాహరు డెవ్వరో తెలిసికొన్నావా?"

"మహామంత్రులు సహస్రాక్షులు. దుర్గాధిపతి త్ర్యంబకనాయకుడు అతని రాకను గూర్చి నన్ను హెచ్చరించినాడు. అతడు అచ్యుతరాయల భవనములోనికరిగి మరి తిరిగి రాలేదు. భవనమునుండి బయటకు వచ్చిన వెంటనే బంధితుడగును."

"అతడప్పటనే బంధింపబడరాదు. కోటదాటిన యనంతరమే అతడు బంధితుడుగావలయును. అతడు గంగరాజు రాయబారియై

యుండును. ఇక నీవు పోవచ్చును" అని యనుజ్ఞనొసంగి పంపినాడు తిమ్మరుసు.

అయ్యమరసు వెడలిన వెంటనే తిమ్మరుసు ప్రధాన భృత్యుడు విరూపన్న యచటకు వచ్చినాడు.

"కృష్ణరాయల పట్టమనిషి తిరుమలదేవి. కుమార్తె తిరుమలాంబయు నెల్లుండి ఉదయమునకిట చేరవలయును. అందులకు పంపునదెవ్వరిని?" ప్రశ్నించినాడు తిమ్మరుసు.

"కొండోజీ తమ్ముడు గుండరాయడున్నాడు. వానిని పంపవచ్చును."

"వానిని పిలిపించి ఈ ఉత్తరమిచ్చి పంపివారలను పిలిపింపుము." అని వానికొక ఉత్తరమిచ్చి పంపి తిమ్మరుసు తన భవనములోని కరిగినాడు.

తిమ్మరుసుచే పంపబడిన దళనాయకుడును తిమ్మరుసు అల్లుడైన నాదెండ్ల అప్పయామాత్యుడు అదవాని దుర్గమునుజేరి చొక్కనామాత్యుని గృహమున కరగినాడు.

అప్పటికి రాత్రిజాముప్రొద్దయినది. కృష్ణరాయలు చొక్కనామాత్యుడు మాటాడుకొనుచున్నారు. కొండోజి వాకిట ఖడ్గహస్తుడై నిలచియున్నాడు. అప్పయామాత్యుడు గుఱ్ఱమును చొక్కనామాత్యుని భవనముముందు దిగినాడు. కొండోజి యాతని గురుతించి నమస్కరించినాడు. చొక్కనామాత్యుడు బయటికివచ్చి అప్పయామాత్యుడొనర్చిన సమస్కారమందుకొని అతని లోనికాహ్వానించినాడు.

కృష్ణరాయిలాతనినెదుర్కొని నమస్కరించినాడు. మహామంత్రులొసంగిన ఉత్తరమును గ్రహించినాడు రాయలు.

"మనమెప్పుడు బయలుదేరవలయును?" ప్రశ్నించినాడు రాయలు.

"ఇప్పుడే"

"అన్నగారెట్లున్నారు?"

"మరణశయ్యపైనున్నారు. చంద్రోదయ కాలము నిర్యాణ కాలమని వైద్యులనుచున్నారు."

"అచ్యుతరాయ లేమనుచున్నాడు?"

"తిమ్మరాయలను హతమార్చి తాను రాజా కావలయునని ఆతని ఆలోచన, అందుల కీ దుర్గాధిపతి తిమ్మన సహాయము."

"తిమ్మన అంతవాడైనాడా?" అనినాడు రాయలు.

"ఉమ్మత్తూరి గంగరాజు ప్రముఖుడు."

రాయల ముఖము అరుణిమ దాల్చినది.

"వాని శిరమును ఏనుగు కాల మట్టింపవలయును." ఆగ్రహమా ముఖమున కొక వింత సొబగును గూర్చినది.

"మనమిక బయదేరవచ్చును" అప్పయామాత్యుడనినాడు.

"కొందరు మిత్రులను కలియవలసియున్నది" అనినాడు రాయలు.

"పెద్దనతో మాటాడగోరుచున్నాడని గ్రహించి పెద్దనను బిలచినాడు చొక్కన.

"పెద్దన కవీంద్రా! నాకు సెలవపొసంగుదువా?" విచారముతో ననినాడు రాయలు.

"ఏమి కన్నప్పా! మీ విజయనగర ప్రయాణమా? అందున నీయర్ధరాత్రియా?"

"అవును. రాజకార్యమిది. పోకతప్పదు." అనినాడు చొక్కనామాత్యుడు.

"నాకేమి భయము పెద్దనా! నీవంటి సన్మిత్రుల శుభాశీస్సులున్నంతవఱకు నీయర్ధరాత్రములు నన్నేమిచేయునయ్యా?"

"నీ వింతత్వరలో మమ్ము వదలి పోవుదువని తలంపలేదు కన్నప్పా!"

"నేను నట్లనుకొనలేదు. చొక్కనామాత్యులు నాభారమెన్నినాళ్ళు భరింపవలయునోయని యనుకొంటిని. కాని భగవదనుగ్రహముత్వరలో నాపై ప్రసరించినది. మిత్రులందరకును తెల్పువ్యవధానములేదు. గురువులు జగపతిదేవులకు నా వందనములను తెలియజేయుమవా పెద్దనా?"

రాయలచే పంపబడిన కొండోజీ వీరమల్లుని తోడ్కొని వచ్చినాడు.

"వీరమల్లా! నేనిప్పుడు విజయనగరమునకు ప్రయాణమగు చున్నాను నాతోవత్తువా అచ్చటకీయర్ధరాత్రమున?"

వీరమల్లు చిరునవ్వు నవ్వినాడు.

"అర్ధరాత్రిమనిన నాకు భయమనుకొనినావా కన్నప్పా! నీతో మహా సముద్రముల లోతులలోనికైన వచ్చుటకు నేను ఎప్పుడును సంసిద్ధుడనే, అందున విజయనగర యాత్రకు నేను సర్వసంసిద్ధుడను. ఇంతలో వీరమల్లు ముఖము విచారమేఘావృతమైనది. దానికి కారణ మెరిగినవాడు పెద్దన యొక్కడే.

"వీరా! నీవు విచారపడనవసరములేదు."

అదేమియో ఎవ్వరికర్థముగాలేదు. పెద్దన మాటలతో చెన్నుదరిగిన వీరమల్లు ముఖమొకింత కాంతినందినది.

పెద్దన ముఖమున నొకింత విచారము పొడసూపినది.

"భగవదనుగ్రహమున నన్నియు సరిగాజరిగిన కొలదికాలములోనే నిన్ను విజయనగరమున దర్శింపగలను పెద్దనా!" యనుచు రాయలాతనికి నమస్కరించినాడు. పెద్దన ప్రతి నమస్కారమొనర్చినాడు.

రాయలు, అప్పయామాత్యుడు గుఱ్ఱములెక్కినారు. వారి వెనుక సజ్జితములైన రెండుగుఱ్ఱములపై వీరమల్లు కొండోజీ యెక్కినారు. చొక్కనామాత్యుడొక గుఱ్ఱమెక్కి వారిననుసరించినాడు.

వారి గుఱ్ఱములు చీకటిలోని కరుగునంతవరకు చూచి పెద్దన యింటిలోని కరిగినాడు.

గుఱ్ఱములన్నియు ప్రధానద్వారమువరకువచ్చినవి. ఏపరిస్థితులలోను దుర్గరక్షకుని యనుమతిలేనిది అర్ధరాత్రమున నా ద్వారము తెరువరు. చొక్కనామాత్యుడే స్వయముగా నా ద్వారము తెరచినాడు. కోట వెలుపల ఏబదిమంది అశ్వికులు వీరిననుసరించుటకు నిలచియున్నారు. వారు అప్పయామాత్యుని వెంటవచ్చినవారు.

కృష్ణరాయలచట గుఱ్ఱమును దిగినాడు. అతనితోడివారందరు అప్పయామాత్యునితో సహా గుఱ్ఱములు దిగినారు. ఆవలనున్న ఏబదిమంది అశ్వికులు గుఱ్ఱములుదిగి వినీతులై నిలచినారు. వీరమల్లునకీ వ్యవహార మేమియు నర్థముగాలేదు. అతడు గుఱ్ఱమునుండి దిగలేదు.

రాయలు చొక్కనామాత్యుని పాదములంటి నమస్కరించినాడు.

"తామొనర్చిన ఉపకారమునకు ప్రత్యుపకృతి నొనర్పగలనని తలంచుటలేదు. త్వరలో పెద్దన నపటకు బిలిపించుకొను నేర్పాటొనర్ప గలను."

చొక్కనామాత్యుడాశీర్వదించినాడు. ఆతని కన్నులనుండి బాష్పములూరినవి.

నా గృహమునందేమైన యమర్యాద జరిగిన ప్రభువులు మఱచి పోవలయును." గద్గదస్వరముతోననినాడు చొక్కన.

"నా స్వగృహముకన్న మిన్నగానున్నది. ఇంతటి ప్రశాంత సమయమిక నా జీవితమున లభ్యమగుననుకొనుటలేదు. సెలవిం"డనుచు అశ్వమధిరోహించినాడు రాయలు.

మిగిలినవా రశ్వముల నధిరోహించినారు.

అతడెవరు ! తమతో నిన్నినాళ్ళు మెలగిన ఈ కన్నప్ప యెవ్వ రనుననియే వీరమల్లు ప్రశ్న. చొక్కనామాత్యులుగూడ ప్రభువులని సంబోధింపగలిన దెవ్వరిని? ఆతడు కృష్ణరాయలేమోనను శంకయు నాతనికి కలలేదు. కృష్ణరాయలు మరణించెననియే అతని యాలోచన. కన్నప్పకు తోడుగా అర్ధరాత్రి కావున విజయనగరమున కరుగుచున్నానని తలంచినాడు వీరమల్లు ఏబదిమంది అశ్వికులుండ తనతో పనియేమి ?

మఱి యాతడెందులకు తన్ను విజయనగరమునకు కొనిపోవునట్లు. అతని యాలోచన పూర్తికాలేదు. అన్ని గుఱ్ఱములతో బాటాతని గుఱ్ఱమును తోక మట్టలెగబట్టుకొని పరుగిడుచున్నది. అతనియాలోచనలట్లులే పరుగిడు చున్నవి.

గుఱ్ఱముల డెక్కలచప్పుడు యణగునంతవఱకట నిలచి చొక్కనామాత్యుడు ద్వారము మూయించి తన యశ్వము నధిరోహించుటకు అశ్వముపై చేయివైచినాడు.

"ఈ అర్ధరాత్రమున దుర్గరక్షకు లిట నేమొనర్చుచున్నారు?" తీవ్రముగ నున్నదా ప్రశ్న. తిమ్మన ఒకింత ముందుగ రాకుండుటకు చొక్కన సంతోషపడినాడు.

"దుర్గాధిపతులు పొరబడినట్లున్నారు. కొందరు స్నేహితులను పంపుటకై వచ్చినాను."

"ఎచ్చటకు?"

"విజయనగరమునకు."

"వా రెవ్వరో మేము తెలిసికొనవచ్చునా?"

"స్నేహితులని తెల్పుకొనినాను."

"విజయనగరమందలి రాజద్రోహులను మీరు మీయింట దాచినట్లు తెలిసినది." వ్యంగ్యముగ ననినాడు తిమ్మన.

"వారు నాకు స్నేహితులు. రాజద్రోహులని నాకు తెలియదు."

"ఎంత కాలమునుండి వా రీ దుర్గమున నున్నారు?"

"మూడు నెలలనుండి యున్నారు."

"వారిపేర్లను చొక్కనామాత్యులు తెలుపవలయును."

"అది చెప్పుటకు వీలుకానిది. రాజ్యవిషయములై తమరు ప్రశ్నించుట తగునుకాని నా స్వవిషయమది."

"వారు రాజద్రోహులనియే నా నిశ్చయము."

"వారు రాజద్రోహులు కారు. రాజద్రోహులు వేరుగనున్నారు." ఆ

వ్యంగ్యము నర్మమెునర్చుకొనినాడు తిమ్మన ఆతని కన్నుల నిప్పులు రాలినవి.

"బంధించు డీతని" అరచినాడు తిమ్మన.

దుర్గరక్షకుడు రాజద్రోహనేరమునకు బంధింపబడినాడు.

"ఈ సామ్రాజ్యమునకు ప్రభువులు వేరేయున్నారనుమాట మరచిపోయినట్లున్నారు దుర్గాధిపతులు." తీవ్రముగనే యనినాడు చొక్కన.

"ఆ ప్రభువులు నిన్ను రక్షింపలేరు. రక్షింపను రారు." అనుచు ఆతని కారాగారమునకు కొనిపోవుటకు అనుజ్ఞనొసంగినాడు తిమ్మన. ఈ వార్తను రహస్యముగ నుంచుటకొఱకై గట్టికట్టడి యొనర్చినాడు.

పెద్దన పరుండి నిద్రించినాడు. వేకువజామున సేవకుడువచ్చి నిద్ర లేపి తండ్రిగా రింతవఱకు రాలేదని తెల్పినాడు.

పెద్దన కనుమానమైనది. వెంటనే గుఱ్ఱమునెక్కి భార్యను జాగ్రతగా నుండుమని హెచ్చరించి దుర్గ ప్రధానద్వారమునొద్ద కరగినాడు. సేవకునివలన దుర్గరక్షకుడు అప్పటకువచ్చి తిరిగివెళ్ళినట్లు తెలిసినదికాని వారి జాడమాత్రము తెలియలేదు. అప్పటనుండి తిరిగి యింటి కరుదెంచినాడు పెద్దన.

ఏమిజరిగినదో తెలియరాలేదు.

తెలతెలవారవచ్చునప్పటికి శంకరుడు పరుగున వచ్చినాడప్పటకు

"పెద్దనా! పెద్దనా!" అని యరచుచునే భవనములోని కరిగినాడు. అప్పటికే మల్లులందరు వ్యాయామశాలకు చేరుకొనినారు.

పెద్దన "ఏమి శంకరా!" అనుచు అప్పటకు చేరినాడు.

"మామ యెక్కడ?" ఆతడు చొక్కనామాత్యుని మామ యనును.

"అర్ధరాత్రి కన్నప్ప నూరికిపంపుటకై ప్రధానద్వారమునొద్ద కరిగినాడు. తిరిగిరాలేదు" అనినాడు పెద్దన.

"దుర్గాధిపతి తిమ్మన మామగారిని బంధించి కారాగారమున కంపినాడట. ఎవరో రాజద్రోహులకు ఆశ్రయమిచ్చుటచే అట్లు జరిగినదని

మా తండ్రి రహస్యముగ మా యమ్మతో యనినాడు. నే నది విని యిటు వచ్చినాను."

"అయిన కన్నప్ప రాజద్రోహియా? ఇందేదియో మోసమున్నది" అనినాడు వ్యగ్రతతో పెద్దన.

"ఈవిషయమై దుర్గాధిపతితో మాటాడిన?"

"బంధించిన దుర్గాధిపతి విడిపించునా? అది వ్యర్థప్రయత్నము."

"అయిన మనము విజయనగరమున కీ విషయము తెలుపుకొనుటే కర్తవ్యముగా దోచుచున్నది ఒకవేళ కన్నప్ప రాజద్రోహియేమో? దుర్మార్గుడీ తిమ్మనయే యేదో కుట్రనొనర్చి యుండవచ్చుకూడ."

"రాజద్రోహికి నాతండ్రి ఆశ్రయమిచ్చి ఆపద కొనితెచ్చుకొనునని నేను విశ్వసింపను. ఏమైన నీ విషయమువూత్రము మహామంత్రులకు తెల్పుకొందును."

"అదియైన రహస్యముగ జరుగవలసినకార్యము ఈ దుర్గాధిపతి నీపై కేమి కొనితెచ్చునో" అనుచుండ జగపతి యరుదెంచినా డచటకు.

"గురువు లీవిషయమై వినినారా?" నమస్కరించి ప్రశ్నించినాడు పెద్దన.

"ఇప్పుడే వినినాను శంకరుడు తెల్పినాడని రహస్యముగ విజయుడు తెల్పినాడు."

"మీకు తెల్పుటకై విజయమల్లుతోనని నేనిటకు వచ్చినాను" శంకరుడనినాడు.

"ప్రస్తుత కర్తవ్యముపదేశింపుటకు మీరుదప్ప అన్యులు లేరు నాకు." పెద్దన కంఠస్వరమున జీర కన్పించినది.

"విచారపడుట కిది సమయముకాదు పెద్దనా! నా యూహలో కన్నప్ప రాజద్రోహిగా తలంచుటలేదు. కాని కొన్ని పరిస్థితులలో రాజే రాజద్రోహియై శిక్షింపబడును. అట్టిదేదో జరిగినదిప్పుడు. ఎంత విచిత్రముగ వచ్చినాడో కన్నప్ప అంత విచిత్రముగనే వెడలిపోయినాడు.

"మన వీరమల్లును వెంటగొనిపోయినాడు."

"నేనా మరి యుద్ధమునాడే యనుకొనినాను. నా యనుమానమే నిజమైన నీవును నేనును వీరమల్లుడును అందర మదృష్టవంతులమే." జగపతి అలోచనామగ్నుడైనాడు. కొన్ని క్షణములు గడచిపోయినవి జగపతి మరల యనినాడు. "ఈ విషయమై మనము విజయనగరమునకు తెల్పుకొనుట యుక్తము."

"కన్నప్ప నా కొక యుంగరమొసంగినాడు. మహామంత్రిని కలుసుకొనవలయుననిన ఈ యుంగరమును నాడుకొనిన దర్శనము త్వరగా లభించునని తెల్పినాడు" అనుచు తన వ్రేలి యుంగరమును దీసి జగపతి కొసంగినాడు పెద్దన.

"ఇది రాజ్యసంబంధమగు సంకేతముగల ముద్రిక. మా కాలము నాటి సంకేతము లిప్పుడు మారిపోయియుండును. కాని యిది మాత్రము రాజవంశీయుల ముద్రిక యనిమాత్రము నిశ్చయముగ తెల్పగలను" ఈ యుంగర మొసంగి మహామంత్రులయొద్దకు విజయునంపుట శ్రేయస్కరము."

మహామంత్రి తిమ్మరుసున కొక విన్నపము వ్రాసుకొని విజయున కొసంగి తన వ్రేలియుంగర మాతని కొసగినాడు పెద్దన.

ప్రక్కయూరనున్న మీ పెదతండ్రికి జబ్బుగా నున్నందున పోవు చుంటిననియు నాలుదినములలో తిరిగివత్తుననియు ద్వారమున కారణము తెల్పిపోవునట్లు నిర్ణయించినాడు జగపతి కుమారునితో.

అశ్వికులు కోటబయట కరుగునప్పుడు కారణముతెల్పి ఎప్పుడు వచ్చునది తెల్పిపోవుట ఆచారము. విజయు డశ్వారూఢుడై బయలు దేరినాడు.

*

# నాలుగు

విజయనగరమునరాజప్రాసాదము దుఃఖసాగరమగ్నమై యున్నది. మహారాజు వీరనృసింహరాయలు రాత్రి చంద్రోదయవేళ తమ జీవిత యాత్రను ముగించుకొనినారు. కాని ఆ విషయ మింతవఱకును ప్రకటితము కాలేదు. రాజాంతఃపురమందలి కొందరు విశ్వాసపాత్రులైన సేవకులకుదక్క ఇతరుల కీవార్త తెలియదు. మహారాజు పరిస్థితి ప్రమాదకరముగ నున్నదని మిగిలినవారలకు నగరమందలి ప్రజలకు తెలియును.

అంతకు ముందుదినమున అచ్యుతరాయలు అన్నగారిని చూచి వచ్చినాడు. నగరపరిస్థితిని తన కనుకూల మొనర్చుకొని రాజ్యము చేపట్టవలయునని అతని యాశయము. తన కాటంకముగానున్నది తిమ్మరుసు మంత్రియొక్కడే. అతనిని హతమార్పించుటకు పన్నాగమువైచినాడు.

రాజధానీనగరమున అక్కప్పనాయకుడు ఆరువేల పదాతిదళమునకు అధికారి. ఆ రాత్రికి తన సేనతో దాడియొనర్చి తిమ్మరుసును గోవిందరాజును హతమార్చిన తన కేయాటంకము లేకుండ రాజ్యము తన వశమగును. నరసన్న యతనికి తోడ్పడగలడు. ఈ విషయమై అక్కప్పనాయకునితోను, రెండవదళపతి నరసన్నతోను మంతనములు సలిపినాడు అచ్యుతరాయలు.

ఆ రాత్రి రెండు జాములకు నగరమంతయు తమవశము జేసికొనుటకు నిర్ణయింపబడినది. తిరుగుబాటులో పాల్గొనిన సైనికులకు అనేకములగు బహుమతులు, అధికారములు, ధనము ఆసపెట్టబడినవి. సైనికులందరదేవిధముగా తిరుగుబాటులో పాల్గొందుమని ప్రతిన చేసినారు. వారి సంఖ్య అశ్వికులతో కలసి పదివేలవఱకుండును.

నగర రక్షకుడు దుర్గాధిపతి త్రయంబకనాయకుడు. అతడుసాక్షాత్తు త్రయంబకుడే. అతని హస్తమందలి ఖడ్గమే విలక్షణమైనది. అది సాధారణ దళపతులు ధరించునదికాదు. ఆ రూపమేవిలక్షణమైనది ఆ

మూర్తిని గాంచిన నెంతటివానికైన నొక భయమంకురించును. అశ్వా రూఢుడై ఆతడు నగరమున నెక్కడ జూచినను తానయై కన్పించు చున్నాడు. సహస్రాక్షుడై నగరవిషయముల గమనించుచున్నాడు. ఆతని యొద్ద ఐదువేలమంది నగరరక్షకు లున్నారు. వారందరశ్వారూఢులు. నిర్ణీతప్రదేశములందు నిలచి వారు తమ విధులను నిర్వర్తింపుచున్నారు. అక్కప్పనాయనితో అచ్యుతరాయలు జరిపిన మంతనములు గూఢచారుల వలన తిమ్మరుసు మంత్రికి తెలియనచ్చినవి. ఆతడు మహారాజ భవనము నందే యున్నాడు. తిమ్మరాయలు, వీరనరసింహరాయల రాణియు నచ్చ టనే యున్నారు. తమ ప్రాణములపై కేమివచ్చునో యనుబాధ, భర్త మరణించినబాధ యొకవైపునను, తన కుమారుదేమగునోయను వెఱపు మరియొక వైపునను ఆమెను తేజోహీనురాలినొనర్చినవి. అట్లే ప్రాణము లుగ్గబట్టుకొని నిలచియున్నది భర్త శవమునద్ద. అచ్యుతరాయ లన్న తిమ్మరుసున కిష్టములేదు. కృష్ణరాయలు మరణించినాడు. అందుచే తిమ్మరుసుమంత్రి తమపై నెట్టి యత్యాచార మొనర్పక తన బిడ్డనే సమ రించునను ఆలోచనయే ఆమెలోని ఆశాలేశము. కృష్ణరాయలకొఱకు ఎదురుచూచుచున్నాడు తిమ్మరుసు. ఆతడు వచ్చునంతవఱకును మహారాజు మరణవార్త ప్రకటింపరాదనుట అతని నిశ్చయము. వాడు వచ్చునప్పటికి రాత్రి మూడుజాములు దాటిపోవచ్చును. ఈ తిరుగుబాటును అణచుటెట్లు?

తిమ్మరుసు మిగిలిన మంత్రులను రాయసం కొండమరుసు, అయ్యా మరసులను పిలిపించినాడు. ఆతని తమ్ముడు విజయనగర సర్వసేనాపతి గోవిందరాజు, ఆశ్వికదళాధిపతి నాదెండ్ల గోపమంత్రి, దుర్గాధిపతి త్ర్యయంబకనాయకుడును వచ్చి రహస్యాలోచనయందు పాల్గొనినారు. వీ రందఱకు కృష్ణరాయలు బ్రతికియుండుట తెలిసినదే.

"అప్పమంత్రి కృష్ణరాయలను కొనివచ్చుటకు అదవాని దుర్గమున కరగినాడు. తిరిగి యింతవరకును రాలేదు" అనినాడు మహామంత్రి తిమ్మరుసు.

"అచ్చటేమైన ప్రమాదము సంభవించియుండదుగద" గోపమంత్రి యనినాడు.

"అజపర్క తిమ్మన అచ్యుతరాయలను సమర్థించి స్వతంత్రుడగుటకు ఆలోచన నొనర్చుచున్నాడు. ఆగర్భశత్రువైన కృష్ణరాయల యునికిని కనిపెట్టినాడేమో?" గోవిందరాజు తన యనుమానమును వెలిబుచ్చినాడు.

"మూడుదినముల కితమువఱకట్టిదేమియు జరుగలేదు. రాయలు సుఖముగనే బయలుదేరి యుండును. బయలుదేరిన సమయమునుబట్టి యాలోచించినను ఇచ్చటకు చేరుటకు నింక రెండుజాములుపట్టవచ్చును." అనినాడు తిమ్మరుసు.

"మహారాజు స్థితి ఎట్లున్నది ప్రస్తుతము?" ప్రశ్నించినాడు అయ్యమరసు.

"మహారాజులు మరణించినారు. రాయలు వచ్చునంతవఱకును వారి మరణవిషయము బయటకు పొక్కనీయకుండుటకే నిశ్చయించినాను. ఆ విషయము తెల్పుటకే మిమ్ము నిచటకు పిలిపించినది."

"అచ్యుతరాయల కీవిషయము దెలియునా?" ప్రశ్నించినాడు అయ్యమరసు.

"తెలియదు. ఆతడీరాత్రికి దాడిజరిపి రాజధానిని తనవశ మొనర్చుకొనవలయునని సర్వము సిద్ధమొనర్చుకొనియున్నాడు. అందిరువురు మంత్రులను ఇరువురు దళపతులను హతమార్చుట వారి యుద్దేశ్యము."

"వానికి సహాయమొనర్చువారెవరు? హతమార్చబడు మంత్రులెవరు?" కొండమరసు ప్రశ్నించినాడు.

"అక్కప్పనాయకుడు, వెలుకొంటి నరపన్న వారివారి సేనలతో నాతని సహాయ్యమునకు ప్రతినబూనినారు. అచ్యుతరాయలు రాజ్యమునకు వచ్చినప్పుడు వారు సేనాపతులుగనో, సామంతరాజులుగనో నొనర్పబడుదురట. ఈ విషమసమయమున కర్తవ్యమును నిర్ణయించుటకు కోరుచున్నాను."

"అచ్యుతరాయలను బంధించిన నన్నివిషయములు తీరిపోవును." అనినాడు కొండమరుసు.

"దళపతులు తిరుగుబాటు నొనర్చిన?" ప్రశ్నించినా డయ్యమరసు.

"తిరుగుబాటు నెదుర్కొనుటకు దళములు సిద్ధముగా నున్నవి." త్ర్యంబకనాయకు డనినాడు.

"రక్తపాతము జరుగుట నా కిష్టములేదు" అనినాడు తిమ్మరుసు.

"మీరు నిర్ణయించినవిధముగా నడచుకొనుటకు మేము సంసిద్ధులము" త్రయంబకనాయకు డనినాడు.

"మహామంత్రుల నిర్ణయములు మాకు సమ్మతములే" యనినారు కొండమరసు, అయ్యమరసు మంత్రులు.

"కుట్రనొనర్చిన దళపతులనుబంధించుట మన ప్రధమకర్తవ్యము. సైన్యములకు వారిస్థానములనుండి కదలిన మరణశిక్షవిధింపబడునని తెల్పవలయును. గోవిందరాజురాయలకు కొంత సైన్యముతో నెమరు పోవలయును. రాయల రక్షణకై పోయినది ఏబదిమంది సైనికులు మాత్రమే. త్ర్యంబకనాయకుడు ఈ క్షణముననే అక్కప్పనాయకుని, నరసన్నను వారి గృహములందు బంధించి రహస్యముగ కారాగారమున నుంపవలయును. రాజధానీ నగరమందు కడు జాగరూకత యవసరము. ఈ రాత్రియే గడ్డురాత్రి. అచ్యుతరాయల విషయమై శ్రీ కృష్ణదేవరాయలు చూచుకొనగలరు."

త్రయంబకనాయకుడు వెడలిపోయినా డప్పటినుండి. ఏబదిమంది అశ్వికులతో నాతడు అక్కప్ప దళపతి గృహమున కరిగినాడు. అక్కప్ప నాయకుడు నరసన్నలిరువు రచ్చటనే మంతనములు సలుపుచున్నారు. వారిక బయలుదేరి సైన్యముల కాధిపత్యము వహింపవలయును.

అశ్వమును దిగి త్ర్యంబకనాయకుడు సరాసరి భవన మధ్యమున కరగినాడు. ఆతనివెంట నిరువదిమందివీరులు ఖడ్గధారులై యున్నారు.

ఈ అకాలప్రళయమేమో తెలియక అక్కప్పనాయకు డిదియేమని ప్రశ్నించినాడు.

"శ్రీశ్రీ వీరనరసింహరాయ మహారాజులఆజ్ఞతో మిమ్ము బంధించుచున్నాను. రాజద్రోహ నేరము మీపై ఆరోపింపబడినది."

"వీర నరసింహరాయలు మరణించి చాల కాలమైనది. ప్రస్తుతము

ఆజ్ఞాపించుటకు రాజెవ్వడును లేడు." అనినాడు కోపముతో నరసన్న దళపతి.

త్ర్యంబనాకయకు దాతనిపై దూకినాడు. మిగిలినవారు అక్కప్ప నాయకునిపై దూకి బంధించినారు. బంధించబడిన యిర్వురు దళపతులను రహస్యకారాగారమునకు గొనిపోబడినారు.

అచ్యుతరాయలుమాత్రము తన స్వంతసైన్యమైదువందలు తన భవనమునకు కాపుదలయుండగా తిరుగుబాటుకొఱకెదురుచూచుచున్నాడు. ఆతని యూహాసౌధములు నేలమట్టమైనది తెలియదాతడు.

హుటాహుటీ పయనములతో అప్పమంత్రితో కలసి రాత్రిమూడవ యామమునకు శ్రీకృష్ణదేవరాయలు విజయనగరమును చేరినాడు. గోవిందరాజాతని నెదుర్కొని నగరములోనికి గొనివచ్చినాడు. నగరప్రజ లీవిషయమేమియు నెఱుగరు. తమ మహారాజు చావుబ్రతుకులలో నున్నట్లును ఆతనియనంతర మాతని కుమారుడో, అచ్యుతరాయలో రాజగుననియు వారి తలంపు.

తిమ్మరుసు రాజభవన ప్రాంగణమున నాతని కెదురేగి సగౌరవముగ లోనికి గొనివచ్చినాడు. రాయలు భక్తిభావముతో తిమ్మరుసు పదములకెరగినాడు. అనంతరమాతడు కొండమరసుకు నమస్కరించినాడు.

"అప్పాజీ! అన్నగారెట్లున్నారు?"

"చంద్రోదయవేళ నన్నగారు మరణించినారు. ఆవిషయమై ప్రకటింపక మీ రాకకొఱ కెదురుచూచుచున్నాము."

అన్నగారి కళేబరమునద్ద కరగినాడు కృష్ణరాయలు. తాము మరణించెననుకొనిన కృష్ణరాయలు జీవితుడై యిట్టి క్లిష్టసమయమున వచ్చుట అచ్చటివారల కాశ్చర్యమైనది. వాకిటనున్న కావలితిమ్మన రాయలకు నమస్కరించి వైదొలగినాడు. తిమ్మరాయ లాతని జూచి చిన్నానన్న చిన్ననాన్న యనినాడు.

అర్ధనిద్రలో కన్నుమూసిన వీరనరసింహరాయల భార్య లేచి దిగ్భ్రాంతి జెంది చూచుచున్నది.

ఆ మహారాజ కళేబరము పాదములు కన్నుల కద్దుకొని నమస్కరించి, అచ్చటనే స్తంభీభూతురాలై నిలచి తనవైపు జూచుచున్న వదినవైపు చూచినాడు రాయలు.

"మహారాణివారికి, యువరాజు తిమ్మరాయల కేవిధమైన అగౌరవముగాని ఆపదగాని జరుగబోదు. నన్ను మీ బిడ్డగా భావించి ఆదరింపవలసినదిగా ప్రార్థన" అనినాడు రాయలు. ఆమె కన్నులు చెమర్చినవి.

ఆ వేకువనే ముఖ్యసేనాపతులతో, మంత్రులతో నొక రహస్య సమావేశము రాజమందిరముననే జరిగినది.

అందు అప్పాజీ, అయ్యమరసు, రాయసం కొండమరుసు, సేనాధిపతి గోవిందరాజు, దుర్గాధిపతి త్ర్యంబకనాయకుడు, లక్ష్మణ దణ్ణాయకులు, దళవాయి లింగరసు, ఆర్వీటి బుక్కరాజు, రాచూరి తిమ్మరాజు మొదలైనవారున్నారు. నాదెండ్ల గోపప్రధాని, అయ్యమంత్రి నిరువురు నా రహస్య సమాలోచనలో పాల్గొన్నవారిలో నున్నారు.

వీరమల్లున కప్పటికి తానెవరితో పోరాడిననాడో, ఆ కన్నప్ప యెవ్వరో అర్థమైనది. ఆతడు కృష్ణరాయలని తెలిసినప్పటినుండియు వీరమల్లాతనితో మాటాడుటకే సందేహించుచున్నాడు. ఆతని కిప్పు డిట అప్తుడొక కొండోజీమాత్రమే. ఆ రహస్యాలోచనయందు కొండోజీ యున్నాడు. ఆతని వెనుకనే వీరమల్లు నిలువబడి యున్నాడు.

తిమ్మరుసు మాటాడబోవుచు వారి నందరను కలయజూచినాడు. ఆతనిదృష్టి వీరమల్లుపై నిలచినది. తిరిగి కృష్ణరాయలపై నిలచినది. ఎవ్వరీ నూతనవ్యక్తి యని మంత్రి ప్రశ్న.

"ఆతడు ఇకపై నా కంగరక్షకుడు. వీరమల్లు నాతో మల్లయుద్ధమొనర్చిన వీరుడు. మరణించిన కృష్ణరాయలకొఱకు అంగలార్చిన స్నేహితుడు, నే నెవ్వడనో నాతని కింతక్రితమువఱకును తెలియదు. ఇప్పుడు తెలిసికొని యుండవచ్చును. సామాన్యవ్యక్తిగా నన్ను సేవించబూనిన ఈతని కా పదవి యిచ్చుటలో నేను పొరబడలేదని మహామంత్రులకు తెల్పుచున్నాను." అనుచు తన మొలయందలి రత్నాలబాకును చేతిలోనికి తీసికొనినాడు రాయలు.

ఆతడే ప్రథమముగా రాయలచే నియమింపబడువాడు. నియమిత పద్ధతియందే యీ నియామకము జరుగవలయునని వాంఛించినాడు మహామంత్రి తిమ్మరుసు.

వీరమల్లువైపు తిరిగినాడు అప్పాజీ.

"వీరమల్లూ! నీ వదృష్టవంతుడవు. మహారాజుగా రాయల ప్రథమ నియామకమిది. ప్రప్రథమముననే ఇంతటి ఉన్నతపదవి నందుటలో నీయందు మహారాజుంచిన విశ్వాసమున కనుగుణముగ నడచుకొనుము."

అప్పమంత్రి లేచి వీరమల్లును రాయల ఎదుటకు గొనివచ్చినాడు. ఆతని ఒరయందు వ్రేలాడు ఖడ్గమును ఒరనుంచి లాగి మహారాజు పాదములకడ నుంచ నాజ్ఞాపించినాడు.

అట్లే ఖడ్గముంచి వీరమల్లు తన శిరమును రాయల పాదములకు సోకునట్లు మ్రొక్కినాడు. తన చేతనున్న రత్నాల పిడిబాకును ఒరతో సహా రాయ లాతనిహస్తములం దుంచినాడు. తరువాత వీరమల్లుంచిన ఖడ్గమును అప్పమంత్రి యందీయగా నందుకొని వీరమల్లు హస్తములం దుంచినాడు రాయలు. ఆ రెండు ఆయుధములను కన్నుల కద్దుకొని నిలచినాడు వీరమల్లు.

అప్రయత్నముగ నాత డిట్లనినాడు. అది రాజసన్నిధి నొనర్పు ప్రమాణమునకు భిన్నమైనను ప్రమాణముగనే భాసించినది.

"మహారాజా! మల్లయుద్ధమున నాడు మీచే జయింపబడినాను. ఆనాటి మీ ప్రేమచే తిరిగి రెండవమారు జయింపబడినాడను. మీ కరుణా లేశముచే నీనాడు జయింపబడితిని. ఈ శరీర మీప్రాణము మీ సేవకై వినియోగింపకొనగలడీ సేవకుడు" ఆతని కన్నులు చెమర్చినవి. ఆతని స్వరము గద్గదమైనది. ఆత డుద్విగ్నుడై నాడు. హృదయాంతరాళము నుండి వచ్చిన ఈ ప్రమాణవాక్యములు ఆ సభికుల హృదయముల చలింప జేసినవి. వారలకు కర్తవ్యప్రబోధ మొనర్చినవి. వారి హృదయముల నెచటనో తాకి కన్నుల బాష్పములు రాలజేసినవి.

ఈ నియోగ మింతటి చక్కని ప్రతిఫలమిచ్చునని యూహింపని తిమ్మరుసు మహామంత్రికి సంతోషమైపోయినది.

రాజప్రాసాదము ముంగిట దీనికి ఉపశ్రుతిగా చాటింపు వినవైనది.

"మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరకృష్ణ దేవమహారాయలుంగారి ఆజ్ఞాపనమీద సకలప్రజలకు తెలియపరచే దేమనగా _

"మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరనరసింహరాయలుం గారు రాత్రి చంద్రోదయకాలమున మరణించి స్వర్గస్థులైన కారణంగా వారి తదనంతరము ఈ విజయనగరరాజ్య సింహాసనాన్ని అధిష్ఠించడాని కిన్ని మహామంత్రులు. దళనాయకుల వేడికోలుమీదను. రాజ్యపు పరిస్థితులు బాగుగాలేని కారణాన నున్నూ. శ్రీ వీర కృష్ణదేవమహారాయలుం గారు ఒప్పుకొని అన్నగారిమరణకాలాన్నుండి అధికారం చేపట్టినారు గనుక ఇకపై సర్వప్రజలున్నూ, సర్వ ప్రధానులు, ప్రతినిధులు సామంతరాజులున్నూ దళపతులూ. దళనాయకులున్నూ వారివారి స్థానాలలో యథావిధిగా నుండి మహారాజులవారి ఆజ్ఞలు జరుపవలసింది. ఈ విధంగా జరుపక వేరుపడనవా రెవరైనా వారికి మరణమే శిక్షా తెలుసుకొనవలసింది. ఇంకపైన సర్వాధికారాలు శ్రీ శ్రీ వీర కృష్ణదేవ మహారాయలుంగారే వహించారని సర్వప్రజలున్నూ తెలిసికోవలసింది. ఎల్లుండిదినాన విజయ నగర సభాస్థలంలో మహారాజులుంగారు సర్వులకు దర్శనమిచ్చేరు కావున కొలువునకు హాజరు కావలసింది_

భేరీ నగారామ్రోతలలో విజయనగర రాజవీధులందలి ప్రజల నీ చాటింపు మేల్కొల్పినది.

మరణించెననుకొనిన కృష్ణరాయలు తమకు మహారాజుగా పదవిని స్వీకరించినాడనుట వారికి వింతగా తోచినది. అధికారికమైన ఆ వార్తను నమ్మకుండు టెట్లు? మహామంత్రి తిమ్మరుసు చాణక్యమై యుండు నిది యని వారు సరిపెట్టుకొనినారు. అచ్యుతరాయ లట్లే నిద్రలేక కూర్చొని యున్నా డానాటిరాత్రి. అర్ధరాత్రి యగుసరికి తనభటు నొకనిని అక్కప్ప నాయకుని భవనమున కంపినాడు. అప్పటి కాపుండెడి ఇదివటకువారెవ్వరు కన్పించలేదు. క్రొత్తవారెవ్వరో యున్నారు.

దళపతినిగూర్చి యడుగగా సైన్యములవద్ద కరగినారని తెలిసినది. వాడది అచ్యుతరాయలకు వినిపించినాడు. అచ్యుతరాయలు తమ ఃనిని నిర్వర్తించుటకే వార లచట కరగినారని తలంచినాడు. కాని యటనుండి మఱి యేవార్తయు రాలేదు. వేకువన ఈ చాటింపువినిన అచ్యుతరాయలకు ప్రాణములే పోయినట్లయినవి.

కృష్ణరాయల మరణవార్తనునమ్మి తానెట్లు వంచింపబడినాడో తన యన్న వీర నరసింహరాయ లెట్లు వంచింపబడినాడో యతని కవగతమైనది. తిరుగుబా టొనర్పదలచిన నాయకు లేమైనారో యతని కవగతము కాలేదు. తనను రాయలు బ్రతుకనిచ్చునా యనునదియే యాతని శంక. ఆతని మరణమునకు తాము కుట్రయొనర్చుట నాత డెఱుగకుండునా? ఏమొనర్చుటకు తోచలే దాతనికి. పారిపోవుటయా? నగరమంద్రప్రమత్తులై తిరుగుచున్న భటులు తనను బంధించిన? తనవారేమగుదురప్పుడు? ఆలోచన యాగిపోయినది.

కృష్ణరాయల భవనమున రహస్య సమాలోచనలు జరిగిపోవుచున్నవి. వారందరు కృష్ణరాయలతో ప్రాణముల నిచ్చుటకు ప్రతినలు గొనినారు. ప్రస్తుతము తిరుగుబాటు నొనర్చుటకు సకల సన్నాహము లొనర్చిన అచ్యుత దేవరాయల నేమొనర్పవలెననునదియే అప్పటి సమస్య.

అచ్యుతరాయలకు మరణశిక్ష విధించి తిమ్మరాజును యువరాజుగ నొనర్చుట యుక్తమనినాడు కొండమరుసు.

అచ్యుతరాయల మరణశిక్షపై మఱియొక యభిప్రాయమే లేదు.

రాయలు అప్పాజీ యభిప్రాయ మడిగినాడు.

"ఇకపై నచ్యుతరాయలవలన మన కేవిధమగు ప్రమాదములేదు. అందుచే నాతని వధించుట యుక్తముగాదు. అది ప్రజలలో నొకవిధమగు జుగుప్సను రేకెత్తింపగలదు. ప్రప్రథమముననే యది మన కనుకూలము కాదు. అందుచే నతనిని రాజధానికి దూరమున నొక దుర్గాధిపతిగా పంపివేయుట యుక్తమని తోచుచున్నది." తన యాలోచనను వివరించినాడు అప్పాజీ.

"అచ్యుతనుండి తిరుగుబాటును ప్రోత్సహించిన మనకు ప్రమాద మెక్కడుకదా?" అయ్యమరసు ప్రశ్నించినాడు.

"ఆతని దళనాయకుడు మనకు విశ్వాసియగువాడుండు నచట" యనినాడు తిమ్మరుసు.

"ఇక తిమ్మరాజు విషయము?" రాయలు ప్రశ్నించినాడు.

"ఆతడు సామ్రాజ్యమునకు వారసుడు" అనినాడు త్రయంబక నాయకుడు.

అందలి వ్యంగ్య మరమైన దంగరకు.

ఏమైన నేనా బాలుని సంహరింపదలచుకొనలేను. ఆతనొక సీమను పరిపాలించుటయే నా యుద్దేశమనినాడు రాయలు స్వయముగ.

మిగిలినవారు దళపతులు. దళపతుల నిరువురను శిక్షించుట యవసరము. అందొకనికి దేశబహిష్కార శిక్ష, మఱియొకనికి తల గొఱిగించియు పంపుటకే నిర్ణయించినాడు రాయలు.

వీరనృసింహరాయల దహన మా దినమున.

మంచిగంధపు చెక్కలు పేర్చిన చితిపై శ్రీ వీరనృసింహరాయల శవము నుంచినారు. సకల రాజలాంఛనములతో శవదహనము పూర్తియైనది. తిమ్మరాజుచే దగ్గఱనుండి సర్వక్రియాకలాపములను నిర్వర్తింప జేసినాడు మహామంత్రి తిమ్మరుసు. ఆనాడు తిమ్మరాజుచే రాయలొనర్పించిన దానములకు పరిమితిలేదు. రాణియొక్క శంక తీరిపోయినది.

# ఐదు

సాయంత్రము కనుచీకటి పడబోవుచుండగా విజయుడు విజయనగర దుర్గద్వారములోని కదుగుపెట్టినాడు. దుర్గములోని కరుగు జనులను

ద్వారమందలివారు పరీక్షించి మరీ వదలుచున్నారు. విజయుడు గుఱ్ఱమును దిగినాడు.

పరీక్షాధికారి ఎచ్చటనుండి వచ్చుచున్నావని ప్రశ్నించినాడు.

"అదవాని దుర్గమునుండి".

"వచ్చుట కేమి కారణము?"

"ఇచ్చట కొకవార్త గొనివచ్చినాను."

"దుర్గాధిపతులనుండియా?"

"కాదు."

"ఎవరినుండి? ఆత దే యధికారి?"

"ఒక సామాన్యునుండి" పేరు చెప్పతగునో తగదో ఊహింప జాలకపోయినాడు విజయుడు.

"వార్త గొనివచ్చిన దెవ్వరికి?"

"మహామంత్రి తిమ్మరుసులవారికి."

ద్వారరక్షకు లంద రొక్కపర్యాయమె నవ్వినారు.

"సామాన్యవ్యక్తి యొకడు మహామంత్రులకు జాబువ్రాసి పంపినాడా?" అనినా డొకడు.

"వార్త నింతదూరము మోసుకొనివచ్చినావు కష్టపడి. తిరిగి జాగ్రత్తగా తీసికొనిపోయిన శరీరమునకు మంచి" దనినాడు ఇంకొకడు.

విజయునకు కోపమాగలేదు. తా నొక్కడు. వారు పదిమంది వఱకున్నారు. తాను లోనికిపోవుటెట్లు? త్వరపడిన కార్యము చెడును. ఆతడాలోచించుచు నిలువబడినాడు.

"నీవు తిరిగి రేపుదయమే దుర్గమును దాటిపోవుదునవిన ఈరాత్రికి తలదాచుకొనుటకు దుర్గములోనికి పోవచ్చును."

ఇంతలో దుర్గాధిపతి త్ర్యంబకనాయకుని గుఱ్ఱ మచ్చుచున్నదని హెచ్చరిక జరిగినది. దుర్గరక్షకులు యెవరిస్థానమందు వారు నిలచినారు. విజయుడును గుఱ్ఱము నొకప్రక్కకుంచి ఆ గుఱ్ఱము వాని నిలచినాడు.

త్ర్యంబకనాయకు డట కరుదెంచినాడు. విజయునిజూచి "ఎవ్వ డీతడు?"

"అదవాని దుర్గమునుండియట. ఈరాత్రికీ దుర్గముననుండి రేపుద యము వెడలుదు ననుచున్నాడు" అనినా డొక ద్వారపాలుడు.

విజయుడు త్ర్యంబకనాయకునకు నమస్కరించినాడు.

"నే నట్లనలేను. నేను మహామంత్రులు తిమ్మరుసులవారిని చూడ వలె నన్నాడను. మీ రవహేళన మొనర్చుచున్నావు."

"ఏవరు పంపగా వచ్చినారు?" దుర్గాధిపతి ప్రశ్నించినాడు.

దుర్గరక్షకులు చొక్కనామాత్యుని పుత్రుడు పెద్దన పంపగా వచ్చి నాను. తన గురుతుగా నాత డీ యంగుళీయక మొసంగినాడు" అనుచు గుఱ్ఱ ముపై కూర్చుండిన త్ర్యంబకనాయకున కగుపించునట్లు తన చేతి నెత్తి యంగుళిని చూపించినాడు విజయుడు.

త్ర్యంబకనాయకుని ముఖమున ఆశ్చర్యము వెల్లివిరిసినది. ఆత దెగాదిగ విజయునివైపు జూచినాడు. "ఇది పెద్దన యొసంగినాడా? నేనే నీకు మహామంత్రుల గృహమును జూపింపగలను" అనినాడు. ద్వార పాలుర ఆశ్చర్యమున కవధులు లేవు. అదేమి మాయయుంగరము?

విజయుడు తిమ్మరుసు గృహమును దరిసినాడు. త్ర్యంబకనాయ కుడు స్వయముగ విజయుని మహామంత్రి ఎదుటకు గొనిపోయినిల్పినాడు.

వినీతుడై నమస్కరించి విజయుడు పెద్దన యుత్తరము నొసంగినాడు.

"స్వస్తి. మహామాత్యులకు నమస్కృతులు
దీనుడు అల్లసాని పెద్దనామాత్యుడు వ్రాసికొను విన్నపములు — కన్నప్ప యను విజయనగరవ్యక్తికి నాతండ్రి ఆశ్రయమిచ్చినాడు. అతడు ఎంత చిత్రముగ మా దుర్గమున కరుదెంచినాడో అంత చిత్రముగనే వెడలిపోయినాడు ఆతని దుర్గము వెలుపలకు పంపుట కరిగిన నాతండ్రి దుర్గరక్షకుడు తిరిగి గృహము జేరలేదు. ఈ దుర్గాధిపతి అజపర్క తిమ్మన నాతండ్రిని రాజద్రోహ నేరమునకు బంధించినట్లు తెలియు చున్నది. ఆ కన్నప్ప తాను మీకు గూర్చినవాడనని మీకు ఆనవాలుగా

నొక ఉంగర మొసంగినాడు. అది మా విజయునివెంట తమకు పంపు కొనుచున్నాడను. మీకు సన్నిహితుడైన కన్నప్ప రాజద్రోహి యెట్లు య్యెనో నా కవగాము కాలేదు. మా తండ్రికి కలిగిన యీ కష్టమును తాము నివారింపగల'ని యెదురు చూచుచున్నాడను.

ఇట్లు విధేయుడు
అల్లసాని పెద్దనామాత్యుడు.

"త్ర్యంబకనాయకా! అజపక్క-తిమ్మన రంగములోనికి దిగినాడు. రాయ లీపలకు వచ్చు పలకు రహస్యము దాచినడు చొక్క-నమాత్యుడు ఈ జాబును చూడగా తన కుమారునకుగూడ నీ రహస్యము తెలియకుండ దాచినట్లు తోచుచున్నది. ఎంతటి విశ్వసనీయు డాతడు?"

"మఱి తిమ్మన యెట్లు గ్రహించినాడిది?"

"కన్నప్ప నంపుటకై వచ్చిన చొక్క-నామాత్యుని ఏబదిమంది సైనికులతో వచ్చి బంధించినాతట. విజయుడనినాడు."

పెరమల్లునొద్ద కీ విజయు నంపుమని దుర్గాధిపతికి తెల్పినాడు మహామంత్రి. విజయుడు వీరమల్లునొద్దకు చేరినాడు. అదవానిదుర్గ విషయములన్నియు విజయుడు వీరమల్లునకు విన్పించినాడు.

పెద్దనకు గల్గిన ఆపదను వినిన వీరమల్లునకు క్రోధమాగలేదు. విజయుని కృష్ణరాయల యొద్దకు గొనిపోయినాడు వీరమల్లుడు.

"ఏమి కన్నప్పయే మహారాజా! అదియే రాజద్రోహమా?" విజయుడు తనకండ్లను నమ్మజాలకపోయినాడు.

"ఏమి విజయా! అదవానిదుర్గమందు పెద్దన యెట్లున్నాడు?"

"పెద్దనతండ్రి చొక్క-నామాత్యులను దుర్గాధిపతి బంధించినాడు."

"కారణము?" కృష్ణరాయలు ఆవేగముతో ప్రశ్నించినాడు.

"వారు రాజద్రోహుల కాశ్రయమిచ్చుచే బంధింపబడుటకు కారణమట."

"ఎవ్వరా రాజద్రోహులు?" తీవ్రముగ ననినాడు రాయలు.

మిన్నకున్నాడు విజయుడు.

"పెద్దనకు చొక్కనామాత్యులకు నా మూలమున కష్టములు వచ్చినవా?"

"పెద్దన తిమ్మరుసు మంత్రులకు ఉత్తరము వ్రాసుకొనినాడు. దానిని గొనివచ్చినాను."

"మహామంత్రు లేమనినారు?" ప్రశ్నించినాడు రాయలు.

"తిమ్మన రంగములోనికి దిగినాడనుటకన్న నింకొకమాట యనలేదు."

"ఆ తిమ్మన గర్వ ముడుగుకాలము వచ్చినది." ఆగ్రహావేశముతో రాయలనినాడు.

"ఇక పెద్దనపై నెట్టి ప్రతీకార చర్య జరుపునో తిమ్మన?" తన యాందోళనను వెల్లడించినాడు విజయుడు.

"త్వరలో పెద్దన నిచటకువచ్చు నేర్పాట్ల నొనర్పగలను. చొక్కనామాత్యులపై నింతటి యత్యాచార మొనర్చిన ఆ తిమ్మనను ప్రాణములతో వదలననుట నిజము. రేపటి యుదయముననే మహామంత్రులతో మాటాడి సర్వసన్నాహముల నొనర్తు"ననినాడు రాయలు.

విజయుడు పరమల్లున కతిథిగానున్నా డారాత్రి.

అందరు సామంతులకును మరునాడు శ్రీ కృష్ణరాయలు రాజ్యమునకు వచ్చుటనుగూర్చి జరుగబోవు పట్టాభిషేకమునకు ముందుగనే వారు వారు చెల్లింపవలసిన బాకీల నన్నిటిని చెల్లించి స్వయముగా మహారాజాననుగ్రహమును స్వీకరించిపోవలయునని ఆజ్ఞలు పోయినవి.

అజపర్క్రతిమ్మన కంపిన ఆజ్ఞలో ఆదవానిదుర్గాధ్యక్షులు అల్లసాని చొక్కనామాత్యులతో పనియుండుటచే ఇరువదిమంది సైనికులను

తోడిచ్చి విజయనగరమునకు వెంటనే పంపవలసినదిగా మరియొక ఆజ్ఞయు చేర్చబడినది. చొక్కనామాత్యుని నిర్బంధ విషయము తామెరుగనట్లె విజయనగరాధీశులు వర్తించినారు.

ఆజ్ఞలను గొని విజయనగరాశ్వికులు ఇరువదిమంది విజయునితో ప్రయాణమైనారు.

# ఆరు

రాత్రి జాము ప్రొద్దయినది. పెద్దన ఆందోళనా మనస్కుడై గృహాభ్యంతరమున తిరుగుచున్నాడు. తన తండ్రి యట్లగుటతో నా నగరమున తన మర్యాద మంటగలసి నట్లాతడు భావించినాడు. తన స్వగ్రామమున కరిగి అచ్చటి పొలము సేద్యమొనర్చుకొనియైన జీవితము గడుపుకొనుట మంచిదిగా నతనికి తోచినది. తన భార్యయు చదువుకొనినది. ఈ సంపన్న జీవితమునకలవాటు పడినదామె. తన తండ్రి రహస్యముగ తన్ను పారిపొమ్మని యేల చెప్పిపంపినాడు ? ఇప్పట్టున తాని ప్రదేశమును వదలిన తన తండ్రి స్థితి యేమి ? ప్రాణములపై నాశతో తన తండ్రిని వదలిపోవుటా ? అట్లెన్నటికిని జరుగరాదు. తన స్నేహితులతో నీ తిమ్మన పైబడి హతమార్చిన ! అతని సైన్యమంతయు తన్ను మట్టు పెట్టగలదు. తాను పంపిన విజయుడు తిమ్మరుసు మంత్రిని చేరినాడో లేదో తెలియదు. కన్నప్ప యిచ్చిన ఉంగరము పని యొనర్చినదో లేదో ? ఈ కన్నప్ప కార్చిచ్చువలె వచ్చినాడు. అతని మూలమున తన తండ్రి కింతటి కష్టము కలిగినది ? అతని యధికారమేమో తెలియదు. అతడెవ్వడైనదియు తన తండ్రి తనకేల తెల్పలేదో అతని కవగతము కాలేదు.

తమ వాకిలియొద్ద నెవ్వరో యొకవ్యక్తి కదలినట్లు పసిగట్టి పెద్దన ఖడ్గము ధరించి బయటకు వచ్చినాడు. ప్రాకారముపై కెక్కి

చాటుగనుండు ప్రవేశమున నెమ్మదిగా చూచినాడా వ్యక్తి. నల్లని ముసుగును ధరించిన యాతడు నెమ్మదిగా అడుగులో నడుగిడుచు భవనద్వారము చెంత కరుదెంచినాడు. బయటనున్న పెద్దన నెమ్మదిగా ప్రక్కనున్న వాకిలిలోనికి పోయి నిలచినాడు. ఆ వచ్చెడు వ్యక్తి పెద్దనను గమనించలేదు. అతడు తీయుచున్న ద్వారమున సరాసరి పెద్దన శయన మందిరమున కరిగినాడు. రహస్యముగ నాతడేమొనర్చునో చూతమని ఖడ్గధారి యైన పెద్దనయు నాతని వెనుకనే యరిగినాడు. శయన గృహమున పెద్దన లేడు ఆ వ్యక్తి ఆశ్చర్యమున కంతము లేదు. అతడు వెనుదిరుగ నున్నప్పుడే పెద్దన తప్పుకొనినాడు. అతడు ప్రక్క గదిలోని కరిగి అచట నిదురించుచున్న ఉమాదేవిని గాంచినాడు. అతనిచేయి ఖడ్గముపై కరిగినది. పెద్దన అపాయమును శంకించి సంసిద్ధుడైనాడు. తమను రహస్యముగ సంహరించుటకై తిమ్మన మాయోపాయమని ఊహించినాడు పెద్దన. ఆ వ్యక్తి కొంచెము తటపటాయించి వెనుదిరిగినాడు. అప్పటికి పెద్దన ఆతని వెనుక వైపున్నాడు. తన చేతి ఖడ్గముతో నాతని ఖడ్గముపై నొక దెబ్బవేసి ఆతనిపై సింగపుకొదమువలె దూకినాడు. ఆ దెబ్బకు ఖడ్గము ఎగిరి దూరముగ బడిపోయినది. ఆజానుబాహుడైన పెద్దన యుద్ధృతమునకు తట్టుకొనలేక పడిపోయినాడా వ్యక్తి. ఆతని మొలలోని కైజారును లాగి దూరముగ విసరివేసి ఆతనిని మట్టగించినాడు పెద్దన. ఈ సందడికి మేలుకాంచినది ఉమాదేవి. రుద్రునివలె నున్న తన భర్తను గాంచి భయమందినది.

స్పృహలోలేని వ్యక్తి ముఖముపై నున్న గుడ్డను తొలగించినాడు పెద్దన. ఆతడెవ్వరో తెలియలేదు. కాలుచేతులు బంధించి నోట గుడ్డలు కుక్కి, నెమ్మదిగా భవనపు వెనుకభాగమునకు చేర్చినాడాతనిని. తనసేవకులెవ్వరానాడు రాలేదు. రాజద్రోహిగా పరిగణింపబడిన చొక్కామాత్యు నింటికి వచ్చుట కందరును భయమందినారు. నిన్నటివఱకు దుర్గ రక్షక దళాధ్యక్షుడు నేడు తోడులేనివాడైనాడు. లక్ష్మి చంచల హృదయ.

పెద్దన గృహములోని కరుదెంచినాడు. కాళ్ళు శుభ్ర పఱచుకొని

శయ్యపై కూర్చుండినాడు. అతని ఆలోచనల కంతములేదు. ఉమాదేవి ఆతని పాదముల కడ కూర్చున్నది.

"ఉమా! ఇచ్చట నికపైనుండుట శ్రేయస్కరముగ తోచుటలేదు. పరిస్థితులు విషమించినవి. మనలను హత్య నొనర్చుటకే దుర్గాధిపతి పూనినాడు."

"మామగారి స్థితి యెట్లున్నదో? వారికేమైన నపాయము కల్గించునేమో యీ మూర్ఖుడు."

"అంతవఱకు సాహసింపడు. తిమ్మరుసు మంత్రి యనిన తిమ్మనకు భయమున్నది. మా తండ్రిపై తిమ్మరుసున కభిమానము మెండు. అందువలన తండ్రిగారి ప్రాణములకపాయ మొనర్ప తిమ్మన సాహసింపడు. కాని రహస్యముగ మన ప్రాణములను తీయింప బూనినాడు."

"విజయుడు విజయనగరమున కరిగిన విషయమై నీరవికేమైన దెలిసినదేమో?"

"అదియు నొక కారణమే, కాని మన మిటనుండి తప్పించుకొని పోవుట శ్రేయస్కరము."

"దుర్గద్వారములు తెరువరుకదా! తెల్లవారు వఱకు మనము బయట కరుగు టే విధముగ?" తన యనుమానమును వెల్లడించినది ఉమ.

అతడాలోచనలో బడినాడు. తామెట్లు కోటదాటి పోవుట? అనునది ఆతని యాలోచన. తాను బంధించిన వాని యనుచరులు తన్నెదుర్కొనిన?

"ఏదైన రహస్య మార్గములున్న వెడలి పోవుట సులభము." ఉమాదేవి యనినది.

పెద్దన ముఖము వికసించినది. తన తండ్రి ఎప్పుడో యనినాడు మల్లవిద్యా గృహమున రహస్య మార్గమున్నదని. కోట శత్రు వశమైనపుడు ప్రాణరక్షణ కుపయోగింపుమని. కోట బయటనున్న అరణ్యములోనికా మార్గమున్నది. అది ఎచ్చట నున్నదో?

పెద్దన లేచినాడు. ఖడ్గమును ధరించి ఒక దీపమునుగొని బయలు దేరినాడు. ఉమాదేవి ఆశ్చర్యముగ నతని ననుగమించినది. మల్ల విద్యాలయము లోనికరిగినారిరువురు. తన తండ్రి తాళపుచెవుల గుత్తి తనవెంట గొని వచ్చినాడు పెద్దన ఆ విద్యాలయ మందన్ని గదులాతడెరిగినవే. అప్పుడు ఖడ్గములు బల్లెములు డాలులు గోడలకు తగిలించి యున్నవి.

తానెరిగినప్పటి నుండియు నొక్కగది మాత్రము మూసియున్నది. అందేమి యున్నదో తానెరుగును. వివిధాయుధములు. అది రహస్య ద్వారమునకు మార్గమై యుండవచ్చునేమో? అనుమానముతో తాళమును తెరచినాడు పెద్దన. అదియొక పెద్దగది. వివిధములైన ఆయుధములు క్రొత్తవి అందున్నవి-జగపతి యొద్ద నొకతాళమున్నది. క్రొత్త ఆయుధము లవసరమైనపు డా గది తెరువబడును."

ఆ గది నంతటిని కలయజూచినాడు పెద్దన. గది గోడలన్నియు వివిధాయుధములతో నిండి యున్నవి. ఒకచోట నొక అరుగున్నది. ఆ అరుగుపై నాతని దృష్టి నిలచినది. ఖడ్గపు పిడితో నాతడాయరుగు రాళ్లపై తట్టినాడు. ఒకచోట మాత్రము కొంచెము బోలు మ్రోత విన్పించినది. ఆ అరుగు ప్రక్క భాగమున నున్నదారాయి. ఆ రాతి ప్రక్కన ఖడ్గమును జొనుపుటకు ప్రయత్నించి సఫలుడైనాడు. అతడట్లు మీటగనే రాయి ఒక యిరుసుపై క్రిందకు పోయినది. పెద్దన ఆన దమున కంతు లేదు. దీపము లోనికి పెట్టి చూచినాడు పెద్దన. క్రిందకి దిగి పోవుటకు మెట్లున్నవి. అట్లే పెద్దన లోనికి దిగి చూచినాడు. మరల వెనుకకు తిరిగి వచ్చినాడు.

ఇరువురు గృహములోనికరిగి కొంత ధనమును వస్త్రములను మూటగట్టుకొనినారు. తన పూజాగృహమందలి స్ఫాటిక కృష్ణ విగ్రహమును గ్రహించి మూటయందు భద్రపరచినాడు పెద్దన. గృహమును వదలుటకు ఉమాదేవి ఆవేదన పడినది. ఆమె కన్నులు చెమర్చినవి.

"ఈ గృహము లీభోగములు శాశ్వతములు కావు. శాశ్వతుడగు మహా విష్ణువు మనవెంటనున్నాడు." ఆమె నాశ్వాసించుచు నదినాడు పెద్దన.

ఉమ ప్రబోధితురాలైనది. అమె భర్త వెనువెంట నడచుటకు సిద్ధ పడినది. పూజాగృహమందలి దైవతములకు నమస్కరించి బరువైన హృదయములతో బయలుదేరినారా దంపతులు.

తమ భవనమునకు తాళము వైచి, విద్యా గృహమున కరుదెంచినారిద్దరు. ఉమాదేవిని లోనికనిపి ప్రహరీ బయట తాళము వైచి ఆ తాళములో తాను వ్రాసిన చీటిని ఉంచి ప్రహరీ దూకి లోనికి చేరినాడు పెద్దన. విద్యాశాల తలుపు లోపలవైచుకొని రహస్య ద్వారమున్న గదిలోని కరిగినాడు. ఆ గది లోపలివైపు గొళ్లెము వైచి రహస్యద్వారములోనికి తన భార్యతో సహా దిగినాడు అతని చేతిలో కాచ దీపమున్నది.

అప్పుట దట్టముగ నల్లిన సాలిగూళ్ళు ఆ బాట చాలకాలమును డి ఉపయోగించుటలేదని తెలుపుచున్నవి కాళ్ల క్రింద మెత్తని యిసుక. మనుష్యుడు ధారాళముగ నడువ వీలగు సొరంగములో పెద్దన ముందు ఒక చేత దీపము మరియొక చేత ఖడ్గము ధరించి నడచుచున్నాడు. వెనుక ఉమాదేవి మూటను చేతబట్టుకొని నడచినది. వారట్లు రెండు గడియల కాలము సురంగము వెంట నడిచినారు. ఒక్కొకచోట గాలి వారికి ధారాళముగ లభించుచున్నది. కొన్నిచోట్ల శ్వాసము కొంచెం కష్టమైనది కొంత దూరమున వారికి మార్గమాగిపోయినది. అప్పుట రెండు మెట్లున్నవి. పెద్దన తన బలమునుపయోగించి అచ్చటి తలుపు నెత్తినాడు. తలుపు పైకి లేచిపోయినది. చల్లనిగాలి లోనికి వచ్చి హాయి యనిపించినది. పెద్దన పైకిపోయి ఉమాదేవిని పైకి లాగుకొనినాడు. చేతి దీపమును పైనుంచి అచ్చట పరిశీలించినాడు. అది దట్టమైన పొద. మధ్య భాగమున మాత్రము సమతలమొనర్చి యున్నది. అందే రహస్య ద్వారమమర్పబడినది.

"పెద్దన పొదరింటి నుండి బయటకు వచ్చినాడు. తమ దీపపు వెలుగు బయటకు కన్పించుటలేదు. అతడు సంతృప్తి నందినాడు. అదవాని దుర్గము బురుజుపై నున్న దీపము కన్పించుచున్నది దూరమున.

తాము దుర్గమునకు దక్షిణపు వైపున నున్నారు. తమకిక భయము లేదు. తెల్లవారు సరికి తాము మరికొంత దూరముగవచ్చును.

ఉమ ఆ పొదరింటి మధ్యనే యున్నది. పెద్దన తిరిగి లోని కరిగినాడు. ఆమె చెమటతో తడిసి యున్నది.

"ఉమా! బాధగా నున్నదా ?"

ఉమ చిరునవ్వు నవ్వినది. "మనమెచ్చటకు పోవలెనని?" ప్రశ్నించినది.

"కోకటి గ్రామమునకు పోయిన ? అదియు తిమ్మన ఆధిపత్యము లోనిదే ఎట్లుండునో ?"

"ప్రస్తుతము మా దోరాలకరిగిన?" ప్రశ్నించినది ఉమ.

"వెడి అత్తవారింటి కరుగుట నా కిష్టములేదు" అనినాడు పెద్దన.

"సరి మీ యిష్టము. ఉదయగిరిరాజ్యమున కరిగిన?"

"అది గజపతుల రాజ్యము. తిమ్మన యాధిపత్యమందు చెల్లదు.

"విజయనగరమునకే పోయిన?" తిరిగి ఉమాదేవియే యనినది.

"అచ్చటి పరిస్థితులెట్లున్నవో తెలియదు. మా తండ్రి నిజముగ రాజద్రోహియేయైన మనకచ్చట సపాయము తప్పదు ప్రస్తుత ముదయగిరి కరుగుటయే మంచిదిగా తోచుచున్నది. అయినను నీవు మీ తండ్రి యింటికి దోరాలయరుగుట శ్రేయస్కరమేమో?" అనినాడు పెద్దన.

"ఇప్పుడు మిమ్ము వదలి పుట్టింటికేగి సుఖపడుమందురా నన్ను?" ఆమె కంఠము రుద్ధమైనది. "మీ యున్నచోటే నాకు సుఖకరమైనది. మీరులేని సుఖములు నాకవసరములేదు." తన నిశ్చితాభిప్రాయమును వెల్లడించినది.

" పెద్దన హృదయ మానందపూర్ణమైనది.

"ఈ మార్గము కష్టతరమైనది. తుంటకలరాయిడి ఎక్కుడు. అందున విజయనగర రాజ్యములో కల్లోలములు చెలరేగు సమయము. మమ్మ దీయులిట్టి సమయములందే చెలరేగుదురు. మనము చిన్న చిన్నగా ప్రయాణించినను ఎప్పటికేమి సంభవించునో తెలియదు అందులకనినాను" అనినాడు పెద్దన్న.

తాముపోక తప్పదనిన మీ మాటకెదురాడను కాని ఇప్పట్టున కట్టుపోవుట మాత్ర మిష్టములేదు." అనినది ఉమాదేవి.

ఆమెను తనవెంటకొనిపోవుటకే నిర్ణయించికొనినాడు పెద్దన. ఇక ఆలస్యమెందులకు మనము బయలుదేరుటమంచిది తెల్లవారిన ఆ హంతకుని జాడను పెట్టుకొనిన వారియనుచరులు మన పలాయనమును తిమ్మన కెరిగింపగలరు. మనకొఱకు రాజభటులు నలుపైపుల పంపబడుదురు. అనుచు ప్రయాణమైనాడు పెద్దన. ఉమాదేవి యాతనిఅను సరించినది.

## ఏడు

త్రిపవాని దుర్గము క్రోసెడుదూరముండగా విజయుడు అశ్వికులను వీడ్కొనినాడు. అతడు తన గుఱ్ఱమునుదిగి అడవిలో విశ్రాంతిగొనుచు నిలచినాడు. విజయనగరాశ్వికులతో తాను వచ్చుట అనుమానమునకు కారణమగును. తన తండ్రికి గూడ నది ప్రమాదమే. తాను వెనుకవత్తునని ముందుగా సైనికుల నంపినాడు.

దుర్గద్వారమున తమ చిహ్నమును జూపి లోనికరిగినారా సైనికులు. దుర్గాధ్యక్షుడు అజపర్క తిమ్మన దర్శనార్థము వారొకింతసేపు సభాస్థానమున నాగినారు.

తిమ్మన తన కుమారుడు వీరశ్యాముని పిల్పించినాడు. "శ్యామా! విజయనగరమునుండి భటులరుదెంచినారు చొక్కనామాత్యుని విడిపించుమనియో లేక కృష్ణరాయల రాజరికమంగీకరింపుమనియో రాయబారమై యుండును."

"మనము స్వతంత్రులమగుటకు తగిన యదనుకదా?" వీరశ్యాము డడిగినాడు.

"అగునా దాసీ పుత్రుని -మహారాజత్వమంగీకరించుట నాకిష్టము లేదు. అది మన వంశగౌరవమునకే కళంకము."

"రాయలు దండెత్తి వచ్చిన?"

"ప్రస్తుతము రాయలు మనపై నెత్తిరాడు. అతడు వచ్చుసరికి మనము బలపడవచ్చును?"

"ఈ భటుల నిప్పుటనే బంధించిన మనకావార్త తెలియనట్లే మనము ప్రవర్తింపవచ్చును."

"అగు నదియు బాగుగనున్నది. లేక చొక్కనామాత్యునే హత మార్చిన."

"ఆ బ్రాహ్మణుని చంపిన మనకు వచ్చునదేమున్నది?" ప్రశ్నించి నాడు వీరశౌర్యుడు

"అతడు మనకెదురైన సైన్యములో కొంతభాగము మన మాట వినకపోవచ్చును. తిమ్మరుసునకితడు కూర్చినవాడు. తిమ్మరుసు నొకకంట కనిపెట్టవలసి యుండును"

ఇంతలో నొక గూఢచారుడరుదెంచినాడు.

"గౌడా! విశేషములేమి?"

"పెద్దనతన గృహము నుండి తప్పించుకొనిపోయినాడు. మనము చొక్కనామాత్యుని బంధించిన విషయము విజయనగరాస్థానమున తెలిసి పోయినదేమోయని నాయనుమానము."

"పెద్దన దుర్వ్యాపారముగుండ పోకుండ కట్టడియొనర్చినాముకద! ఎట్లాతడు తప్పించుకొనినాడు?" తిమ్మన ఆశ్చర్యమును ప్రకటించినాడు.

"భార్యకూడ కన్పించుటలేదు. ఆతని భవనమునకు తాళమువైన బడియున్నది. వీరన కాలు చేతులు బంధింపబడి భవనపు వెనుకభాగమున నున్నాడు."

"ద్వార రక్షకులను ప్రశ్నింపవలయును."

"నేనా విషయమును కనుగొందును. మీరీ విజయనగర భటుల విషయమును జూడుడు"

"చొక్కనామాత్యుని భవనములోని కెవ్వరును ప్రవేశింపకుండ కట్టుదిట్ట మొనర్చి అందు ప్రవేశింప ప్రయత్నించువారిని బంధించి కారాగారమున పడవేయునట్లు ఆజ్ఞాపింపుము"

సరియే యనుచు వీరభటుడు డశ్వమధిరోహించి వెడలినాడు. అజపర్క తిమ్మన సభాస్థానమున కరగినాడు.

విజయనగరాశ్వక నాయకుడు తిమ్మనకు నమస్కరించినాడు. కృష్ణదేవరాయ లొసగిన కమ్మను తిమ్మన కొసంగినాడు.

"ఏమిది? మహారాజులెట్లున్నారు?" ప్రశ్నించినాడు తిమ్మన.

"ఏ మహారాజులు?" నాయకుడు ఎదురు ప్రశ్నవైచినాడు.

"శ్రీ వీరనరసింహరాయలు"

"నరసింహరాయలు మరణించినారు. శ్రీ వీరకృష్ణదేవరాయలు మహారాజులిప్పుడు"

"దాసీ పుత్రునకెట్లు రాజ్యము వచ్చును? అచ్యుతరాయలేమైనాడు. నరసింహరాయల పుత్రుడు రాజుగాని, ఈ దాసీ పుత్రుడా రాజు."

"ప్రభువులు త్వరపడి మాటాడుచున్నారు." నాయకుడు హెచ్చరించినాడు.

తీవ్రమైన హెచ్చరికకు తిమ్మన కనులెఱ్ఱబడినవి. అయినను ఓర్పు వహించినాడు.

"మహారాజుల యాజ్ఞకేమని ప్రత్యుత్తరము?" నాయకుడు ప్రశ్నించినాడు.

"నోరు మూయుము మూర్ఖుడా! మహారాజు మరణించినాడు, వారసుడుండగా నీ దాసీపుత్రుడు సింహాసనమెక్కగనే మహారాజుకాడు." గద్దించినాడు తిమ్మన. లేఖను విప్పిచదివినాడు ప్రక్కనున్న వ్రాయసకాడు.

శ్రీ అదవాని సామంతమండలాధిపతులు అజపర్కతిమ్మనాయని వారికి-శ్రీ విజయనగర సామ్రాజ్య సింహాసనాధిపతి శ్రీ వీరకృష్ణదేవ రాయలు వారి ఆజ్ఞాపన.

మీ దుర్గ రక్షక దళాధ్యక్షులు అల్లసాని చొక్కనామాత్యునితో మాకవశ్య కార్యముకలిగినది. కావున నిరువదిమంది ఆశ్వికులను తోడిచ్చి మా విజయనగర సైనికుల వెంటనంపవలసినది రాబోవు శుద్ధ త్రయోదశి నాడు జరుగు రాజసభకు హాజరై తామిదివరకు చెల్లింపవలసినయన్ని పన్నుల బాకీలను చెల్లించి శ్రీ మహారాజులయెడ విశ్వాస ప్రకటన మొనర్పవలసినది

శ్రీ వీరకృష్ణరాయలు.

తిమ్మనకేమియు దోచలేదు. తిమ్మరుసు ఎంత గూఢముగ వ్రాసినాడీ లేఖను. చొక్కనామాత్యుని నిర్బంధము వానికి తెలిసి యుండును. కాని తెలియనట్లే నటించినాడు. తానీలేఖనుముందుగా చదివిన బాగుండెడిది. తానును కపటముగ నటింపవలసెను. కాని ముందుగనే బయటపడిపోయినాడతను. ఇక వెనుకాడుట పిరికిపంద లక్షణము. వీరిని బంధించి తనకేమియు తెలియనట్లుండి పరిణామముల గమనించుటే ప్రస్తుతకర్తవ్యము.

"చొక్కనామాత్యులను మావెంట పంపెదరా?" నాయకుడు ప్రశ్నించినాడు.

"లేదు. మిమ్ముల నాతనివెంట పంపెదను." తిమ్మన తన చమత్కారమునకు తనే నవ్వుకొనినాడు.

ఆ వ్యంగ్యము నర్థమొనర్చుకొనినాడు నాయకుడు. అపాయమును శంకించినాడు.

ఇంతలో వీరశ్యాముడు సైనికులతో సభాస్థానమునకు వచ్చినాడు.

"మీరందరాయుధములను వదలి లొంగిపోవలసినదినా ఆజ్ఞ."

"మేము మధ్యాహ్నమువరకు కోటబయటకు రాకపోయిన మా ఉనికి తెలియజేయుటకు విజయనగరమున కరుగుటకు ఆశ్వికులు కోటబయటనున్నారు." నాయకుడనినాడు.

"వారీవరకే బంధింపబడినారు." వీరశ్యాముడనినాడు.

"మా ప్రాణముండగా మమ్ము బంధింపలేరు." కత్తిదూసి

నాయకుడు వీరశ్యాముని పై నూకినాడు. సభాస్థానము సమరంగమైనది. ఒకటి రెండు గాయములతో సైనికులందరు బంధింపబడి కారాగారముకు పంపబడినారు.

"మనలను హతమార్చి చొక్కనామాత్య నీదుర్గమునకధిపతిగా నొనర్చుటయే తిమ్మరుసు యుద్దేశము. మనము అచ్యుతరాయల పక్షమని తిమ్మరుసెరుగును. అందుచే చొక్కనామాత్యుని తుదముట్టించుటే కర్తవ్యము."

"బ్రహ్మహత్యయా?" వీరశ్యాము డంగీకరింపలేదు.

"రాజకీయములందు కులమత ప్రసక్తిలేదు కుమారా. రాజద్రోహిగా పరిగణింపబడినవారు మరణింపవలసినదే."

"మన మాతని సంహరించినను లేకపోయినను రాయలిక మనపై శత్రుత్వము వహించును. మన మాతని మార్కొని జయింపవలెను. తరువాతనే చొక్కనామాత్యుని విషయము గమనింపవచ్చును."

తన కుమారుడాతని సంహరించుటకు వ్యతిరేకించు చున్నాడని తిమ్మన గ్రహించినాడు. అతని పరోక్షముననే చొక్కనామాత్యుని తుద ముట్టింప వలయునని తలంచి ఆ ప్రసంగమంతటితో మార్చినాడు తిమ్మన

పెద్దనను వెదకుటకు నలుమైపులకును అశ్వికులంపబడినారు. విజయనగరమువైపు పోవుత్రోవలన్నియు అశ్వికులచే నిండినవి పెద్దన కొరకు.

# ఎనిమిది

పెద్దన ఉమాదేవి యిరువురు హుటాహుటి నడకలతో పెన్నానదీ తీరము చేరువకు పోయిరి. పెన్న యిక రెండు మూడు కోశముల దూర మున్నది. ఉమాదేవి నడచునట్లులేదు. తాము త్రోవ తప్పినట్లు తెలిసి

కొనినాడు పెద్దన. ఆ యడవికంతము కన్పించలేదు. రానురాను అడవి దట్టమగుచున్నది. వారి కాళ్ళు బొబ్బలెక్కినవి. అతి సుకుమారి యగు ఉమాదేవి ఈ ఆయాసము తట్టుకొనునట్లు లేదు. ఆమె భర్త నానికొని నడచి నడచి అలసి స్పృహ దప్పి పోయినది. ఆమె నా కాలి బాటపై పరుండబెట్టి దగ్గరలోని యొక వృక్షము నెక్కినాడు పెద్దన ...

అచ్చటకు దగ్గరగనే యేదో ఒక చిన్న దేవాలయమున్నట్లు గోపురమొకటి కన్పించినది. దేవాలయము వద్ద తప్పక నీరుండును. ఆత నికి ఉత్సాహము కలిగినది. ఆ స్థలమును గుర్తుంచుకొని వృక్షము దిగి వచ్చినాడు.

ఉమాదేవిని భుజముపై వైచుకొని ఆ దిక్కుగా నడచి కొలది క్షణములలో దేవాలయ ప్రాంతమునకు చేరి ఉమాదేవి నా ఆలయమందు దించినాడు. అక్కడే ఒక కోనేరున్నది. స్వచ్ఛమగు జలముతో కమల ఖండములతో నలరారుచున్నది. ఒక తామరాకు దొప్పలో నీటిని గొని వచ్చి ఉమాదేవి ముఖమున చిల్కరించినాడు. కొన్ని నీళ్ళామె నోటి యందు పోసినాడు. ఆమె గుటకవైచినది. మఱికొన్ని నీళ్ళు ఆమెచే త్రాగించినాడు. ఆమె ప్రాణములు తేరుకొనినవి, కనులు తెరచినది. ఆమె భర్తముఖమును కాంచినది. వసివాడిన యా ముఖమును గాంచిన ఆమెకు దిగులైనది.

ఆమె తేరుకొనుటతో పెద్దనకు ఏనుగంత బలము వచ్చినట్లయి నది. ఆతడా కొలను నీట స్నానమాడినాడు తృప్తిదీర ఆ నీరములు త్రావినాడు, అచ్చటి వృక్షముల ఫలములు వారి కాహారములైనవి. కోసిన ఫలములు ముందుంచుకొని తినబోవుచుండగా వారికి జ్ఞప్తి వచ్చినది. ఆ దేవాలయ దైవతము విషయము. ఇరువురును లేచి లోనికికరిగినారు.

అందలి కరాళకాళికా విగ్రహము కన్పించినది. భక్తితో స్తుతించి నాడు పెద్దన. నిమీలిత నేత్రుడై శ్యామలా దండకము పఠించు తన నాధుని గని ఉమాదేవియు భక్తి పరవశయైనది. తమ ఫలముల నా దేవికి నివేదించి, అచటనే భుజించినారా ఫలములను ఆ దంపతులు. బడలి యుండిన ఉమాదేవి నిద్రించినది. ఆమె అట్లే నిద్రించుచున్నది. అంగ

వస్త్రమును పరచుకొని పరుండినాడు ప్రక్కనే పెద్దన. కష్టము మీద నిద్రను జయించినాడు పెద్దన. తాను నిద్రి పరాదు. ఖడ్గము నేమరక అట్లే మేల్కొని యున్నాడు పెద్దన.

తనకీ కష్టము లేలకలినవి? తనది మంచి జాతకము. తన కెందు లకీ కష్టము కలిగినది. తన జాతక రీత్యా తాను గమనింప జాలకపోయి నాడు. తన జ్యోతిష విద్య పరిపూర్ణమైనదికాదా? తానందు నిష్ణాతుడైన ఈ వలకే ఈ రాబోవు కష్టములను తాను పసికట్టి యుండవలసినది. కాని తాను తన జాతకమందేలోటును గమనింపలేదు. ఇది తన భార్యా జాతక మందలి లోటేమో?

తన తండ్రి యెట్లున్నాడు? ఆ మహాత్ముని వదలి తాను ప్రాణము కొఱకు పారిపోయి వచ్చినాడు. తన తండ్రి యింకను బ్రతికి యున్నాడా?

తిమ్మన కర్ణారుడు ఆతడాయన కపకారమొనర్పడా? అచట వెట్లున్నదో? తాను త్వరపడి వచ్చినాదేమో? తండ్రియే తన్ను కోట విడిచి పొమ్మని చెప్పి పంపినాడుకదా? ఆయనయు యేదియో కీడును శంకించియుండును. కష్ట సమయములందు తండ్రి నాదుకొన జాలక పోయితిని. అది యాతనిలోని విచారము. తల్లి పోయినను తల్లియై తండ్రియై తన్ను పెంచి పెద్ద జేసినాడామహాత్ముడు.

కన్నప్ప యెవ్వరో? ఎవరో రహస్యజీవి. మరిగోవిందరాజేల వచ్చినా డాదినమున? తన తండ్రి అతని విషయమంత గోప్యముగ నేల యుంచినాడు? ఆతడు రాజకుటుంబమునకు చెందినవాడై యుండును. ఆతనికి తిమ్మరుసు మహామంత్రుల యండగలదనుట నిర్వివాదము. లేనిది అతడేల సాంకేతికమైన యుంగరమునిచ్చును? గురువు జగపతి యది రాజకుటుంబసంబంధంమైన దనినాడు.

తానీ యడవినెప్పటికి దాటగలడు? పెన్నానదిని దాటిన ఉదయగిరి దుర్గము. ఆదుర్గమున తనకు తావుదొరకునా? ఆదుర్గము గజపతుల యధీనమునయున్నది. గజపతులు పండితుల నాదరింతురని తానువినినాడు.

ఈ సుకుమారినిట్లు కష్టపెట్టవలసి వచ్చినది. ఏమైన నీ దిన మిచ్చుట గడుపవలసినదే, లేనిది నడచుటదుర్లభము. చీకటిపడిన నిచ్చుట

కెట్టి ఘాతుకమృగములు వచ్చునో! గర్భగుడి విశాలముగ నున్నది. తలుపులు వైచికొని పరుండవచ్చును. ప్రొద్దువాటారుచున్నది. ఉమ అలసి నిద్రించినది. తనకు నిద్రవచ్చుచున్నది. తాను నిద్రింపరాదు.

ఉమ కలవరించినది. నిద్రలో చిన్నగ నవ్వినది. మరల సన్నగ నవ్వినది. నవ్వుచున్న ఆముఖమును కనినాడు. అది కమలము వికసించి నట్లులేయున్నది. ఉమ నవ్వునాపలేము. అంతకంతకు ఎక్కువగు చున్నది. పకపకపక నవ్వుచున్నది. ఆమె ప్రక్క రెగయునట్లు నవ్వినది. అదేమి నవ్వు ఆమె నిద్రించుచునే యున్నది. కన్నులు మూటబడి యున్నవి. కాని ఆమె నవ్వాగలేదు.

పెద్దన తట్టిలేపినాడు. ఆమె నవ్వాగలేదు. ఈ బలహీనముగానున్న యింతటి నవ్వుతో ఆమె ప్రాణవాయువులే పోవునేమో యనిపించిన దాతనికి.

ఉమా! ఉమా! యనుచు నామెను పొదువుకొనినాడు పెద్దన. కుదిపి లేపినాడు. తామరయాకు దొన్నెలోని నీరు ఆమె ముఖమున చిలుకరించి నాడు. ఆమె నవ్వుట యాపినది. కన్నులు విచ్చి చూచినది. లేచిభర్త హస్తమును గట్టిగ పట్టుకొనినది. తన నెవ్వరును తన భర్తనుండి వేరు చేయజాలరన్నంత గట్టిగా నున్నదాపట్టు.

"ఉమా!" పల్కరించినాడు పెద్దన.

ఏమన్నట్లు చూచినదామె.

"ఎందులకట్లు నిద్రలో నవ్వినావు?"

"నానవ్వు విన్పించినదా మీకు!"

"ఆ నవ్వునకు నీప్రాణవాయువులు లేచిపోవునేమోయని భయపడి నాను. అదేమినవ్వు!" చిరునవ్వుతోడ ననినాడు పెద్దన. ఇప్పట కొక దేవకన్య యవతరించినది. ఆమె మనపూజా గృహములోని దేవతవలె నున్నది. ఆమె నాహస్తమును పట్టికొనినది. ఆమెవెంట నడచినాను నీకు ధనము కావలెనాయనినది. కావలయుననినాను. ఆ విగ్రహము వెనుక వైపు నకు కొనిపోయిన దామె. విగ్రహము పాదమూలమున నొకరాతిని తొల గించి లోనికి కొనిపోయినది. అచ్చట చాలాగదులున్నవి, బంగారువెంది

రత్నములు వజ్రములు. ఒకటేమి! అంతయు ధనము ఒక రాజ్యమునే కొనవచ్చును. ఆధనమును చూచినాకు నవ్వాగలేదు. సంతోషము అబ్బ, అంత ధనము నొక్కచోట చూచుట సాధ్యముకాలేదు. ఉమా! ఈ ధనము నీకిచ్చినాను తీసికొని న్యాయముగా వినియోగించు అని దోసెడు రత్నాల నెత్తి నా శిరముపై నభిషేకించినది. నాకు నవ్వాగలేదు. ఒకే విధముగ నవ్వుచుంటిని. ఇంతలో మెలకువ వచ్చినది."

పెద్దన కాశ్చర్యమైనది. తన భార్యకు ఈ ఆలయాధిదేవత శ్యామల కన్పించినదా! ఆమె పుణ్యాత్మురాలు

"ఉమా? ఏది చూపు మా ప్రదేశము" ననుచు లేచినాడు పెద్దన. ఉమ లేచి చూచినదానివలె విగ్రహము వెనుకవైపునకు పోయినది. ఆమె ననుసరించినాడు పెద్దన.

విగ్రహము వెనుకభాగమున నాతనికేమియు కన్పించలేదు. రాతి బండలు బిగింపబడియున్నవి. పెద్దన జాగ్రత్తగ పరిశీలించినాడు. అచ్చట నేదియు ద్వారములేదు. తన నమ్మకమునకుతనకే నవ్వువచ్చినది. కలను నమ్ముటా? అందునను పగటికలను?

ఆమెకు ననుమానము వచ్చినది. కత్తితో నా ప్రదేశము నంతను తట్టిచూచినాడు పెద్దన. అంతట నొకేవిధముగనున్నది.

"ఆ దేవత యచ్చట చేయివైచినది." విగ్రహభుజమును చూచుచు ననినది ఉమాదేవి.

అచ్చట చేయివైచి అదిమి చూచినాడు పెద్దన. ఎచ్చటనేమార్గము లేదు.

ఆదేవి విగ్రహము భుజమున ఉమాదేవి చేయివైచినది.

ఆశ్చర్యముగ దేవి పాదమూలమున నొక ద్వారము వివృతమైనది అది ఉమాదేవి కొసగబడినధనము. అందువలన ఆమె స్పర్శామాత్రమున నాదైవధనమునకు మార్గము కన్పించినది. తన ప్రయత్నమందుచే విఫల మైనది.

ఇరువురు నా సొరంగములోనికి దిగినారు. లోనఁవాసనలు అఖండ సుగంధము. తామెఱుగని సుగంధముల బీల్చుచు లోనికరిగినా రిద్దఱు దంపతులు.

అదియొక భవనము వలెనున్నది. అందనేక గములున్నవి. చక్కని వెలుతురు గాలితగులుచున్నది. అంత చల్లనిగాలి తగులునట్లే శిల్పి వానిని చెక్కించినాడో.

మొదటి గదిద్వారమున నిట్లు వ్రాయబడియున్నది.

ఈ ధనమంతయు దీనిని మొదట చూచినవారిదే. హిందూమతాభివృద్ధికి. హిందూ రాజ్యాభివృద్ధికి ధర్మరక్షణకు మాత్రమే యీ ధనమును వినియోగింప వలయును. అట్లుకాక యీ ధనమును దుర్మార్గ కార్యాచరణములకు వినియోగించిన వాని వంశమభివృద్ధి చెందదు.

శ్యామలాదేవి దయను పొందినవారే ఈమార్గము నెఱుగగలరు.

ధనకాంక్షచే స్వర్ణయోగము నెఱింగిన నేనింతటి స్వర్ణమును.దాని మూలమున నీరత్నములను, వజ్రములను సేకరించినాను, అనుభవించినాను. పశ్చాత్తప్తుడనై ఈ ధనమును ధర్మకార్యాచరణార్థమై మీకొసంగుచున్నారు.

శ్యామలాపాదభక్తుడు.

వారిరువురా వ్రాసిన వ్రాతకును వ్రాసిన వ్యక్తికిని నమస్కరించినారు.

ఆగది తలుపు తెరచినాడు పెద్దన. ఆగదిలో మధ్య నెంతయో సువర్ణమున్నది. సువర్ణముతో నొనర్చిన పాత్రలున్నవి. అంత బంగారమెచ్చట నుండును? ఒక బిందెనిండుగా సువర్ణములు వరహాలు పోసియున్నవి. అవి కొన్నిటిని ఉమాదేవి దోసిలితో నెత్తితన మూటయందు భద్రపరచుకొన్నది. వీరు బయటకు రాగానే తలుపు మూసికొనినది.

మరియొకగదిలో స్వర్ణపాత్రలు నిండ రత్నములు ముత్యములున్నవి. ఒక స్వర్ణపాత్రలో పెద్దవి చిన్నవి వజ్రములున్నవి. అందొక్కటియు పెద్దన తాకలేదు. ఉమాదేవికూడ వానిని ముట్టుకొనలేదు?

వారిరువురు వెనుదిరిగి వచ్చినారు. ఘూగృహము బయటకురాగానే ఆ ద్వారము మూసికొనిపోయినది. అది వారి యాశ్చర్యమునకు కారణమైనది. వారిరువురు ఆలయముఖమంటపమున కూర్చున్నారు. వారొకరితో నొకరు మాటాడు కొనలేదు.

బయటకు రాగానే ఈ రాత్రి గడపు టెట్లనునది వారికి ప్రశ్నయైపోయినది. ఇంకను కొంచెము ప్రొద్దున్నది. ఏదైన జనపదమునకు చేరగలిన భాగ్యుడునని వారి ఆశ. మారమున ఒకటిరెండుకొండలగుపించినవి. తామెంతమారము నడచివచ్చినారో వారికి తెలియలేదు. వారియాలోచనలనేకవిధములుగానున్నవి.

ఇంతలో నెవ్వరో వచ్చుచున్న పప్పుడైనది.

దేవాలయపు [illegible] రివాకిలి నెట్టుకొని ఒక వ్యక్తిలోనికి వచ్చినాడు. పెద్దన [illegible] నిలచినాడు.

ఆవ్యక్తి ఆ [illegible]ముగ వీరివైపు చూచినాడు. "ఎవరుమీరు ?" ప్రశ్నించినాడాతడు.

"మేము [illegible]రదేశులము. అడవిలో త్రోవతప్పి ఈ ఉదయ మిక్కడకుచేరినాము. తామెవరో మాకు మార్గమును తెల్పిపుణ్యము కట్టుకొనుడు. మేమిప్పుడెచటనున్నాము?' ప్రశ్నించినాడు పెద్దన.

"మీరు ఉదయగిరి దుర్గమునకు రెండు క్రోశముల దూరమున నున్నారు,"

"ఆఁ" యనినాడు పెద్దన. ఉమాదేవి యాశ్చర్యమునకంతము లేదు.

"మే ముదయగిరి చేరవలయునని బయలుదేరి దారి తప్పినాము."

"ఎచ్చటనుండి వచ్చుచున్నారు?"

"కంభమునుండి." తడవుకొనకుండ సమాధాన మిచ్చినాడు పెద్దన.

"మీరు త్రోవతప్పి ఇటువచ్చినారు."

"తామెవరో మా పాలిట సాక్షాత్ శంకరులు'

"కామ. నేనీ దేవాలయమునకు పూజారిని. ఉదయగిరి రాజులకీ దుర్గాదేవి ముఖ్యదైవము. నేను ఉదయము సాయంత్రమిట పూజాదికము లొనర్చి నైవేద్యము నిడిపోవుచుందును."

"గజపతులు దుర్గోపాసకులు కాబోలును."

"అవును వారు శక్త్యుపాసకులు" అనుచు నాతడు పూజనొనర్చుటకు సంసిద్ధుడైనాడు. పూజాదికమును నిర్వర్తించి పూజారి వారికి ప్రసాద మొసగినాడు. ఉమాదేవి పెద్దనలు భక్తితో శ్యామలాంబికకు నమస్కరించినారు. ఆ మాతయే తమకిట్లు త్రోవ జూపినదని వారి నిశ్చయము.

"మీరు నావెంట వచ్చెదరా?" ప్రశ్నించినాడు పూజారి.

"అవశ్యము. ఈరాత్రి వేగించుట కెట్లాయని విచారించుచున్నా" మనుచు పెద్దన ఉమాదేవి ముఖమును చూచినా[illegible] నీవు నడువగలవా? యని ఆ చూపులోని భావము. ఉమ మూటపట్టు[illegible]పడినది. పెద్దన ఆమూటనందుకొనినాడు, పూజారి వారిచూపు సం[illegible]గారియుపురాతని వెంట నంటినారు. దుర్గద్వారమువద్దకు వచ్చుసరికి బాగుగ [illegible] గూకినది. తామే త్రోవవెంట వచ్చినారో కూడ వారికి తెలియలేదు.

దుర్గద్వారరక్షకులు ప్రశ్నించినారు "వారెవరని."

"మా బంధుగులు కంభము నుండి వచ్చుచున్నారు." పూజారి ప్రత్యుత్తరమిచ్చినాడు. ద్వారరక్షకుడు మరియొకని ముఖమునుచూచినాడు. తిరిగి పెద్దన ముఖమును చూచినాడు, ఉమాదేవిముఖమును చూచినాడు.

"వీరు నా బంధుగులు ఈ పట్టణములో నివాస మేర్పరచు కొనవచ్చినారు."

"ప్రస్తుత మెక్కడ నుందురు?"

"మాయింటనే" పూజారి బదులు చెప్పినాడు.

ద్వారపాలకుడందరను వదిలినాడు.

ఉమ పెద్దనలు నగరములోని కడుగిడినారు.

ఆ దుర్గమున కదియొక్కటే మార్గము. పెద్దకొండపై నిర్మింప బడినది. రెండు వైపుల కొండలు. ఆ కొండలలోనుండి ప్రవహించునదని ఈ దుర్గము రెండు వైపులను తాకిపోవునట్లు ఒక కాలువతో కలిపినారు. ఆ అగడిత లోతెంతయో తెలియదు.

ఆ లోపల కంచెకోటయున్నది' తరువాత రాతికోట సింహద్వారము. అగడితపై వంతెననెత్తి వేసిన దుర్గములోనికి వచ్చుట సాధ్యము కాదు.

చాల గొప్పనగరము. పూజారి వారిరువురను తానుండు సత్రమునకు కొనిపోయినాడు.

"తామెవ్వరో?" ప్రశ్నించినాడు పూజారి.

మేము మీ బంధుగులము, అనినాడు పెద్దన. తామొనర్చిన ఈ ఉపకారము మరువరానిది. మీరురానిది ఈనాడు కోటలోనికి మాకు ప్రవేశము దొరకెడిదికాదు.

"అది మానవధర్మము. నాపేరు దీక్షితులు. ఈ సత్రము నాయధికారముక్రింద నున్నది. నా .. స్వరునులేరు. మీవలసినంత కాలమిచ్చట నుండవచ్చును."

"తాము పురోహితులా?" ప్రశ్నించినాడు పెద్దన.

'అవును గజపతి సేనాపతి పౌరోహిత్యమునాది. మీ నామధేయము?"

"పెద్దన యందురు. మేము నందవరీక బ్రాహ్మణులము."

"అమ్మాయీ! ఇవిగోనమ్మా సామానులు. త్వరగా వండివార్చు బడలియున్నారుమీరు." అనుచు ఉమాదేవికి సామాను నందిచ్చినాడు దీక్షితులు.

ఆమె వానినందుకొని లోనికరిగినది.

పెద్దన శో ప్పరనుచు నట మేను వాల్చినాడు. చల్లనిగాలి తగులుటతోడనే అతనికెంతయో నిద్రవచ్చినది. అట్లే విద్రించినాడాతడు.

ఆ కాలమున ఉదయగిరి యొక వివాదాస్పదమైన దుర్గము. ఒక పర్యాయము గజపతులయు, మరియొక పర్యాయము విజయనగర రాజులయు చేతులు మారుచున్నదది. పదునైదవ శతాబ్దాంతమున నది పూస పాటి తమ్మారాయనివారి యాధిపత్యమున నున్నది. తమ్మారాయనివారు గజపతుల ప్రతినిధి. వారి తరువాత నీ దుర్గప్రాముఖ్యము ననుసరించి ప్రతాప రుద్ర గజపతి పినతండ్రి తిరుమలకాంత రాహుత్తరాయల పాలన లోనికి వచ్చెను. పుహూర్‌ద్రావిడ బ్రాహ్మణుడైన బసవరాజు వీరికి మహామాత్యుడై యుండెను. తమ్మారాయని కుమారుడు మిర్గానాయుడు సర్వసైన్యాధిపతియై యున్నాడు. రాహుత్తరాయల ఆస్థానమున నంది తిమ్మన యను కవీశ్వరుడుండెను.

దుర్గము భేద్యమైనది. ఒక లక్షకాల్బలము, ఐదువందల యేనుగులు ఐదు వేల గుఱ్ఱము లీగజపతి యొద్దనుండెడివి. అవసరసమయమున ఏబది వేల సైన్యమును గూర్చుకొను శక్తికలిగియున్నదా దుర్గము. దుర్గమునకు రెండువైపులనున్న కొండల నెక్కుటకు వీలుకాకుండునట్లుచెక్కించివైచి నారు. అవియే పెద్దగోడలవలె నైనవి. ఆగోడల మొదటలో తైనయగడ్త యున్నది. కొండమీద బురుజులున్నవి. అందెల్లప్పుడు నాయుధులైన భటులుందురు. ఏమరక కావలికాయు భటులచే కోట రక్షింపబడు చుండెను.

## తొమ్మిది

ఉదయగిరి దుర్గమున పెద్దన జీవిత మాసత్రమున నొకవిధముగా గడచిపోవుచున్నది. అతడు ప్రతిదినము స్వయంగా దేవాయతనమున కరుగును. తన తండ్రి స్థితినిగూర్చి ఆతనికేమియు తెలియదు. ఆలోకేశ్వరు నెదుట పరిదేవన మొనర్చును. ఈ విచార మాతని కృంగదీయు

చున్నది. ఉమ కావిషయము తెలియును. ఆమె కేమనుటకు తోచదు. తన భర్తను బాధించు విషయము మరపించుట కలవికానిది. పితృదేవుల బంధన మాతనికి హృదయశల్యము.

ఇప్పుడిప్పుడే పెద్దన తన సృష్టిని రచనావ్యాసంగములపై మళ్ళించుచున్నాడు. దీక్షితులవద్దనున్న హరివంశ కథను పెద్దన చదివినాడు. ఎఱ్ఱాప్రగడ హరివంశమును వ్రాసినాడు. అది తనుచదివినాడు. అంత కంటెను బాగుగ సుందరవలయునని నాచన సోముడు హరివంశకథను వ్రాసినాడు. ఆ నాచనసోమునిది ఉత్తరహరివంశము. హరిహర నాథున కంకితము నొసంగినాడు. తాను నా హరికథనే వ్రాసిన. నాచన సోముని వలె తను వ్రాయగలడా? ఆ శైలీ. ఆ శయ్యా సౌభాగ్యములు తన కలవి యగునా?

ఉమాదేవి వచ్చికూర్చున్నది.

"ఉమా! హరివంశమును చూచినావా?"

"ఎఱ్ఱన హరివంశమును చదివినాను."

"నాచన సోముని ఉత్తరహరివంశము?"

"అది కవిత్రయాను వారి కవితతో తులతూగునని ఒక్కొకచోట మధురతరముగను మా తండ్రియనినాడు."

"నిజమది. ఇది మూగ్రంథమే చదివెదవా!"

"తమరు చదివినారా? మీరు నొక హరికథ నేలవ్రాయరు?" చిరునవ్వుతో ప్రశ్నించిన దామె.

"నేనదియే యనుకొనుచున్నాడను ఉమా! హరికథా సారము నొక గ్రంథముగా వ్రాసి అదవాని శ్రీకృష్ణదేవున కంకితమీయ దలచినాను. ఆతడే మనకష్టముల నీడేర్పగలడు."

"అగునది మంచియాలోచనము. మీరా గ్రంథమును మొదలిడుడు."

"మంచిముహూర్తము చూచినాడు పెద్దన. నాటికి మూడవనాడు

శుభతిధి. తను గ్రంథరచన మొనర్పదొనుటకది తన జాతకరీత్యా సరి పడినది. గ్రంధ రచనకుపలయు ఆకులు మొదలైనవి మరునాడు సేక రించుకొనినాడు పెద్దన. ఆతనొక పండితుడు, కవి యని మాత్ర మూహించినాడు దీక్షితులు.

మరునాటి ఉదయమునకు నగరమలంకార మొనర్పబడినది. అలంకరింపబడిన ఉదయగిరి యలకాపట్టణమువలె నున్నది. అది ఎందు లకో పెద్దనకు తెలియదు. ఇంతలో దీక్షితులరుదెంచినాడు.

"పెద్దనా! విజయనగరరాజ్యమునకు శ్రీకృష్ణదేవరాయలు మహా రాజైనాడట వింటివా?"

"ఏమి? కృష్ణరాయలు మరణించెనని వింటినే అది నిజము కాదా!"

"అది యంతయు తిమ్మరుసు మాయ. కృష్ణరాయల నెచ్చటనో దాచి ఆతడు మరణించి, లోకవార్త పుట్టించినాడు సమయమున కాతని రప్పించి రాజ్యము కట్టించినాడు. ఆతడు పండితపక్షపాతియుట దాన శీలియట. అన్న కొమరునిచేత నారడిప్పించిన దానములకంత మే లేదట."

"ఆంధ్రరాజ్యమిక నత్యున్నత దశనందునేమో.!" ఆనంద తన్మ యుడైయనినాడు పెద్దన.

"రాజ్యము నలువైపుల శత్రువులున్నా . కావి తిమ్మరుసున్నా డాతని రక్షించుటకు." అనినాడు దీక్షితులు.

"విజయనగర సామ్రాజ్యమున కధిపతిగా కృష్ణరాయలు తిమ్మరుసుచే నేనాడో నిర్ణయింపబడినాడు. ఎందరెన్ని ప్రయత్నము లొనర్చినను రాయలేరా జ్యాధిపతియైనాడు."

"ఇటు ఉదయగిరి అటురాయచూరు విజయనగరమునకు శిరో ధారములు. రహస్యముగ ననినాడు దీక్షితులు,

"ఈదినమున నగరమలంకార మొ. ్కరేమి!" ప్రశ్నించి నాడు పెద్దన,

"నీ వెఱుగవా పెద్దనా? గజపతుల యాస్థానపండితుడు. గురు వైన లక్ష్మీధరులు కొండవీటినుండి యిటకీదినము వత్తురట. వారి స్వాగతా ర్థమీ అలంకరణము."

"సంగీతవేత్త లొల్ల లక్ష్మీధరులేనా?"

"అగు. నాయనయే. సంస్కృతాంధ్రము లందాత డసమానపండి తుడు. ఓఢ్రమందుగూడ నాతడు పండితుడే."

"కవికూడనా?"

"ప్రతాపరుద్ర గజపతి పేర సరస్వతీ విలాసమీతడే రచించెను."

"శంకరాచార్యుల వారి సౌందర్యలహరీ వ్యాఖ్యాన కర్త యీత డేనా?"

"అగునీయనయే. శంకరస్వాముల వారా గ్రంథమును గొని యాడిరట."

"ఆగ్రంథమే వారిపాండిత్య నిదర్శనము."

"మహాసభకు వత్తువా పెద్దనా?"

"తప్పకవత్తును. అట్టిమహామహుల దర్శనమొ కర్తవ్యము కదా. పండితసభయు జరుగునా?"

"కంమూకూరి రుద్రకవి మంత్రతంత్ర విధులెరిగిన కవియట. అతడును సభకు వచ్చునట. నంది తిమ్మన వివాదము తప్పదనుకొనుచున్నారు."

"అయినా రేపటి ఉత్సవం ఘనంగా నుండుననుకొం మును సభయందు పాల్గొనవచ్చునా?"

"తిరుమలస్వాములు విద్యాగ్రహణపారీణులు. అందుల డనుకొందును. అయిన నీవును అందు పాల్గొనగోరుదువా చెప్పి నీకొక స్థానమును సంపాదించి తేగలను."

"అది యవసరములేదు. స్వశక్తితోడనే స్థానమ్ము ప్రయత్నింతును."

"సరియే. నీవుసభలో నా ప్రక్కనే కూర్చుండగలవు. సభకరుగుట కాయతుడవుకమ్ము."

దీక్షితులతో పెద్దన సభకరుగ సమకట్టినాడు. ఉమాదేవి పతి ముఖమున కుంకుమనిడి హారతియొసగినది. వాకిలివఱకు వచ్చి సాగ నంపినది.

ఆముఖమందలి తేజముకొట్టవచ్చినట్లున్నది. అందమునకు దగిన యాకారము. ఆకారమునకు దగిన యందము. వానిచక్కదనము వైరాగ్య మున జేసి కాంక్షజేయు కాములకు మధు కరాంగనలకు సంపెంగ పొలుపవలెనయ్యెను.

ఉదయగిరి సభాస్థానము జనులనే క్రిక్కిరిసియున్నది. పండితుల కొకవైపున నాసనములు వేయబడియున్నవి. మహారాజు సింహాసన ప్రాంతమున నొకయున్నతాసనమున్నది. అది గురువులు లక్ష్మీధరులకు. ఎదుట నొకయాసనమున్నది. అది కందుకూరి రుద్రకవికై ప్రత్యేకింప

క్క వారి శిష్యులకు రెండాసనములు ప్రత్యేకింపబడినవి.

కొండయ్య. ప్రెగడరాజు నరసరాజు. తిమ్మన కవీశ్వరుని

రు. భద్రమంత్రి ఒకచరుసయాసనములపై నాసీనులైనారు.

రమున పురోహితుడు శివదీక్షితులు వాని ప్రక్కన

ములయినారు.

కూరి రుద్రకవి పెద్ద తలపా. స్థూలమైన ఆ యాకారము;

యున్నవి. నల్లని పండితశా ధరించి చెవుల

క్షలు చౌకళి పగా నాసనమధ్యమున ఠీవిగా నుపవిష్టుడై

పక్కల కాపోప్పులు త్రిపురాంతకుడు, ఘ గండ్ల చిట్టెప్ప

శిష్యులున్నారు.

సభయందుప్రవేశించినాడు. నలుబదై దేడులవయస్సు. వాణి

ప ప్రతిఫలించుచుండగా చిఱునవ్వులతో వచ్చి సభనంత

. ముందుగా పెద్దనామాత్యుడు లేచి అతనికి తలవంచి

ను.

ఎవరీయువకుడు ? ఈ సభకీతడు నూతనుడు. ఏమా ఠీవి ? ఆ ఆకార సౌష్ఠవము ! ఆ చక్కదనమేమి? ఈతడు కవియా? పండితుల స్థానములందు కూర్చొనినాడు. ఈనాటి చర్చలలో పాల్గొన దలచినాడా? అతనిలో నొకయాకర్షణమున్నది. ఈ ఆలోచనలతో నందితిమ్మన పెద్దన యొద్ద కరుదెంచినాడు.

"శుభీభవ ! నాయనా! ఎవరయ్యా నీవు?"

"నన్ను పెద్దన యందురు. ఈ పండిత సభలో పాల్గొనుట కనుజ్ఞ వేడుచున్నాను."

"ఆశ్చర్యము నాయనా! ఇదివరకే సభలయందైన పాల్గొన్నావా!"

"లేదిది ప్రథమము కుర్రకవిలో పాండిత్యప్రభావమునకన్న మంత్రతంత్రప్రభావమెక్కుడుగానున్నట్లాతని ప్రవర్తనలో కన్పించుచున్నది"

"భద్రమంత్రి మంత్రశాస్త్రవేత్త లక్ష్మీధరులు నిగ్రహానుగ్రహ సమర్థులు. భయకారణమేమియులేదు నాయనా?" అనినాడు నందితిమ్మన.

ఇంతలో మహారాజుల ఆగమనమును సూచించు శంఖారావమై సభయంతయు నిశ్శబ్దమైనది.

గురువరులకు స్వాగతమొసంగి తిరుమల కాంత రాహుత్త రాయలు తోడ్కొని వచ్చుచున్నాడు రాజలాంఛనములతో.

విద్వత్సార్వభౌమా - పరాకు
నిఖిల యామక తంత్రార్ణవావగాహ రుద్రా - పరాకు
నయవివేకభూషణాద్యనేక కావ్యకల్పా - పరాకు
ఆశ్రిత జనకల్పా - పరాకు
నిగ్రహానుగ్రహ శక్తా - పరాకు
మహా మహోపాధ్యాయ లక్ష్మీధరదేశికా - పరాకు
పరాకు లాగినవి.

ప్రభువులతో లక్ష్మీధరపండితులు సభలోనికి విచ్చేసినారు. గురువులు ఆసీనులైన యనంతరము తిరుమల కాంతరాయలాసీనుడైనాడు.

వారకాంతల నాట్యమారంభమై యొక గడియకాలము సభ్యుల నానంద ప్రవాహమున ముంచి తేల్చినది.

గురువుల యనుజ్ఞతో తిరుమలకాంతరాయలు విద్వత్సభ కనుజ్ఞ నొసగినాడు.

మహామంత్రి బసవరాజు లేచి నిలచినాడు.

"ఈనాడు రాజగురువులు మహామహోపాధ్యాయుల సన్నిధి నీ విద్యాగోష్ఠి జరుగుట యానందకరము ఈర్ష్యాసూయలకు తావీయక మీమీ పాండిత్య ప్రకర్షలతో సభ నానందపరచుట మీ విధి. కందుకూరి రుద్రకవి జయ పత్రిక గోరి ఈ యాస్థానమున కరుదెంచినారు రాజగురువులు వారి సామర్థ్యమును పరీక్షించి సత్కరింతురని నా మనవి. ఈ సభలో పండితులు, కవులెల్లరు ప్రశ్నలలో పాల్గొని మీ మీ పాండిత్య ప్రకర్షను వెలయింపవచ్చును." అని చెప్పి కూర్చొనినాడు.

రుద్రకవి లేచి నిలచినాడు.

"మహారాజా!" యని మహారాజును సంబోధించినాడు. ఆ కంఠము మేఘగర్జనవలె నున్నది. మీదినుండి పడెడి జలపాత నిర్ఘోషమువలె నున్నది. సభికులు సమ్మోహితులైనారు.

"గడియకు నూఱు పద్యము లఖండతర ప్రతిభన్ ఘటింతునో
బడిబడి నూఱు ఘంటముల బద్యములన్ లిఖియింతునో పదం
పడి వివిధాంధ్రభాషల ప్రబంధము లొక్కొకనాడు సేతునో
యడుగుడి మీ మనంబునకు హర్షము తిర్మలరాయ భూవరా"

యని తన యాసనమున గూర్చుండినాడు. వర్షము వెలిసినట్లయినది. నంది తిమ్మన లేచినాడు. ఆతనివి ముద్దు పల్కులు. కవిత్వమే పుష్ప సుకుమారము.

"....దంష్ట్రిలమీద శంకరుడు తాండవమాడెను రాముకైవడిన్."
రుద్రకవి ఈ సమస్యను పూరింపవచ్చును." అని కూర్చుండినాడు తిమ్మన.

రుద్రకవి లేచినాడు.

"రిపుష్ట్రిహ యేమిటంగలచు? ఋక్షము లెక్కడనుండు? నంధకున్
నంష్ట్రినుజేసె నేవిభు? డనంతరమంపర దేమిచేసె? చే
దంష్ట్రి భిలాత్ముడై నలవు రూప మదేగతినుండె? చెప్పుమా
ద ష్టలమీద శంకరుడు తాండవమాడెను రాముకైవడిన్.

సభలో సాధువాదములు ప్రబలినవి. కరతాళములు మార్మ్రోగినవి.

"…. బలవదరీ దరీ కుహర భాస్వదరీ యదరీ దరీ హరీ."
ఈ నా సమస్యను తిమ్మన కవీంద్రులు పూరింపగలరు." అని వ్యంగ్యముగా
నని కూర్చుండినాడు రుద్రకవి.

తిమ్మన కవీశ్వరుడు నిలచినాడు_

అంతటి జటిల సమాస సమస్యను తన ముద్దులొలుకు పలుకు-
లతో తిమ్మన యిట్లు పూరించినాడు.

"కలశపయోధిమీద దరగప్ప మతిహోరని మ్రోయు వేయు ఫం
గుల తలపాన్పు పాము బుసకొట్టగ నేగతి నిద్రజెందెదో
యలసత సంద్రి చీమ చిటుకన్నను నిద్దురరాదు మాకు నో
బలవదరీ దరీ కుహర భాస్వదరీ యదరీ దరీ హరీ'

"సెబాస్" అనినాడు తిరుమల కాంతరాయలు. సభికుల కరతాళములు
మిన్నుముట్టినవి.

"రుద్రకవీ! ఆ సమస్యను మరింత రసవంతముగా నీవే పూరించు"
మధ్యవర్తి లక్ష్మీధరులు రుద్రకవితో ననినాడు.

"నా సమస్యను నేను పూరించుటా? అది సత్సాంప్రదాయము కాదు."

"దీనికొక సంప్రదాయమున్నదేమి?" యనినాడు నరసరాజు.

"దేనికైన సంప్రదాయముండును. నీవు సంప్రదాయ శూన్యు
డవా?" యనినాడు నరసరాజును త్రిపురాంతకుడు.

"రుద్రకవీ! నేనడుగుచున్నాను. పూరింపు డా సమస్య నంతకంటెను
రసవత్తరముగా. శైలి భావ సంపదలంతకంటె ఘనముగా నుండవలె"
తిరుమలరాహుత్తరాయ లాజ్ఞాపించినాడు.

"ప్రభువుల యాజ్ఞ
అలపగవాని తమ్ముడు భయాతురుడై చనుదెంచినంతనే
భళి భళి వచ్చితే యనుచు బట్టముగట్టవె లంక కప్పుడే.
కొలిచిన నిన్నెకొల్వవలె గోరిక లిచ్చిన నీవ యీవలెన్
బలవదరీ దరీ కుహర భాస్వదరీ యదరీ దరీ హరీ."

రుద్రకవి పూరించి కూరుచుండినాడు.

"గురువర్యు లీ రెండు పద్యములలో నేది గణనీయమైనదో తేల్చ వలయును. వారికి నేను సన్మానము జేయ దలచుచున్నాను."

"పెద్దనా! నీవు పూరింతువా ఈ సమస్యను." దీక్షితులు ప్రశ్నించినాడు. పెద్దనను. రహస్యముగ. కొంచెము వ్యంగ్యముగ కూడ.

"పూరింతమనియే యనుకొనుచున్నాను."

పెద్దన జవాబు దీక్షితుల కాశ్చర్యమే కలించినది.

లేచి నిలువబడినాడు పెద్దన. అందరి దృష్టులాతనిపై నిల్చినవి. ఈ యువకుడెవ్వరు? అతని అందమునకు ముగ్ధులైనారందరు. తిమ్మన పెద్దన వైపు చూచినాడు. ఆ యాకారసౌష్టవమును చూచి రుద్రకవి కనులు చిట్లించినాడు. మహారాజు తిరుమల కాంతరాయని దృష్టి పెద్దనపై పడినది.

"మహారాజులానతి యొసంగిన నేనీ సమస్య పూరింపగలను." ఆ కంఠస్వరమున శిరీషకుసుమముల జల్లు కురిసినది.

అతడెవ్వరో మహరాజునకు తెలియలేదు.

"నీవు పూరింతువా?" యనినాడురాజు నీవలనయగునాయన్నట్లున్నదా వాక్యము.

పెద్దన చిరునవ్వునవ్వినాడు.

అతని మృదుమధుర కంఠస్వరము వేయివీణల నొక్కసారి మీటినట్లయినది.

"కలుష సరిత్తరీ పుషిత గంధకరీ మహిభృత్కిరీ భవా
చల భిదురీ దయారస విశాలయురీ నిగమార్థ మాధురీ
ఖల గజకేసరీ విభవకంపిత మేరుగిరీ లతాదరీ
బలవదరీ దరీ కుహర భాస్వదరీ యదరీ దరీ హరీ-"

రాగయుక్తముగ మధుర కంఠముతో నా సమస్యను పూరించినాడు. కర్పూరవర్షము గురిసినది సభయందు. సమ్మోహితులై వినినారు సభికులు. తమ పద్యములకన్న ఆ పద్యమే బాగుగనున్నట్లు తోచినదా కవులకు.

లక్ష్మీధరున కొక కష్టము గడచినది. మొదటి రెండుపద్యములలో నేది రసవంతమైనదను నిర్ణయము కష్టతరము. పెద్దన యా కష్టమును తొలగించినాడు. తిరుమల కాంతరాయలే హరవారిచిలో దోగినాడు. "సభికు లీ పద్యములలో నేది రసవత్తరమైనదో తెల్పగలరు." అనినాడు మహారాజు.

వరకవి కొండయ్య లేచి "మూడవపద్యమే రసవత్తరమైన' దని తెల్పినాడు. తిమ్మన కవీంద్రుని సుమతి తోడనే యాతని మాటలనినాడు. అరుణ నయనములతో ననినాడు రుద్రకవి—

"విదితంబుగ గవి రుద్రుని
సదమల వాగ్వనిత శాస్త్ర సంహితపదముల్
కుదిరిక తెలియక యూరక
వదరకురా వెట్టిముండ! వరకవి కొండా!"

సభలో నవ్వులు చెలరేగినవి.

మహారాజు ముఖము జేవురించినది - "రుద్రకవీ! మాషణల కీ సభ స్థానముగాదు. కవిత్వ ప్రగల్భమే యిందు లెక్కింపబడును." అనినాడు మహారాజు.

రుద్రకవి రుద్రుడే యైనాడు. ఆతని కంఠస్వరమున పిడుగులు గురిసినవి —

"మహారాజా! రుద్రకవి నవమానించిన వారెవ్వరును క్షమింపబడ లేదు -

"తిట్టుదు నా భుజంగ విషదిగ్ధ దవానల ధాగధైగ చి
ట్పట్ట చిటార్భటి ప్రకట శీఘ్ర మహోగ్రత దంతనిష్ఠురో
ద్ఘటన విస్ఫులింగ లయకారణ దారుణ బద్ధబుద్ధ రా
ట్పట్టణ గోపురధ్వజ నిపాత హతాహంతిగాగ నుద్ధతిన్"

మహోగ్రుడైన పెద్దన లేచినాడు. క్షాత్రము బూనిన భార్గవరాముడే యైనాడాతడు. ఘనాఘన గర్జనల ననుకరించిన దాతని కంఠస్వరము —

"తిట్టుము నా మహోగ్రకర తీవ్రవచోవరగద్య పద్య సం
ఘట్టఘరట్ట ఘట్టవధగా విధిగాచిన నైన మానినీ
పట్టణ వప్రసౌధమణి బంధుర సింధుర సైంధవాద్యులన్
బట్టపు రాజులన్ దొరల బండితులన్ దురహంకృతాత్ములన్"

పద్యము పూర్తియగుకోపుననే పెద్దన ఆసనము ప్రక్క పడి పోయినాడు. సభలో కలకల మునయించినది. ప్రయోగ మొనర్చినాడ న్నారు వారు. త్రిపురాంతకుని ముఖమున చిఱునవ్వు చిందులాడినది.

"కవిగారి పని యైపోయినది. రుద్రకవి నాక్షేపించి బ్రతికినవా రెవ్వరు?" అనినాడు నాగండ్ల చిద్దెన.

ఆ మాటలకు సభలో తీవ్రమైన నిరసన బయలుదేరినది.

"భద్రమంత్రీ! మాపెదవేమది క్షుద్ర ప్రయోగము. మంత్రతంత్రము లెఱింగినవారు లేరనియే యీతడు విఱ్ఱవీగుచున్నాడు." అనినాడు నంది తిమ్మన రాక్షసయునుడై.

"రుద్రకవీ! త్వరపడినావు. నీ ప్రయోగ ముపసంహరింపుము. అది మా సంప్రదాయము కాదు. పాండిత్యముతో జయింపవలెనయ్యా! నీ పాండిత్యముతో నా యువకవి నెప్పటికినీ జయింపలేవు నీవు" అని యనినారు లక్ష్మీధరులు - "నిన్నిపుడే శపింపగలను. కాని మేమట్లు చేయము."

రుద్రకవి తలవంచినాడు.

భద్రమంత్రి నిలువబడినాడు. కీవిగా పెద్దన వద్ద కరుదెంచినాడు.

"ఈతని పేరేమి తిమ్మనా?" ప్రశ్నించినాడాతడు.

"పెద్దన."

పెద్దన శవమువలె నాసనము చెంత పడియుండినాడు. దీక్షితు డాతని తలను తొడపై నుంచుకొని కూరుచున్నాడు.

ఆ శిరముపై దక్షిణహస్తముంచి భద్రమంత్రి యేమియో పఠించినాడు. ఆతని కన్నులు లెఱ్ఱవారినవి.

రుద్రకవివైపు తిరిగినాడు భద్రమంత్రి. అతని చేయి అట్లే పెద్దన శిరముపై నున్నది.

"జబగడ దష్షలణ్ణు శషసద్రుకపయ్యు ఝభఞ్ఞటంచు
జబజబ లెల్లజేసియగసాలెల బేలల బోయ పాలెఫ్ఫం
బబువుల దేల్చి చేతగల పైకము దోచుటగాదు రుద్ర! నీ
డబడబ భద్రమంత్రి యెదుటం గొనసాగదు పోకుపోకుసీ!"

"పెద్దన కవీంద్రా! లేవయ్యా! లెమ్ము. భద్రమంత్రి యాజ్ఞాపించు చున్నాడు." అనినాడు భద్రిమంత్రి.

నిద్రనుండి లేచినట్లు లేచినాడు పెద్దన. తన తలపై చేయినుంచిన భద్రమంత్రికి నమస్కరించినాడు.

"చిరంజీవ!" యనినాడా వృద్ధుడు భద్రిమంత్రి.

"పెద్దనకవీ! మా యాస్థానగౌరవమును నిల్పినాడవు. ఆస్థాన కవిగా ,మా తిమ్మ కవిశ్వరుని సహచరునిగా నిన్ను నియమింప దలచినాము. అనినాడు మహారాజు "పెద్దనా! నీ కవిత్వ మనుపమానమయ్యా! కాని నీకివి శుభప్రదమగు దినములుకావు. రాబోవు కొలదికాలము నీ జీవితమున అత్యధికమగు క్లిష్టకాలము. కొలది మాసము లోపికపట్టిన తరువాత నంతయు శుభమే"అని ఆగతమును నుడివినారు లక్ష్మీధరులు,

"పెద్దన లక్ష్మీధరులకు. మహారాజులకును నమస్కరించినాడు. మహారాజా! నా తండ్రి కష్టములందున్నాడు. వారు నావద్దకు జేరువరకు నేనే గౌరవముల నొల్లను." అనినాడు పెద్దన వినయముగ.

"సరియే మహాకవీ! అంతవరకు నా యాతిథ్యమును స్వీకరించి నీ యిచ్చవొప్పున ఆస్థానమునకు వచ్చిపోవుచుండుము." మహారాజనినాడు.

కవులందరు సత్కరింపబడినారు.

అఖండ గౌరవము జరుగుననుకొని వచ్చిన రుద్రకవి కానాడు అందరు కవులతో సామాన్యగౌరవము మాత్రము దక్కినది.

సభికులలో నాతనిపై నొకవిధమగు జుగుప్సరేకెత్తినది. అది స్వయంకృతాపరాధము.

సభాంతమును సూచించు కాహళిమ్రోగినది. తిరుమల రామచంద్రరాయలు లేచినాడు. సభచాలింపబడినది.

# పది

అజపర్కాతిమ్మన విజయనగర సైనికులను కారాగృహమందు బడవేయుట విజయుడు గమనించినాడు. తన తండ్రి జగపతి యీ విషయమై యేమనునో? తండ్రివద్ద కరుదెంచినాడు విజయుడు.

"నాన్నా! విజయనగరాశ్వికులను బందీ యొనర్చినాడట తిమ్మన."

"అగునీతడు విజయనగరరాజు కృష్ణరాయల నెదిరింప దలచినట్లు కన్పట్టుచున్నది. తిమ్మరుసీతని యాటల సాగనీయడు. తగరు కొండను డీకొనబోవుచున్నది. పెద్దన యేమైయుండునో? కన్నప్ప విషయమై వినకుండగనే యాత డెటకో యరిగినాడు"

"ఆయుధాగారపు తాళముస్థానమున నీ చీటీని వ్రాసియుంచినాడు పెద్దన" అనుచు విజయున కొసగినాడు చీటీని జగపతి.

విజయుడందుకొనినాడు.

"గురువర్యులకు నమస్సులు.

ఈ రాత్రి నన్ను హత్యగావించుటకు తిమ్మన చేపంపబడిన హంతకుడు నాచే బంధింపబడినాడు. ఇక నిక్కడ నుండుట శ్రేయస్కరము గాదని తండ్రిగారినుండి వార్తవచ్చినది. భగవంతుడు చూపిన మార్గము ననుసరించి ఈ దేశమును వదలిపోవుచున్నాను. నా భార్యయు నాతోడనే యున్నది. వీలువెంట ఈ విషయము మాతండ్రిగారి కెట్లయిన తెలియజేయగలరు. ప్రాణములతో నున్న ఎప్పటికైనను మిమ్ముల చూడ నాశించు. శిష్యుడు - అల్లసాని పెద్దనామాత్యుడు."

విజయుని కన్నుల నీరుతిరిగినది. తన ప్రాణస్నేహితునికి కలిగిన కష్టమున కాతని హృదయ మంగలార్చినది. అది క్రోధముగా మారినది.

"ఈ తిమ్మనను హతమార్చిన?" తన క్రోధమును బయల్పరచినాడు విజయుడు.

"అది అలవిగాని విషయము నాయనా? ఈ జాబెట్లైన చొక్కనామాత్యుల కందజేయవలయును." అనినాడు జగపతి.

శంకరుడటకు చేరినాడు.

"కారాగారమున నున్న చొక్కనామాత్యునకు పెద్దనజాబునందింప గలవా?" ప్రశ్నించినాడు విజయుడు శంకరుని.

"అందింప ప్రయత్నించెదను. పట్టుబడిన?"

"పట్టుబడిన బాధఎక్కువ. మీ తండ్రిగారికి కష్టముకల్గును." అవినాడు జగపతి.

"మధ్యాహ్న సమయమందు మీ తండ్రిగారు గృహమునం దుండెదరు. ఆయన కొరకు నీవు కారాగారమునకరిగి సమయముజూచి జాబు నందించుము." విజయుడుపాయమును సూచించినాడు.

"సరియే. ప్రయత్నించెద"ననుచు జాబు నందుకొనినాడు శంకరుడు.

"జాగ్రత్త శంకరా! విజయుడు విజయనగరమున కరుగుచున్నాడని చొక్కనామాత్యులకు తెల్పుము." అనినాడు జగపతి.

"సరియే."

‍~ ~ ~

"నారాయణా! నారాయణా!" కారాగృహమందు తనను కాపుండెడి సేవకుని బిలచినాడు చొక్కనామాత్యుడు.

తన నెవ్వరు బిలచినారో వానికి తెలియలేదు. నలువైపుల చూచినాడు.

"నారాయణా!" తిరిగి చొక్కనామాత్యుడు బిలచినాడు.

లోనుండి చొక్కనే తనను బిలుచుచున్నాడని గ్రహించినాడతడు. ఖైదీతో మాటలాడుటా? చొక్కనామాత్యుడే తన కుద్యోగము ననుగ్రహించినాడు. అయిన నాతనితో మాట్లాడుట నెవ్వరైనచూచిన? తన జీవికకే భంగము.

"ఆలోచించుచున్నావా నారాయణా! నాకొక్కవిషయము నొగాదవి సమాధానము తెల్పుము. మా పెద్దన ఎట్లున్నాడు! ప్రాణములతో

నున్నాడా? అంతవరకు తెల్పుము నారాయణా నాతో?" దీనముగ ననినాడు చొక్కనామాత్యుడు. "ఈ దుర్మార్గుడు తిమ్మన నాబిడ్డను బ్రమకనిచ్చి నాడా? నారాయణా, నాకీ యొక్క విషయమును తెల్పవా నారాయణా! తోటి మానవున కామాత్రపు సహాయ మొనర్చుట ద్రోహమా!"

అతని విచారమును గమనించినాడు నారాయణ. అతడు నిలువ లేకపోయినాడు. "పెద్దన నింతవరకే మొనర్పలేదు. అతని క్షేమప కారము జరుగలేదు. కుమారుని విషయము కనుగొని రేపు తెల్పెదను స్వామీ!" యనినాడు నారాయణ.

అప్పటికే శంకరుడు వెనుకకు వచ్చి నిలువబడినాడు.

నారాయణ వెనుదిరుగు నప్పటికి శంకరుడు కన్పించినాడు. అత నికి భయమైనది.

"ఒక బందీతో కారాగార రక్షకుడు మాట్లాడుటా?" అననే యని నాడు శంకరుడు. సేనాధిపతి కారాగారాధిపతి కుమారుడాతడు. తండ్రితో ఈ విషయమనిన తనగతి యేమి? నారాయణ వణికిపోయినాడు. అతని గాంచి శంకరుడు ఫక్కున నవ్వినాడు.

"తండ్రిగారెక్కడ?" ప్రశ్నించినాడు శంకరుడు.

"ముఖ్యాగారమున నున్నారేమో?" తడబడుచు ననినాడు.

"చూచి రాగలవా?" ప్రశ్నించినాడు శంకరుడు.

నారాయణ తటపటాయించినాడు.

"ఫరవాలేదు. నేను ఖైదీని చూచుచుండెదనులే." అనినాడు శంకరుడు.

నారాయణ ముఖ్యాగారమునకు బయలువెడలినాడు. పెద్దన యుత్త రమును శంకరుడు చొక్కనామాత్యున కొసగినాడు!

"విజయుడు రేపు విజయనగరమున కరుగును."

"దుర్గాధిపతి మదను ముందుగా నడంపవలెనని తెల్పుచున్నాము."

నారాయణ తిరిగివచ్చినాడు. కారాగారాధిపతిలేడు.
శంకరుడు ఇంటి కరిగి విషయము విజయునికి తెల్పినాడు.

॥ ॥ ॥

విజయనగర రాజప్రాసాదమున నొక రహస్య సభ జరిగిపోవు చున్నది. తిమ్మరుసు, మహారాజుకృష్ణరాయలు, గోవిందరాజు, దుర్గాధిపతి త్రయంబక నాయకుడు నల్వురున్నారు.

"మహామంత్రులు చొక్కనామాత్యులవిషయ మేమాలోచించి నారు?" ప్రశ్నించినాడు రాయలు.

"ప్రస్తుతము మనము దండయాత్ర కరుగుట క్షేమముగాదని నా యభిప్రాయము. మనవారిలోననే కొందరు ద్రోహులున్నట్లు నాకను మానమున్నది."

"నాకొరకు సాహసించి ప్రాణాపాయమును గొనితెచ్చికొనిన చొక్కనామాత్యుల నట్లేవదలుట నాకు క్షంతవ్యముగాని యపరాధముగ గన్పించుచున్న దప్పాజీ! ప్రాణమిచ్చెడి స్నేహితుడా పెద్దన ఏమను కొనుచున్నాడో? పెద్దనవైన నిటకు పిలిపింపవలయును."

"విజయుడు కన్నప్పయే ప్రభువులని పెద్దనకు తెల్పియుండును. పెద్దన యీ సమయమునకు బయలుదేరి విజయనగరము చేరుకొన వలసినది."

"మన పంపిన సైనికుల జాడయేలేదు." అనినాడు గోవిందరాజు.

"తిమ్మన బంధించినాడేమో వారిని." త్ర్యంబక నాయకుడనినాడు.

"ఆ దుర్మార్గుడు సామ్రాజ్య సైనికులనే బంధించునంతటి దుస్సాహసియా?" తీవ్రముగ ననినాడు రాయలు.

"తిరుగుబాటు నొనర్చి స్వాతంత్ర్య మవలంబించ బూనినవా డే సాహస మొనర్పడు?" గోవిందరాజనినాడు

"ప్రస్తుత మాతడా సాహసమొనర్పడు. చొక్కనామాత్యుని విష యము తెలియనట్లే ప్రవర్తించుటకు నిశ్చయించుకొనినట్లు తోచుచున్నది.

అందులకే సైనికుల నిర్బంధమం దుంచియుంతును." అనినాడుఅప్పాజీ.

మహామంత్రులెన్ని చెప్పినను చొక్కనామాత్యుల ప్రాణము విషయమై నాకు భయాందోళనలు గలుగుచున్నవి. ఆతనికి ప్రాణాపాయమే సంభవించిన నాకీరాజ్యమే యవసరములేదు. నాకొరకుగా నంతటిస్నేహ పాత్రుడు మరణించిన........" రాయలిక మాటాడలేదు.

ఆతని మనోనిశ్చయమేమో కనుగొనినారు వారు. అజపర్క తిమ్మనపై దాడి నిశ్చయమని నిర్ణయించు కొనినారు।

"మనము దాడి యొనర్చిన చొక్కనామాత్యునాతడు సంహరించిన మన మొనర్చునదేమి ప్రభూ। తిమ్మరు సడిగినాడు."

మహామంత్రుల యనుమానమేమో వారికర్థమైనది. క్రూరుడైన అజపర్క తిమ్మన దేనికైన సాహసించుననుట నిజము.

మహారాజర్థ మొనర్చికొనినాడు. అదియు నిజముగనే తోచినది.

"మరి కర్తవ్యమేమి?" రాయలు ప్రశ్నించినాడు.

"అదవాని నుండి వార్తకొరకెదురు చూచుచున్నాను. నాగూఢచారి రావలసియున్నది. ఆతడెందుల కాలస్య మొనర్చినాడో తెలియదు."

ప్రతీహారి లోని కరుదెంచినాడు.మహారాజులకు నేలకంటమ్రొక్కినాడు. "అదవానినుండి విజయుడువచ్చి తమదర్శనమును గోరుచున్నాడు."

మహారాజు నాజ్ఞతో విజయుడులోన ప్రవేశించినాడు. మహారాజున కభివాదన మొనర్చినాడు.

"ఏమి విజయా। వెంటనే తిరిగివచ్చినావు? చొక్కనామాత్యుడు క్షేమముగ నున్నాడా?" ప్రశ్నించినాడు రాయలు.

"క్షేమముగనే ఖైదునందు మ్రగ్గుచున్నాడు. కాని...."

"కాని...."వ్యగ్రతతో మహారాజు. మహామంత్రు లొక్కసారి యనినారు.

"పెద్దన మాత్రము పలాయనమైనాడు."

"పెద్దనపై నేమైన యత్యాచారము జరిగినదా?" అప్పాజీ ప్రశ్నించినాడు.

"ఆరోజురాత్రి. నేనిక్కడకు బయలుదేరిన రోజు రాత్రి. పెద్దనపై

హత్యాప్రయత్నము జరిగినదట. ఆరోజే కారాగారమునుండి చొక్కిన ఎటకైన పారిపోవలసినదని పెద్దనకు వార్తబంపినాడు. మా తండ్రికి తాను భార్యతో భగవంతుడనుగ్రహించిన మార్గమున వెడలిపోవుచున్నట్లు త్తరము వ్రాసినాడు పెద్దన."

"భగవంతుడాతని కనుగ్రహించిన మార్గము మీరు కనుగొనలేదా?" తిమ్మరుసు ప్రశ్నించినాడు.

ఆ ప్రశ్నకు అచటివారికి నవ్వేవచ్చినది. మహారాజు నవ్వనేనవ్వినాడు. తన్ను మహామంత్రి ఎగతాళి యొనర్చుచున్నాడని విజయుడును నవ్వినాడు.

"నే నీతని నెగతాళి యొనర్చుటలేదు. నిజముగనే యడుగుచున్నాను. విజయా ఆ చీటీ నాతడెచ్చట నుంచినాడు పోవునప్పుడు?"

"మల్లవిద్యాలయము ప్రహరీ తాళమందు." విజయుడు సమాధాన మొసగినాడు.

"ఆ భగవంతుడొసగిన మార్గ మావిద్యాలయమందే యుండును. దానిని మీరు శోధింపలేదా?"

"బయట తాళము వైచియుండ నాతడెట్లు లోని కరుగును?" ప్రశ్నించినాడు విజయుడు. "ఆ తాళము మాతండ్రియొద్దనున్నదికూడ" యనినాడు.

"పెద్దన మహామేధావి. ఆచీటీ తన తండ్రికి చూపుమని వ్రాసినాడా?"

మహామంత్రి ప్రశ్నకు విజయుడాశ్చర్యమే పొందినాడు.

"అవునందట్లే యాతడు కోరినాడు."

"సరియే ఆమార్గ మా యిరువురకు మాత్రమే తెలియును."

"మా తండ్రి మీకుమాత్రమే యిమ్మని యొకలేఖ నిచ్చినాడు. దానిని ముద్రికతో ముద్రించి యిచ్చినాడు. నేను చూడరాని రహస్య విషయమట." అనుచు నొకలేఖ అంగిజేబునుండి తీసి తిమ్మరుసుమంత్రి కొసంగినాడు విజయుడు.

అప్పాజీ లేఖను విప్పినాడు. అది చదువుచున్నంతసేపు నాతని ముఖమున చిఱునవ్వు వెలిగినది.

"ఆలేఖ మేమును వినరానంత రహస్యమా అప్పాజీ!" నవ్వుచు యడిగినాడు రాయలు.

"విజయనగర సామ్రాజ్య మహామంత్రులకు.

"సేవకుడు జగపతి నాయకుడు వ్రాసిన లేఖార్థములు. పూజ్యులైన చొక్కనామాత్యులు బంధింపబడినారు. ఆతని పుత్రులు పెద్దనపై హత్యా ప్రయత్నము జరుపబడినది. అతడు నాపేర తన తంత్రికందింప వలసి నదిగా నొక జాబు వ్రాసి మందిరద్వారముననుంచి పోయినాడు. భగవంతుడనుగ్రహించిన దారియనుటతో నాకనుమానము వచ్చినది. మల్లవిద్యా మందిరములోని కరుగగా నది లోపలివైపు బిగింపబడినది. ఆ తలుపును తీసి లోపలి కరుగ నొకగదిలోని రహస్యద్వారము కన్పించినది. ఆ ద్వారమువెంట నేను పోయి చూచినాను. అది ఆదవాని దుర్గమునకు దక్షిణమున నొక యర్ధక్రోశము దూరమున అడవిలో నొకపొదరింట అంతమైనది. ఆ పొదరింటి ప్రక్కనొక బిల్వవృక్షమున్నది. పొదరింట ఉత్తరపు దిక్కున బండి గురివెందతీవకొక ఆకుపచ్చని గుడ్డముక్కను కట్టియుంచినాను. ఆ గుర్తులతో ఆ రహస్యమార్గమును తాము అవసరమున కుపయోగించుకొనగలరు. ఈవైపు మార్గము తీసియుంచగలను.

నాపై తిమ్మనదృష్టి పడుచున్నట్లనుమానముగ నున్నది. నా యేక పుత్రుడు విజయుని మీచేతులందిడుచున్నాను ఆజపర్క తిమ్మన బ్రదికి యుండగా నా విజయునిటకు పంపవలము, త్వరలో చొక్కనామాత్యుడు విడుదలకానిదాతని తిమ్మన బ్రదుకనీయడు.

ఇట్లు సేవకుడు.
జగపతినాయకుడు."

"ఈ సమయమున జగపతి మనకఖండమైన యుపకార మాచరించినాడు" "అనినాడు అప్పాజీ.

"విజయా! నీ విక నాగూఢాచార శాఖలో చేరవలయును." అని వాడు తిరిగి అప్పాజీ!

చిత్రమనినాడు విజయుడు.

"ప్రభువులిప్పుడే మూహించుచున్నారు?" ప్రశ్నించినాడు తిమ్మరుసు.

"మీ యిష్టమువచ్చిన రీతిని చొక్కనామాత్యునిటకు రప్పింపుడు. దండయాత్రతోనైన నేనే సేనాధిపత్యము వహింతును." అనినాడు రాయలు.

"ప్రస్తుతము దండయాత్ర నాకిష్టములేదు."

"మఱి కర్తవ్యము?" త్రయంబకుడనినాడు.

"చొక్కనామాత్యుని విషయము తెలియినట్లు నటించుచున్నాడుగదా అజపర్కతిమ్మన. మనమునట్లే యేలనటింపరాదు? మోసమును మోసము తోడనే నిర్జింపవలయును. వంచనకు తగినది వంచనయే. చొక్కనా మాత్యుని మాయోపాయముచేతనే అదవాని దుర్గమునుండి తప్పింప వల యును. అందులకు తగిన యుపాయముకూడ యమరినది. మఱి చొక్కనా మాత్యుని రక్షించి సురక్షితముగ దెచ్చుటకు మనలో పోవువారెవరు?" ప్రశ్నించినాడు అప్పాజీ! వెంటనే "అన్నియు తెలిసినవాడవు నీవరుగుదువా వీరమల్లూ!" ప్రశ్నించినాడాతడే వీరమల్లును.

"మహాప్రసాదముగ భావించి పోదునుగాని........" ఆగినాడు వీరమల్లు.

"మీ మహారాజును నీ కప్పగించు భారము నాది. తిరిగి వచ్చిన వెంటనే." యనినాడు మహామంత్రి.

మహారాజు ముఖమున దరహాసము విరిసినది.

"వీరమల్లూ! చొక్కనామాత్యుల రక్షణము మన కవశ్య కర్త వ్యము." అనినాడు రాయలు.

"నీతోడ నిరువదిమంది యారితేరిన జోదులనంపెదను. అద వాని యానుపానులెఱిగిన నీవు వారికి నాయకుడవై కారాగృహమునుండి చొక్కనామాత్యుని తప్పించి రహస్యమార్గమున కొనిరావలయును. నీకు తెలిసినవారితో దుర్గాధ్యక్షుడు తిమ్మన చొక్కనామాత్యుని చంపించినాడని చెప్పిరావలసినది. తరువాత కాగల కార్యము గంధర్వులే తీర్పగలరు."

అప్పాజీ మార్గమున కందరు సమ్మతించినారు. సంతసించినారు.

"విజయా నీవు ఉదయగిరి నగరమున కరిగి యందు విశేషములు మాకు తెలియజేయవలయును. లింగరాజు నీకు సహాయకుడు."

వీరమల్లు - విజయమల్లు రందులకు సంసిద్ధులైనారు.

## పదకొండు

నంది తిమ్మనతో పెద్దన సహచర్యము అతిశయించుకొలది పెద్దనలోని వైమష్య మాతని నాకర్షించినది. పెద్దన నిష్ఠమొయి హరికథా సారము వ్రాయుచున్నాడు. ప్రతి దినమును తాను వ్రాసిన భాగమును దీక్షితులకు, ఉమాదేవికి చదివి విన్పించుచున్నాడు. పెద్దనను జూచుట కరుదెంచినాడు తిమ్మన యొక దినమున. శ్రావ్యకంఠమున గ్రంథపఠనమొనర్చుచున్న పెద్దన పల్లకినుండిదిగిన తిమ్మన నాహ్వానించినాడు.

"పెద్దనా! నీవు పఠించిన పద్య మేగ్రంథములోనిది?"

"పెద్దన రచించుచున్న హరికథాసారమందలిది." దీక్షితులు జవాబు చెప్పినాడు.

అందలి పద్యముల నొకటి రెంటిని పెద్దన చదువగా వినిన తిమ్మన యానందించినాడు. పెద్దన కవితా ప్రాగల్భ్యమున కాతని కచ్చెరువైనది.

"పెద్దనా! నీజన్మస్థానమేది?" ప్రశ్నించినాడు తిమ్మన.

"కవీంద్రా! ప్రస్తుత మాప్రశ్న యడుగవలదు. అవసరసమయమున నేనే తెల్పగలను. క్షమింతురుగాక."

"పెద్దనా! ఉదయగిరి నగరమున కుట్ర జరిగిపోవుచున్నది. కందుకూరి రుద్రకవి యానాటి ఓటమికి నీవు కారణముగా దలంచి నీపై పగ సాధింపదలచియున్నట్లు తెలియుచున్నది."

"ఆతడే మొనర్పగలడు?" దీక్షితులనినాడు.

"ఆతని శిష్యుడు ఏదైనా చేయగలవాడు. పరమ దుర్మార్గుడని ప్రతీతి."

"ఎవరా శిష్యుడు?"

"చిట్టప్ప. ఉద్దంఖాను డాతనికి స్నేహితుడు ఆతనిచే నీకేమైన అపకార మొనర్చునేమోయని! ఏమైన జాగ్రత్తగనుండుటవసరము పెద్దనా!" యనినాడు తిమ్మన.

"పెద్దల యనుగ్రహమున్నంతవఱకును నాకు భయములేదు ఈ విషయము మీకు తెలిసినట్లు మహారాజునకేల నివేదింపకూడదు? ముందుగ నావిషయమై తెలిసికొనుటచే రాజేదైన సహాయమొనర్ప వీలుండునుగదా?"

"అగునది నిజమే. కాని వారి కీ విషయమై తెల్పుటకు సమయము కావలయును. ఎట్లైనను నేనీ విషయమై రేపు రాజునకు విన్నవింప ప్రయత్నింతును. మీరు నా విషయమై జాగ్రత్తగా నుండుడు" తిమ్మన వీరిని హెచ్చరించి వెడలినాడు.

పెద్దనయు దీక్షితులు ఆలోచనాగ్రస్తులైనారు.

చివరకు మఱునాడు సభకరిగి యీ విషయమై రాజుతో ప్రస్తావింప నిశ్చయించుకొనినారిరువురు

మఱునాడుదయముననే తలుపువద్ద నెవ్వరో పిలుచుటచే దీక్షితులు మేలగ్కొని తలుపు తెరచినాడు.

ఎదురుగా సైన్యాధిపతి ఉద్దంఖానుడు ఇరువదిమంది సైనికులతో నిలచియున్నాడు.

దీక్షితులకు చెమట పోసినది.

"పెద్దన యెక్కడ?" ప్రశ్నించాడాతడు. హింసవుల యెడ నాతడు బహు కౄరుడు.

దీక్షితులు గడగడ లాడినాడు.

"ఎక్కడ పెద్దన?" గద్దించి యడిగినాడు ఖానుడు.

పెద్దనయున్న గది వైపు జూచినాడు దీక్షితులు.

ఈ సంపది ఇదివఱకే పేల్కొని దైవపూజ నొనర్చుచున్న పెద్దన వినినాడు.

ఇంతలో ఉద్దండఖానుడు ఆ గృహద్వారమునొద్ద కరిగినాడు.

"వారు పూజా గృహమందున్నారు?" ఉమాదేవి చెప్పినది.

చెప్పవాల్చక ఆమెవైపు చూచినాడా మహమ్మదీయుడు. ఆ క్రూర దృష్టి ఉమాదేవికి కంటగింపు కలిగించినది. ఆ మహమ్మదీయుడొకపరి గడ్డమును సవరించుకొనినాడు. ఉమాదేవి లోనికరిగినది. ఉద్దండఖానుడు రెండడుగులు ముందుకు వైచినాడు. పూజాగృహములోని కరుగుట అతని యాశయము. పూజచేయుచున్న పెద్దన యగుపించుచున్నాడు. అతని ముందు సొగసైన కృష్ణవిగ్రహమున్నది. ఆ విగ్రహముపై ఉద్దండఖానుని దృష్టి పడినది. ఆ విగ్రహపు అందమాతని నాకర్షించినది.

పెద్దన ఈ సందడి నాకర్ణించి వెనుదిరిగి చూచినాడు. దేవతాగృహము దాపునకువచ్చిన ఉద్దండఖానునకు ఎదురువచ్చినాడు.

"దేవతా గృహమునకువచ్చి మమ్మవమానించుట గౌరవనీయులకు తగినదికాదు."

"గౌరవనీయులను మేమవమానింపము." ప్రశ్నకు జవాబు వినవచ్చినది.

పెద్దన నిర్విణ్ణుడైనాడు. వెంటనే తేరుకొనినాడు.

"మీ ఉద్దేశము నాకరమగుటలేదు," అనినాడు పెద్దన.

"ఇప్పుడిద్దముకాదు." అనుచు అతని భుజముపై చేయివైచినాడు ఉద్దండఖానుడు.

"ఛీ మూర్ఖుడా! అనుచు నాచేయిని విదలించివైచినాడు పెద్దన.

ఆ విదలింపుతో ఖానునిచేయి విరిగినంతపని యైనది.

ఈ ఉరుమని పిడుగేమో ఉమకర్థముకాలేదు. రాత్రి తిమ్మన చెప్పినది వెముకవైపు చూచుచున్నాడు దీక్షితులు.

కోపముచే ఉద్దండఖానుని కన్నులెఱ్ఱబడినవి.

పెద్దన కోపముచే త్రివిక్రముడైనాడు. ఆతని కటములదరుచున్నవి.

"ఛీ నీచుడా! నీ అత్యాచారమునకు తగిన ఫలితమనుభవింపగలవు. కారణములేని నీ దౌర్జన్యమును సహింపను. ఈ రాజ్యమునకు రాజున్నాడనుమాట మరచినావా?" ఉగ్రుడై యనినాడు పెద్దన.

"బంధించుడీ బాపని." అని భటులకాజ్ఞాపించినాడు.

భటులిద్వరు ముందునకురికినారు.

"ఆగు!" ఆ గంభీర కంఠస్వరమునకు వారు చకితులై నిలచినారు. ఖానుడే ఒక్కక్షణము జంకి తేరుకొనినాడు.

"ఎవరి యాజ్ఞచే నన్ను బంధించుమన్నావు?"

"మహారాజు నాజ్ఞచేత"

"మహారాజా లేక విట్టప్పయా నన్ను బంధింపుమని నిన్నుపురికొల్పినది? నీయీ యవినయమునకు తగిన ప్రతిఫల మనుభవింపగలవు. నేను మహారాజుకడకు వచ్చుచున్నాను."

"ఉమా జాగ్రత్త. నీవు దీక్షితులతో నంది తిమ్మన యింటికరిగి యటనుండుము."

పెద్దన బయలుదేరినాడు. విచ్చుకత్తులతో సేవకులాతనిచుట్టి నడచినారు. ఉద్దండఖానుడు ఆ వ్యక్తి గంభీరతకాశ్చర్య చకితుడైనాడు.

కన్నీళ్ళతో ఉమాదేవి గదిబయట కరుదెంచినది. ఖానుడామెను చూచి చిఱునవ్వు నవ్వినాడు.

పెద్దన మహారాజునొద్దకు కొనిపోబడినాడు.

తిరుమల రామాత్తరాయలాతనిజూచి ముఖమావలకు త్రిప్పుకొనినాడు.

"మహారాజేల నాపై కినుకవహించినారో నాకర్థముకాలేదు. కారణరహితముగ బంధింపజేయుట న్యాయసమ్మతముగాదు." అనినాడు పెద్దన మహారాజుతో.

"పెద్దనా! ఈ జాబులు చూడుము." అని మంత్రి బసవరాజొక జాబు నందించినాడు పెద్దనకు.

పెద్దన యాజాబు నందుకొనినాడు.

అవి తన యక్షరముల పోలికగా వ్రాయబడిన యక్షరములు.

విజయనగర గూఢచారిగా తాను తిమ్మరుసుకు వ్రాసినట్లు వ్రాసిన జాబది.

చదివినాడది.

"ఇది నా అక్షరముల పోలికలుండునట్లు వ్రాసిన జాబు. ఇది నేను వ్రాసినదికాదు. అదిగాక గూఢచారిగా పనిజేయవలసిన యవసరమేమియు నాకులేదు." పెద్దన స్థిరముగనని ఆ జాబును తిరిగి బసవరాజు చేతికొసగినాడు.

"నీ దేదేశము?" రాజు ప్రశ్నించినాడు.

"నాది అదవానిదుర్గము, ఆ దుర్గాధీశుడు నాపై కోపగించుటతో పారిపోయి వచ్చినాను."

"ఆ దుర్గాధీశుడేల కోపించినాడు?"

"కారణము లేకుండ కోపించినాడు. అతని దుర్మార్గమునకు తోడు పడకుండుట నాయపరాధము."

"ఆ దుర్మార్గమేమి?"

"అది చెప్పవలను పడనిది"

"నీవు విజయనగర శ్రేయోభిలాషివా?"

"తప్పక విజయనగర సామ్రాజ్య ప్రజలలో నొకడను నేను. అందుచే ఆరాజ్యమందు విశ్వాసము నాకవశ్య కర్తవ్యము."

"నీవు తిమ్మరుసు గూఢచారివికాదా?"

"నేను తిమ్మరుసును గాని, కృష్ణరాయలగాని నెరుగను."

"అసత్యమది. ఈతని బంధించిన మఱికొన్ని విషయములు బయటపడవచ్చును." అనినాడు ఉద్దంఖానుడు.

"ఈ జాబున కేమని నీ సమాధానము?" ప్రశ్నించినాడురాజు.

"అది నీచుడైన చిట్టప్ప తయారు చేసినది. అతడే ముసల్మానునకు సహకారి. తన యోటమికి రోషించిన రుద్రకవి ప్రోత్సాహమిది."

"నీతండ్రియెవ్వరు?" ప్రశ్నించినాడు రాయలు.

"ఇప్పుడది చెప్పవలనుపడదు."

"నీవపరాధివి కానప్పుడు తండ్రిపేరు చెప్పుటకేమి?"

"అపరాధిత్వము ఋజువుచేయజాలనప్పుడు దండించుట రాజ ధర్మము కాదు."

"నాకు రాజనీతిని బోధించుచున్నావు." ఉగ్రుడై యనినాడురాజు.

"తెలియని విషయము తెలియజెప్పుచున్నాను." పెద్దనయనినాడు.

"నీవు నిరపరాధివని ఋజువగునంతవఱకు కారాగారమున నుండ వలసినదే."

పెద్దన కారాగారమునకు కొనిపోబడినాడు.

## పన్నెండు

త్రిమకీ కష్టములను భగవంతుడేల కల్గించుచున్నాడు? తామాతని భక్తి నిష్ఠలతో పూజించుచున్నామే. ఆతని యనుగ్రహమేల తప్పినది. మురళీ కృష్ణునికి తామేమపకార మొనర్చినారు? అనవసరముగ తనభర్త కష్టములందు జిక్కుకొనుచున్నాడు. తన భర్తను వారే మొనర్తురో?

ఆ మహమ్మదీయుడు తనవైపట్లు చూచినాడేమి? వాడేమపకార మొనర్చునో తనకు. తానొంటరి. ఇచ్చటనే యుండుటా లేక తిమ్మన యింటికి పోవుటా? దీక్షితులిచ్చటనుండిననే భయము లేదనుచున్నాడు. తిమ్మన యింటికిబోవుటే మంచిది. తన భర్తయు నట్లేచెప్పినాడు తన భర్తతో పోయిన దీక్షితులింతవఱకును రాలేదు. ఆతడేమైనాడో? ఆతని గూడ నీ తురక బంధించినాడేమో?

చీకటి పడబోవుచున్నది. ఆ తిమ్మన గృహమెచ్చటనో తా నెఱు గదు. తిమ్మనయు నిటకురాలేదు. ఈ రాత్రి గడచుటెట్లో తెలియదు,

ఆమె ఉదయము నుండియు నేమియు తినలేదు. తినవలయునను వాంఛయులేమి. వాడిన శిరీషపుష్పమైనది ఆమె.

చీకట్లు అలముకొనుచున్నవి. ఆమె హృదయమునను భయాంధకార మావరించినది. కొంచెము కాలములో దేవికి నైవేద్య మొసరించి దీక్షితులు రావచ్చును. తనభర్త వ్రాయుచున్న హరికథాసార మచ్చట దేవగృహమున కృష్ణవిగ్రహము దాపుననున్నది. ఆ గ్రంథమును చూచు సరికామెకు ఏడుపు వచ్చినది.

శ్రీకృష్ణునకు నమస్కరించి కన్నులనీరు తుడుచుకొనినదామె. వెనుదిరిగి దేవగృహము బయట కరుదెంచినది.

భయంకరాకారుడొకడామెనొడిసి పట్టినాడు. ఆమె కెవ్వుమనినది. భయముచే గొంతులోననే యణగిపోయినదా కేక. అతడామెనోట గుడ్డలు క్రుక్కినాడు. దొడ్డి తలుపు దెరచినాడాతడు. అచ్చటనొక మేనాయున్నది. దానియందామెను బడవైచినాడు, తలుపుమూసి బోయీలు నిశ్శబ్దముగ మేనా నెత్తినారు. ఆమెకు స్పృహ తప్పిపోయినది. ఆవ్యక్తి వెనుకకువచ్చి స్ఫాటిక కృష్ణవిగ్రహమును సంతరించుకొని పోయినాడు.

మేనా నెమ్మదిగా పెదవీధులనువదలి సందుగొందులను బడినది. కనుబడిన రాజభటులతో వారేమియో యనుచున్నారు. నిశ్శబ్దముగ రాజభటులు తొలగి త్రోవయిచ్చుచున్నారా మేనాకు. మేనా అట్లే నగరమును దాటి బయటి అడవిలోనికరిగినది. వారట్లే అర్ధరాత్రి వఱకు ప్రయాణ మొనర్చినారు.

వారి వెనుకనే ఆ వ్యక్తి గుఱ్ఱముపై వచ్చుచున్నాడు. వారట్లునడచి ఒకపాడుపడిన కోటవంటి భవనమున కరుదెంచినారు.

బయటకు చూచుటకా భవనము పాడుబడియున్నను లోపలివైపు బాగుచేయబడియున్నది.

ఆ వ్యక్తి ఉద్దండఖానుడు. అతడు గుఱ్ఱము దిగగనే లోనుండి యిరువురు సేవకులువచ్చి గుఱ్ఱమును లోనికి కొనిపోయినారు. బోయీలు కి దెఱచి లోనున్న యామెను మోసుకొనివచ్చి లోనున్న యొక

మంచముపై బరవేసినారు. ఆమెకు స్మృహలేదు. ఆమెవద్ద నొక దాసీని నియమించి ఉద్దంఖాను లోనికరిగినాడు. కొంత తడ వాతడటనుండి తన గుఱ్ఱముపై వెనుదిరిగి మరములోని కరిగినాడు.

తెల్లవారు సరికి ఉమాదేవికి తెలివి వచ్చినది. తానెక్కడున్నది? తనకు మిక్కిలి దాహముగా నున్నది. ప్రక్కనేయున్న దాసీ యది గ్రహించినది. ఒక పాత్రలో నీటి నామె కందించినది.

"నే నెచ్చట నున్నాను?"

దాసీ పలుకలేదు.

"నన్నెవ్వరిట్లు బలవంతముగ కొనివచ్చినారు?"

దాసీ పలుకలేదు.

"నీవేమి మూగదానవా? బదులు చెప్పవేమి?"యనినది ఉమ. ఆమె నోరు తెరచి నాలుకను జూపించినది. అది కోయబడియున్నది ఆమెకు మాటలు రావు.

ఆ భవన మెచ్చటనున్నదో తెలియదామెకు. తన్ను బంధించి తెచ్చిన వాతురుష్కుడే యై యుండునని యామె భావించినది.

మరుదినము మధ్యాహ్నమున ఉద్దంఖాను దరుదెంచినాడు. అతడు సరాసరి లోనికరుదెంచినాడు. ఆమె మంచము వెనుక కరిగినది. తన విరుపాటి గడ్డము సవరించుకొనుచు నాతడామెను చూచి చిరునవ్వు నవ్వి నాడు.

"ప్యారీ! ఎట్లాగున్నావు?" కర్కశ కంఠముతో ప్రశ్నించినాడు.

"........తలవంచుకొని నిలుచున్నది ఉమాదేవి.

"నామీద కోపమా ప్యారీ! నీ అందము చూడగానే నా మనసు చలించి పోయింది. తెప్పించాను. నన్ను పెండ్లాడు. నీవు ఉదయగిరి దుర్గానికే రాణివౌతావు."

"ఛీ. నీచుడా! భగవంతుడొక డున్నాడని తెలిసి ప్రవర్తించు. నీ వానర్పై ఈ నీచ కృత్యాలకు తగిన ఫలిత మనుభవిస్తావు."

"ఫలితమనుభవించడానికే కదా ప్యారీ! నిన్ను తేవడానికి కారణం? రా, నిన్నిక్కడ రక్షించే వాండ్లెవరూలేరు. నాదానవైతివా నీ సుఖాలకు మితిలేదు. ఆ పేద బాపడు నిన్నేం సుఖపెడతాడు?"

"దుర్మార్గుడా! వారి కాలిగోటికి కూడ నీవు సరిరావు. నిన్ను కామించే నీచురాండ్రతో నీ ప్రలాపాలు సాగించు." ఆమె మహిషాసుర మర్దనియైనది.

"కోపంలోనే నీ వందంగా ఉన్నావు ప్యారీ!" తన రసికతను వొలకబోసినాడు ఖానుడు.

"పరస్త్రీలను ఈ విధమైన భంగములపెట్టే నీవొక పందవు! ఈ గతి నీ భార్యకే కలిగితే?"

అతని అభిమానం దెబ్బతిన్నది

"నోరు మూయి! ఈ ఉద్దండఖాను నెదిర్చిన వారెవరూలేరు. ఎదిర్చి బ్రతికిన వారూలేరు. మర్యాదగా లొంగిపో. లేకపోతే .." అతడు లేచి ఒక అడుగు ముందుకు వైచినాడు.

"ఒక అడుగు ముందుకు వైచితివా ఇదిగో వజ్రపుటుంగరము." ఆమె ఉంగరపు రాతిని నోట బెట్టుకొనినది.

ఉద్దండఖానునకు ఆమె చనిపోవుట యిష్టములేదు.

"నీకు రెండు దినములు గడువిచ్చుచున్నాను. నా దానవైతివా సరియే లేదా నిన్ను ఇతర దేశములకంపి బానిసగా నమ్మించివైచెదను." అతడు వెనుదిరిగి పోయినాడు.

తానెంతటి క్రూరాత్ముని చేతబడినది! తనభర్త యెట్లున్నాడో? వారా మహాత్మునేమొనర్ప లేదుగదా? తనకిక్కడనుండి ముక్తిలేదు కాబోలును. తనకు మరణమే యుక్తమైనది. ఈ నీచుడు తనను బలాత్కరింపక మునుపే తానీలోకమును బాసిపోవలయును.

పెద్దన రూపమామె కన్నులలో తాండవించినది. ఆ సుందర రూపుడు తన భర్త తనకొరకు కరుదెంచిన? తాను మరణింపరాదు. ఎట్లయిన నిక్కడనుండి ముక్తిపొందవలయును. ఆరస ష్మాదయును

తన మరణమునకు దుఃఖించుట తానో ర్వలేదు తానెట్లైనను నాతని జేర గలదు. భగవంతుడు తమ్మెట్లైనను ఎడబాటు జేయుడు. తనకొరకు తన భర్త ఎట్లయినను ప్రయత్నింపగలడు. తన యునికి నాతడెట్లు కనుగొన గలడు?

ఆలోచనలతో నామె మునిగి తేలుచున్నది. ఉద్దండఖానుని బాందిఖానాలో.

## పదవవాడు

పెద్దన కారాగారమున నున్నాడు. చీకటి పడుచుండగా నాతని కొక వింత యనుభూతి కలిగినది.

ఆతనికొక స్త్రీ కేక విన్పించినది. అది యెవ్వరి గొంతుక? చిర పరిచితమైనది. తన భార్య గొంతుకయది. ఆమె యక్కడేల యాక్రోశించి నది? ఆమె కేదియో ప్రమాదము జరిగినది.

ఆతని కనులముందు ఉద్దండఖానుని భయంకర రూపము తాండ వించినది. ఆ దుర్మార్గు డామెనేమొనర్చినాడు? అది యాతని శంక.

ఆతని హృదయము వ్యధితమైనది. అతనిలో నొక యాందోళన మంకురించినది. ఇప్పుడు తానామె కే విధమైన సహాయమొనర్పజాలడు. ఆతడు శ్రీకృష్ణ రూపమును తన హృదయమున నిల్పినాడు. తన కష్ట ముల నిప్పట్టున బోకార్పజాలిన వాడీ కృష్ణ భగవానుడే.

ఆ కృష్ణరూపము నాతడు భావించుచున్నాడు. అతడట్లే నిమీలిత నేత్రుడై కారాగారమునందు పద్మాసనస్థుడై కూర్చుండినాడు. రాత్రియైనది. తిక్కన వర్ణించిన శ్రీ కృష్ణునాతని హృదయస్థుడైనాడు.

పహరా మారినది. ఇంకకొరా పహరాకు నియమింపబడినాడు ఆతడు శూలము చేత ధరించి పహరా యిచ్చుచున్నాడు.

పెద్దన యట్లే నిశ్చలుడై కూర్చుండియున్నాడు. అతడు కన్నైన దెరువలేదు.

అప్రయత్నముగ పెద్దన ముఖమునుండి వెలువడిన దీ పద్యము.

సీ॥ పాండు తనూజుల పక్షమై నొగలెక్కి
రెండు సేనలయందు నిండియున్న
బంధు జనంబుల బావల మఱదుల
నన్నదమ్ముల జూచి యనికిదొడగి
అనుకంప జేసిన యారుని బోధించి
పార్థుకు విశ్వరూపంబు జూపె
అచ్చట బదునెన్మిదక్షౌహిణుల తోడ
భీష్మాది యోధుల పీచమడచె

సీ. ధరను మరియు బుట్టి దనుజుల బరిమార్చె
భూమి భారమెల్ల బుచ్చివైచె
నాది దేవుడైన యా కృష్ణు బ్రార్థించు
వట్టివారు ముక్తులైనవారు

అచట కొక స్త్రీ యరుదెంచినది.

"విజయనగర గూఢచారిగ కారాగారమున బంధింపబడిన దెవ రిచ్చట?" ఆమె కారాగార సేవకుని ప్రశ్నించినది.

"ఆతనితో నేమిపని? ఇంతకు తామెవ్వరో తెలుపవలయును."

"అది సేవకున కవసరములేదు. ఇదిగో చూడుమిటు." అనుచు తనచేతి ముద్రిక జూపించినదామె.

అది మహారాజ ముద్రిక. సేవకుడునమస్కరించినాడు.

"అధికారము నిక ప్రశ్నింపవలదు" ఆమె యనినది.

సేవకు డామెను పెద్దన గదివద్దకు కొనిపోయి విడచినాడు.

"ఇది పరమ రహస్యము. నీవిది బయల్పరచి నీ జీవికకు ముప్పు తెచ్చుకొనవనుకొనెదను" ఆమె యనినది.

"శ్రీ కళింగ ప్రతాపరుద్ర గజపతి సార్వభౌముల ముద్రిక గల్గిన

తమతో వారి బాంధవ్యమును నేను ప్రస్తావింపవచ్చునా?' సేవకుడడిగి నాడు.

"అది నీకనవసరము." ఆమె యనినది.

"నేనాతనితో మాట్లాడుట నీ కభ్యంతరము లేదనుకొందును." తిరిగి యామెయే యనినది.

గటవద్ద కరిగి నిలచినది. పెద్దన కొంత యా సంభాషణమును విని నాడు.

"తామెవరో నాతో తమ పని యేమియో తెలియలేకున్నాను." అనినాడు పెద్దన.

"తాము కృష్ణరాయల నెరుగుదురా?" ఆమె ప్రశ్నించినది.

విషయము పెద్దనకు గ్రాహ్యముకాలేదు. అతడు మాటాడలేదు

"గజపతుల పుత్రిక అన్నపూర్ణాదేవికి తమవలన కావలసిన ప్రయోజన మొకటి యున్నది."

"నావలనా! నాకలవియైనదైన అవశ్యము నెఱవేర్పగలను. కాని ధర్మవిరుద్ధములగు కార్యము లొనర్చుట కసమర్థుడను."

"తామొనరింపబోయెడి ఉపకారమునకు ప్రతిఫలము తమ విడుదల."

"విషయమేమో వివరింపవలసినది." పెద్దన కోరినాడు.

"ఇది పరమరహస్యవిషయము మీ సంభాషణమునుబట్టి విజయ నగరాధిపతితో మీ సన్నిహితత్వము నూహించుచున్నాము. మా రాకుమారి అన్నపూర్ణాదేవి శ్రీకృష్ణదేవరాయలను వరించియున్నది. తన ప్రేమ విషయమై కృష్ణరాయల కెఱిగించుటే మీరొనర్చు నుపకారము."

పెద్దనకు నవ్వువచ్చినది.

"నేను రాయబార మొనర్పవలయునా?"

"ఏమి? బ్రాహ్మణులొనర్పరాదా? అగ్నిద్యోతనుడు మీవాడేకదా?" ఆమెయు నవ్వుచు ప్రశ్నించినది.

"మఱి యీ కార్యములో నన్నే ఎంచుకొనుటలో మీయుద్దేశము?"

"అనవసరముగ మీరు వంచింపబడినారు. అధర్మముగ మీ రిందు బంధింపబడినారు. అది మాకు తెలియును. కవిపండితుల విట్లవమా నించుట గజపతుల వంశలక్షణమే కాదు. నంది తిమ్మనాచార్యుడిది యంతయు తన శిష్యురాలైన అన్నపూర్ణ కెఱింగించి మీ విముక్తి గోరి నాడు. మీ శాపమున కీరాజ్యమాహుతి గాకుండుటకై మిమ్ము విడుదల చేయుటకే మాతండ్రి నిశ్చయించుకొనినాడు. ఉపకారమునకు 'ప్రత్యుపకారము మహాత్ముల లక్షణము. అందుచే అన్నపూర్ణాదేవి ఈ రహస్య విషయమును తమతో మనవిచేయమని నన్నంపినది. ఎట్లయిన తమ చాతుర్యము నుపయోగించి రాయలతో మా రాకుమారిని గూర్పుడు."

"సరియే. ఇందు నా ప్రయత్నము విఫలముకాదు. మీ రాకుమారి యుపకారమునకు నా ఋణము దీర్చికొనగలను. ఇందుల కానవాలు మాత్రము కావలయును.

"ఇదిగో రాజపుత్రి యుంగరము మీ కానవాలు." అనుచు రాజ ముద్రిక ననాలోచితముగ నాతనిచేతనుంచిన దామె.

ఆతడా ముద్రికను గుప్త మొనర్చుకొనినాడు.

"మా రాకుమారి విషయము మరువకుందురుగాక." ఆమె యనినది.

ఆమె కాబోవు విజయనగర మహారాజ్ఞి. ఆమెను గూర్చి మరచుటా?

ఆమెముఖము ప్రఫుల్లమైనది

తాను రాయలనే యెఱుగను. విడుదల కొరకై తా నసత్యము లాడుచున్నాడా? లేదు. ఈ కార్యము సానుకూలమగునని తనకేలనో నమ్మకముగానున్నది - ఆలోచించుకొనినాడు పెద్దన.

"పెద్దన కవీశ్వరా! మీకొక యశుభవార్తను విన్పించుటకు చింత కల్గుచున్నది." ఆమె యనినది.

"అశుభమా? ఏమది?" అతని హృదయము దడదడలాడినది.

"కాని ఆ యపాయమును మోసముతోడనే నిగ్రహింపవ పమకట్టి నాము. అందులకు తగినవారు నియోగింపబడినారు."

"ఆ విచారవార్త యేమో తెల్పలేదు?" పెద్దన యడిగినాడు.

మీ భార్య ఉమాదేవి యపహరింపబడినది.

"ఆఁ?" యనినాడు పెద్దన. ఆతని హృదయ చలనమాగినట్లయినది. తన భార్య యపహరింప బడినది. తనభార్య నొకడపహరించుటా? ఈ యవమానము జరిగిన యనంతరమామె మరణింప కుండినదా? ఆమె మరణించిన తనకీ లోకముతో పనిలేదు. ఆమెలేనిది తనకీ జీవితమక్కర లేదు.

ఆలోచనతో తన స్థితినే మరచినాడు పెద్దన.

"కవీంద్రా?" ఆమె పల్కరించినది.

"ఈ ఉదయగిరి రాజ్యమా? లేక శ్మశానమా? నిరపరాధులను దండించుట. స్త్రీలను చెఱగొనుట చూడ ఈ రాజ్యమునకు రాజు లేనట్లే తోచుచున్నది." ఆ వేగముతో ననినాడు పెద్దన.

"ఇవి ప్రమాద జనితములు. ఆ మహమ్మదీయ సేనాపతి నిప్పు డెదుర్కొనుట కష్టహేతువు. అందువలన ఆమె నప్పటినుండి వంచనతో తప్పింపదలచినాము.

"నేనిప్పట్టున విజయనగరమున కెట్లుపోగలను?" పెద్దన యనినాడు.

"ఈ చెరసాలనుండి తామొనర్పగల్గిన దేమి స్వామీ?" ఆమె యడిగినది.

"అవును. కాని ఇట్టికష్టసమయమున ప్రాణసమానను వదలి పోవుటా?"

"పోవకున్న ప్రాణములకే ముప్పు సంభవింపవచ్చును. ఆమె సురక్షితముగా నొకచోట చేర్పబడనున్నది."

"అది యెవరివలన జరుపబడినది?" ప్రశ్నించినాడు పెద్దన.

"కొందరు అదవాని దుర్గమునుండి వచ్చిన గూఢచారులు. మా సేనాపతి ఉద్దండఖానుడు కలిసినట్లనుమానము. ఆ గూఢచారులు పట్టుబడినారు. వారందరు ఆమెఉనికి తమకు తెలియదనినారు. కాని అందొకడు రహస్యముగా నామె ఉనికిని తిమ్మనామాత్యునికి తెల్పినాడు." అనినదామె.

"ఆ దుర్మార్గు లిప్పటికిని నన్ను వెంటాడుచున్నారు. ఆ దుర్గాధిపతి పీడుడు" పెద్దన యావేశపడినాడు.

"వారి నాధారముగొనర్చుకొని మీపై నేరము ఋజువు పరుపవలెనని ఉద్దంఖానుని ప్రయత్నము. గూఢచారునికి శిక్ష మరణము మా గురువులు తిమ్మన కవీశ్వరులీ విషయములు మా తండ్రికి తెల్పినారు. కాని యిప్పు డానర్పగలిగినదిలేదు. ముందు మీ భార్యను ఆ దుర్మార్గులనుండి బయటకు వంచించి కొనిరావలయును. అది కొద్దిదినములలో జరుగుగగలదు. ఆమె కేవిధమగు నపకారము జరుగకుండ చూచుట కొకపరిచారిక మారువేష మున నామెయొద్దకరిగినది. ఆమె ధైర్యమువహించునట్లొక కమ్మవ్రాసి యిచ్చిన నామెకు చేరుము. ఆమెను సురక్షితముగ నంతఃపురమునకుంచు కొని కాపాడు భారము మా రాజకుమారి అన్నపూర్ణ వహించును."

"నా కంతయు నిగమ్యముగనున్నది. నాతోడిదే లోకమై ప్రవాస మునకు వెంటవచ్చిన భార్యను వదలి ప్రాణములను రక్షించుకొనుటకు సిగ్గుగానున్నది" పెద్దనయనినాడు.

ఈ సమయమున మహారాజులు ఉద్దంఖానుని దండింపజాలరు. మోసముతోడనే ఆమెను అంతఃపురమునకు చేర్చుటకు నిర్ణయించుకొని నాము. మహారాజు మిమ్ము పిడుదల నొనర్చిన ఖానుని దృష్టిమీపై కేంద్రీ కరింపవచ్చును. లేక మరేమైన జరుగవచ్చును. అందుచే మీరు తప్పు కొనిన ఆమె విషయము రహస్యముగ నెరవేరగలదు. తమ ప్రయాణము నకు ఇరువురు రౌతులతో గుర్రములు సిద్ధముగనున్నవి."

పెదనయాలోచించి నిర్ణయమునకు వచ్చినాడు.

"ఆ పతివ్రత భారమునంతియు మీపైవదలి కృష్ణరాయలను జూచు టకై పోయెదను. ఆమెకేమైన అపకారముజరిగిన స్త్రీహత్యా పాతకమును వెనువెంటనే బ్రహ్మహత్యా పాతకము ఈ రాజు నీరాజ్యమును భస్మీ భూతమొనర్చును." అని శాపవాక్కులవలె నవభాసించినవి.

"ఈ బ్రాహ్మణ శాపమునకు భయమందియే మేమీకార్యమునకు దిగినాము. తాము వశ్యవాక్కులు. ఆయమకే యపకారము జరుగకుండ రక్షించుభారము మాది. తామాందోళనా రహితముగ బయలుదేరుడు.

తాము విజయనగరము చేరుసరికి మీ భార్యను రాచనగరులోనికో తిమ్మన గురువుల గృహమునకో చేర్పగలము." అనుచు నామె నమస్కరించినది.

"అభీష్టార్థ సిద్ధిరస్తు!" అని దీవించి ఆమెవెనుక నడచినారు పెద్దన.

## పద్మాలంగం

విజయనగర మానాడు కన్నుల పండువుగ నలంకరింపబడినది. కృష్ణరాయలు సామ్రాజ్యాధిపతియైన యనంతరము వచ్చిన క్రొత్తపండుగ యది. ఆనాడు నగరమున నందరు నుత్సాహముతో తిరుగువారే. తలలపై ఉష్ణీషములున్నవి. రంగురంగుల వస్త్రములతో వీరులగువారు ఖడ్గములు మొలలందు ధరించినారు. కోర మీసముల మెలివేయుచు కుబుసము వదలిన కోడెత్రాచుల ననుకరించు యువకుల ఉత్సాహమునకు మేరలేదు. చైత్రోత్సవ మానాడు. మహారాజూరేగును. హజారరామస్వామి ఉత్సవ మానాడు.

మహారాజ భవనము నుండి ఉత్సవము బయలుదేరినది. ఉత్సవమునకు ముందు ఆశ్వికులు వరుసలుతీరి నడచినారు. వారివెనుక మేళములు తప్పెటలు మొదలగు వాద్యపరికరములున్నవి. వానివెనుక వరుసకు నాలుగేసి చొప్పున పదివరుసలు మదగజములు తుండములూపుకొనుచు నడచుచున్నవి. వాని వెనుక రాయల అంగరక్షక బలము వరుసకు పదిమంది ఆశ్వికుల చొప్పున ఐదువరుసలు. ఐదువరుసలు వెనుకను పరివేష్టించి రాగా ఐరావతమును ధిక్కరించు మత్తగజముపై బంగారు టంబారిలో రాయలుపవిష్టుడైనాడు. రాయల కుడిపార్శ్వమున ఒక అరబ్బీ గుఱ్ఱముపై నిలువాటి ఖడ్గమును హస్తమున ధరించి ప్రధాన అంగరక్షకుడు వీరమల్లు వచ్చుచున్నాడు. ఆనాడాతని హృదయమేలనో ఆనందమందుచున్నది. కారణము లేవిలమలకు. రాజవీధిచివరనున్నది రామాలయము. ఆనాడు శ్రీరాముని గజోత్సవము. దేవాలయము ముందుభాగమున నొకవైపున విశాలమైన

స్తంభములయు నెత్తయిన పందిరి వేయబడినది. అందాకపైపున నాటక శాల యమర్పబడినది.

ఆనాడు రాజనర్తకి భరతనాట్యమాడును. ప్రయోక్త రంగరాజు, అతడానాటి నటులలో నగ్రగణ్యుడు. అతని కుమార్తె నాగాయి రాజనర్తకి. ఆమెను ముద్దునాగాయి యని కూడా పిలుతురు. ఆమెసోదరి మేఖల భరత నాట్యమందు సంగీత సాహిత్యములందత్యంత నిపుణ రాజనర్తకి, రామా లయమునందు దేవదాసి. ముద్దునాగాయి సంగీత సాహిత్యములందు భరత నాట్యాభినయము లందానాడామెకు సాటిలేరు. ఇరువదైదేండ్ల ప్రాయము. అపరరతీదేవి. రాజధాని యందలి యువకుల కామెపేరు చెప్పిన శరీరము పులకరించును. ఆమెతోడి పొందునకు తహతహలాడుట ఆ నగరమందలి ముఖ్యులకు సహజమైనది. కాని ఆమె అందరానిపండు. సర్దారులు భాగ్య వంతులామె ముందిటమున కరుచెంతురు. ఆమె వారిని గౌరవించును. ఆటపాటల వారిని రంజించును నాగస్వరముపట్టి నాగులవలె వారినాడించు నంతియే. మెల్లగా వారిండ్లకు వత్తురు వచ్చి తమ దురదృష్టమునకు నిట్టూర్చుదురు. అట్లని ఆమెపై కోపగించుకొనుట వారెరుగరు. ఏనాటికైన ఆ అప్సరోభామినికి తమపై కరుణగల్గకపోవునా యనునదే వారి ఆశా లేశము. కాని ఆమె రాయలసొత్తు.

ఆనాటి నాట్యమున ప్రధానభూమిక మేఖల నిర్వహించును. ఆ భరత నాట్యాభినయము జూచుటకే ప్రజలట్లు వెల్లువలై రామాలయము వైపు ప్రవహించినారు. శ్రీకృష్ణరాయల ఊరేగింపు బయలుదేరుసరికి నాల్గుగడియల ప్రొద్దున్నది. అది రాజమార్గము మధ్యకు చేరినది.

ఆ సమయమున రాజమార్గమందెవ్వరు వాహనము నధిరోహించి ఎదురు రారు. అట్లు ప్రవర్తించినవారు కారాబద్ధులగుట తప్పదు.

పెద్దన తన గుఱ్ఱము నధిరోహించి రాజమార్గమును చేరు మార్గ మున వచ్చుచున్నాడు. ఆనాడా విజయనగరము స్వర్గపురిని తలపించు చున్నది. ఆ జనప్రవాహమేమి? ఎన్న రామాలయమునొద్ద కలియుననని భటుడరిగినాడు. ఈ మార్గమే సరాసరి రామాలయమును జేరుననియు తెల్పినాడాతడు. పెద్దన మెల్లగా గుఱ్ఱమును నడిపించుచు సాయంసంధ్యలో

ఆ నగర సౌందర్యమును పరికించుచున్నాడు.

తిమ్మరుసు తన తండ్రినట్లా కటికవానిచేత నుంచి యూరకొనినాడు. ఈ విషయము తెలిసిన వెంటనే తిమ్మనాయకునిపై దండయాత్ర జరుగు ననుకొనిన తన యూహ కన్యథా జరిగినది. రాజకీయములు దురవగాహ మైనవి. అందు మానవజీవితమునకు విలువతక్కువ. తన తండ్రి బాధి ప బడుటకు కారకుడైనవాడు కన్నప్ప. ఆ కన్నప్పను కొనివచ్చినవాడు గోవిందరాజు. బాధలందుచున్న తన తండ్రిని వదలి వీరు భోగములనుభవించుచున్నారిచ్చట. ఆ విషయమే తాను తిమ్మరుసు మంత్రి నడుగ గలడు.

కొంచెము దూరమునుండి నగారా నౌబతుల మ్రోత విన్పించినది. పెద్దఊరేగింపు దారిని వచ్చుచున్నట్లు గమనించినాడు పెద్దన.

వీరఖడ్గముల ధరించిన అశ్వికులు నలుగురు పెద్దన గుఱ్ఱము వైపునకు వచ్చినారు. ఎఱ్ఱని ఉష్ణీషముల ధరించి కోరమీసములతో నున్న వారు తనపై దౌర్జన్యమును జరుపుట కుద్దేశించుచున్నారని గమనించిన పెద్దన ఖడ్గముపై చేయివైచినాడు.

"ఎవరు నీవు?" ప్రశ్నించినాడందొకడు.

"ఈ నగరవాసిని కాను." పెద్దన జవాబొసగినాడు.

"ఈ దిన మీరాచబాటపై అశ్వమునెక్కరాదని తెలియదా?"

పెద్దనకు నవ్వువచ్చినది. "మీ రెక్కిన అరబ్బీ గుఱ్ఱములు నాగుఱ్ఱముకన్న గొప్పవి." అనినాడు వ్యంగ్యముగ.

వ్యంగ్యము నర్థమొనర్చుకొనినాడు మొదటి అశ్వికుడు. "మేము మహారాజ అశ్విక అంగరక్షకులము. మేముతప్ప మరెవ్వరీ ఊరేగింపు సాగిపోవనిది గుఱ్ఱమెక్కరాదు."

"నాకీ నగర నియమములు తెలియవు. తెలిసిన వానిని తలదాల్చుట కభ్యంతరములేమి." అనుచు గుఱ్ఱమును దిగినాడు పెద్దన. ఇంతలో జన ప్రవాహము పొర్లివచ్చిన దా ప్రాంతమునకు. తన గుఱ్ఱము నొకవైపునకు తప్పించి నిలచినాడు. ఆ ప్రవాహమెంత ఉధృతముగవచ్చినదో అంత త్వరగా పోయినది. మొదటి అశ్వికులవరుసలు పెద్దన నధిగమించినవి.

వాద్యములు మేళతాళములు చెవులు గింగురుమనిపించినవి. కొండెము వెలుబాటు చిక్కినది పెద్దనకు. కృష్ణరాయలు ఆ ఊరేగింపులోనున్నారు. అతని దర్శనభాగ్యము తనకు లభింపగలదు. కన్నులింత యొనర్చుకొని చూచుచున్నాడు పెద్దన.

మదగజముపైనున్న అంబారిలోనుండి చూచుచున్న రాయల దృష్టి పెద్దనపై బడినది.

పెద్దన విజయనగరమున కరుదెంచినాడు. అతని ఆనందమున కంతమేలేదు.

అంబారిలోనున్న కృష్ణరాయలపై పెద్దన దృష్టి ప్రసరించినది. ఆతడే ఆంధ్రభూరమానాయకుడు. బంగరు జలతారు నగిషీలుగలి మాణిక్య ధగధగలతో వెలిగిపోయెడు. ఆ కృష్ణరాయలనెట్లా పెద్దన గుర్తింపగలడు? కన్నప్ప పెద్దన మనోపథమునందైన కదలిన పోలికలైన గమనింపడు. కాని ఈ ఉత్సవసమయమున కన్నప్ప గుర్తునకు వచ్చు నవకాశమేమున్నది?

రాయలు వీరమల్లువైపు తిరిగినాడు. అతని ముఖమున ఆనందము వెలిగిపోవుచున్నది. వీరమల్లున కాశ్చర్యమైనది. కారణమూహింపలేక పోయినాడు.

ఏనుగులవరుసలు పెద్దనను దాటిపోయినవి. శ్రీకృష్ణరాయలధివసించిన మదకరీంద్రము పెద్దన కెదురుగా రాచబాటపైకి వచ్చినది.

సర్వాంధ్ర సామ్రాజ్యాధినేత శ్రీకృష్ణరాయల దర్శనభాగ్యము నగరములోని కడుగిడగనే కాకతాళీయముగ లభించినది తనకు. తన కార్యమిక సుఖతరమగును. తనకిక మంచికాలము రావచ్చును.

హఠాత్తుగ పట్టపేనుగు నాపినారు మావటీడు. ఊరేగింపంతయు ఆగిపోయినది. మేళతాళములు నిలచిపోయినవి.

ఏమి జరిగినదో తెలియక దుర్గరక్షకుడు, నగరరక్షకాధ్యక్షుడైన త్ర్యంబకనాయకుడు తన గుఱ్ఱమునెక్కి యచట కరుదెంచినాడు.

ఆ మకరకరీంద్ర మప్పుట నేలయాగినదో పెద్దనకు తెలియలేదు. ఉత్కంఠతతో చూచుచున్నాడాతడు.

మావటీడు రాజాజ్ఞపై ఏనుగునుండి దిగినాడు. మహారాజు ఏనుగు పైనుండి దిగగోరినాడని యర్థమైనదందరకు. వాహనములపైనున్న అధికారు లందరు ముందుగనే వాహనములు దిగి పాదచారులైనారు. ఇంతలో శ్రీకృష్ణరాయలు ఏనుగుపైనుండి దిగినాడు.

ఆ సౌష్ఠవమేమి? ఆతడు దుష్టశిక్షణార్థమవతరించిన సాక్షాత్ శ్రీకృష్ణదేః అట్లే యవభాసించినాడప్పుట.

ఆ దిగిన సార్వభౌముని కన్నార్పక కాంచుచున్నాడు పెద్దన.

శ్రీకృష్ణరాయలు సరాసరి పెద్దనయున్న చెట్టుక్రిందకు నడచినాడు.

అటువైపు చూచిన వీరమల్లున కప్పుడు కన్పించినాడు పెద్దన. విషయమనగతమైనది. ఆతని యానందమున కవధిలేదు. తన ప్రాణస్నేహితుడు ప్రాణగండము నుండి విడివడి తమ్ము కలసికొనినాడు. ఆతని కోరకు రాయలాలోచించని క్షణములేదు.

తనవైపునకే చేతులు జాచుకొని వచ్చుచున్న మహారాజును అట్లే రెప్పలార్పక చూచుచున్నాడు పెద్దన. ఆరూపు చాలిక నెప్పుటనో గాంచి నట్లున్నది. ఎప్పుట? ఏమో-గుర్తులేదు.

ఈ మహారాజు వింతచర్య కందరును విస్తుపోయి చూచుచున్నారు.

"పెద్దనా!" బిగ్గరగా పిలచినాడు కృష్ణరాయలు. ఆకంఠస్వరి మెప్పుటనో వినినది. తనకు సుపరిచితమైన దా స్వరము.ఎప్పుటి దా స్వరము? తానెప్పుట వినినాడు? మహారాజు తననే పిలచినాడు. నిజమా? ఇది కల యేమో? కృష్ణరాయలు తన్నెరుగడు. పెద్దన చేతులు కృష్ణరాయని చేతులందున్నవి.

"పెద్దనా! నన్ను గుర్తింపలేవా? చిరునవ్వుతో ప్రశ్నించినాడు రాయలు. ఆనంద పారవశ్యమున ఆ కన్నుల బాష్పములూరుచున్నవి. ఎవరీ రాయలు? ఆ నడక, ఆ రూపుచాలిక, ఆ కంఠస్వరము ...అన్నియును... పెద్దన కనులముందు కన్నప్ప చిరునవ్వుతో ప్రత్యక్షమైనాడు. ఆతని

హృదయమున కన్నప్ప రాజవేషము ధరించి కృష్ణరాయలై నాఁడు. ఆతని ఆనందము హద్దులు మీరినది.

"కన్నప్ప...... క.. న్న ...ప్ప!" గద్గదస్వరమున పెద్దన పల్కినాఁడు. ఆతని కనులవెంట ఆనందాశ్రుపులు వర్షించినవి.

"కన్నప్ప! అవును ఆనాటి కన్నప్పనే పెద్దనా! నీ కష్టములకు కారకుఁడైన కన్నప్పనే పెద్దనా!" ఆతని స్వరము గద్గదిక చెందినది.

"అట్లననుఁడు మహారాజా! ఒక మంచిపనికి నా తండ్రి సాహసించినాఁడు. అందు విజయము పొందినాఁడు."

పెద్దన హృదయము స్నిగ్ధమైనది. ఆనంద సముద్రమున మునకలు వైచినదా హృదయము.

"నా యనుమానమే నిజమైన నీవును నేనును ధన్యులమే పెద్దనా!" అనిన జగపతి వాక్యము పెద్దన వీనులందు ప్రతిధ్వనించినది.

"అవును ధన్యుడనే"యని దానికి ప్రత్యుత్తరమొసంగినాఁడు పెద్దన కొంచెము బిగ్గరగ.

"ధన్యుఁడవు నీవుగావు పెద్దనా! నిను ప్రాణములతో చూడగల్గిననే నదృష్టవంతుఁడను!" అనినాఁడు రాయలు.

వీరమల్లు ముఖమున ద్యోతకమైన ఉత్సాహము ఆతనికి అంగరక్షక పదవి కల్గిననాఁడుకూడ లేదు. ఆతఁడు పెద్దన గుఱ్ఱముపై చేయి వైచి దువ్వుచు పెద్దనవైపు చూచుచున్నాఁడు. తమ మిత్రుని తమకు చేర్చినదా గుఱ్ఱమేనని యేమో ఆతని యాలోచన.

"పెద్దనా! విజయనగర సామ్రాజ్యాస్థానము నీకు స్వాగత మొసంగుచున్నది. ఇకపై నా ఆస్థానమున ప్రథమకవిగా, పండిత పరీక్షాధికారిగ నా కాంతరంగిక మిత్రునిగా నా జీవితమును ధన్యమొనర్పు పెద్దనా!"

అంతవఱకు తన ప్రక్కనే గుఱ్ఱమును పట్టుకొని నిండుమనస్సులలో నిలచియున్న వీరమల్లుని గాంచలేదు పెద్దన.

రాయలు వెనుదిరిగి త్ర్యంబక నాయకునివైపు జూచినాడ త్ర్యంబక

నాయకుడు తలవంచినాఁడు. ఆతని ఆరోపన నర్థమొనర్చుకొనినట్లు. ఈ సమయమున వీరమల్లు పెద్దన భుజముపై చేయి వైచినాడు.

వెనుదిరిగిన పెద్దనకు ఆశ్చర్యమైనది.

"వీరమల్లు -" పెద్దన ఆతని విగ్గ కౌగిలించికొనినాడు.

ఈ మిత్రత్రయ సమ్మేళన మా ఉత్సవమునకే శోభగొనివచ్చినది.

"రావయ్యా! పెద్దనకవీంద్రా ?' అనుచు పెద్దనచేయి పట్టుకొని నడచినాఁడు రాయలు మదకరీంద్రమువద్దకు?

సేవకుడొకడు పెద్దనగుఱ్ఱము నందుకొనినాడు.

రాయ రేనుగునెక్కినాఁడు. కేలూత యిచ్చి పెద్దన నేనుగపై కెక్కించుకొని తన ప్రక్కయాసీను నొనర్చికొనినాడు. ఏమి తపంబుచేసి జనియించెనొ ఈ ధరణీ దివిజోత్తముంఁడు తొల్లాముని ..అనిన పోతన పద్యము జ్ఞప్తికివచ్చినది పెద్దనకు. తానుకుచేలుడు. రాయలు శ్రీకృష్ణుడు. ఆస్నేహితునివలె ఈ స్నేహితునాదరించి మదకరీంద్రముపై తనకు తనతోడాటు చోటొసగినాఁడు. తన సుస్పష్టమున కవధులులేవు. తనతంద్రి యెట్లున్నాడో? తన భార్య ఉమ! ఆమె యేమైనది? తాను నిర్భాగ్యుడు! వారులేని ఈ సౌఖ్యములెందులకు తనకు ? ఆ హృదయమారాటమందినది. కన్నుల నీరువిరిగినవి.

రాయలు గమనించినాఁడు. "నీ తండ్రిని నీకప్పగించు భారమునాది పెద్దనా ? ఆతడు సుఖుడై నీకొరకెదురు చూచుచున్నాఁడు! కాని అదవాని దుర్గమాతని మరణమునకై అంగలార్చుచున్నది. ఇది రహస్యవిషయ మగుటచే నీకు తొలుతనే తెల్పలేదు." అనినాఁడు రాయలు.

పెద్దన హృదయభారము తగ్గినది. సగముమాత్రమే తగ్గినది.

ఆ ఉత్సవమట్లే సాగిపోయినది. రామాలయ ప్రాంగణమును జేరినది. విజయనగర పట్టణ సౌందర్యగరిమ ఆ పెద్దన శ్రమ నపనయిం చినది. ఆతఁడు తానమరావతి యందున్నట్లూహించినాడు.

ఆలయ రాజమర్యాదలతో స్వాగతమీయబడినది రాయలకు పెద్దన కవీంద్రునితోఁకూడి రాయలు ఆలయ ప్రదక్షిణ మొనర్చినాఁడు. శ్రీరామ విగ్రహము రత్నమాణిక్య కిరీట కాంతినిచయములా గర్భాలయమందలి

చీకటులను, భక్తుల హృదయములనుండి పాపపుచింతలనొకేపర్యాయము ప్రారద్రోలుచున్నని.

భక్తి ప్రపత్తులతో నమస్కరించి తీర్థ ప్రసాదములగొనినా డాతడు.

ఆలయ ప్రాకారమందు నాట్యమందిరమున్నది. అది యూనాని జనులచే క్రిక్కిరిసి యున్నది। మొదటివరుసలో సింహాసనముపై రాయలధివసించినాడు. అతని ప్రక్కనున్న ఉన్నతాసనమున పెదన కూర్చుండినాడు. మంత్రి సామంత దండనాయకులు ఉచితాసనములందున్నారు.

ఎదుట తెరవైచిన నాట్యసానమున్నది.

తెరలో తాళములు మ్రోగినవి. ప్రారన జరిగి యాగినవి. కాలి గజ్జెలు ఘల్లుమనినవి. సభ్యులహృదయ స్పందనములందా రవళి ప్రతిధ్వనించి స్పందనముల నధికాధికము గావించి వారి యుత్సుకతను హిమగిరి సానువులపై నధివసింపజేసినది।

గజ్జెలరవళిలో నొక వేణు నిస్వనము వినవచ్చినది. దానికుప శృతిగా నొక కిన్నెర కంఠము గీతిక నాలపించినది.

తెర తొలిగినది. ప్రేక్షకుల కన్నులు మిరుమిట్లుగొనినవి. సర్వ లోక లావణ్యములు రూపుగట్టి తమముందు నిలచిన అప్సరో భామినుల సౌందర్య గర్వ మణంచుటకై పితామహునిచే సృష్టింప బడిన సౌ దర్య రాసిని తాము గావించుచున్నట్లు భ్రమించినారు వారు. వేయితటిల్లత లొక్కమారు మెరసినట్లయినది వారికి.

నాట్యభంగిమలో మహారాజునకు మ్రొక్కినది. మేఖల మహారాజు ప్రక్కనే యాసనము నధివసించిన నూత్న యువకునిపై కామె వీక్షణములు తిరిగినవి. అతడెంత చక్కనివాడు. ఆమె హృదయము నినదించినది. స్పందించినది. రాగపూర్ణమైనది. మహామంత్రులా యుత్సవమునకు రాలేదు.

తెరలో వేణుధ్వనము తరంగములుగా ప్రవాహమై సభికులను ముంచివైచినది.

మేఖల రాధాప్రణయ మభినయించినది. కృష్ణుడు కన్పించలేదు. ఆమె ఆ నల్లనయ్య కొరకచట యన్వేషించినది. సఖులు పరమాత్మ నన్వేషించు తపోధనులే యైనారు. వేణునాద మాగినది. రాధా హృదయమున విరహమావిర్భవించినది. ఆమె విరహతప్తయైనది. ఆ హృదయబాధను సఖులనుభవించుచున్నారు. తామూరాధకు ప్రతిరూపములైనారు. శ్రీకృష్ణుని దర్శన లేశము కొరకు తహతహలాడుచు కాళిందీ తటమున కృష్ణు నన్వేషించు గోపికలైనారు వారు. వారి హృదయములు మధురభావ మయములు. వారి యాత్మలు పరమాత్మాయత్తములు. వారు విరహతప్తులు. వారి కన్నులు ఆనందాశ్రుసిక్తములు.

పెద్దనకు ఉమాదేవి జ్ఞప్తికి వచ్చినది. అతని హృదయము విరహతప్తమైనది. ఆందోళితమైనది. కంటివెంట కారు నీటినైన తుడుచుకొనలేని స్థితిలో నున్నాడాయన.

రాధా ప్రణయ మాతని కదలించినది. ఉమాప్రణయమును జ్ఞప్తి కెలయించినది. ఈ యువని గమనించిన వారెవ్వరుందరు.

విరహబాధ శిఖరముల నందినది. రాధ తన శరీరము తపించిపోవుట నభినయించినది. ఆమె మూర్ఛాగతయైనది. సభికుల హృదయములు హాహాకారమొనర్చినవి. తెరవాలినది. తామున్నది నాట్యమందిరమందను కొనినారు వారు. విరహ విషాదము నుండి తేరుకొనిన హృదయములు అభినయ చాతుర్య విషయములపైకి మళ్ళినవి. కొంచెము విరామము. ఘంట మ్రోగింపబడినది. ప్రేక్షక సందోహము నిశ్శబ్దమైనది.

పళ్లెరముల బంగారు టంకములుంచి కర్పూర తాంబూలములతో గొనివచ్చినారు వాసీ జనులు. చీని చీనాంబరములు వెలలేని ముత్యాలా పళ్లెములందున్నవి.

మహారాజు తన కిష్టమైన వారినెవరినా బహుమానమిచ్చుటకు నియమించుట యాచారము పూర్వము నుండియు.

అంతవఱకా గౌరవము మహామంత్రులకు లభించెడిది. ఆనాడు తిమ్మరుసు సభయందు లేడు.

మహారాజెవ్వరిని నియమించునో, అంతటి యఖండగౌరవాదరములకెవ్వరు పాత్రమగుదురోయని ప్రేక్షకు లాలోచించుచున్నారు. గోవిందరాజునకు ఆ గౌరవము దక్కునని యనుకొనుచున్నారు కొందరు. తనతో సమానముగ మదకరీంద్రము నెక్కించుకొని వచ్చిన యా బ్రాహ్మణుడీ గౌరవము నందవచ్చు ననుకొనుచున్నారితరులు.

శ్రీకృష్ణదేవరాయలు లేచినాడు.

"పెద్దన కవీశ్వరా! మేఖల నాట్యకౌశల మద్భుతము. ఆమె మనల నే రసలోకములకో గొంపోయి విడచినది. తాము రసగ్రహణపారీణులగు విద్యావేత్తలు. పండితులు. ఆమె నీ బహుమానములచే సత్కరింపుడు. నాట్యోపాసకురాలగు నీ కళాజీవి, కవితోపాసకులగు తమచే బహూకరింపబడుట యదృష్టముగనే భావింపగలదు." అనుచు చిఱునవ్వు నవ్వినాడు రాయలు.

మేఖల ముఖమానంద ప్రపుల్లమైనది. ఆమె నాల్గడుగులు ముందునకు వైచినది. పెద్దన కవీంద్రులకు తలవంచి నమస్కరించినది. పెద్దన కవీంద్రుడు లేచి నిలచినాడు.

"నీ నాట్య మనుపమానము. ప్రేక్షకుల నానంద రసాబ్ధి నోలలాడించిన నీ యభినయ మభినందనీయము. నీ సౌందర్య మనుపమానము. దివ్యాప్సరో భామిని వీవు!" అనుచు ముత్యాల పళ్లెరమును కర్పూర తాంబూలములతో నామె కొసంగినాడు.

ఆమె రెప్పవేయక చూచిన దాతని ముఖమును. ఆమె కన్నులు మిలమిలలాడినవి. పెద్దన దృష్టి యామె దృష్టియందు కలిసినది. అందు నిర్లిప్తత తాండవించినది.

"తమ పొగడ్తను దినదినా యీ విద్యా సౌందర్యములు కృతార్థత ందిన"వనుచు బహుమతి నందుకొనినది మేఖల.

ఒక నూతనాగంతకున కంతటి గౌరవము లభించుట కందరాశ్చర్య మానసులైనారు. కాలమును సూచించు కాహళి మ్రోగినది.

గోవిందరాజు లేచి పెద్దన వద్ద కరుదెంచినాడు.

గోవిందరాజును చూచిన పెద్దన తలవంచి నమస్కరించినాడు.

"అదృష్టవంతుడవు పెద్దనా!" అనుచు నాశీర్వదించినాడు గోవిందరాజు.

"మహారాజులు పెద్దన కాతిథ్య మొసగుటకు నాకు అనుమతి దయచేయుదురా?" గోవిందరాజడిగినాడు.

"అవశ్యము. సేనాపతుల కోరికను మేము కాదందుమా" అనుచు నవ్వినాడు రాయలు.

చొక్కనామాత్యులు గోవిందరాజు నింటనే రహస్యముగ నున్నాడను విషయ మెవ్వరెరుగుదురు?

రాయలు గజము నధిరోహింప, రాజోద్యోగులు తమతమ వాహనముల నధిరోహించి గృహోన్ముఖులైనారు.

చెలియలికట్ట తెగిన మహాసముద్రమైనదా ప్రజాసముద్రము.

# పదునైదు

కృష్ణరాయల యభ్యంతర మందిరమున నొక రహస్య సభ జరిగినది. పెద్దన, చొక్కనామాత్యులు, గోవిందరాజు, తిమ్మరుసు మంత్రి అందున్నారు. వీరమల్లు ప్రధాన అంగరక్షకుడుగా అచ్చట నిలచినాడు.

"మహారాజుల వారికి తెలుపవలసిన విషయ మొకటి ఉదయగిరి రాజ్యమున జరిగినది." అనినాడు పెద్దన.

"ఆ విచారకర విషయమును గమనించుట కీవటకే మన గూఢ చారులరిగినారు. కాని ఫలిత మింతవఱకును తెలియరాలేదు." అనినాడు మహామంత్రి తిమ్మరుసు.

"మహామాత్యులు అనునది నా స్వవిషయము." ఉమ యాతని మనోరథమున మెరసినది. ఆతని ముఖము విచార సంద్రమున వోగినది. తన మిత్రునకు వాటిల్లిన యాపదకా చక్రవర్తి హృదయమే ద్రవించి పోయినది.

తన యేకైక పుత్రుకు జంట విడిన పక్షి యైనాడు. తన కోడలెప్పుట నెన్ని కష్టముల బడుచున్నదో? ఆ సుశీల ప్రాణములతో నున్నదా యను శంకతో చొక్కిన మానసము కటకటబడినది.

"మరి ఆ విషయమేమి పెద్దనా?" హెచ్చరించినాడు తిమ్మరుసు వారి నా భారమగు నాలోచనలనుండి బయటవేయుచు.

"గజపతి కుమార్తె అన్నపూర్ణాదేవి విషయము." పెద్దన యనినాడు.

అన్నపూర్ణాదేవి యనగనే రాయల ముఖమొకింత దీప్తినందినది. వెంటనే యం[illegible] వహించినది.

తిమ్మరుసది గమనించినాడు.

"అన్నపూర్ణాదేవి మహారాజులను ప్రేమించుచున్నది. కాని గజపతులందుల కిష్టపడుటలేదు. అందుల కామె చింతించుచున్నది. విజయనగర గూఢచారిగా బంధింపబడిన నన్నందులకు సహాయపడ వేడినది."

మహారాజు ముఖమున నొక దరహాసము విరిసి విరిగినది.

తిమ్మరుసు ఆలోచనాధీనుడైనాడు.

"మహారాజులు కృష్ణుడు. నేనగ్నిద్యోతనుడనట." పెద్దన యనినాడు.

ఈ పర్యాయము చిరునవ్వు తిమ్మరుసు వంతైనది.

"రాయబారి చక్కగనే కుదిరినాడు కాని రాయబారమేమగునో?" తనలోని శంకను వెలిబుచ్చినాడు మహామంత్రి.

"అగ్నిద్యోతనుని రాయబారము విఫలమైనదా అప్పాజీ?" చిరునగవుతో ననినారు రాయలు.

ఆతని హృదయభావ మర్థమైనది వారికి.

"గజపతులు సామాన్యులు కారు. తమ కిష్టములేని సంబంధమును వారొప్పుకొందురా?"

"మహామంత్రులు నా మనస్సును తెలియగోరుచున్నారా?" రాయలనినాడు.

"పూర్వాపరములు విచారింపక నిర్ణయములు చేసికొనుట ప్రమాద హేతువు కదా మహారాజా?

"ఒకవైపు బీజాపూర్ సుల్తాను యుద్ధ ప్రయత్నములు చేయుచున్నాడు. అళియరామరాయలు ఆతనితో కలియుటకు ఆలోచించుచున్నాడు. అచ్యుతరాయ లొకవైపు రాజధానిలో విప్లవము రేపుటకు సంసిద్ధుడగుచున్నాడు. ఉదయగిరి రాజులు సమయముకొరకు ఎదురుచూచుచున్నారు. ఈ సమయములో ఆలోచించి నిర్ణయములు చేయుట మంచిదికాదా మహారాజా?"

"వలచివచ్చిన కన్యను వదలుకొనుట క్షత్రియ లక్షణమా అప్పాజీ?" ఆ వాక్యమందెంత గంభీరత యున్నదో అంత పట్టుదలయు గోచరించినది తిమ్మరుసునకు.

"తాను వలచిన వానిని విడచి క్షత్రియకన్య మఱియొకని వరించునా? అట్టి క్షత్రియ కన్య మనకు మహారాణి యగుట భాగ్యముకాదా? నిరంతర వైరములతో సతమత మగుచున్న ఈ రెండు రాజ్యములమధ్య ఐకమత్యము నెలకొనుట క్షేమము కదా? కుమతులైన తురుష్కులపైననే దృష్టి సారించుట కప్పుడు మన కనుకూలముకదా?" అనినాడు పెద్దన.

రాజకీయ విషయముల నెవ్వరు తిమ్మరుసు ముందెన్నడు చర్చింపరు. ఆతని ఆజ్ఞలే శిరోధార్యములుగా భావించుట వారి కలవాటైనది. కాని యీతని చొరవ వారికి ఆశ్చర్యమే కలిగించినది.

తన మనసులోని మాటలనే చదువుచున్నాడీతడు. రాజకార్యముల దిద్ది తీర్చుటకు తగిన పదనుగల బుద్ధిమంతుడు ...అనుకొని ఆతని ముఖమును తేరిచూచినాడు తిమ్మరుసు.

గంభీరత సంతరించుకొనిన ఆ ముఖ మేభావమును వ్యక్తమొనర్ప లేదు. ఆవేశ చిహ్నములే లేవు.

చొక్కనామాత్య దొకింత జంకినాడు. అప్పాజీ ఆగ్రహించునేమో నని ఆతని యాశంక.

పెద్దన చొరవ గోవిందరాజున కాశ్చర్యమే కలిగించినది.

తన వివాహ విషయమున పెద్దన యట్లు కల్గించుకొనుట లోలోపల రాయలకు సంతోష కారణమే యైనది.

"నీవు చెప్పిన విషయములనే నాటంక పెట్టుటలేదు పెద్దనా. కాని దానికొకింత వ్యవధి కావలయు ననుటయే నా యభిప్రాయము. విజయనగర కళింగరాజ్యము లొకటితో నొకటి స్నేహముగా నుండిన దక్షిణ హిందూ దేశమునుండి మహమ్మదీయుల నేరివేయుట అతి సులభ కార్యము. కాని...."

"మీ శంకయేమి అప్పాజీ" రాయలు ప్రశ్నించినాడు.

"ఈ వివాహము ఈ రెండు రాజ్యముల మధ్య వైరానలము ప్రజ్వరిల్ల జేయక ఐకమత్యము కల్గించునాయని ?" తన సందేహమును వెలువరించినాడాతడు.

ఈ ప్రశ్న కందరు నిరుత్తరులే. అప్పాజీ మేధస్సు ఎట్లు పని చేయునో గమనించినారు పెద్దన.

"కుమార్తె కిష్టములేని వివాహ మొనర్చి ఆమె జీవితమును నాశన మొనర్చు తండ్రి యుండునా?" తనలో యనుకొనినట్లు పెదన యనినారు.

"క్రుద్ధు లెంతటి పనులొనర్చురు పెదనా ? రాజకీయములందు ర క్తబంధములు పని యొనర్పవని మనమెఱుగమా?" అని నిట్టూర్చినారు మహామంత్రి.

"మహారాజులంతటి వారు కన్యనడిగిన నియ్యనను నంతటి యవివేకియా గజపతి ?" యనినాడు గోవిందరాజు.

"మహారాజుల క్షత్రియత్వమునే శంకించుచున్నాడా గజపతి. అదొక్కటే ఈ సంబంధమున కాటంకము. కాని అన్నపూర్ణ ఈరాజ్యము రాణులలో నొకర్తె కానుండుట దైవనిర్ణయము." అని పెదన యనుటతో రాయల కన్నులు అరుణ కాంతులతో చెన్నారినవి.

"అప్పాజీ! ఇక నా నిర్ణయము. నా వంశగౌరవమునే శంకించిన ఆ మూర్ఖ గజపతి కుమార్తె నాకు భార్యకాక తప్పదు. ఆమె వేరొకనివి వలచి యున్న నేనీ నిర్ణయమునకువచ్చువాడనే కాను. నయపద్ధతిని గాని దండనమునగాని, ఆమె నా అంతఃపురమును జేరవలసినదే. ఆ గజపతి గర్వ మణగిపోవలసినదే. ననువలచి హృదయ మర్పించి తండ్రినే ధిక్కరించి నాతో రాబూనిన కన్యను వదలుట నారాజత్వమునకే లోపము. యుద్ధమో లేక మరియొక పద్ధతియో నిర్ణయించుట మహామంత్రులకే వదలుచున్నాను. పెద్దన భార్య ఉమాదేవిని గొనివచ్చుట ప్రధమ కర్తవ్యము. నా కొఱకై చౌక్కనామాత్యు లీ విధమగు బాధలనందుట నా హృదయమునకు వజ్రాఘాతము. పెద్దన తన భార్యను కోల్పోవుటకు కారణము నేను. ఆతని భార్యతో కూర్పనిది నే నే సుఖముల నొల్లను." అనినాడు రాయలు.

"ప్రభువుల కొఱకు ప్రాణములనే పణముగ బెట్ట సంసిద్ధులమై నప్పుడీ కష్టములొక లెక్కలోనివికావు. ప్రభువులంతటి తీవ్రతర నిర్ణయము లొనర్చుట బాధాకర"మనినాడు చౌక్కనామాత్యుడు.

"చౌక్కనామాత్యులకు మాయందలి ప్రేమ మట్టిది. కాని పెద్దన మనోవ్యథ నర్థమొనర్చుకొనగలను. మహామంత్రులు ఆమెను గొనివచ్చు విషయమై యేమాలోచించుచున్నారో వినగోరుచున్నాము." అనినాడు రాయలు.

"మఱియొక నెల దినములలో గజపతి ఉదయగిరి కరుదెంచుచున్నారు." అనినాడు పెద్దన.

"ప్రేమ విషయమై తెల్పిన యామె తమ యానవాలేమియు నీయలేదా పెద్దనా?" మధ్యలో ప్రశ్నించినాడు మహామంత్రి.

"అది మహారాజుల వద్దనే యున్నది." అనినాడు పెద్దన.

గజపతి నామాంకితమగు ముద్రిక తన వ్రేలినుండి తీసి యొసగినాడు రాయలు. తిమ్మరుసాముద్రిక గొనినాడు.

"మహారాజులు కన్యా కర గ్రహణమే గాక రాజ్యలక్ష్మీ కరగ్రహణము గూడ నీ ముద్రికచే నొనర్పవచ్చును." అనినాడు తిమ్మరుసు.

"అదేమప్పాజీ!" ఆశ్చర్యముతో ననినాడు రాయలు.

"ఈ ముద్రిక కొంతకాలము నా యధీనమందుంచుకొని మహారాజులనుగ్రహింపగల" రనుచు తన యంగీ యందే ఆ ముద్రికను భద్రపరచినాడు అప్పాజీ.

బౌద్ధ సన్యాసి యొకరు మహామంత్రులను చూడగోరుచున్నాడని సేవకు డరుదెంచి తెల్పినాడు.

ఆతడు లోనికి ప్రవేశింపబడినాడు —

బుద్ధం శరణం గచ్ఛామి

ధమ్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి.. అనుచు లోనికరుదెంచి వారినందరకలయ జూచినాడు బౌద్ధసన్యాసి.

"బౌద్ధ గురువుల రాక యెచ్చటనుండియో?" మహామంత్రి యడిగినాడు.

సన్యాసి పెద్దన ముఖమువైపు జూచినాడు. మహారాజా ముఖముపై దృష్టి నిల్పి వెంటనే తిమ్మరుసువైపు చూచినాడు.

"మాకొక చోటులేదు. తూర్పునుండి వచ్చుచున్నాము." అనినాడాతడు.

"ఆతడు మనవాడే. నారాయణా! విశేషములు వివరించు. ఉదయగిరి నుండియేనా రాక?" అనినాడు తిమ్మరుసు.

నారాయణ మహారాజునకు అభివాదన మొనర్చినాడు —

ఉదయగిరి యుద్ధమునకాయత్తమగుచున్నది. ఆనవాని దుర్గము నుండి వచ్చి ఖైదు చేయబడిన కవి ఖైదునుండి తప్పించుకొనినాడు. అతని భార్యను ఉదంఖానుడు అపహరించి ఉదయగిరికి దూరముగ నొక పాడుబడిన కోటలో దాచినాడు. అన్నపూర్ణాదేవి పినతల్లి కుమారుడు ఆనందుడు ఉమాదేవి కొరకు వెదకుచున్నాడు. నంది తిమ్మన ఆనతికి

సహకారి. ఆమె ఉనికిని వ్రాసిన పత్రము నొకదానిని తిమ్మన యింట విడిచినాను. మఱునాడు దానిని ఉద్దంఖానుని వసతి కన్గొనినాడు. రహస్యముగ ఆమె అంతఃపురమునకు చేర్పబడినది. తమ్మెవరు మోసగించుచున్నారో తెలియక ఉద్దంఖానుడు నిప్పులు త్రొక్కినట్లు ఎగురుచున్నాడు.

"బిజాపూరు సుల్తాను తనపై వెడలివచ్చునని రామరాయలు గజపతికి కబురు పంపినాడు. ఆతడొక నెల దినములలో ఉదయగిరికి రాగలడట. బిజాపూరు సుల్తానునకు సహాయ మొనర్చుటకు రహస్యముగ కోటవాకిండ్లు తెఱచుటకు జయించిన తర్వాత ఉద్దంఖానుని ఉదయగిరి రాజు నొనర్చుటకు వారిమధ్య రాయబారములు జరుగుచున్నవి."

"అదవాని దుర్గ విశేషములేమి నారాయణా? లింగరాజు లేడా ?"

"వచ్చినాడు. తిమ్మన అచ్యుతరాయలతో సంప్రదించుటకు వీరశ్యాముని పంపునట నేటి రేపట. చొక్కనామాత్యుని మరణమునకై అదవాని దుర్గ మాక్రోశించుచున్నది. జగపతి బోధనలచే గరిడీశాలలోని ఏబది మంది యువకులు విజయనగరమునకు రహస్య ప్రయాణమును గట్టుచున్నారు."

"పెద్దన విషయమేమైన తెలిసినదా ?" మహామంత్రి యడిగినాడు.

"అదియే తెలియని విషయము" అనినాడు నారాయణ.

అందఱి ముఖములపై చిఱునవ్వు తాండవించినది. నారాయణ కొంచె మాశ్చర్యముచెంది తేరుకొనినాడు. పెద్దన ముఖమువై పొక సువిశిత దృష్టి బరపినాడు. ఆతని ముఖముపై నొక హాసరేఖ యువ్వతిల్లి యంతరించినది

"ఇక నీ వేగవచ్చును నారాయణా! రేపు సాయంత్రము నా గృహమునకు త్ర్యంబక నాయకునితో రావలయును."

మహారాజులకు నమస్కరించి నారాయణ యరగినాడు.

"మహామంత్రులు చారచక్షువులు. నా హృదయ మొకింత స్వస్థత నందినది. ఆమె నిటకు గొనివచ్చుటనుగూర్చి తా మాలోచింపవలయును." అనినాడు రాయలు.

"మహారాజులు ఉదయగిరి ముట్టడి కరుగుదురా? లేక నగరమందుండి విప్లవమును అణగించెదరా? సెలవీయవలయును." అనినాడు తిమ్మరుసు.

"విప్లవ మెచ్చటనుండి వచ్చును? నాయకు లెవరు? వారి నిప్పుడే తుదముట్టించివైతుము." అనినాడు క్రోధముతో రాయలు.

"రేపటి శ్రీరామనవమి వైష్ణవుల కతి పర్వదినము. అనాడు తిరుగుబా టొనర్పవలెనని వారి యుద్దేశ్యము."

"తిరుగుబాటు నాయకులెవరు?" క్రోధముతో యనినాడు రాయలు.

"రాజశేఖరుడు, అక్కప్పనాయకుడు, ఎల్లప్పనాయకుడు. వీరు సైన్యములతో తిరుగుబాటు నొనర్తురు. అచ్యుతరాయలును, తిమ్మరాయల మేనమామ నరవరరాజును నాయకత్వము వహింతురు."

"ఏ రూపమున తిరుగుబాటు జరుగునో తెలిసికొనవచ్చునా?" గోవిందరాజు ప్రశ్నించినాడు.

"అది యింకను మేము నిర్ణయించుకొనలేదు." అనినాడు తిమ్మరుసు.

అందరు నవ్వినారు.

"మహారాజు లంతకు నాలుదినములముందు ఉదయగిరి ముట్టడికై బయలుదేరుదురు. రెండుదినములు ప్రయాణ మొనర్చి తిరిగి వెనుకకు ససైన్యముగావచ్చి విప్లవకారుల తుదముట్టించి తాము ఉదయగిరి ముట్టడి మానుకొనినామని ప్రకటింపవచ్చును. తరువాత వారము దినములకు పెద్దనతో బయలుదేరి వెళ్ళి ఉదయగిరి దుర్గమును ముట్టడించి స్వాధీన మొనర్చుకొని కామినీకరగ్రహణ మొనర్పగలరు." అనినాడు తిమ్మరుసు.

"మఱి ఉమాదేవినిగూర్చి తెల్పియుండలేదు. అంతవఱ కామె నందితిమ్మన యింటనుండుట శ్రేయస్కరముగా భావించుచున్నారా ?"

"ఆమె ఈ లోపలనే యిక్కడకు చేరుటకు ప్రయత్నము సిద్ధమైనది. కాని ఆమె పెద్దన యనుమతిలేనిది కదలదు. విజయునే అందులకు నియోగింపదలచినాను."

"విజయు డెక్కడనున్నాడు?" పెద్దన ప్రశ్నించినాడు.

"నా గూఢచార శాఖలోనున్నాడు. ప్రస్తుత ముదయగిరియందే యున్నాడాతడు. నారాయణ అతని నట వదలి వచ్చినాడు."

## పదునారు

పెద్దనా చొక్కనామాత్యులకొక గృహము ప్రత్యేకింపబడినది. దాసదాసీలతో నింపబడిన యాగృహ మొక రాజభవనము. పెద్దనకిప్పు డే కొమవయు లేదు. ఉమాదేవి లేని లోటా గృహమున కొట్టవచ్చినట్లు కన్పించుచున్నది.

తనయుని గాంచిన చొక్కనామాత్యుని హృదయము విషాదపూరిత మగును. తనలోని విషాదము ఆవేదనలను కన్పించకుండ ప్రయత్నించును పెద్దన. అంచోళన ఆతని ముఖమందు ముద్రవేసికొని కన్పించును చొక్కనకు.

తాన భార్య అప్పుట నెట్లున్నదో? ఆమె తిమ్మకవంద్రుని గృహ మందుండిన భయములేదు. కాని తాను స్వయముగా తన భార్యకొఱకై పోవుటకు మహామంత్రు లొప్పుకొనుటలేదు. ఏదో రాజకీయమును మనమునందుంచుకొనియే ఆతడట్లనుచుండవచ్చును. తన తండ్రి ఉమ విషయమై మిక్కిలి బాధపడుచున్నాడు. తన భార్యను తాను రక్షించుకొనుటకు పోగూడదేమి? తనకీ నిర్బంధ మెందులకు? ఉదయగిరి తానే పోయిన? తాను కారాగారమునుండి తప్పించుకొని వచ్చినాడు. వెంటనే తనను ఖైదు చేయుదురు. ఉద్దండఖానుని ఆట కట్టించవలయుననిన పోకుండుటయే పద్ధతి.

ఆమె నందితిమ్మన గృహమందున్నట్లు తెలుసుకొనిన ఆతురుడుక్క దూరకొనునా? మహామంత్రుల యాలోచనమేమో?

ఒక దాసి వచ్చి నమస్కరించి నిలచినది.

ఆమె ఒక లేఖను పెద్దన చేతియందుంచినది.

పెద్దన యందుకొనినాడు. కస్తూరి జవ్వాజి వాసనల వెదజిమ్మినదా కమ్మ. విప్పినాడు పెద్దన.

"అల్లసాని పెద్దనామాత్యుల దివ్యసన్నిధికి.

దేవదాసి మేఖల విన్నపములు.

స్వామీ!

ఆనాడు నాట్యావసానమున బహుమతీ ప్రదాన మొనర్చి నా నాట్యమును గొనియాడినారు. తాము కవులు, పండితులు, సరసహృదయులు. కాని నా హృదయమున సాహిత్యమున నొకింత కృషి సలుపవలెననెడి కోరిక ఎన్నాళ్ళనుండియో యభివృద్ధి చెందుచున్నది. మిమ్ము గాంచిన యనంతర మా వాంఛ పుష్పింప నారంభించినది. శిష్యురాలిగా నన్నను గ్రహించి సేవాశుశ్రూష లొనర్చుకొను భాగ్యమును కల్గించ ప్రార్థించుచున్నాను. తమవంటి రసజ్ఞులు మెచ్చిన నా సంగీత నాట్యములకు సాహిత్యమును జోడింపజేసి నను ధన్యురాలి నొనర్పగలరు. ఈ నా చిరు వాంఛను నిరాకరింపకుందురుగాక. ఈనాటి ప్రారంభ వసంతోదయోత్సవమునకు తాము మా గృహమును పావన మొనర్ప వేడుచున్నాను. ఇట్లు-

—దేవదాసి, మేఖల.

ఈ లేఖ ఆతని కాశ్చర్యము నినుమడింపజేసినది ఆమెను తన సన్నిధానమం దుంచుకొనుట అతని కేమియో భారమనిపించినది. స్త్రీ సన్నిధానము హృదయ నవనీతము దరికి అగ్నిని తెచ్చుటవంటిది. అందున మేఖల వారకాంత. జను లేమనుకొందురు? తన తండ్రి యేమనును? తాను నిర్లిప్తుడుగా నుండగలడు. కాని అది పద్ధతికాదు.

తన భార్య జ్ఞప్తికి వచ్చినది.

శిష్యరిక మొనర్పగోరిన ఆమె వాంఛను నిరాకరించుట తన మనో దౌర్బల్యతను మాత్రమే సూచించును. అందున ఆమె సోదరి మద్దునాగ రాయల ప్రియురాలు. ఈమెను తిరస్కరించిన రాయల కాగ్రహ మీయామె కలింపకలదు. ఈ చిన్న విషయమును పురస్కరించుకొని రాయలు తనపై నాగ్రహించునా? ఏమో? స్త్రీలెంత జేయజాలరు?

చొక్కనామాత్యు లటువచ్చినారు. ఆలోచనాధీనమైన ఆతని మానసమును గమనించినాడు చొక్కన.

"పెద్దనా!" చొక్కనలోని యాందోళనను వ్యక్తపరచినది ఆ పిలుపు.

పెద్దన తలయెత్తి చూచినాడు. ఆ లేఖను తండ్రి చేతియందుంచినాడు పెద్దన.

చొక్కనామాత్యు డది చదివినాడు. "నీ యనుమానమేమి పెద్దనా ?"

"ఆమె అత్యంత సౌందర్యవతి. విలాసిని" అనినాడు పెద్దన.

"శిష్యురాలు గాగోరుచున్నది గదా?"

"ఆశిష్యత్వ మంగీకార యోగ్యమా ?"

"ఏల కాకూడదు నాయనా? బిడ్డవలె భావించి శిష్యురాలిగా స్వీకరించుటలో దోషమేముండును?"

"లోకము మెచ్చునా ?

"లోకమేమనినను మన నిర్మలతపై నాధారపడియుండునయ్యా. మన హృదయము కళంకితము కానంతవరకు లోకమునకు జడియవలసిన అవసరమేమి పెద్దనా ?"

"నా హృదయ మీ విషయమున విముఖముగా నున్నదేలనో కాని ఆమె ముద్దునాగ సోదరి."

"అగునదియు నాలోచింపవలసిన విషయమే. రాయలకు మనపై నాగ్రహము కలునేమో ?"

"రాయలట్టి వాడని నే నంగీకరింపను." అనినాడు పెద్దన.

"ఇన్ని విషయము లేలనయ్యా! విద్యాభిక్ష కోరిన వారిని నిరాకరించుట ధర్మమేకాదు. ఆమె నంగీకరించుటలో నవిష్ట మేమియులేదు పెద్దనా!"

"చిత్తము" అనినాడు పెద్దన.

"ఈ దినము అచ్యుతరాయలతో సంభాషించుటకు వీరశ్యాము దరు దెంచునట. రహస్య వార్తను పంపినాడు జగపతి పావురము ద్వారా."

"మన పావురము లిచ్చట నున్నవా నాన్నా?"

"వచ్చునప్పుడు రెంటిని కొనివచ్చినాను. నీ యాగమనమును తెల్పుచు జగపతి కంపాక దానిని కమ్మ వ్రాసి యంపినాను. దానితో నీ రహస్య వార్తను దెల్పుచు మరియొక పావురమునుగూడ పంపినాడు జగపతి. గరిడీశాలయందలి సభ్యులందఱికు రెండు మూడు దినములలో చేరగలరనియు వ్రాసినాడు."

"అట్లయిన నిచ్చట మరియొక మల్లయుద్ధశాల నేర్పరచుట యవసరమేమో?" యనినాడు పెద్దన.

"అగు నీ విషయములు తెల్పుటకై తిమ్మరుసు గృహమున కరిగివత్తు"నని వెడలినాడు చొక్కన.

మేఖల యుత్తరమును మరొక్కమారు పఠించినాడు పెద్దన.

పెద్దన పల్యంకిక మేఖల యింటిముందాగినది.

అది వారకాంతా గృహమా? కాదు రాజభవనమును దలపించు చున్నది. ఆ గృహోపకరణము లా యలంకారములా కుడ్య చిత్రము లవి యొక దేవేంద్రలోకమునే దలపింప జేయుచున్నది.

ముద్దునాగ భవనమూ వేశ్య వాటికలలోని భవనము లన్నింటికంటె గొప్పది. రాజభవనము తర్వాత నంతటి భవనము విజయనగరముననే గానము.

ఆ వీధియం దెన్నో ఉన్నత సౌధములున్నవి. వానికి విశాల ప్రాంగణము లున్నవి. గృహములకుముందు పెద్ద ఉద్యానవనములు తరులతా కిసలయములతో, వాపీ తటాకములతో, జలక్రీడా సరోవరములతో నిండియున్నవి. అందందు చలువ పందిళ్ళు పొదరిండ్లు చలువరాతి మండపములు జంటగా కూర్చుండుటకు తగిన ఆసనము లందందు కలవు.

ఆనాటి వారకాంతలు సర్వకళా కుశలలు, విదుషీమణులు, కవిత్వ తత్త్వప్రవర్తకలు. వెలయాండ్రనుట వారి యాభిజాత్యమునకే యవమానము. వేశ్యకాంతలలో మహా భక్తురాండ్రున్నారు. యోగిని భోగిని మధ్య యంతరమును శూన్యముగా సూచించినాడు ధూర్జటికవి.

[illegible] ఆనాటి వేశ్యవాటికలలో [illegible] కందరికును సంతోషప్రదమే.

"[illegible]"

అది న్యూనత నాపాదింపకపోగా నొక యౌన్నత్యమునే గొనిరాగలదు. అంతటి కళాశాస్త్రవేత్తలగు వారితో సహచర్యము న్యూనతగా భావించున దెవరు? ఆ వాటికకు దసకాపతంములగు కవులు గాయకులేకాదు. నీతి విదులు, శిష్టాచార సంపన్నులు, రాజకీయాగ్రణులు, సేనాపతులు, సామంతులు, మహారాజులే చనుచుండినిన ఆనాటి వేశ్యలు వెలయారా? వారి యౌన్నత్యము న్యూనమైనదా? వారివృత్తి ఇతరుల నానందింపజేయుటయే గాదు. రాజకీయముల ప్రవర్తింపజేయుటలోగూడ వారికి భాగమున్నది. అవి నటవిట గాయిక తండములనేగాక రాజకీయ ప్రపంచమునకు గూడ ఉల్లాసము నొసంగు కేంద్రములు.

ముద్దునాగ యెదురు వచ్చినది. ఆమెకు గర్వములేదు. కావ్య నాటక పురాణేతిహాసముల జదివిన ప్రోఢ. నాట్యశాస్త్ర మామెకు కరతలామలకము. అలంకార శాస్త్రమందు నిధి. ఆమె రాయలకు భోగిని. ఇతర సమయములందు యోగిని. అన్ని విషయములందామె యుండును. కాని నిర్లిప్తత యామెలోని భాగము. ఆమె సర్వసామాన్యముగ నందఱ సమ్మోహింపజేయును. ఆమెలోని ఆకర్షణ మట్టిది. ఆమె యాత్మనిగ్రహముకూడ నట్టిదే.

"కవీంద్రులు దయచేయుటచే మా గృహము పావనమైనది" అన్నది నాగ. పెద్దన ధీరగంభీరముగా నామెవైపు చూచినాడు. ఆ చూపులందు నిర్మోహత్వమే కలదు.

తనను రాయలు కవీంద్రా యనును. ఈమెతో యదని యనుచున్నది. అనుకొనినాడు పెద్దన.

మేఖల యట కరుదెంచినది. పెద్దనను గాంచినది. ఆమె తేమో సిగ్గయినది. నాగ తీరు వేరు. మేఖల పద్ధతి వేరు. అది గోదావరివలె ఒడ్డులొరసి పారెడి మహాప్రవాహము. ఇది కొండలపై క్రిందికి దుముకు సన్నటి దైన సెలయేరు. ఇందు ఉధృత మెక్కువ. అందు గాంభీర్య మెంచు. సర్వమును తనలో లయించుకొను శక్తి మహాప్రవాహమునకున్నది. సర్వమును నెట్టివేయు శక్తి దీనికి కలదు.

ఆమె పెద్దన యెదుట నిల్చినది. నాట్యభంగిమలో నమస్కరించినది. అజంతా సుందరశిల్ప ప్రతిమను దలపించినది.

కళ్యాణ ప్రాప్తిరస్తని దీవించినాడు చేయెత్తి పెద్దన.

ఆ యాకారముననే తనివితీర గాంచుచున్నది మేఖల.

ముద్దునాగ గమనించినది.

మేఖల హృదయమున నింతకు పూర్వములేని వికార మొండు జనించినది. ఆ పస్పుని దేహము ఆ గౌరకన్నులలోని తేజ మామెను చక్కిలిగింత లిడినవి. ఆమె హృదయ కుసుమము వికసించి సుగంధముల వెదజల్లినవి. ఆమె శరీరమున పులక లుద్భవిల్లినవి.

"మా గృహమును గాంచి కవీశ్వరు లేమాలోచించుచున్నారు?" ముద్దునాగ ప్రశ్నించినది.

ఒక్కొక్కరే పురుషులు అచ్చటకు చేరుట మొదలగుచున్నది.

స్త్రీలుకూడ వచ్చుచున్నారు. వారంత రచ్చటచ్చట తిన్నెలపై కూర్చొని యిష్టాగోష్ఠు లాడుచున్నారు.

ఆ ప్రశ్నకు పెద్దన జవాబీయలేదు.

అతని కంతయు క్రొత్తయైనది. తానెఱిగిన వారొక్క రిచ్చట లేరు. ముద్దునాగ అతని చేయిపట్టుకొని లోనికి నడపించుకొనిపోయి పట్టుపరుపులు పరచబడిన ఒక సింహాసనమున అతని నుపవిష్టు నొనర్చినది. అగరు వాసించు అగ్నికరండ మొకటి యా ప్రదేశమును ధూమావృత మొనర్చుచున్నది. సభాసదులకు పరిచారికలు పచ్చకప్పురపు విడెము లందించుచున్నారు.

మేఖల యొక సువర్ణభాండము నొయ్యారముగ చంక నిడుకొని వచ్చిన దక్కడకు. ఆ భాండము నిండుగ వసంతమున్నది. ఆ వసంతమును ప్రథమముగ నచ్చటి గున్నమామిడిపై జల్లి తరువాత తనంతవచ్చి కోరిన యువతిపై ప్రారంభోత్సవ మొనర్చువారు చల్లుదురు.

ఆ భాండము పెద్దన ముందిడినది మేఖల.

ఇంతలో మహారాజా రాయలచ్చటకు వచ్చుచున్న సూచనలైనవి.

"జయ మూరు రాయ రగండా - జయ
జయ వీరకృష్ణదేవరాయ మహీపాలా- జయ" అనునినాదములతో రాయ లటకు విచ్చేసినాడు.

ఆసనములందున్న వారెల్లరు వినీతులై నిలచినారు.

స్త్రీలెల్ల రొకవైపు నిలచినారు. పెద్దనార్యుడా సింహాసనము ప్రక్క నిలువబడినాడు.

తానిక్కడ రాయలకంటబడుట యాతనికేమో కష్టమైనది. ఆందోళన కలిగినది.

"కానిమ్ము పెద్దన కవీంద్రా! ఉత్సవ మాగరాదు." అనుచు అచ్చట కరుదెంచినాడు రాయలు.

ముద్దునాగ నమస్కరించినది - మేఖల నమస్కరించి చిఱునవ్వులతో పల్కరించినది.

ఆ సువర్ణభాండమున నొక లేత మామిడిమండ యున్నది. ఆ మండనట్లే వసంతమున ముంచి లేమావిగున్నపై చల్లినాడు పెద్దన. గున్న ప్రక్కనేనిలువబడిన మేఖలపై కొన్ని వసంతపు చినుకులు పడినవి.

ఆమె కన్నులింత యొనర్చుకొని చూచినది పెద్దనను.

రాయలు నవ్వినాడు.

"పెద్దనా, యెట్లున్నదీ వేశ్యలవాడ?" ప్రశ్నించినాడు రాయలు.

"ప్రభువు లొక్క వేశ్యలను గూర్చియే చెప్పమందురా? మిగిలిన యందఱను గూర్చియునా?"

"ప్రభువులకంతటి పక్షపాతము వేశ్యలపైలేదు. అందఱుగూర్చి చెప్పినప్పుడు మావిషయమును ముడువవచ్చును" అనినది ముద్దునాగ.

"మాకీ పట్టణమే యలకా పట్టణమును తలపించుచున్నది.

అచటి విప్రులు మెచ్చ రఖిల విద్యాప్రౌఢి
ముదిమది దప్పిన మొదటివేల్పు,
నచటిరాజులు బంటునంపి భార్గవునైన

బింకాన బిలిపింతు రంకమునకు,
అచటి మేటి కిరాటు లలకాధిపతినైన
మునుసంచి మొదలిచ్చి మనుపదక్షు
లచటి నాలవజాతి హాలముఖ్య రవిభూతి
నాది భిక్షువు భైక్షమైన మాన్పు.

సన్నని సెలయేరు రాళ్ళపై పరువెత్తునపుడొనర్చెడు మణిమంజీరములా పెద్దన గొంతున ధ్వనించినవి. తన్మయుడై వినినాడు రాయలు.

"ఆగినావేమి పెద్దనా?" రాయలనినాడు.

"అచటి వెలయాండ్రు రంభాదులైన నొరయ
గాసెగొంగున వారించి గడపగలరు
నాట్యరేఖా కళాధురంధర విరూఢి
నచట బుట్టిన జిగురు గొమ్మైన జేవ.

మేఖల కన్నులు సిగ్గుతో వ్రాలినవి.

ముద్దునాగ ఉత్సాహియై వినినదా పద్యమును. కాని ఆమె ముఖమొకింత విచారమును సూచించినది.

సభాసదులు సంతోషముతో కరతాళములు సరిచినారు.

వెలయాండ్రనుట ముద్దునాగ విచారమునకు కారణమని గ్రహించినాడు రాయలు.

"మేఖలా కవిగారికి సదుపాయములన్నియు చూడు"మని రాయలతో కేళీవనమున నొకవెపునకు పోయినది నాగ.

మిగిలినవారు విడిపోయినారు.

మేఖలా పెద్దనలు మిగిలినారు.

ఆమె సౌందర్యవతి, విలాసిని, ఆమె చూచెడి ప్రతి చూపులో నేదో క్రొత్తదన మాతనికి కన్పించుచున్నది.

"నీకు సాహిత్యోపాసనానర్ప కోరికగల్గుట సంతోషింపదగినది." మాటాడుటకేమియులేక యనినాడు పెద్దన.

"అవునుస్వామీ! నన్ను మీశిష్యురాలిగ అంగీకరించి సేవాభాగ్యమొసంగిన నాజన్మ తరింపగలదు."

ఈ వాక్యము లాతనిలో నాలోచనమును రేపినవి.

ఆమె ఒక విడెము పెద్దన చేతనుంచినది. విటులచేత విడెముంచుట వేశ్యాలక్షణము.

దాని నతడు పశ్చిమందుంచినాడు.

ఆమె హృదయము చివుక్కుమనినది. కన్నులెత్తి పెద్దనవైపు జూచినది. ఆ చూపు దీనముగనున్నది.

"కవీంద్రులు నాహృదయమును గ్రహించినా రనుకొందును." మేఖల అనినది.

నీయందలి ఆసక్తి నిన్ను త్వరలో సాహిత్యమందు నిష్ణాతురాలిగా నొనర్పగలదు. వినిపించుకొననట్లే యనినాడు పెద్దన.

"నా హృదయాసక్తిని మీరుగుర్తింపలేరా కవీంద్రా?" ఆమె ప్రశ్నించినది.

"నీవేమేమి శాస్త్రములలో పరిశ్రమ మొనర్చినావు?" ప్రశ్నించినాడు పెద్దన.

"శాస్త్రములన్నిటిలో కామశాస్త్రము నాకభిమాన శాస్త్రము. మీవద్ద నేను ఆ శాస్త్రమర్మముల గ్రహింప గోరుచున్నాను." ఆమెకు నవ్వు వచ్చినది. ఆ చిఱునవ్వు ముఖములోనికి రక్తము నురికించి రాగ రంజితమొనర్చినది. ఆ ముఖమందలి కామాసక్తిని పెద్దన గమనించినాడు,

"ఇదేమి శిష్యత్వము? ఇక తానచ్చట నుండుట ప్రమాదహేతువు. తానేకపత్నీవ్రతుడు. తన ఉమకు తానన్యాయమెనర్పలేడు. ఆతని కన్నుల ముందు ఉమ రూపము మెదలినది. అతడు కన్నులు మూసికొనినాడు.

"కవీంద్రా!" మేఖల పిలచినది.

ఆతడు కనులు తెఱచినాడు. సమాధివీడిన యోగియే యైనాడాతడు. మేఖలకే జాలివేసినది ఆ బ్రాహ్మణ యువకునిగూర్చి.

"కవీంద్రా! మేము వెలయాండ్రము.' అనినది మేఖల.

"కాని మీపాదముల సేవనే నేను వాంఛించుచున్నాను" అనికూడ యనినది, ఆమె గొంతు జీరవోయినది. పురుషుని కామభిక్ష నర్థించుట

స్త్రీలోకమున కరుదుగానగు అనుభవము. ఆమె పురుషుల నెఱుగును. ఇది క్రొత్త యనుభూతి.

"నిక్కము దాచుట నాకిష్టమైనది కాదు. మీ మీద నా హృదయము చిక్కినది. నన్ను మన్మధు బారికప్పగించుటో లేక పూపొదరిండ్లలో కౌగిట గారవించుటో చేయవలయును కవీంద్రా!" యని మేఖల పెద్దనకు దగ్గఱగా నిలచినది.

గమగమ వలచు చొక్కపు జవాజీవాసన లా బ్రాహ్మణప్రవరుని నాసాపుటముల బ్రవేశించినవి. ఆతనిలో నొక వికార ముదయించినది.

"నావలన పొందగోరిన శాస్త్రజ్ఞాన మిదియేనా?" ఒకింత కఠిన ముగా ప్రశ్నించినాడు పెద్దన.

"నాట్యమునాడే మీ రూపము నన్నాకట్టుకొనినది స్వామీ! నే నా భావము నణంచుకొన ప్రయత్నించి విఫలనై నాను. నే నేమొనర్పగలను స్వామీ, అబలను!" అనినది మేఖల.

ఆమెలోని మోహపుగాఢతను గమనించినాడు పెద్దన. రాయలు తమ నచ్చేల నొంటరిగా వదలిపోయినాడు. వసంతోత్సవమిషతో తన్ను రప్పించుటలోని యాంతర్య మిదియే కాబోలును? పెద్దన యాలోచించు చున్నాడు.

"వలచివచ్చిన వనితను నిరాకరించుట ధర్మమా స్వామీ!"

ఆమెలోని నిస్పృహయంతయు ఆ వాక్యమున గూడుకట్టుకొనినది.

"నే పత్నీయుతుడను మేఖలా!" అనినాడు పెద్దన.

"భార్యాయుతులకు మా పొందు నిషిద్ధమా కవీంద్రా! ఈ సామంతు లీ మహారాజులందఱకు భార్యలకు కొదువా?" ఎదురుప్రశ్న వైచినది మేఖల.

"తనభార్య పరపురుషుని జూడరాదనుకొను పురుషుడు తా నేల పరస్త్రీని వాంఛింపవలయునో? అదేటిధర్మమో నా కరముగాలేదు. పత్నీ ప్రేమ యమున దొక్కసారి యొక్కచోటనే. దాని నిన్నివిధముల విభ జింప వలనుపడునా?"

"మీకు నమాధాన మీగలుగుదాననా స్వామీ? ఇది యానందము

ఆనందానుభవమున నొకయంగము స్త్రీ. అట్లుకానినా డీ వేశ్యావాటికలు పాడుబడిపోవలసినవే."

"పవిత్రమగు గృహస్థధర్మముద్వారా లభించెడి యానందము మోక్షప్రదము. ఈ తుచ్ఛసుఖములు మీనాలపై తేనెలు. రసానుభవసిద్ధి కివి మార్గములే గావు." అనినాడు పెద్దన.

అతని నిగ్రహ, మాతనియూహ లా హృదయనైర్మల్య మెట్టిదో యవగాహనమైనది ఆమెకు. ఇట్టిపురుషునితో సన్నిహితత్వముగల స్త్రీ భాగ్యవతికదా!

"నే నందగత్తెనుగానా? కళాకుశలత నాయందేమైన తక్కువపడెనా! ఇంతటి నిరాకరణమునకు నా యదృష్టమే కారణమా స్వామీ?" కంట నీరొలికించినది మేఖల.

"నిను కష్టపెట్టినందులకు విచారమగుచున్నది మేఖలా. నా హృదయ మీ తగులములకు విముఖము. నే భోగవిముఖుడను గాను! కాని ధర్మబాహ్యములగు నీ తగులములు ఇహపర దుఃఖసాధనములని నా యభిప్రాయము. నాకు ప్రాణాధికమైనది నా భార్య. ఆమె నా యర్ధాంగి. తన సర్వస్వము భర్తకొసంకర్పించిన ఆమెను వంచించి తుచ్ఛమైన కామగత మార్గములను భోగములని యనుకొని యనుభవించుట ఆత్మవంచనము గాకేమి?" యనినాడు పెద్దన.

'తన నీతడు తిరస్కరించుచున్నాడా? అట్లగుపించుటలేదు. భార్య యందలి ప్రేమతో నీత డిట్లనుచున్నాడా? ఆమె లేనందుల కీతడు దుఃఖించుట లేదు. ఈత డెంతటి నిర్మోహుడు. అయిన స్త్రీస్పర్శ ఎంతవానినేని మార్చజాలదా? ఈత డనుకొనునంత సులభముగా వదలునదా స్త్రీ!' అనుకొనినది మేఖల.

"ఈ కప్పురపు విడెమైన గ్రహింపరాదా! స్త్రీ తనంత దా వలచి వచ్చిన ఏరికైన చుల్కనగదా స్వామీ!" గద్గదకంఠియై యనిన దామేఖల.

కప్పురవిడె మందుకొన చేయిచాచినా డా పెద్దన. ఆ కరపద్మమందు తన హస్తమును కప్పురవిడెముతోకూడ నుంచినది మేఖల, అతని కను పాపలోనికి జూచుచు: స్త్రీస్పర్శ అతని అంతరాంతరముల సంచలనము

రేపినది. ఆతని హృదయ మొకింత యూగిసలాడినది. రక్త మా శరీర మున ఉవ్వెత్తుగ ప్రసరించి కలతరేపినది. ఆత డామెవైపు జూచినాడు. ఆమె కామార్త. ఆతనిలోని సంచలనము గమనించిన దా స్త్రీ. తన స్పర్శ ఆతని రెచ్చగొట్టినది. ఇక నాతడు తననుండి తప్పించుకొనలేడు. స్త్రీ స్పర్శ తగలనంతవఱకే ధర్మపన్నములు. ఆతని హస్తమునుండి తన చేతి నామె తీయలేదు. ఇది యవకాశము. ఆమె పెద్దనను పెనవైచుకొనినది. ఇప్పు డామెలోని స్త్రీత్వము సహస్రముఖముల విజృంభించినది. పెద్దన లోని పురుషత్వము తిరుగబడినది.

ఈమె తన నేమొనర్చుచున్నది! తాను పతితుడగుచున్నాడు. ఉమ కన్నీటితో ఆతనిముందు నిలచినది. ఆతడు నిలద్రొక్కుకొనినాడు. మహా వృక్షమును లతవలె మేఖల యాతని బెనవైచుకొనుచున్నది. ఇంకను యింకను ఆతనిలో లయించిపోవలెననునది యామె ఆకాంక్షగా తోచినది.

"హుం!" అనినా డా పెద్దన. తన నాక్రమించుకొనుచుండిన యా తరుణీమణిని విదలించివైచినాడు. పట్టుపరుపుపై ఆలంబనములేని లేదీగ వలె పడిపోయినదామె.

ఆత డా సమయమున దుర్నిరీక్ష్యుడు. ఆ పడిపోయిన స్త్రీపై పొక్కపర్యాయము జూచినాడాతడు. పెద్దపెద్ద అంగలతో ఆమెను వదలి ఆవలికరిగినాడు.

తనకొరకు నిరీక్షించుచున్నారు సేవకులు పాలకితో. దానిలో నెక్కినాడు పెద్దన. పల్యంకిక నెత్తినారు సేవకులు. బరువై కలతజెందిన హృదయముతో గృహమును సేరినాడు.

తా నోడిపోయినది. ఆత డేటిపురుషుడు! లొంగుచున్నట్లు కలత జెందినట్లు కన్పించుటచే తా నట్లు సాహసమొనర్చినది. తన సాహస మిట్లు విఫలమైనది. తనకొఱకు పడిగాపులున్నారు పురుషులు. ఈత డొక యోగి. తనప్రవర్తన మిపుడు తనకే లజ్జాకరమైనట్లు కన్పించినది. ఎంతటి పురుషు వైన లొంగదీయగల ననుకొనిన తనగర్వ మిప్పుడు పతనమై పునాది లేకుండ పోయినది. కాని తనలోని నిరాశ! ఆతనిపై తనకేల క్రోధము

కలదేమి? తన కవమానముగాదా యిది? తన ధర్మము తాను నిర్వహించు కొనినా డా నిర్మలరూపుడు.

ఆమె కన్నుల నీరు తిరిగినది. దిండుపై ముఖముంచి ఒక్క క్షణము కన్నుమూసిన వా నిరాశా నిస్పృహాలతో బరువగు బాధనందు చున్న ఆ యోషామణి.

రాయలొకవైపున నాగ యొకవైపున నిలచినా రా సింహాసనము నకు. ప్రక్కనున్న సంహాసనముపై నిశ్శబ్దముగగూర్చుండినాడు రాయలు.

ముద్దునాగ చెల్లెలి శిరముపై చేయివేసినది. ఆమె తలయెత్తి అక్క వైపు జూచినది. ఆమె కన్నులనుండి నీరు ముత్యాలవలె రాలి దిండును తడిపినది.

"నీ చెల్లె లోడినది నాగా!" యనినాడు రాయలు.

"ఒక ప్రయత్నమునకే ఓటమిని మే మంగీకరింపము మహారాజా!"

"నా పెద్దన నిర్మోహుండని నే నుడువలేదా భామినీ! అతడు తాత్కాలి కానందమునకై అఱ్ఱులుచాచువాడు కాడు." చిఱునవ్వుతో ననినాడు రాయలు.

మొగమెత్తి రాయలవైపు జూచినది మేఖల.

"మతొక ప్రయత్నముంద్రైన నతడు లొంగిపోవక తప్పదు మహా రాజా? మీరీ పందెమునుమాత్రము గెల్చుకొనలేరు" అనినది ముద్దునాగ.

"అక్కా!" నెమ్మదిగా ననినది మేఖల.

"మా పెద్దనపై క్రోధముగల్గుచున్నదా మేఖలా?" ప్రశ్నించినాడు రాయలు.

"లేదు ప్రభూ! ఆ సరస్వతీపుత్రునిపై ఆ ధర్మతత్పరునిపై కోపము కల్గిన నాకిక జన్మించ గతులుండునా? అతని నిస్సంగత్వము కాంచిన కొలది దాసిగానైన ఆతని సేవజేయ తహతహలాడుచున్నది నాదు హృదయము."

"ప్రశంసనీయమైనవి నీ భావనలు. అతినిర్మలమై పల్లవ కోమల మైనది నీ హృదయము మేఖలా! నీ వాంఛితము కొలదికాలములోనే

తీర్చుకొనగలవు" అనుచుండగా రాయల కన్నులందు ఆనందపు మెఱపులే మెఱసినవి.

ఆశ్చర్యముగ నంతవఱకు జూచుచున్నది ముద్దునాగ మేఖలను. "ఈతదేమి ప్రవరాఖ్యుడువలె నున్నాడే!" యనినది నాగ.

"ఏ ప్రవరాఖ్యుడు? మార్కండేయ పురాణమందలి ప్రవరాఖ్యుడా నాగా? మేఖల వరూధినియే! చక్కని పోలికయే. కాని యామె మోహ పరవశయై అతని పొందుగోరి తిరస్కరింపబడినది. కాని ఈమె అతని పొందు తిరస్కరింపబడిన యనంతరము మోహపరవశయైనది."

ఆ ప్రభు వాలోచనలో బడినాడు. అతనియూహ లెంతయో దూర మఱిగినవి. అతని కన్నుల నానందప్రవాహము వెల్లివిరిసినది.

"ప్రభువుల యానంద మెందులకో?" చిఱుకోపముతో ప్రశ్నించి నది ముద్దునాగ.

"నీ యోటమికన్న పెద్దనకవీంద్రుని ధర్మ కర్మదీక్ష నాయానంద కారణము నాగా! కాని పెద్దనకవీంద్రుని కొక యనుభవమును కల్పించి అతని సాహిత్యకృషికి తోడ్పడిన నిన్నభినందింపక తప్పదు."

"మహారాజుల భావమేమో నా కర్థముగాలేదు!" విస్మయముతో ననినది ముద్దునాగ.

మేఖల ముఖ మెఱ్ఱబడినది. "ప్రభువులు నా విఫల ప్రణయమును గ్రంథస్థ మొనర్పజేయుదురాయేమి?" అనినది.

చిఱునవ్వు నవ్వినాడు రాయలు. "మేఖలా నీయం దొక భారము నుంచుచున్నాను. పెద్దన కుపకారకమైన దది."

"ఏమది ప్రభూ?" ప్రశ్నించినది నాగ.

"పెద్దన యుదయగిరి కోటనుండి ఒక స్త్రీచేత తప్పింపబడినాడు. ఆమె నా పాణిగ్రహణ మభిలషించినది."

"గజపతులపుత్రిక అన్నపూర్ణయా స్వామీ?" నాగ ప్రశ్నించినది.

"అవును. పెద్దన పలాయనమునకు పూటగా ఆతని భార్యను వారు విడుదల జేయుట కొప్పుకొనలేదు. పెద్దన స్వయముగావచ్చిన ఆమెను విడుదలజేతు మనినారట. నందితిమ్మన యింటనున్న పెద్దనభార్య గృహ

నిర్బంధమం దున్నదట. నీవు ఆమె నెట్లయిన తప్పింపజేసి తీసికొని రావలయును"

"అన్నపూర్ణాదేవి కొాక సందేశమును గొనిపోవలయును" అని నది చిఱునవ్వుతో ముద్దునాగ.

"నాగా! నీ వీర్ష్యపడుచున్నావా?" చిఱునగవుతో ప్రశ్నించినాడు రాయలు.

"నా కీర్ష్యయేమి స్వామీ! తమ యనుగ్రహము నానుండి తొలగ నంతవఱకు తా మెందఱుభార్యల భరించినను నా కీర్ష్యలేదు. ఈర్ష్యాద్వేషములు నన్నంటవు. ఈ శరీర మీ ప్రాణమ్మే తమకై పణముపెట్టిన నా కేవిషయమునకైన ఈర్ష్యాసూయలు కల్గు నవకాశమెక్కడిది ప్రభూ!" యనియది ముద్దునాగ.

రాయలు తృప్తిగా నామెవైపు చూచినాడు.

"అన్నపూర్ణను కొనినచ్చుటకు దండయాత్రను జరుప సిద్ధమగుచున్నాడు రాయలు పెద్దన యీవిషయమును దెల్పినాడను సంగతి అన్నపూర్ణకు తెలియజేయవలయును మేఖలా. విజయుడు నీకు సహకారి కాగలడు" అనినాడు రాయలు.

"అంతకంటే నే నొనర్పగల కార్య మేమున్నది ప్రభూ!" యని నది మేఖల.

## పదునేడు

దూరామునుండి సన్నని శంఖారావము వినవైనది. దాని వెను వెంటనే సభా భవనమున నిశ్శబ్దమలమికొనినది.

ఆనాడు రాయలు తన ద్వితీయ దండయాత్రను ప్రకటించునని

కొండయు నాయకులెరుగుదురు. అర్వీటి బుక్కరాజు. కోనమంత్రి. నాదెండ్ల గోపమంత్రి తమ తమ యాసనములందున్నారు. రాయసం కొండమరుసు రాయల కార్యకర్త. మంత్రులలో నొకడు. తిమ్మరుసు ప్రక్కనే యుపవిష్టుడైనాడు. కామానాయకుడు, లేపానాయకుడు, రాజధాని ప్రాంతసేనాని నరవర, చిన్నప్పనాయకుడు, మల్లప్పనాయకుడు, ఆదెప్పనాయకుడు ఆనాటి సభలో నున్నారు.

ఆదవాని దుర్గ నాయకుడు సేనాపతులలో నొకడైన అజపర్క తిమ్మన మాత్రమానాటి సభకురాలేదు.

సర్వ సేనాధిపతి గోవిందరాజు, ఉప సేనాపతి నాగమనాయకుడు ఉన్నతాసనములపై నున్నారు.

చొక్కానామాత్యుడేలనో సభకురాలేదు. అల్లసాని పెద్దన తిమ్మరుసు సింహాసనము ప్రాంతముననే ఉన్నతాసనమున నున్నాడు.

గంభీరమగు శంఖారావమొకటి రెండవ పర్యాయము వినిపించినది. సభలో నిశ్శబ్దమావహించినది. దూరమునుండి —

"మహారాజాధిరాజ రాజపరమేశ్వర పరాకు,
మూరురాయరగండ పరాకు,
అరిరాయ విభాండ పరాకు,
అష్టదిక్కురాయ మనోభయంకర పరాకు,
భాషగెతప్పువ రాయరగండ పరాకు,
పూర్వ దక్షిణ పశ్చిమ సకలసముద్రాధీశ్వర పరాకు,

వందిమాగధులు బరాబరు లొనర్చుచుండ మదకరీంద్రమును దిగి రాయలు సభలోనికరుదెంచినాడు.

లేచినిలచిన సభికులు రాయలు సింహాసనాసీనుడైనంతనే తమ స్థానములందు కూర్చొనినారు.

సామంతులు సేనాపతులు ఒక్కొక్కరే మహారాజ పాదపీఠమున శిరసు గదియించి మ్రొక్కి వైదొలగినారు.

అజపర్క తిమ్మన సభకు రాలేదను విషయమును సభా సంవిధానకుడు నగరాధ్యక్షుడు త్ర్యంబకనాయకుడు రాయలకు నివేదించినాడు.

సభకు రాని కారణమును నివేదించుచు తన ప్రతినిధిని పంపుట, మహారాజా విజ్ఞప్తిని మన్నించుట ఆచారము. కాని తిమ్మన చర్య విపరీతముగానున్నది.

"ఈ సామంతుని చర్య విపరీతము. ఇది మమ్మవమాన పరచుటగా భావించుచున్నాము!" ఎఱ్ఱవారిన కన్నులతో ననినాడు రాయలు.

"పంపిన ప్రతినిధి ఏ కారణముచేతనైన సభకు రాజాలకపోయి నాడేమో ప్రభువులాలోచింపవచ్చును. సభపూర్తియగువఱకెవ్వరును రాకున్న నప్పుడు మీరు సామంతుని యవిధేయతను నిర్ణయింప వచ్చును!" మహారాజ సోదరుడు అచ్యుతరాయలనినాడు.

"సరి. ఈ విషయము చివరన నిర్ణయించుటకు నిశ్చయించినాము" రాయలు సౌమ్యమూర్తి యైనాడు.

"ఉదయగిరి గజపతుల యకార్యములు మేరమీరిపోవుచున్నవి. మన భూభాగములు తమ సోదరుల కాలమునుండియు వారి యధీనమున నున్నవి. వానినప్పగింపుడని కోరిన వారు తిరస్కరించినారు. విమతులగు మహమ్మదీయులతో పొత్తు వారి మతాభిమానమును గూడ పతనమొనర్చి నది. మహమ్మదీయులలో బీజపూరు సుల్తాను ఆదిల్‌షా సహాయ ముతో గజపతి మనపైనెత్తి వచ్చుటకు ప్రయత్నములు సల్పుచున్నారు. అందుచే ఉదయగిరి దండయాత్రా విషయమై మహారాజులాలోచించుటకు కోరుచున్నాను." అని విరమించినాడు మహామంత్రి తిమ్మరసు.

"మా హృదయము పై ఉదయగిరి దుర్గమున లంకెపడియున్నది. మరణించిన మా సోదరులు శ్రీ వీరనరసింహరాయల మరణశాసనమున మా రాజ్యభాగమైన ఉదయగిరి దుర్గము, రాయచూరు దుర్గములు శత్రువు లన్యాయముగ నాక్రమించినట్లు వ్రాయబడినది. హిందూ మతోద్ధరణకై కంకణము కట్టుకొనిన, అందులకై స్థాపింపబడిన ఈ రాజ్యభాగమందు యవనుల ఆగడములు సాగనీయమనుట మీకు తెలిసినదే.

"రాయచూరు దుర్గమును ముట్టడించుట ఉదయగిరిని లోగొనుట ఒకే పర్యాయము జరుగవలసిన కార్యములుగా మేమూతలంచుచున్నాము.

"ఉదయగిరి దండయాత్రకు తగు ముహూర్తములు ఆస్థానజ్యోతిష్యులు నిర్ణయింప గోరుచున్నాము". అని గంభీరముగ పల్కినాడు రాయలు.

ఆస్థాన జ్యోతిష్యులు చతుర్వేది రామాదీక్షితులు కొద్దిసేపు లెక్కలు వైచినారు.— "చైత్రశుద్ధ పంచమి దండయాత్రకు సర్వ శుభమైన పుణ్యదినము. ఆదినమున బయలుదేరిన ఓటమియనునట్టిది కల్గుట దుర్ఘటము."

"శ్రీరామ నవమీ ఉత్సవమునకు మహారాజులు లేకుండుట సంప్రదాయము కాదుగదా ?" తన సందేహమును వెలిబుచ్చినాడు తిమ్మరుసు మంత్రి.

"మఱి దగ్గఱలో అంతకంటె మంచిముహూర్తములేదు. సర్వ విజయ కారకమగు ముహూర్తమును వదలుకొనుట నా కిష్టములేదు !" అనినాడు జ్యోతిష్యుడు.

మహామంత్రుల వాక్యమును వ్యతిరేకించునంతటి బలమీతని కెక్కడనుండి వచ్చినదా యనునది సభలో గుసగుసలకు కారణమైనది.

వేత్రహస్తులు సభను నిశ్శబ్దమొనర్చినారు.

"ఆస్థాన జ్యోతిష్యుల నిర్ణయము ప్రకారము సర్వసేనలకు మేమే ఆధిపత్యము వహించి ఉదయగిరి ముట్టడిని జరుపదలచినాము. అందులకు చైత్రశుద్ధ పంచమినే నిర్ణయించినాము. సేనాధిపతులందరు తమతమ సైన్యములతో దండయాత్రకు సిద్ధముకావలయునని మాకోరిక."

"రాజశేఖర నాయకులు, అక్కప్పనాయకులు, మల్లప్ప నాయకులు తమ సేనలలో సగము దండయాత్రార్థముపంపి మిగిలిన సేనలతో నగరప్రాంతాధ్యక్షులు నరవరరాజుతో నగరరక్షణ మొనర్ప గోరుచున్నాము."

"మాస్థానమున మేములేని కాలమున మాసోదరులు అచ్యుత దేవరాయలు నగరరక్షణ భారమును వహింపగలరు."

అచ్యుతదేవరాయల కాశ్చర్యమైనది. ఈ నియోగము దైవ ప్రేరితమా? రాయల స్థానమున తనను నియోగించిన ఈ నిర్ణయము దైవప్రేరితమే. ఈ నిర్ణయము తాత్కాలికముగాదు. సిరమైనదే. ఆతని ముఖమున నొక సంతోషచిహ్న ముదయించి చిఱునవ్వుగా మారి యంత రించినది.

తిమ్మరుసు మంత్రి గమనించినాడది.

రాజశేఖరనాయకుడు. అక్కప్పనాయకుడు, మల్లప్పనాయకుడు, మహారాజు నానతిని చిత్తమనిరి.

నరవరరాజు తన సమ్మతిని తెలియజేసినాడు.

అచ్యుతరాయడు నిలచినాడు.

"మహారాజులు తమతో మమ్ముకూడ యుద్ధమున కాహ్వానించునను కొంటిమి. కాని యింతటి గురుతరమైన కార్యభారము వహించవలసి వచ్చుననుకొనలేము.

"సోదరప్రేమతో వారప్పగించిన ఈ బాధ్యత నే దలనాల్చి నెఱవేర్చుటకు ప్రయత్నింతును."

సభ్యులు హర్షధ్వానము గొనర్చినారు.

"ఈ దండయాత్రా శుభసమయమున నొక తగినవానిని సేనాపతిగా నొనర్చుట యాచారము. ఈదినమట్లు నిర్ణయింపదగిన వారిరువురు మా హృదయమున భాసించినారు. మాతోబాటె కష్టముల బంచుకొని మాకొఱకు కష్టములనందిన వీరుదైన మాస్నేహితుడు ఇంతకుమునుపే ఆస్థానకవి పదమందిన పెద్దనామాత్యుడిక పెద్దన దండనాయకుడగును" అనుచు పెద్దనపై పుచూచి చిఱునవ్వు పసరించినాడు శ్రీ కృష్ణరాయులు.

తన కాపదవి వచ్చునని యనుకొని యుండలేదు పెద్దన. ఊహించని గౌరవమది. రాయలకు తనపై నేలనంత గౌరవము? అతని స్నేహమెంతటి నిష్కల్మషము. ఆతనికెందులకో ఆవేగము కలిగినది.

నిర్మలముగ కవిత్వ రసానుభూతిలో దేలవలయుననుకొనిన తనకీ బాధ్యతలెందులకు?

సర్వసేనాధిపతి గోవిందరాజు రత్నములు దాపిన ఒరగల ఖడ్గమును. సైన్యాధిపతి దుస్తులను. దండనాయకబిరుదచిహ్నమును పళ్ళెరమందిడి రాయలవద్ద నునుచినాడు. రాయలది చేత గ్రహించినాడు.

"పెద్దన దండనాయకా! ఈ పదవి మీకు భారముగా దోచినను మాకు మీరొసన్చిన సహాయము ముందిది యల్పముగనే భావించు చున్నాము."

పెద్దన లేచినాడు. ఆ మూర్తి మత్వమేమి! ఆ తేజోమయరూపము సభికులను ముగ్ధులగావించినది.

పెద్దన నమస్కరించి చేయిజాపినాడు. రత్నసగిత ఖడ్గమును పెద్దన చేతులం దిడినాడు రాయలు. సేనాపతి చిహ్నమున నాతని నలంక రించినాడు.

"ప్రభువులసేవలో ప్రాణములనైన నర్పించుట కీసేవకుడెప్పుడును సంసిద్ధుడు." అనుచు పెద్దన సేనాపతిగా ప్రమాణ మొనర్చినాడు.

"పెద్దన కవీంద్రా! అలనాడు మరణించినాడనుకొనిన కృష్ణ రాయల కొటకంగలార్చుచు ఆతని రక్షణకొఱకు రాజీవాక్షుని వేడుకొనుచు నీవు ప్రార్థించిన పద్యము నాకిప్పుడు వినినట్లున్నది. ఆ పద్యమునకు ఆ నాటి నీ సుస్నిగ్ధ హృదయమునకు తగిన యుపాయనము కాదది."

"మహారాజా చేతి కెముక లేదు పెద్దనా" యనిన కొండోజీ పలుకు లాతని చెవుల ప్రతిధ్వనించినవి. రాయల ప్రక్కనే ఖడ్గధారియై నిలచిన కొండోజి ముఖమువైపు జూచినాడు పెద్దన.

ఆతడు చిఱునవ్వులు చిలుకరించుచు నిలిచినాడు —

నా మాటలు నిజమేనన్నట్లున్న దాతని చిఱునవ్వు.

మన ఊహలన్నియు నిజమగుచున్నవి పెద్దనా యనినట్లు వీరమల్లు పెదవులపై హాసరేఖ యుదయించియంతరించినది.

"ఏ మాలోచించుచున్నావు పెద్దనామాత్యా!" ఆతని తండ్రిని బిలచెడి విధముగ బిలచినాడిప్పుడు రాయలు.

పెద్దన వర్తమానమున కరుదెంచినాడు.

"ప్రభువుల యనుగ్రహమునకు మేరలేదు."

ఆ పద్యమేమియో వినవలయునని కోరినారు సభ్యులు. సభలో నొక యలజడి కల్గినది.

"సభ్యుల కోరికపై ఆ పద్యము నిట విన్పింతువా పెద్దన కవీంద్రా!"

"ఉదయగిరి ప్రభువుల వశమగునందాక నా కవిత్వము నొకచో దాచుమని మహామంత్రులాజ్ఞ నిడినారు. కాని ప్రభువుల యాజ్ఞ మీరరానిది!"

సుమధుర కంఠమెత్తి పద్యమును విన్పించినాడు పెద్దన కవి చంద్రుడు. భక్తి భావావేశముతో వినినాడు రాయలు.

తన్మయులే యైనారు సభికులు. ఇక రెండవ సేనాపతి కాబోవున దెవరనునది వారి యాలోచన.

"సైన్యాధిపత్యముతోబాటు పెద్దన దండనాధునకు నగర రక్షణ బాధ్యతను ఒప్పగింపగోరుచున్నాము." అనినాడు మహామంత్రి.

"ప్రస్తుతము నిర్ణయించిన సేనాపతులందులకు చాలుదురు. ప్రస్తుతము పెద్దనకు నిర్ణయింపదగినబాధ్యత వేరేయున్నది మహామంత్రీ!" యనినాడు రాయలు.

"ఏమిది! మహామంత్రులపై రాయల కాగ్రహము జనించినదా? లేనియెడల యీ విపరీత ధోరణి ఏమి? అప్పాజీ వాక్యమునకు తిరుగు లేనిదీనాడాతని కన్ని విషయముల రాయలు వ్యతిరేకమునే యొనర్చినాడు!"

సభయంతయు గుజగుజలు వోయినది. అచ్యుతరాయలకిది యంతయు నేదియో ఇంద్రజాలముగనున్నది. తిరుగుబాటు నొనర్ప బూనిన నాయకుల కీ చిహ్నములు అనుకూలముగ భాసించినవి.

"బిజాపూరుసుల్తాను ఇస్మయిల్ ఆదిల్షాఅధీనమందున్న రాయచూరు దుర్గమును ముట్టడించి వశపఱచుకొని రాగలవారెవరు? వారీ రత్నముల పిడిబాకునందుకొనగలరు." అనుచు తన మొలలోని కైజారును చేతికి తీసికొనినాడు రాయలు.

సభలోని సేనాపతులొక్క క్షణ మాలోచించినారు.

సర్వసేనాపతి గోవిందరాజు మొదలుగువారలకు ఉదయగిరి ముట్టడికి ఆయత్తులు కమ్మని ఆజ్ఞయైనంతన వారూరకున్నారు.

సభామధ్యమునుండి యిరువదేడుల యువకుడొకడు లేచినిలచినాడు.

ఆ యువకునిలోని యంత మేమి? మూర్తీభవించిన రాజత్వమున్నది ఆ నడకలో.

"ఇందుబింబమున్ కిమ్మన నీదు మోము. గిరిశ్రేపులు మూపులు కౌనుకానరా దమ్మక చెల్లవాని వికచాంబకముల్, శతపత్ర జైత్రముల్" అనిన కవివాక్య మాతనికి సరిపోవుచున్నది.

ముగ్ధుడై యాతని మోమును పలకించినాడు రాయలు. గంభీరముగ గడలివచ్చు సింహ కిశోరమును జపి తెలియించినాడా యువకుడు.

తన ప్రక్కనుండి. ధీర గంభీర గమనముతో రాయల జేరబోవు చున్న తన కుమారుని నీరు నిండిన కన్నులతో జూచుచున్నాడా యువకుని తండ్రి.

రాయలపాదమూలమున తనశిరమునుగదియించి మ్రొక్కినాడాతడు—

"రాయచూరు దుర్గమును నా ప్రాణములనైన వెచ్చించి సాధించి, కొని తెచ్చుటకు తమ పాదములంటి ప్రతిజ్ఞ నొనర్చుచున్నాను" అని నాడా యువకుడు.

ఈ బాలుడేమి? ఎందుకో అలవిగాని రాయచూరు దుర్గమును సాధించుటేమి? ఏమో! ఎవ్వనియందే శక్తి యిమిడియున్నదో! ఆ తేజస్వి కప జయమగునని యెవ్వరనగలరు?

రాయ లానందహ్రదమున మునకలు వైచినాడు. ఆతడు కోరుకొని సేనాపతి నొనర్ప బూనిన యువకు డతడే.

తగినవాడే తన దృష్టికివచ్చినాడు. ఆతని హృదయ మందెన్ని యాలోచనలో రేకెత్తి యణగిపోయినవి.

"యువకుడా! నీధైర్యము ప్రశంసనీయము ప్రయత్నించి నీ ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనుము. నీవంటివారలే ప్రస్తుత మీ విజయనగర రాజ్యభారమును భరించుటకు కావలసినవారు." అనుచు తన పచ్చల పిడి బాకు నాదరపూర్వకముగ ఆ యువకుని హస్తములందుంచినాడు.

అతి వినీతుడై యందుకొనినాడా రాజప్రసాదమును ఆ యువక వీరుడు.

తొలిచూపునందే రాయల యనుగ్రహమునంతగా చూరగొనిన, అత్యున్నత బహుమానమైన రాయల కైజారును కొనిన ఆ యువకుడెవరు? ఆతడే భావి విజయనగర రాజ్యాధిపతిగా ప్రసిద్ధికెక్కిన రామరాయలు.

సైన్యాధిపతి ఖడ్గమును, దుస్తులను గోవిందరాజందీయ మహారాజు రామరాయల కొసంగినాడు. అతడు రాజఠీవితో వాని నందుకొనినాడు.

అనుకొనిన విధముగా తన కుమారునకు లంభించిన అఖండ గౌరవమునకు ఆనందబాష్పములు రాలుచున్న కన్నులను తుడుచుకొని నాడు - ఆర్వీటి బుక్కరాయలు.

"మా సోదరులు అచ్యుతరాయలవినతిపై నింతవఱకు ఆజపర్క తిమ్మన విషయ మూపినారము. ఆ సామంతుడు మమ్ము ధిక్కరింపబూని నట్లుగా దీనిని పరిగణించుచున్నారము. మా ఉదయగిరి ముట్టడిలో వల తిమ్మన వచ్చి యపరాధమునొప్పుకొని మమ్ముశరణుగోరిన సరియే, లేకున్న మాసోదరులచ్యుతరాయలే సైన్యాధిపతియై తిమ్మనపై నెత్తి పోయి అతని రాజ్యమును కైవసమొనర్చుకొని అతని గొనివచ్చుటయో లేక హతమొనర్చుటయో జరుపవలయును" అనినాడు రాయలు.

అచ్యుత రాయలకిది యాఘాతమైయైనది, తమ వ్రేలుతో తమ కన్నునే పొడవయత్నించుచున్నారా వీరు? అనుకొనుచు తిమ్మరుసు వైపు చూచినాడు. ఆ ముఖమున మార్పులేదు. అనుకొనకుండగనే, 'చిత్త' మనినాడు అచ్యుతరాయలు. సభావసానమును సూచించు ఘంట మ్రోగినది.

## పదునెనిమిది

పెద్దన తిమ్మరుసు రహస్యాగారమున కరుదెంచునప్పటికి మహా మంత్రి ఆలోచనావ్యగ్రుడై యున్నాడు. త్ర్యంబకనాయకుడొక యాస నముపైనున్నాడు. అప్పుడా మహామేధావిని బలుకరించుటకే జంకినాడు పెద్దన.

పెద్దన తిమ్మరుసునకు నమస్కరింప, నాతడు చేయెత్తి దీవించి నాడు. తిరిగి ఆలోచనాధీనుడైన మహామంత్రిని జూచుచు పెద్దన అచ్చటి యొక యాసనమం దుపవిష్టుడైనాడు.

కొన్ని క్షణములు గడిచినవి.

"పెద్దనా! మల్లయుద్ధశాలలో నెంతమంది యువకులున్నారు? వారేయే యాయుధ పరిశ్రమల నెఱుగుదురు?" నిదుర మేల్కొనినవాని వలె ప్రశ్నించినాడు తిమ్మరుసు.

"ఆదవానినుండి యరుదెంచిన ఏబదిమంది యువకులుగాక నింకను వేయిమంది యువకులున్నారు. వారిని దళములుగా విభజించి ఆదవాని యువకులను నాయకులుగా నియమించినాను."

"ద్రోహబుద్ధిగలవారిందు లేరని నమ్మకమేగదా పెద్దనా?"

"అవసరమైన ప్రాణము లీయగల స్థితిలోనున్నారు వారు. ఖడ్గము నందు వారు నిపుణులు, బాణ విద్యలో కుశలురు." అనినాడు పెద్దన.

ప్రస్తుతమునకీ రెండును చాలును. విప్లవదినమున అంతఃపుర రక్షణము వీరితో నొనర్పగలవా పెద్దనా?"

"అవశ్యము చేయగలను. కాని రాజధానిలోని సైన్యములన్నియు నొక్కటియైన?"

"అయిదారువేల సైన్యము రహస్యద్వారముగుండ విరూపాక్షాల యములోనికి వచ్చునేర్పాటు నొనర్చినాను."

"తాము రాజధానిలో నుందురుగదా?" పెద్దన తన యనుమానమును బయల్పరచినాడు.

"లేదు పెద్దనా! నే రాజధానిలోనుండిన తిరుగుబాటు నొనర్పుటయే జరుగదు. రాజధానిలోనున్న నీ విషాంకురముల నేరివేయుట కింతకన్న వేఱు మార్గములేదు, ముందుగ మనమే వారిపై చర్య తీసికొనిన ప్రజా నీకము దృష్టిలో మన మధర్మపరుల మగుదుము. అందువలన కొంచెము కష్టమైనను ఈ త్రోవనే పోవుటకు నిర్ణయించుకొనినాను." తన నిర్ణయ మును వివరించినాడు తిమ్మరుసు.

"పెద్దన సైన్యముతో కృష్ణరాయలు దండయాత్ర కరిగినతరి వీరు

రాజధాని నాక్రమించినను మహారాజుతోడి యుద్ధము తప్పునా ? వీరి యాలోచనలోని ఆంతర్యము బోధపడకున్నది!" పెద్దన తనయనుమానము వెల్లడించినాడు.

అగును. వారి ధైర్యమేమి? వారి కపుడెవరు సహాయము వత్తురు ? పెద్దన తీక్ష్ణదృష్టికి మహామంత్రి సంతోషపడినాడు. ఆ విషయమై తానాలోచింపలేదు. తిమ్మన తన సైన్యమునేమైన పంపుచున్నాడా ? అటు పోవు బిజాపుర సైన్య మిటు వచ్చునా ?....తిమ్మరుసు ఆలోచనమున బడినాడు.

"ఎన్ని సైన్యములు ఎవరివి వచ్చినను బాధలేదు, పెద్దనా ? అవసరమనుకొనిన నేనే రహస్య దళముతో పురములోనికి రాగలను. అంతఃపురరక్షణ బాధ్యతను మాత్రము నీపైనుంచి పోవుచున్నాను." అని నాడు తిమ్మరుసు.

"ప్రాణములనైన నొడ్డి అంతఃపురమును రక్షింపగలను." తన నిశ్చయమును విన్పించినాడు పెద్దన.

"ప్రస్తుతము రాయలకుమార్తె తిరుమలాంబిక విషయమై జాగరూకత అవసరము. ఆమెను రాయల వారసురాలిగా దలచువారున్నారు. శ్రీరామనవమి దినముననే విప్లవము జరుగును. ఎట్లు జరుగునో తెలియదు. అచ్యుతరాయలందు పాల్గొనడు. నిర్లిప్తుడై నిరీక్షించును. నరవరరాజు మాత్రమందు ప్రధాన నాయకత్వము వహించును."

కొద్ది కాలమటనుండి పెద్దన మహామంత్రుల యనుజ్ఞగైకొని బయలుదేరినాడు. తనపై నుంపబడిన భారము తాను నిర్వహింపగల్గినదా యనునది ఆతని శంక.

చైత్రశుద్ధ పంచమినాడు రాయలు ఉదయగిరిదండయాత్రా సేవమున ససైన్యుడై కోటదాటి యరిగినాడు. తిమ్మరుసా మహారాజు వెంట నరిగినాడు.

నరవరరాజు తిరుగుబాటునకు నాయకత్వము వహించినాడు. రాజశేఖరనాయకుడు, అక్కప్పనాయకుడు, తమ తమ సేనలతో రాజధానిని వశపరచుకొన ప్రయత్నించినారు. అనుకొనని ఈ విపరీతమునకు

ప్రజలు ఆశ్చర్యావిష్టులైనారు. ఆగ్రహమందినారు. చేతికందిన ఆయుధములతో నా సైన్యముపై తిరుగబడినారు. కొందరు వధింపబడినారు. అంతఃపుర రక్షణమున నప్రమత్తుడైనాడు పెద్దన దండనాథుడు. మల్లయుద్ధశాలలోని వేయిమంది యువకులును అంతఃపురమున అభేద్యమగు కోటవలె నిలచినారు. ఎచ్చట జూచిన తానయై పెద్దన తిరుగుబాటుదారులను హతమార్చుచున్నాడు.

అచ్యుతరాయలకు జై యనుచు సైనికులు కేకలువైచుచు అంతఃపురము గోడను త్రవ్వివేయ సంకల్పించినారు. నరవర యాజ్ఞయైనది. కాని గోడదరికి వచ్చుట వారి కలవియేకాలేదు. మధ్యాహ్నముదాక ల్లే యుద్ధము జరిగినది. తిరుమలదేవి అంతఃపురమునందలి సైనికులను పురికొల్పుచున్నది. ఏమైనను వేలమందితోకూడిన నరవర సైన్యమును ప్రతిఘటించుట కష్టమగుచున్నది. కొంత తిరుగుబాటు సైన్యము ఆయుధాగారమును ముట్టడించినది. త్ర్యంబకనాయకుని సైన్యమచట వారిని ప్రతిఘటించినది. ఏమైనను పరిస్థితులు విషమించునట్లుతోచినది త్ర్యంబకనాయకునకు. రహస్యస్థానముననున్న మహామంత్రికి వార్త యందింపబడినది. ఐదువేల సైన్యము లోనికి ప్రవేశపెట్టబడినది. అంతఃపురము వద్దనున్న సైన్యము ముట్టడింపబడినది. అచ్యుతరాయల స్వంత సైన్యము కూడ తిరుగుబాటునందు పాల్గొనినది. ఆతనిగృహము ముట్టడింపబడినది. అచ్యుతరాయలు బంధితుడైనాడు.

మహామంత్రి నాయకత్వమున సైన్యము తమ్ము ముట్టడించుట కాంచగనే తామెట్లు వంచింపబడినారో గ్రహించినాడు నరవర. ఆతడు నిస్పృహనందినాడు. ఈయవినయమునకు శిక్ష మరణమని యాతడెఱుంగును. రాయలు తనకు మరణశిక్ష విధింపకమానడు. తాను యుద్ధమందే మరణించుట మంచిది. ఆతని నిరాశ ఆగ్రహముగా మారినది. తమనింత మోసగించిన తిమ్మరుసును సంహరించుట తన కర్తవ్యముగా భావించి విజృంభించినాడు.

మహామంత్రి సైన్యముల గాంచిన తిరుగుబాటు సైనికులు నిర్విణ్ణులైనారు. వారికి ప్రాణములే పోయినట్లయినవి. ఆయుధములు విసర్జించి

లొంగిపోయినవారికి ప్రాణదానము గావింపబడునని మహామంత్రి ప్రకటింప జేసినాడు. సైనికులందరు ఆయుధములను క్రింద బారవైచి నిలచినారు.

అంతఃపురమునుండి ససైన్యుడై వెలికివచ్చిన పెద్దన నరవరను బంధించినాడు. రాజశేఖర అక్కప్పనాయకులుబంధింపబడినారు. త్ర్యంబక నాయకుడు మల్లప్పనాయకుని బంధించినాడు.

మరునాడు తెల్లవారుసరికి రాయలు ససైన్యుడై నగర ప్రవేశ మొనర్చినాడు.

అచ్యుతరాయలు తన యపరాధమును మన్నింప వేడినాడు.

నరవరకు మరణశిక్ష విధింపబడి యమలు జరుపబడినది.

అచ్యుతరాయలను కరుణతో క్షమించి చంద్రగిరి దుర్గ పరిపాలనకు రాజప్రతినిధిగా నియమించినాడు రాయలాతని దుర్గరక్షకుడుగా అపసం సమయములసర్వాధికారిగా గోపయామాత్యులునియోగింపబడినారు. అతడు తిమ్మరుసు మేనల్లుడు. రాజధానిలో నెలకొనియున్న విషాంకురములన్నియు సమూలముగ నాశనమొనర్పబడినవి

## పందొమ్మిది

ఉదయగిరిపై యరుణోదయమైనది. ఉదయగిరి నగరము జాగృత మైనది. తెల్లవారుసరికి పావురములు, చిలుకలనమ్మువారా రాజవీధియందు ప్రత్యక్షమైనారు. వారివెంట అనేకరకములగు పక్షులున్నవి. చిలుకలు, పావురాలు, మైనాలు, గోరువంకలు, పాలపిట్టలు, అందు ముఖ్యమైనవి.

పురుషుడు కొన్ని పక్షులను పంజరములందిడుకొని పంజరములు కావడియందిడి నడచుచున్నాడు. ముందొక స్త్రీ యున్నది. ఆమెపై నిండుగ వాలియున్నవి చిలుకలు పావురములు.

ఆమెయట్లే ఆ రాజవీధియందు ఒక పర్యాయము తిరిగి అంతఃపుర మార్గమందొక భవనపు అరుగుపై కూరున్నది.

ఉదయము రెండుగడియల ప్రొద్దెక్కినది.

ఆ భవనము నంది తిమ్మనార్యునిది.

అతడాభవనము వెలుపలకరుదెంచినాడు. బోయీలు మేనాను గొని వచ్చినారు. వారు రాజదర్శనార్థమరుగుచున్నారు.

మేనాలో కాలిడబోవుచున్న తిమ్మన కవినొక చిలుక పలుకరించినది —

"స్వామీ! క్షేమముగా నున్నారా?"

తిమ్మన కాశ్చర్యమైనది. బోయీలాశ్చర్యమందినారు. తన వెవ్వరు పల్కరించినారు. అటుయిటు చూచినాడు తిమ్మన చిలుకలనమ్ము స్త్రీకి నవ్వువచ్చినది.

లేచి నమస్కరించినది ఆమె!

"ఇది మాటకారి స్వామీ!" అని చిలుకను చూపినది.

స్వామీ యన్న మాటను వినిన చిలుక "స్వామీ! క్షేమముగా నున్నారా?" యనినది స్వచ్ఛముగ.

ఆ చిలుకమీద ప్రేమ గల్గినది తిమ్మనకు. "అమ్మా. యీ చిలుక నమ్మెదవా?"

"అందులకేకదా స్వామీ?"

"దీనికింకేమైనా మాటలు వచ్చునా?"

"వచ్చును స్వామీ"!"

"పలికించుము చూతము."

"అది దాని యిష్టము. మన కోరికతో దానికి నిమిత్తము లేదు."

"దీని వెల యెంత?"

"వంద దీనారములు స్వామీ!"

బోయి లొకరిముఖ మొకరు చూచుకొనినారు.

"సరి. దీనిని నావెంట అంతఃపురమునకు కొనిపోయెదను. నీ విచ్చటనే యుండిన తిరిగి వచ్చి ధనమిచ్చెదను" అనినాడు తిమ్మన.

"నన్నును రాజకుమారి దర్శనము చేయింపుడు స్వామీ! నా యదృష్టమును పరీక్షించుకొందును."

"సరియే, నీవే తీసికొని నా వెంట రమ్ము." అనుచు తిమ్మనకవి మేనా నెక్కినాడు.

మేనా వెనుకనే నడిచినది చిలుకలనమ్ము జవరాలు. ప్రజలామెను చూచుటతో సరిపోయినది. ఆ స్త్రీ చక్కదనమునా చూచునది ఆ పక్షులనా? దేనిని చూచుట ?

శిష్యురాలివద్ద కరిగిన తిమ్మన చిలుక వృత్తాంతము అన్నపూర్ణ కెఱింగించినాడు. దాసీనిపంచి యామెను రావించినది అన్నపూర్ణ.

పంజరముల నచ్చట నుంచుకొని రత్న కంబళముపై నాసీనమైన దామె.

లోనుండి రాకుమారి యన్నపూర్ణ యరుదెంచినది.

"కుమారీ! కుశలమా?" యనినది చిలుక ?

అన్నపూర్ణ కాశ్చర్యమైనది.

"ఇట్టి చిలుక లింటనుండుట జయకారణము తల్లీ!" అనినాడు తిమ్మన జయమను మాటవినినది చిలుక.

"జయ మూరురాయరగండ జయ! జయ మహారాజాధిరాజ జయ! జయ అరిరాయ విభాండ జయ! జయ కృష్ణరాయనృపాల జయ!" అని ఊరకొనినది చిలుక. తిమ్మనకు కొంత జంకు కల్గినది. అన్నపూర్ణ కానందమైనది. ఆ ముఖమున వెల్గిన దివ్యతేజమును గమనించగలిగినది చిలుకల నమ్ము స్త్రీ మేఖల.

"స్వామీ! అది నేర్చుకొనిన వాక్యములనినది. మా మండలమున నీవాక్యము లిట్లే వినబడుచుండును" అనినది మేఖల.

"ఈ చిలుక యిక్కడనుండుట సమంజసముకాదు తల్లీ!" అనినాడు తిమ్మన.

"భయములేదు స్వామీ! నేను దీనిని పెంచికొందును!" అనినది నవ్వుచు అన్నపూర్ణ.

"సరి నీ యిష్టమమ్మా! వత్తు" ననుచు లేచి రాజదర్శనార్థమఱిగినాడు తిమ్మన.

మేఖల సౌందర్యమును తేరిచూచినది అన్నపూర్ణ. "నీ వెచ్చటి దానవు ?" ప్రశ్నించినది.

"విజయనగర నివాసిని."

"ఈ చిలుక వెల యెంత ?"

"ఇది తమకు బహుమానము."

"అన్నపూర్ణ చకితయైనది."

"నీవద్ద బహుమానమును పుచ్చుకొందునా !" కోపము కన్పించిన దామె కన్నులలో.

"రాకుమారికి బహుమానమీయగల్గిన శక్తి కలదాననా నేను!" మేఖల ఎదురు ప్రశ్న వైచినది.

"ఎవరంపిన బహుమానమిది ?"

"తమతో సమానులు, తమ స్నేహము నాకాంక్షించిన వారు." చిఱునవ్వుతో నవినది మేఖల.

"ఎవరువారు ?" అన్నపూర్ణ కేమో యనుమానమైనది.

"చిలుకయే తెల్పినది తమకు."

"కృష్ణరాయలా ?" ఆమె ముఖమున సిగ్గు మొగ్గలు దొడిగినది.

"తామంపిన యగ్నిద్యోతనుడట జేరినాడు, తన ప్రేయసిని కొని పోవుటకు శ్రీకృష్ణుడు తహతహలాడుచున్నాడు.

"నీవెవరవు ? విజయనగర గూఢచారివా ?"

"ఈ కార్యము మీకెఱింగించుటకు."

"తరువాత ?"

"రాయల ఆస్థాన రక్షిని."

"ముద్దునాగవా ?" కన్ను లింతయొనర్చుకొని చూచినది అన్నపూర్ణ ఆమె సౌందర్యమును.

"ఆమె సోదరిని."

నా ప్రణయమామె యెఱుంగునా ?" నాగపై రాయల ప్రేమను వినిన అన్నపూర్ణ యనినది.

"ఈర్ష్య నెరుగని సేవకురాలు నా సోదరి. ఆమెయే నా యీ గూఢ

వారత్వమునకు కారణము. మహారాజు సౌఖ్యముకొరకు ప్రాణముల పణముగా నిడుట మా వంశధర్మము" మేఖల యూరకొనినది.

"పెద్దన కవీశ్వరులు కుశలమా?" అన్నపూర్ణ ప్రశ్నించినది.

"వారు ఆస్థాన కవీశ్వరులు, పండిత పరీక్షాధికారి, దండనాయకులు కూడ. ఉమాదేవిని కొనిపోవుట, మహారాజ ప్రణయవృత్తాంతము మీకు తెలియజేయుట మాకప్పగించిన కార్యములు."

అన్నపూర్ణ యాలోచించుచున్నది. ఆమె ముఖమున మలినపుఛాయలు రేగినవి.

"రాకుమారీ, ఉదయగిరినిముట్టడించి జయించిమిమ్ముకొనిపోదలచు చున్నారు రాయలు. మీరు త్వరలో విజయనగర సామ్రాజ్యమునకు మహారాణి కాగలరు. ఇది తిమ్మరుసయ్య నిర్ణయము. ఇక దీనికి తిరుగు లేదు."

"మా తండ్రి యీ సంబంధమున కొప్పుకొనుటలేదు!" విచారముగా ననినది.

"ఆ ఒప్పించు భారము మహామంత్రులవారు తమపై వేసి కొన్నారు!"

"ఉమాదేవి నిన్నెరుగునా?"

"పెద్దన మిత్రునెరుగును."

విజయుడు పిలువబడినాడు. ఉమాదేవి విజయుని గుర్తించినది. ఆమె యానందమునకు మేరలేదు.

మేఖల తిరిగి వచ్చినది విజయునితో తిమ్మన యింటికి. లోపల నున్నాడు తిమ్మన. "స్వామీ? రేపు తమ కుమార్తెను కొండవీడు పంపు నేర్పాటు కావింపుదురా?"

తిమ్మన కాశ్చర్యమైనది.

"రాకుమారి యన్నపూర్ణ అట్లు కోరినారు" అనినది మేఖల. తిమ్మనకేమియు అర్థముకాలేదు.

"పెద్దన కవి భార్య నీనాడు రహస్యముగ విజయనగరమున

కంపుటకు వలయు సౌకర్యములన్నియు తా మొనర్పవలయును. కోట దాటిన యనంతర మడవిలో మా సైన్యమున్నది.

"ఎవరి సైన్యమున్నది ?"

"శ్రీకృష్ణరాయలది. ఉమాదేవిని కొనిపోవుటకై తిమ్మరుసుల వారంపినది. తామీసహాయమొనర్పుడు. ఆమెను భర్తతో కూర్పుడు", అనినది మేఖల.

ఇంకను గడియ ప్రొద్దుండగా తిమ్మన కుమార్తె మేనాలో కొండవీడువై పునకరిగినది. ఆమె మేఖల. రెండవయామె యామె దాసిగానున్న ఉమాదేవి.

తిమ్మన కవీశ్వరులు వెంటనుండి యామెను కోటదాటించినారు. ఆమె పోకడను గుర్తింనినవారు లేరు.

కోట బయటి అడవియందు రాయల సైన్యము కలసినది వారిని. హుటాహుటి ప్రయాణములతో వారు విజయనగరమును చేరినారు. వారిని కొంతముందుగనే మేఖల విజయనగరమును జేరి విషయము నన్నియు రాయల కెరింగించినది.

"నీ యుపకారమునకు పెద్దన నీకు కృతజ్ఞుడైనయుండగలడు" అని నాడు గంభీరముగ రాయలు.

"అది నా ధర్మముగ నిర్వర్తించినాను నాకేకృతజ్ఞతయు నవసరములేదు. అది ప్రభు కార్యము." అనినది మేఖల.

"నీ ప్రణయమునే తిరస్కరించిన పెద్దనకీ వొనర్చిన యుపకారము ప్రశంసనీయము."

"ప్రేమ ప్రతిఫలమును గోరునా ప్రభూ !" ఆమె తలవంచినది. ఆ కన్నుల బాష్పములురాలినవి.

"నీ ప్రేమ సఫలము కాకపోదు మేఖలా ! నా స్నేహితుడంతటి హృదయరహితుడు కాడు." అనినాడు రాయలు చిఱునగవుతో ?

"ఆ బ్రహ్మణ ప్రవరుడు నిర్మోహుడు. నేను వారకాంతను.

నా. ప్రేమకేమి విలువకల్గును ప్రభూ !" ఆమె కంఠము గద్గదిక మందినది.

"ప్రభువులొక్క విషయమున నా కనుజ్ఞ నీయకోరుదును" మేఖల యడిగినది.

"ఏ విషయమది మేఖలా ?"

"పెద్దనార్యునకు ఉమాదేవి నప్పగింపునప్పుడు నా ప్రశంస వలదు ప్రభూ !"

రాయల కాశ్చర్యమైనది, ఆనందమైనది. తానాతనికి పరోక్షముగ సహాయపడినట్లుగూడ పెద్దన భావింపరాదను ఆ ఊహ వెనుకనున్న నిస్స్వార్థత నా ప్రభువు నుద్రేకపరచినది.

"అది పొరపాటు మేఖలా ! నీవే యామెనట నొప్పగింపవలయును. నీ యుదాత్త నిస్స్వార్థత నాతడు గమనించి కృతజ్ఞతనంద వలయును."

"ఆయన సమ్ముఖమున కరుగుటకే నాకుసిగ్గగుచున్నది ప్రభూ ! నేనపరాధిగా భావించుకొనుచున్నాను. నన్నాతడు కులటగా వెలయాలుగా కనుగొనుట నాకు బాధాకరము." అనినది మేఖల.

"బాధపడకు మేఖలా ! నీ యుదాత్త ప్రవర్తనమే ఆతనిలో పరివర్తనమును తేగలదు. ఉమాదేవి నీ దినమే పెద్దనయింట దించిరమ్ము." అనుచు వెడలిపోవుటకు సెలవొసంగినారు రాయలు.

కోటలోనికరుదెంచు ఉమాదేవి కెదురువోయినది మేఖల. సైన్యము స్కంధావారమున కరిగినది. మారువేషమున విజయుడు మేనాతో మేఖల ననుగమించినాడు.

మేఖల మఱియొక మేనాలో నున్నది. పెద్దన గృహము మ్ముంగిటి నాగినవి మేనాలు.

తన ఇంటిముందాగిన రెండు మేనాలనుజూచి పెద్దన ముంగిటి కరుదెంచినాడు.

మేనా తెరచుకొని మేఖల మెఱపుతీగవలె బయటికడుగిడినది.

మేఖలను గాంచిన పెద్దన చకితుడైనాడు.

ఈమె స్వయముగా నిటకేలయరుదెంచినది! వెనుకటి విషయ మాతని మనోపథమున మెరసినది. నాంది ప్రస్తావనమైన యా ప్రణయ నాటకమునని దిరెండవ రంగముకాదుగద? తనయాలోచనమున కాతనికి నవ్వు వచ్చినది.

మేఖల యాతని పాదములకు నమస్కరించినది.

"చిరంజీవ!" యనినాడాతడు.

"నాకేల చిరంజీవత్వము స్వామీ?" మేఖల యననేయనినది.

పెద్దన యూరకొనినాడు.

"ఈ దినము మా యింట పండుగ. ముకుర వీక్షణాదినము. ఈ దాసి యొసంగు ఉపాయనము స్వీకరింపుడు స్వామీ!"

"నాకేల ఉపాయనము మేఖలా?"

"నా కానుకను స్వీకరించుటకీ విజయనగరమున మీకంటే అర్హులెవ్వరున్నారు? క్షమించి స్వీకరింపుడీదాసి యొసంగు నీ కానుకను!"

పెద్దన మాటాడలేదు. ఆలోచించుచున్నాడు.

"కానుకలొసంగి, నను విలిచికొందువా మేఖలా? నాకిట్టివి సమ్మతములు కావు."

లోనుండి వినుచున్నది ఉమాదేవి యీ సంభాషణము. తలుపు తీయుటకు లోనుండి కదలనని యామెనుండి మాట తీసికొనిది మేఖల.

"నే వెలయాలను, మిమ్ము విలచికొందునా స్వామీ."

పెద్దనకు నవ్వు వచ్చినది. చిఱునవ్వాముఖముపై చిందులాడినది.

"నీ నొసంగు బహుమానము గ్రహింపదగినదా?" యని ఊరకొని నాడు పెద్దన.

"ప్రాణములను పణముబెట్టి తమకొఱకై తెచ్చినదీ కానుక. నను నిరాకరించినను ఈ కానుకను మాత్రము నిరాకరించుట కళాహృదయులగు మీబోటివారికి తగదు స్వామీ!"

చొక్కనామాత్యు డరుదెంచినాడప్పటకు. మేఖల నమస్కరించినది. ఆతడు దీవించినాడు.

"అంత ఆప్యాయముగ గృహమునకు కొనివచ్చిన ఉపాయనమును నిరాకరించుట కూడదు పెద్దనా!" అనినాడు పుత్రునితో.

తండ్రివైపు చూచినాడు పెద్దన. తండ్రిచూపు నందేభావమును లేదు. తన నీమెలోగొన ప్రయత్నించుచున్నది. ఆ ప్రయత్నమందిది యొక భాగము. "ఒకవారకాంత యొసంగు బహుమానము స్వీకరణ యోగ్యమా నాన్నా!"

"భక్తితో నొసంగిన నేల స్వీకరింపరాదు పెద్దనా?"

తనకు మేఖలయింట జరిగిన విషయమును పెద్దన తండ్రితో చెప్పలేదు. ఆతడూరకొనినాడు.

"మేఖలా! ఈ గృహముతరపున నే స్వీకరింతు నాబహుమతి" అనినాడు చొక్కనామాత్యుడు.

"లేదు స్వామీ!" వారే అది గ్రహింపవలయును. లేకున్న నే దానిని తిరిగి కొనిపోవుదును." మేఖలకు నవ్వువచ్చినది. మారువేషమున నున్న విజయునకు నవ్వు వచ్చినది.

"నేనే గ్రహింతును మేఖలా!" తన హృదయమును మార్చుకొని నాడు పెద్దన.

"ధన్యురాలను స్వామీ! రండు. ఈ బంగరు పూవులు తాపిన మేనాతో దీనియందలి సర్వస్వము మీ కొఱకు కొనివచ్చినవే. గ్రహింపుడు."

"దీనియందేమున్నది?" పెద్దన యడిగినాడు.

"చూచుకొనవలసినది మీరు." మేఖలయనినది.

మెట్లుదిగినాడు పెద్దన. లోనున్న ఉమాదేవి గుండెలు కొట్టు కొనినవి.

మేనాతలుపులు తెరచినాడు.

"ఆ!" యనినాడు పెద్దన. ఆశ్చర్యావిష్టుడతడు. ఆతని హృద

యము గుబగుబలాడినది. దుఃఖము పొంగివచ్చినది. లోనుండి ఉమాదేవి లేచివచ్చి పెద్దన పాదములకు చుట్టుకొనినది.

చొక్కనామాత్యుడు నిర్విణ్ణుడైనాడు. అతనికన్ను లశ్రుసిక్తములైనవి.

ఉమాదేవి లేచి మామపాదములకు నమస్కరించినది.

"రా తల్లీ ! నా యింటి శోభయే పోయినది. నీవులేని మేము సగము మాత్రమే జీవించియున్నా" మనినాడు చొక్కన కారెడి కన్నీరు తుడిచికొనుచు,

తలయెత్తి మేఖలకొరకు చూచినాడు పెద్దన.

అప్పటికే ఆమె మేనా కనుచూపునకుదాటి దవ్వరిగినది. కృతజ్ఞత జాలువార్యుచూపులతో నామెపోయినవైపునకు చూచినాడు పెద్దన.

విజయుడు చొక్కనామాత్యునకు నమస్కరించినాడు.

"నన్ను గుర్తింపలేదా స్వామీ ?" యనినాడు విజయుడు.

కంఠమును గుర్తించినాడు చొక్కన. "విజయా !" యనినాడు.

"ఉదయగిరినుండి స్వామీ ! మహామంత్రులకీ విషయమై నివేదించి వత్తును." వెనుదిరిగినాడు విజయుడు.

చొక్కనలోని కరిగినాడు కోడలితో.

నిర్విణ్ణుడై కనుకొలకుల నీటితోనిలచిన పెద్దన యొద్దకరిగినాడు విజయుడు.

"పెద్దనా !"

పెద్దన విజయుని కౌగిలించుకొనినాడు.

"నా కొనర్చిన యీ యుపకారమునకు ఇంకేమి బహుమాన మీయగలను నీకు విజయా !" అనినాడు పెదన.

"ఈ బహుమానమీయవలసినది నాకు కాదు పెద్దనా ! ఇందుల కర్తురాలు మేఖల ! యని నవ్వుచు నటనుండి మహామంత్రి గృహము వైపు కదలినాడు విజయుడు.

"వీరందరు తన నేమొనర్చుచున్నారు. !" పెదన అట్లే నిలువబడి నాడు ఒకక్షణము.

# ఇరువది

ఉదయగిరి మహాదుర్గము. ఆదుర్గమును జయించుట కష్టసాధ్యము. సునుపాసు నిడువగు కొండలనెక్కుట. స్థావర మేర్పరచుకొనుటయే బాధాకరము కోట కడ రెండువైపుల నిలచుటకే వీలుకాదు. అటు కాచుటకు సైన్యమే యవసరములేదు. ఆ వైపు కోట యభేద్యము. మిగిలిన రెండువైపుల కోటగోడవద్ద సైన్యము నిలువవచ్చును.

ఉద్దండఖానుని సహాయమున ఉదయగిరిని కాజేయ సంకల్పించిన ఆదిల్‌షా కృష్ణరాయల నెదుర్కొనుట యనుపేరుతో సైన్యమును నడిపించినాడు. ఆ సైన్యము ఉదయగిరి దాపులకు చేరి నిలచినది..

రాయ లనంతబలసమేతుడై ఉదయగిరి ముట్టడికై బయలువెడనున్నాడని విజయనగరమున చాటింపబడినది. ముప్పదివేల సైన్యము, వేయి ఏనుగులు. పదివేల ధానుష్కులు. అయిదువేల యాశ్వికులతో నడచినది యా విజయనగర వాహిని.

చాలాకాలమునుండి వివాదస్పదముగనున్న ఉదయగిరి యీ విజయయాత్రలో తమ వశమగునని విజయనగర సైనికు లుత్సాహమందుచున్నారు.

ప్రధానసేనాపతులు గోవిందరాజు నాగమనాయకులు సైన్యమును నడుపుచున్నారు. పెద్దనామాత్యుడు రాయలవెంట నున్నాడు. మహామంత్రి తిమ్మరుసు తమను మఱికొంత సైన్యముతో వచ్చి సకాలమున కలియునట్లు నిర్ణయించుకొనినారు వారు.

విజయనగర కోటను దాటి యొక్కపరుగుమాఱ మరుదెంచి యానాటికట నిలచినవి సైన్యములు. రాజధానీనగరమే యటనున్నట్లు తోచినదానాడు. మఱునాడు మూడవనాడు నాల్గవదినముకూడ ఉదయగిరి కభిముఖమై ఏకదీక్షతో పయనమొనర్చినవా సేనలు.

తమనగరమునకు దక్షిణముగా విజయనగరసేనలు ఉదయగిరిపై

లక్ష్యముంచుకొని యరిగినవని గూఢచారులద్వారా తెలిసికొనిన అజపన్కృ-తిమ్మన కొంత హృదయశాంతిని బొందినాడు. ఆదిల్‌షా సైన్యము లుదయగిరివద్ద నున్నవి. రాయ లుదయగిరిని ముట్టడించిన నవి రాయల సైన్యములను వెనుకనుండి పొడువగలవు. ఇదే సమయమున తాను సైన్యములతో రాయలను తాకిన ఈ మూడు సైన్యములముందు రాయల సైన్యమేమాత్రము నిలువజాలదు. రాయల సామ్రాజ్యమునకే యీ యుద్ధయాత్ర వినాశ కారణము.

తన యూహను కుమారునకు తెల్పినాడు తిమ్మన. తండ్రియూహను బలపరచినాడు కుమారుడు. ఉదయగిరిపై యుద్ధము ప్రారంభమైనతదుపరి తమ సైన్యముల కొనిపోవుటకు వారు నిర్ణయించుకొనినారు.

రాయలసైన్యములు అదవానివాయలు దాటిపోయినవి. పది యోజనములు దాటివచ్చిన తన సైన్యమును హఠాత్తుగానాపినాడు రాయలు. సైన్యాధిపతులు విస్తుపోయినారు. ఆ రాత్రికి రాత్రియే వెనుదిరిగి అదవాని దుర్గమును ముట్టడించినవా సైన్యములు.

అదవానిదుర్గము గాఢసుషుప్తియందున్నది. ఇదివఱకున్న కొలది భయమునుగూడ విడనాడి పారాసైనికులు గూడ నిద్రయందు మునిగినారు. తమ కోటనొక మహాసైన్యము ముట్టడించినదని యెఱుంగరు వారు.

వీరమల్లు ఐదువందల సైన్యముతో రహస్యమార్గమున కోటలోని మల్లయుద్ధశాలలోనికి చేరినాడు. రహస్యమార్గపు తాళములన్నియు వీరమల్లునొద్ద నున్నవి. ఏబదిమంది సైనికులతో యుద్ధశాలనుండి వెలికివచ్చి కోట సింహద్వారముపై పున కరిగినారు వారు. ఉచ్ఛ్వాస నిశ్వాసముల బిగబట్టి నడచినదా సైన్యము. కోట వాకిలి గాయు సైనికులు కిక్కురు మనకుండ వధింపబడినారు. కోటవాకిలి తెరువబడినది. పహరా మారు సమయమున కరుదెంచిన రక్షకభటులిది గమనించినారు. అందొక డపాయమును సూచించు గంటపై గబగబ నాలుదెబ్బలను వైచినాడు. ఒక విజయ నగవఖడ్గ మాతనికంఠము నెగురమీటినది. అప్పటికే కోట లోనికి విజయనగరసైన్యము ప్రవాహమైనది.

ఏమైనది తెలియక నిదురమత్తు వీడక లేచి యాయుధముల

వెదకికొను ప్రతిసైనికుడును కడతేర్పబడుచున్నాడు. కోటలో సంకుల సమరమైనది. మల్లయుద్ధశాలలో సైన్యమంతయు తిమ్మన యంతఃపురము వైపు సాగినది. అప్పటి కప్పుట సైన్యము జేరినది. వీరశ్యాముడు తిమ్మనసైన్యములకు నాయకత్వమువహించి విజయనగరసైన్యమును ప్రతిఘటించినాడు. కోటలోనికరుదెంచిన సైన్యమునకు పెద్దన నాయకత్వము వహించినాడు.

తెల్లవారినది. మదమాతంగమునెక్కి-యుద్ధమొనర్చుచు సైన్యముల నడపుచున్నాడు పెద్దన. భార్గవరాముని తలపించినాడానాడు పెద్దన. పెద్దనను గాంచిన అజపక్కి తిమ్మనకు కోపమాగలేదు. ఆతడు పెద్దనపై కవిసినాడు. తామెట్లు మోసగింపబడినారో యూహించుకొనినకొలది తిమ్మనలోని నిస్పృహ కొలదిమీరుచున్నది ఆతడుద్వేగి యగుచున్నాడు. పరాక్రమించిన వీరమల్లుడు వీరశ్యామునాక్రమించి బంధించినాడు. పెద్దన తిమ్మనపై కురికి బంధించివైచినాడు. తిమ్మన నిర్మించిన యూహాసౌధములన్నియు క్షణములో నేలమట్టమైనవి. ఆతడిప్పుడు విజయనగర ప్రభువునకు బందీ.

తమ ప్రభువు బంధింపబడుటెఱింగిన సైన్యము శస్త్రములను వదలి పెద్దనను శరణుగోరినారు.

హొంబట్టుగుడారమున సభనొనర్చిన రాయలయెదుట శృంఖలా బద్ధుడై నిలుపబడినాడు అజపక్కి తిమ్మన.

తగిన రక్షణలో విజయనగర కారాగారమునకు పంపబడినారా యిర్వురు తండ్రీకుమారులు.

దుర్గనాయకత్వము జగపతికి పెద్దనసలహాపై నొసంగబడినది. మఱునాడట విజయోత్సవమైనది. రాయలు ససైన్యుడై ఉదయగిరివైపు నడచినాడు.

కృష్ణరాయలు వెనుదిరిగి అదవానిదుర్గముపై కరిగినాడని తెలిసిన ఉద్దండఖానునకు సంతోషమే యైనది. తన సహాయార్థమై ఆదిల్‌షా పంపిన సైన్యమును ఉదయగిరికోటను ముట్టడింపుటకు కోరినాడాతడు. కృష్ణరాయ

లదవాని ముట్టడించిననాటిరాత్రి ఆదిల్ షా సేనాపతి బిజిలీఖానుడు ఉదయగిరి దుర్గమును ముట్టించినాడు. తిరుమల రాహుత్తరాయలు అప్రమత్తుడైనాడు. ఉమాదేవిని తననుండి తప్పించినది రాజకుమారియని ఉద్దండఖానుడు తెలిసికొనినప్పటినుండియు నాతని యాగ్రహమునకు మేరలేదు. ఆతడాదిల్ షాతో మంతనములు సలిపినాడు. ఆ మంతనముల ఫలితముగా ఆదిల్ షా పెద్ద సైన్యమునిచ్చి బిజిలీఖానుని పంపినాడు.

నాటిరాత్రియే కోటతలుపులను తెరిచి రాహుత్తరాయలను సంహరించి ఆతని కుమార్తెను చెరబట్టి ఆదిల్ షావద్దకంపుటకై సన్నాహము జరిగినది.

రాయలప్రస్థానమును వినినంతనే గజపతి యట యుద్ధసన్నాహముల కనుజ్ఞ నొసంగినాడు. ఆదిల్ షా సైన్యము ఉదయగిరి యడవులందున్నదని గజపతికి తెలియలేదు. గజపతి కీడును శంకించినాడు. ఆరాత్రియే గజపతి రహస్యమార్గమున కోటవదలి కొండవీడును చేరినాడు. గజపతి కోటలో నున్నట్లే రాచకార్యములన్నియు నాతని పేరనే జరుగుచున్నవి. కుమార్తెను తనవెంట కొనిపోవుట కాతడిష్టపడలేదు.

కృష్ణరాయ లదవానిదుర్గముపైకి వెనుదిరిగిపోయెనన్న విషయము తెలిసిన రాహుత్తరాయలొకింత తెరపి జిక్కెనని తలంచినాడు. కాని బిజిలీఖానుని సైన్యము ఉదయగిరిని ముట్టడించినది. ఆ దినము పోరు జరుగలేదు. ఉద్దండఖానుడు తనలోని కుటిలము నేమియు బయలుపడనీయలేదు. ఆతడు బిజిలీఖాను నెదుర్కొనుటకు సన్నాహములొనర్చినాడు. కోటను యుద్ధమున కాయత్త మొనర్చినాడు. హంవీరపాత్రుని కుమారుడు నరహరిదేవుడు కోటసింహద్వారమును కాచుటకు నిలుపబడినాడు. సర్వసేనాపతిగా పూసపాటిరాచిరాజు, ఉద్దండఖానుడు నిర్ణయింపబడినారు. ఉద్దండఖానుని సైన్యము అవసరసమయమున శత్రుసైన్యముపై విరుచుకొనిపడుటకై నిల్పినాడు రాహుత్తరాయలు. ఆజ్ఞలేనిదా సైన్యము కదలరాదు. రాచిరాజు సైన్యము దక్షిణమువైపును నరహరిదేవు సైన్యము కోట తూర్పువైపు సింహద్వారమును కాచుచున్నవి.

అర్ధరాత్రమైనది. కోట ఉత్తరమువైపునకు బిజిలీఖాను సైన్యము

నడచినది. అర్ధరాత్రమున కోటగోడపైనుండి అసంఖ్యాకముగ త్రాటి నిచ్చెనలు వదలబడినవి. క్రిందనున్న బిజిలీఖాను సైన్యములిక వానిపై నుండి ఎక్కి లోనికి దిగిరావలయును సమయమున కక్కుడ రాహుత్తరాయలు సైన్యముతో ప్రత్యక్షమైనాడు. ఇది ఊహింపని ఉద్దం ఖానుడు కలతచెందినాడు. రాహుత్తరాయల సైన్యము కోటగోడల నాక్రమించినది. త్రాటినిచ్చెనలు కోసివేయబడినవి, వానిపై నెక్కివచ్చు వందలాది బిజిలీఖానుని సైన్య మటనుండి కొండపైకి పడిపోయి కొండ నుండి క్రిందికిదొర్లి పోయినారు. ఆ యెక్కివచ్చినవారిలో బ్రదికినవాఁడొక్క డునులేడు. ప్రతిఘటించిన ఉద్దంఖానుని రాహుత్తరాయలసైన్యము కొలదిపోరుతో బంధించివై చినది. తన సైన్యమునకు జరిగిన మారణ హోమము బిజిలీఖాను నాగ్రహావేశునొనర్చినది. మరునాడు దుర్గముపై ముట్టడి తీవ్రతరమొనర్చినాఁడు ఖానుడు. కోటనుండి ఏ సహాయమును తనకు రాకుండుట అతనిని నిరుత్సాహపరచినది. కోటలోని సైన్యము మహమ్మదీయసైన్యమును తీవ్రముగ ప్రతిఘటించినది. పోరు మున్మర ముగ రెండుదినములు జరిగినది. మూడవనాడు తెల్లవారుసరికి రాయల సైన్యములు ఉదయగిరికోటను డరిసినవి. అవి బిజిలీఖానునిసైన్యముతో సహా ఉదయగిరి దుర్గమును ముట్టడించినవి.

అంతత్వరగా అదవాని లొంగిపోవదవి తలంచిన బిజిలీఖానునకు కృష్ణరాయల సైన్యమును గాంచిన భయమే కలిగినది. అతని పని వెనుక నూయి ముందు గోయి యైనది, తన దురాశయే తనను హతమార్చినది. ఉద్దంఖానుని నమ్మి తాను చెడినాఁడు వెనుదిరిగి రాయలవెనుకొనిన కోటనుండి రాహుత్తరాయలు తనను పొడువగలఁడు. కోటను ముట్టడించిన రాయలూరకొనడు. ఏమైనను వెనుదిరిగి రాయల సైన్యమునకు గండికొట్టి పారిపోవుటకే నిశ్చయించుకొనినాఁడు బిజిలీఖానుడు.

రాయలు బిజిలీఖానుని సైన్యమునకు చుట్టును తనసైన్యమును, పొదివి స్థావరములు నిర్మించినాడు.

అయిదు దినములవఱకు రెండుసైన్యములు నిమ్మకు నీరె తిన

ట్లూరకొనినవి. ఆరవనాటి యుదయమున రాయలు బిజిలీఖానుని సైన్యమును ముట్టడింప నిశ్చయించుకొనినాడు.

తిరుమల రామచంద్రరాయలు కోటలో తన సైన్యము నీసమయమున బాగుగ పటిష్ఠమొనర్చుకొన ప్రయత్నించినాడు. కోటముట్టడించిన వారిరువురు తనకు శత్రువులే. వారిరువురు శత్రువులగుటయే ప్రస్తుతమునకు ప్రయోజనము. వారిప్పుడొకరితో నొకరు ముందుగా పోరొనర్చినగాని కోటపైపునకు రారు. ఈలోపల తమ మహారాజ సైన్యములు తనకు సహాయము రావచ్చును.

ఆరవనాటి యుదయమున బిజిలీఖానుడు తనకు త్రోవనొసంగిన యుద్ధము మానుకొని వెడలిపోవుదునని రాయబారమంపినాడు.

పౌరుషమున్న యుద్ధమునొనర్చి బయటపడుమని రాయలు రాయబారికి చెప్పిపంపినాడు.

బిజిలీఖానుడిక నిస్పృహనందినాడు. ఆతడెటుపోవుటకు వీలులేదు. పరాక్రమించి తప్పించుకొననైనవలెను. లేక ప్రాణములనైన నొసంగవలయును. తన సైన్యముల నుత్తేజపరచినాడాతడు.

బిజిలీఖానుని సైన్యములు రాయల సైన్యముల దాకినవి. అంతవరకు తప్పించుకొనుటకు మార్గమున్నదనుకొనిన వారిప్పుడు భయమందినారు. ఆ మార్గము బంధింపబడినట్లు తెలిసి వారు ప్రాణములపై నాశ వదలినారు. ఇక వారిని తేరిచూచునదెవరు ?

పోరు ఘోరమైనది. గోవిందరాజు హారికసమసంగినట్లు శత్రువుల మరుమోదుచున్నాడు, బిజలీఖానుడు సైన్యమును నడపుచు యుద్ధమొనర్చుచున్నాడు. గోవిందరాజాతని నెదుర్కొనినాడు, గోవిందరాజు బిజలీఖానునాక్రమించినాడు. గోవిందరాజు సైన్యములు బిజలీఖాను సైన్యములనాతని కందుబాటులో లేకుండ నొనర్చినారు. గోవిందరాజు ఖడ్గము బిజలీఖాను కంఠము నుత్తరించినది. తెగిపడిన శిరమును బల్లెమునకు గ్రుచ్చి బల్లెమును పైకెత్తి పట్టుకొనినాడు విజయనగర సైనికుడొకడు. దీర్ఘమగు గడ్డము భయంకరమగు మీసములతో నా శిరము మరియు భయంకరముగనున్నది.

మహమ్మదీయ సైన్యము చెల్లాచెదరైనది. యుద్ధమాపుటకు రాయలాజ్ఞాపించినాడు.

ఆయుధములు విసర్జింప రాయల యాజ్ఞయైనది.

ఫిరంగులతో సహా మహమ్మదీయుల ఆయుధములు, ఆహార పదార్థములు రాయల వశమైనవి. మహమ్మదీయులు పారిపోవుటకు విజయనగర సైనికులు త్రోవనొసంగినారు. చావుతప్పిన సైనికులు వెడలి పోయినారు.

విజయనగర సైనికులు స్వయముగ కోటను ముట్టడించి నిలచినారు. రాయల పట్టుగుడారమున సాహిత్యసభలు వారకాంతానృత్యములు సాగిపోవుచున్నవి.

పదునైదు దినములు గడిచినవి. ముట్టడి కనుజ్ఞ నీయలేదు రాయలు. కోటలోనుండి రాయబారము వచ్చునని రాయలూహించినాడు. కాని విఫలుడైనాడు.

మఱునాడు ముట్టడికి సైనికులాజ్ఞాపింపబడినారు. కోటగోడలపై ఫిరంగులు గురిపెట్టబడినవి. గోడలపై కెక్కువారలను లోని సైన్యము ప్రతిఘటించుచున్నది. ఆ ప్రతిఘటించువారలను ఫిరంగులు కూల్చివైచుచున్నవి. ఇరువైపులవారికిని నష్టములు విపరీతముగ నున్నవి. ఆయిదిన ములు గెలుపోటములు లేని యుద్ధము జరిగినది. కొండపైకి ఒకవైపు నుండి చక్కని బాటను నిర్మించినారు రాయల సైన్యము. అటు కోట గోడ ఎత్తులేదు. రాయలు తన దృష్టి నట కేంద్రీకరించినారు.

ఆవైపునుండి సైన్యములన్నియు మఱియొకవైపు పిలిపింపబడినవి. విజయనగరసైన్యమే లేదావైపున. ఉదయగిరి సైన్యముల కిది వింత యైనది. మిగిలినవైపుల సైన్యముల యొత్తిడి ఎక్కువైనది. ఉదయగిరి సైన్యములటువైపు కేంద్రీకరింపబడినవి. మూడు దినములు కష్టించి ఖనకులు ముప్వురు రహస్యముగా కోటగోడలక్రింద సన్నని సొరంగములు నిర్మించినారు. మహమ్మదీయులవద్ద దొరకిన ఫిరంగిమందంతయు నా సొరంగ ములనిండుగా కూరి అప్పటినుండి కొంత క్రిందువఱకు సన్నగా మందు వరుస పఱచినారు. అప్పటికి తెల్లవారుజామైనది. కోటగోడక్రింద నేదియో

చప్పుడగుచున్నదని సైనికులు తిరుమలకాంత రాయలకు తెల్పినారు. ఆతడా శబ్దములకంత ప్రాధాన్యత నీయలేదు. కొండదిగివచ్చిన ఖనకులు పలుచిన ఫిరంగిమందునకు నిప్పంటించినారు.

ఉదయగిరి దుర్గము దడదడలాడిపోయినది. భవనములూగిపోయినవి. భూకంపము వచ్చినట్లయినది వారలకు. కోటగోడ నాలుగైదు బారల మేర ముక్కలు ముక్కలైనది. ఏమిజరిగినదో తెలయరైరి జనులు. వారి భయమునకు మేరలేదు. కోటగోడ పడిపోయినది.

రాయలసైన్యములా ప్రదేశమునకు వెల్లువలై నవి.రాహుత్తరాయల సైన్యము వారి నాటంకపలచినది. రాయల సైన్యముటు ప్రవాహమైనది. రాచిరాజు. రాహుత్తరాయలు ఆప్రవాహముల కానకట్టలై ప్రతిఘటించినారు.

సూర్యాస్తమయమగువరకు గెలుపోటములులేని యుద్ధమైనది. వారి పరాక్రమమునకు రాయలే నిర్విణ్ణుడైనాడు. ఆనాటికి యుద్ధము చాలింపబడినది. కోటలోని కొక్కయంగుళమైనను చొరలేకపోయినారు విజయనగర సైనికులు.

మఱునాడు పెద్దన సలహా ననుసరించి విజయుని రాహుత్తరాయల కడ కంపినాడు శ్రీకృష్ణదేవరాయలు.

రాహుత్తరాయలు వివేకియై ప్రజామారణమునాపి దుర్గము తమ వశమొనర్చిన వారి ప్రాణముల కభయమిచ్చెదమనియు, వారితో తాము బంధుత్వమును కోరుచున్నందున ఈనిర్ణయ మొనర్చితిమనియు రాయబార సారాంశము.

తిరుమల రాహుత్తరాయలు అన్నపూర్ణతో సంప్రదించినాడు.

ఆతనికి అన్నపూర్ణ యభీష్టము తెలియును.తానుగా లొంగిపోయిన గజపతిమహారాజునకు ఆగ్రహము కల్గవచ్చును. అన్నపూర్ణయు గజపతితో వెడలిపోయిన బాగుండెడిది.

"మనము ప్రతిఘటించి నిలువగలమా చిననాన్నగారూ?" ప్రశ్నించిన దన్నపూర్ణ.

"ప్రతిఘటింపక చేజేతులా పిరికిపందవలె కోటను స్వాధీన మొనర్తునా ?" రాహుత్తరాయలనినాడు.

"ఇందు పిరికితన మేమున్నది ? మనము పోరినాము. కాలము కలిసిరాలేదు. నీరుమాత్ర మేమిచేయగలవు ?"

"కృష్ణరాయల యభిప్రాయము వేఱుగానున్నదమ్మా ! అతడు మనతోడి బంధుత్వమును గోరుచున్నాడు." తానేమియు నెఱుగనట్లే యనినాడు రాహుత్తరాయలు.

"బంధుత్వమనిన ?" అన్నపూర్ణ యనినది.

"నిన్నాతడుద్వాహమాడ గోరుచున్నట్లున్నది." అనినాడు రాహుత్తరాయలు.

అన్నపూర్ణ కొకింత సిగ్గుకలిగినది. ఆమె తలవంచి యూరకొనినది.

"ఆ దాసీపుత్రునకు కన్యనిచ్చి వంశగౌరవమునకు కళంకము కొని తెచ్చుకొందుమా అన్నపూర్ణా?"

"అతడు దాసీపుత్రుడా ? నాగమాంబాదేవి యభిజనము మనమెఱుగనిదియా చినవాన్నా ! ఈ రెండు రాజ్యములీ యుద్ధములతో తలమునకలుగాక సంఘటితమై తురుష్కుల నీ దక్షిణహిందూదేశమునుండి పారద్రోలగూడదా ! ఆ సంఘటన నామూలమున నగు నవకాశము కలిగినప్పుడు నేనేల యందుల కంగీకరింపరాదు ? సహృదయముతో నీవైన యాలోచింపరాదా చిన నాన్నా !" ఆమెకు దుఃఖము కంఠగతమైనది.

"నీ కీ వివాహము ఇష్టమా అన్నపూర్ణా ! నేను నీ తండ్రినైన నీ యభీష్టమును నెఱవేర్చియుండుటకు వెనుదీసెడివాడను కానమ్మా ! కాని తండ్రిగారు చండశాసనుడు. విజయనగరముపై, అందున కృష్ణరాయలపై వారి పగ యణగునట్టిది కాదు." అనినాడు రాహుత్తరాయలు.

"నా వివాహము మూలముననైన ఈ పగలణగరాదా ?" అన్నపూర్ణ తనలోని వాంఛను వెలిగ్రక్కినది.

"అన్నపూర్ణా ! నీ వాంఛ నేనెఱుగుదునమ్మా ! కాని నేను

పరతంత్రుడును. స్వతంత్రించి నిన్నాతనికర్పించుటకు నాకు హక్కు లేదు ?"

"మిమ్మా రాయలు జయించిన నను గొనిపోవునుగదా ? ఇక నెంతోకాల మీకోటను మీ రాపలేరనునది నిర్వివాదము !"

"నీ యుద్దేశము నాకర్థమైనది అన్నపూర్ణా ! నీ యభీష్టమే నెఱవేరనిమ్ము." అనుచు ఆచోటు వదలి వెళ్ళినాడు తిరుమలకాంతరాయలు. ఆ విశాలహృదయుడు తన పినతండ్రియనుకొనుటయే యామెకు గర్వ కారణమైనది.

"సంధిషరతులను తాము తిరస్కరించుచున్నట్లును యుద్ధమొనర్చి కోటను స్వాధీనపరచుకొన రాయల గోరుచుంటిమనియు జవాబును పంపినాడు తిరుమలకాంతరాయలు.

ఆ ప్రత్యుత్తరమునకు రాయలుగ్రుడే యైనాడు. మరునాడెట్లైన కోటను స్వాధీనపఱచుకొనవలసినదిగా సైన్యాధిపతుల కాజ్ఞలిడినాడు. నాలుగువైపుల సైన్యములు కోటపై పడినవి. గండిపడినచోట నాగమనాయకుడు స్వయముగా సైన్యము నురికించినాడు. ప్రతిఘటన కొలదిమాత్రమే. వారి యాశ్చర్యమునకు మేరలేదు. తిరుమలకాంత రాహుత్తరాయలు బంధింపబడినాడు. కోట సునాయాసముగ రాయల స్వాధీనమైనది.

పెద్దనతో అన్నపూర్ణను జూచుట కరిగినాడు రాయలు. ఆమూర్తిని కన్నులార గాంచి అలవంచినది అన్నపూర్ణ. ఆమె శరీరము హృదయముతో సహా పులకరించినది.

"అన్నపూర్ణా ! మీ అగ్నిద్యోతనుడీతడు. నీ ప్రణయమును మాకెఱింగించినాడు." అనినాడు రాయలు.

"నే నొనర్చుకొనిన పుణ్యమే బ్రాహ్మణరూపమున నాకు ప్రత్యక్షమై నా వాంఛిత మీడేర్చినది!" క్రీగంట చూచుచు ననిన దన్నపూర్ణ.

"ఏమైన నా కృష్ణునివలె ఈ కృష్ణునకును రాక్షసవివాహమే యైనది." అనినాడు పెద్దన నవ్వుచు.

"క్షత్రియులకది యుచితమైనదే." అన్నపూర్ణ యనినది.

రాయల యానందమున కంతులేదు,

"గజపతులు మా క్షత్రియత్వమును శంకించినట్లు మాకు వినికిడి." రాయలు గంభీరుడై నాడు.

"అది యోర్వలేనితనము. తనకంటె గొప్పవారియందు లేని న్యూనత నాపాదించి ఆత్మోపంచనమొనర్చుకొని తృప్తిజెందుట కొందరి లక్షణము. నాగమాంబాదేవి యభిజనము లోకవిదితము. నాకెట్టి కళంకము హృదయమున లేదు. నేను తమ దాసిగా జీవించుటకనుజ్ఞ గోరుచున్నాను." నీరునిండిన కనులతో తలయెత్తి రాయలముఖముపై పు చూచినది అన్నపూర్ణ.

"విజయనగర సామ్రాజ్య పట్టమహిషివి. కంట నీరిడరాదు." అని నాడు రాయలు చిరునవ్వుతో.

కొనగోట కన్నీటిని మీటివైచినదా బేల. ఆ ముఖమున చిరు నవ్వుల మెఱపులు తళుక్కుమనినవి. "అదృష్టవంతురాలి!" ననుచు రాయల పాదములకు నమస్కరించినది.

"యుద్ధమున కాహ్వానించి ప్రతిఘటింపక నిలచిన నీ పినతండ్రి నేమొనర్పవలెనో తోచకున్నది.

"మా తండ్రికోట కొతడాడిన నాటక మది. సహృదయుడగు నా పినతండ్రియే నా వాంఛాసిద్ధికి సాయపడినాడు."

"రేపే విజయనగర ప్రయాణము అన్నపూర్ణా! సంసిద్ధురాలవు కమ్ము."

"నావెంట గురుదేవులు నంది తిమ్మన యరుదెంచుట కనుజ్ఞ నిప్పించ ప్రభువులను కోరుచున్నాను." అన్నపూర్ణ యడిగినది.

"ఆత డాస్థానకవిపదమున కర్హుడు. నే నదియే కోరుదమనుకొను చున్నాను." అనినాడు పెద్దన.

అన్నపూర్ణను ప్రేమపూర్వకముగ జూచి చిఱునవ్వుతో రాయలు వెనుదిరిగి యరిగినాడు పెద్దనతో.

ఉదయగిరి దుర్గమునకు లక్కనదండనాయకుని రాజప్రతినిధిగా

నుంచి రాయలు తిరుమలకాంతరాహుత్తరాయలతో అన్నపూర్ణతో విజయనగరమున కరిగినాడు. నంది తిమ్మనార్యుడు వారి ననుగమించినాడు.

మార్గమధ్యమున శ్యామలాదేవి యాలయమున తనకు వశమైన స్వర్ణనిధిని పెద్దన రాయలపరమొనర్చినాడు. హిందూమతాభివృద్ధికై ఆధనమును వ్యయపఱతునని ప్రమాణమొనర్చి గైకొనినాడాధనమును రాయలు.

తిరుమలకాంత రాహుత్తరాయలు బందీగా విజయనగరమునకు కొనిపోబడినాడు. అవి బంగారపు సంకెలలు. అన్నపూర్ణావివాహ మొనర్ప వలసినవా డాతడు. మనస్ఫూర్తిగనే యాత డీయకొనినా డీ బంధమునకు, అనుబంధమునకును.

## ఇరువదియొకటి

భువనవిజయ సభాభూమి విజయనగర ప్రజాసందోహమునే కిటకిటలాడుచున్నది. మహారాజసింహాసనము ప్రక్కగా నొకప్రక్క నున్నతముగానున్న యాసనముపై సర్వ శిరఃప్రధాని తిమ్మరుసున్నాడు. ఆవరుసనే సర్వసైన్యాధిపతులు గోవిందరాజు, నాగమనాయకు లుపవిష్టులైనారు. రాయల కార్యకర్తయు ముఖ్యమంత్రులలో నొకడైన రాయసం కొండమరుసున్నాడు. అయ్యమరసు, బాచరసు, యల్లమరసు, వీరమరసు యెల్లన దళనాయకులు, అప్పరపిళ్ళ, మన్నారుపిళ్ళ, రాయసం కొండమరుసు కుమారుడు రామచంద్రయ్య, బొక్కసం భాస్కరయ్య రాయల ప్రభుత్వ ముఖ్యకార్యకర్తలొకచో ఆసనము లధివసించినారు.

నగరాధ్యక్షుడు త్ర్యంబకనాయకుడు సభానిర్వాహకుడుగా సమస్తవిషయములను పర్యవేక్షించుచున్నాడు. ముఖ్యప్రధానులలో లక్ష్మీపతిప్రధాని వెంకటపతి ప్రధానులు రాయసం కొండమరుసుప్రక్క నుపవిష్టులైనారు. తిమ్మరుసు వెనుకవైపున సాలగరాజున్నాడు. విజయనగర సామంతులు సాళువ నాగరాజు, ఆర్వీటి బుక్కరాజు, సాళువ మేకరాజు, శ్రీపతివారు, బూదహాళివారు, నంద్యాళవారు, అవుకువారు, తొరగంటివారు, రామూరి తిమ్మరాజు సంగరాజు, తమతమ యాసనములందున్నారు.

తిరుగుబాటునందు పాల్గొనిన పెద్దసాని అక్కప్పనాయకుడు రాజశేఖరనాయకుల స్థానములు పూరింపబడక వెలితిగానున్నవి.

నగరశ్రేష్ఠులు, ప్రధానశ్రేష్ఠి అవచినాగేంద్రశ్రేష్ఠితో తమ తమ యాసనముల సుఖాసీనులైనారు.

రాయలసింహాసనమునకు మరొకవైపున నున్నతమగు నాసనమున అల్లసాని పెద్దనామాత్యుడున్నాడు. ఆతని ప్రక్కనే మహారాణి అన్నపూర్ణాదేవితో యరుదెంచి రాయల యాస్థానకవిపదమందిన నంది తిమ్మన పెద్దనతో చిరునవ్వులొలికించుచు నేదియో మాటాడుచున్నాడు. వారి ప్రక్కనే ధూర్జటి కవి నిమీలితలోచనుడై యున్నాడు మాదయగారి మల్లన, అయ్యలరాజు రామభద్రుడును అప్పటికే రాయలయాస్థానకవులుగా నపటనున్నారు.

అష్టభాషాకవిత కృష్ణావధానులు, శాబ్దికం పాండిత్యం వెంకట్రామశాస్త్రులు. సహస్రావధాని ప్రభాకరశాస్త్రులు మొదలైన నగరి పండితులటనున్నారు.

అంతఃపురము మోసాల మంగళ తూర్యనాదములు వినవైనవి. మహారాజులు సభాస్థానమున కరుదెంచుచున్నారనుట కది చిహ్నము. వేత్రహస్తులు సభను నిశ్శబ్దమొనర్చినారు. సభానిర్వాహకుడు అశ్వముపై మహారాజు భద్రతాండవళమున కెదురేగినాడు. సభాభవనమున కంటియుండు రాజభవనమునకు మహామంత్రి యప్పాజీ యరిగినాడు.

రాజభవనమునకు ముందునకరుదెంచిన మహారాజునకు స్వాగతమొసంగి లోనికి కొనిపోయినాడు అప్పాజీ. వారివెంట వీరమల్లు లోనికరిగినాడు.

సభయంతయు నిశ్శబ్దమైనది. ఒక క్షణము తరువాత రాయలు తిమ్మరుసుతో సభాభవనమున కరుదెంచినాడు. సింహాసనమునకు నమస్కరించి శ్రీ వీరకృష్ణదేవరాయలు వందిమాగధులు కైవారములొనర్చుచుండ సింహాసన మధిష్టించినాడు.

సంవత్సరమునకు మూడుపర్యాయములు జరిగెడి ముఖ్యసభలలో

విధియొకటి. సర్వసామంతులు దళనాయకులు, సర్వకార్యకర్తలు ఈ సభకు హాజరుకావలయును.

సభాకార్యక్రమము యథావిధిగా నిర్వర్తింపబడినవి. ఆనాటి యభియోగములు విచారింపబడినవి.

రాయలు పెద్దనవైపు చిరునవ్వులొలుకు చూపుల నుపలక్షించినాడు. "పెద్దనామాత్యా!" పిలచినాడు రాయలు, "నాదొక చిరకాల వాంఛితము." రాయలే యనినాడు.

"మహారాజులు వాంఛితములు చిరకాలము తీర్చుకొనకుండుట యాశ్చర్యకరము. అచిరకాలమున ఆ వాంఛితార్థముల నొందుటకు మీ పరిజనులమగు మమ్ము నియోగింపవచ్చును." అనినాడు నవ్వుచు పెద్దన.

"పెద్దనా! నీవు హితుడవు. చతురవచోనిధివి." యనినాడు రాయలు.

"అంతియ కాదు. మన పెద్దనార్యుడు అతుల పురాణాగమేతిహాస కథార్థస్మృతియుతుడు కూడ. మీ రిడదోవు నెట్టికవిత్వ భారమైనను భరింప సమర్థుడు." రాయలలోని యాలోచనమును గ్రహించిన నంది తిమ్మన యనినాడు.

"తిమ్మనార్యులు పరేంగితావగాహులు." రాయలనినాడు తన యాలోచన మొకింత బయల్పరచుచు. "అత డాంధ్రకవితా పితామహుడు" కొసరినట్లనినాడు అప్పాజీ. ఉదయగిరి దిగ్విజయమైనతర్వాత తాను పెట్టిన యాంక్ష తొలగినదని పెద్దనకా మాటలో సూచించినాడు మహామంత్రి.

"ఇంతటి పొగడ్తలకు నేనరుడనా యని నా సందేహము, ప్రభువులు విషయమును వివరింప ప్రార్థన." అనినాడు పెద్దన కొంచెము మొగమోటపడుచు.

"పెద్దనార్యా! ఈ సామ్రాజ్యము శ్రీమహారాజస్థానము శ్రీభోగ భాగ్యము లన్నియు నస్థిరములు - ఖిలమగునవి. ఈ శరీరమే క్షణభంగుర మైనది. ఒక్క యశఃకాయమే మానవుని స్థిరముగా జీవింపజేయునది.

సప్తసంతానములందును ఖిలముగాకుండునది, ధాత్రియందు కృతి యొక్కటియే. అట్టి కృతి నొక్కదానిని సంతరించి మాయశఃకాయమునకు చిర జీవిత్వము నొసంగగోరుచున్నాను." రాయలు తన చిరవాంఛితమును బయల్పరచినాడు.

"పెద్దనా! ఈ విశాలాంధ్ర సామ్రాజ్యము స్థిరముగ నొరులు కన్నెత్తిచూడకుండ కత్తివాదరపై స్థాపించుట మహారాజుల భాగము. దాని నొడిదుడుకులు లేకుండ నడిపించుట మా వంతు. నైతికముగ, ఆధ్యాత్మికముగ, ఉన్నతి నందించి, చిరస్థాయిగ మహారాజుల విశాలాంధ్ర సామ్రాజ్యపు నామముల చరిత్రయందు నిల్పుట మీభారము" అనినాడు మహామంత్రి తిమ్మరుసు.

"ఆంధ్ర సామ్రాజ్యమును మేము, ఆంధ్రవాఙ్మయ సామ్రాట్టులు మీరు. ఇది సమత కలిగిన విభాగము. తమ కవితాకన్య నొసంగి ఆంధ్ర వాఙ్మయ సామ్రాజ్యమున మా నామము ఆచంద్రతారార్కము నిలుచునట్లు కృషిచేయుడని కోరుచున్నాను." రాయలనినాడు.

పెద్దన తలవంచి యూరకొనినాడు.

తిమ్మరుసు ఆందోళనమందినాడు. "మహారాజుల ప్రార్థనకు జవాబొసంగకుండుట సభాసంప్రదాయము కాదు. పెద్దనా! ఈ సంకోచమేల నయ్యా! నీ కవితాశక్తినే నీవు సంశయించుచున్నావా!" తిమ్మరుసనినాడు.

"నేటి సంస్కృతాంధ్ర కవులందెవ్వరీడు నీకు పెద్దన కవీ! నీవు సందేహింప బనిలేదు." చిరునవ్వుతో రాయలనినాడు.

"ప్రభువులకు నాయందలి యాదరమట్టిది. ప్రభువుల యాజ్ఞమేరకు నా శక్తికొలది ప్రయత్నింతును. అనుజ్ఞ నిండు. నేను రచింపనగు ప్రభువుల హృదయమందున్నట్టిదగు గాథను.

"నీ చతుర రచన కనుకూలమై రసమంచిత గాథలచే నొప్పారు కవితావస్తువొండు మా మనోపథమునందున్నది పెద్దనా!"

"ఆ కథావస్తువెచ్చటిది మహారాజా?"

సభాసదులయందుత్కంఠ పెరిగినది.

"అయ్యది స్వారోచిష మనుసంభవ గాధ. మార్కండేయ పురాణోక్త ప్రకార మా గాధను ఇదివర కే కవియు రచింపని ప్రబంధ ఫక్కిని రచింపుము పెద్దనా!" రాయలనినాడు.

పెద్దన తలయెత్తి రాయలవైపు నిశితముగ గాంచినాడు. రాయల యందే మార్పును లేదు. మెలిదిరిగిన మీ సముల మాటున చిరునవ్వు మాత్రమే చిందులాడుచున్నది. "అందలి వరూధినీ ప్రవరాఖ్యుల గాధ యొక్కటియే ప్రబంధమునకు సరిపడునది పెద్దనా!" తిమ్మనార్యు డనినాడు.

"కవివర్యు లనుభవపరులు. శాంత శృంగారముల శృంగార వైరాగ్యముల ఘర్షణమే ఆ కవితావస్తువు పెద్దనా! నా నిర్ణయమున పొర పాటు లేదనుకొందును. శిరీష కుసుమ పేశల సుధామయోక్తుల చెన్నారు సీ చతురరచన కనుకూలమైన కధావస్తువునే నే గోరికొనినాను. నను వాంఛితార్థసిద్ధి నొనర్చుట సీవంతు." ప్రభువనినాడు.

ప్రభువుల యాజ్ఞమేరకు నడచుకొందును." అనినాడు పెద్దన.

సభలో "జయ! సాహితీ సమరాంగణ సార్వభౌమా! జయ! ఆంధ్ర భూరమానాయకా! జయ! ఆంధ్రకవితాపితామహా! జయ!" మను నినా దములు దిక్కులు పిక్కటిల్ల జేసినవి.

చేటిక యొకర్తుక రాయల యాజ్ఞపై కర్పూరతాంబూలముంచిన బంగరు పళ్ళెరమును మహారాజా ముందుంచినది. సువర్ణములు నిండుగ బోసిన మరియొక పళ్ళెరమును, పట్టువస్త్రములు శాలువలు కల్గిన పళ్లెర ములను మరియిర్వురు చేటికలు కొనివచ్చి నిలచినారు.

సాహితీసమరాంగణ సార్వభౌము డా కృష్ణరాయలు సింహాసనము పైనుండి లేచినాడు.

తనవెంటనే లేచినిల్చిన మంత్రి సామంత పురోహితాదులను తిరిగి కూర్చుండ నియమించినాడాతడు.

అతడే మొనర్పబూనినాడో తెలియలేదు సభికులకు. పెద్దన కూర్చుండిన యాసనమువద్దకే నడచినాడా విద్వత్సభారాయలు.

ఇదేమి సభా సంప్రదాయవిరుద్ధమగు కార్యము లొనర్పబూనుచు న్నాదేమి రాయలు! అనుకొనినాడు అప్పాజీ.

కర్పూరతాంబూలమును చేతుల నందుకొనినాడు రాయలు.

"పెద్దనామాత్యా!" ఆస్వరమునం దార్ద్రత యున్నది. కరుణ యున్నది. ప్రేమ యున్నది. సహృదయత యున్నది. గంభీరత యున్నది.

'నీకు తగు యుపాయనము గాకున్నను స్నేహితుడొసంగు కాను కగా గొనుమిది. కృతికర్తగా నన్నొనర్చి ధన్యునొనర్చుము. వరూధినీ ప్రవరాఖ్యుల కథ నుడువుటకు నీకంటె నర్హులెవ్వరున్నారు పెద్దనా?" రాయలనినాడు.

పెదన మనోంధమున మేఖల మెదలినది. ఆనాటి యా విఫల ప్రణయ మేఖల వరూధిని. తాను ప్రవరుడు. రాయలెంత యాలోచన మొనర్చి నిర్ణయించినాడు!

"తనకీ మర్యాదయేమి? మహారాజే స్వయముగ తన యాసనము కడ కరుదెంచి యర్థించుచున్నాడు. తనపై యాతనికెంతటి యనురాగము! ఆతని హృదయము చెమ్మగిలినది. కన్నులు అశ్రుసిక్తములైనవి. తడిసిన కనురెప్పలెత్తి రాయలవైపు జూచినాడు పెద్దన.

పెద్దనలోని మృదులహృదయమును చూడగలిగినాడు రాయలు.

పెద్దన చేతులు జాచినాడు. కర్పూరతాంబూలము నా దోసలియం దుంచి రాయలు నమస్కరించినాడు పెద్దనకు.

పెద్దన గొంతును సవరించుకొనినాడు. గద్గదికమందిన ఆ కంఠ మున ఆశీర్వచనరూపముగ శిరీషకుసుమముల జల్లు కురిసినది. కృష్ణ రాయల కత్యంతము ప్రీతిపాత్రమగు వెనుకటి పద్యముతోడనే పెద్దన యాశీర్వదించినాడు.

"శ్రీవక్షోజ కురంగనాభ మెదపై జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలా సమీపమున బ్రీతిన్ నిల్పినాడో యనం
గావందారు సనందనాది నిజభక్తశ్రేణికిం దోచు రా
జీవాక్షుండు కృతార్థు జేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్!"

నిమీలితనేత్రుడై వినినాడు రాయలు.

"పెద్దనామాత్యా! తాము రచింపబోయెడి గ్రంథాది నీ పద్యమునే నిలుపుట మా యభీష్టము"

సువర్ణముల పళ్లెరమందుకొని దానిని పెద్దనకందించి తిరిగి నమస్కరించినాడు రాయలు.

చిరునవ్వుతో నాశువుగా పెద్దన యందుకొనినాడు.

"ఉల్లమునందు నక్కుటిల రూఢి మీ కులమందు గంటి మం
చల్లన మేలమాడు నచలాత్మజ మాటకు లేతనవ్వు సం
ధిల్ల గిరీటి పాశుపత దివ్యశరాఢ్యుని జేయు శాంబరీ
భిల్లుడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్!"

అనుచునాశీర్వదించినాడు.

పట్టువస్త్రములు కాశ్మీర శాలువల పళ్ళెరమునందించి తిరిగి నమస్కరించినాడు ఆంధ్రసార్వభౌముడు.

"నాలుగుమోములన్ నిగమనాదములుప్పతిలన్ బ్రచండ వా
తూలహతిం జనించు రొదతోడి గుహావళి నొప్పు మేరువుం
బోలె బయోజపీఠి మునిముఖ్యులు గొల్వగ వాణిగూడి పే
రోలగమున్న ధాత విభవోజ్వలు జేయుత కృష్ణరాయనిన్!"

సభయంతయు ఆనందమున తలమునకలైనది.

మహారాజు సింహాసనముపై నుపవిష్టుడైనాడు, ఆనందతన్మయుడై.

"కవీశ్వరులు గ్రంథారంభ మెప్పు డొనర్తురో?" రాయలడిగినాడు.

"గ్రంథారంభమప్పుడే జరిగిపోయినది. సర్వశుభముహూర్తమున గ్రంథమునకు శ్రీకారము చుట్టబడినది. అనినాడు ఆస్థానజ్యోతిష్యులు ప్రభాకరులు.

కవీశ్వరులందరును సత్కరింపబడినారు.

పెద్దనార్యునకు జరిగిన యా యపూర్వగౌరవము పాలగరాజునకును భట్టుమూర్తికిని కన్నుగుట్టించినది.

ఇది గమనించినాడు పెద్దనామాత్యుని శిష్యుడు తెనాలిరామకృష్ణుడు తన సహాధ్యాయుడు సూరనతో ననినాడా విరసభావమును. తమ గురువుతో మాత్ర మనలేదు వా రీ విషయమై.

## ఇరువదిరెండు

బీజాపూరు సుల్తాను ఇస్మైల్ ఆలీ ఆదిల్షాకు బిజిలీఖానుని మరణము తీరని పరితాపమును కలిగించినది. ఆతని ముఖ్యసేనాపతులలో బిజిలీ ఖానుడొకడు. తమ సరిహద్దులందు నానాటికి అత్యంత పటిష్ఠమగుచున్న విజయనగర సామ్రాజ్యము ఆదిల్షాకు నిద్రపట్టనిచ్చుటలేదు. ఏవిధముననైన విజయనగరరాజ్యమును నాశనమొనర్చుటయే ఆదిల్షాకు కర్తవ్యముగా తోచినది.

ముఖ్యమంత్రి కుతుబ్ వలీ, సైన్యాధిపతి షితాబ్ ఖానులను తన రహస్యాగారమునకు పిలిపించినాడు ఆదిల్షా.

"బిజిలీఖానుని మరణము మనకు నష్టమునేగాక అత్యంత విషాద స్థితిని గొనివచ్చినది. మన బలముపై ప్రజలకే యనుమానములు కలుగుచున్నవి. పెరుగుచున్న యీ హిందూరాజ్యము మనకు ప్రక్కలోని పాము వంటిది. ఇప్పటికే రాయల దృష్టి రాయచూరుదుర్గముపై పడినది. ఈ దుర్గమును వశమొనర్చుకొనుట కిరువురు సేనాపతుల నాతడు నిర్ణయమొనర్చినాడట.

"ఆర్వీటి బుక్కరాయల కుమారుడు రామరాయలు సేనాపతిగా నొనర్పబడినాడు. ఆతడు, పెద్దన దండనాథు లిర్వురు రాయచూరును వశమొనర్చుకొనుటకు ప్రతినమొనర్చినారు." అనినాడు ముఖ్యమంత్రి కుతుబ్ వలీ.

"మనమే విజయనగరముపై నెత్తిపోయి దానిని ధ్వంసమొనర్చిన వారికిప్పట్టున సహాయమొనర్చువారే లేరు." అనినాడు షితాబుఖాను.

"ప్రస్తుతము అది మన కలవియగునది కాదు. విజయనగర

సైన్యము నెదుర్కొనవలయుననిన మన సైన్యము రెట్టింపు కావలయును; చాలకాలపు పోరాటమునకు సంసిద్ధులము కావలయును. ఇతర రాజుల సహాయము నవసరమే." యనినాఁడు మంత్రి.

"గజపతి కుమారైను రాయలు కొనిపోవుటచే గజపతి రాయల యందు క్రోధమందియున్నాడు. ఇప్పుడాతని మనపై పునకాకరించుకొనిన రాయల నొక్కక్షణమున మట్టుబెట్టవచ్చును." అనినాఁడు సైన్యాధిపతి.

ఈ యాలోచనము ఆదిల్షాకు బాగుగ నచ్చినది. ఆతఁడాలోచన యందు బడినాడు.

"మన ముదయగిరి కోటను ముట్టడించిన విషయము గజపతి యప్పుడే మరచిపోవునా ?" ముఖ్యమంత్రి యనినాడు.

"ఆతడు దానిని మరచిపోవునట్లు చేయుటలోనే మన ప్రతిభ యున్నది. గజపతి దండెత్తునట్లొనర్చి ఆతనికి మన సహాయ మందఁ జేసిన గజపతివిషయ మానక చూచుకొనవచ్చును." షితాబుఖానుడనినాడు.

"బిజిలీఖానుని విషయ మేమిచెప్పుదుము ?" ఆదిలా యనినాఁడు.

"తప్పునంతయు మరణించిన బిజిలీఖానునిపై నెట్టివైచిన సరి" యనినాడు షితాబుఖానుడు.

"షితాబ్ ఖాన్, నీవే యందులకు తగినవాడవు. గజపతివద్దకు రాయబారమును నీవే కొనిపొమ్ము." అనినాఁడు ఆదిల్షా.

"చిత్తము. గజపతి మనము మరల్చి మనకాతడు సుముఖుడుగా నొనర్చుటలో నేను కృతకృత్యుడను కాగలనను నమ్మకము నాకున్నది." షితాబుఖానుడనినాడు.

షితాబుఖానుడు భోగకులస్థుడు. విజయనగర రాజవంశమున కితని కేదోనొక సంబంధమున్నదను నొక వదంతి యున్నది. షితాబు ఖానుడు జన్మించినది విజయనగరముననే కాని ఆతని తల్లి బిజాపుర రాజ్యమున చిన్న జమీందారుగానున్న నొక మహమ్మదీయుని యధీనము లోనికి పోయినది. ఆమెతో పాటు మహమ్మదీయుని యధీన మందు బెరిగిన సీతాపతి (ఇది యాతని హిందూనామము) మహమ్మదీ యుడై షితాబుఖానయ్యెను. వయసు వచ్చుసరికి సైన్యమున జేరి అతి

సాహసిగా బేరుగాంచెను. హిందువులపై నాతడు పెంచుకొనిన ద్వేషమున కవధులు లేవు. మధ్యంతరముగా మతాంతరీకరణమందిన మహమ్మదీయుల మతద్వేషమమితము. వారు తమ ప్రథమమతమునంతగా ద్వేషించు వరకును ద్వేషమును నూరిపోయుదురు మతగురువులు. అందున మహమ్మదీయులకు మతసహన మతిక్లుప్తము.

షితాబుఖానునందలి హిందూమతద్వేషమే నాతని నాదిల్‌షా సేనాపతిగా నొనర్చినది. అతడతిసాహసియేగాక రాజనీతి తెలిసినవాడు. మోసమొనర్చి ఇతరుల హృదయముల విరుచుటలో నాతడతి మేధావంతుడు. గజపతియొద్దకు రాయబారము కొనిపోవుటకాతడు సంసిద్ధుడైనాడు.

వెలలేని కానుకలను పెట్టెలకెత్తించుకొని ఐదువందలమంది సైనికులతో నాతడు పయనమైనాడు. ఆదిల్‌షావద్దనుండి యుత్తరము నొకదానిని నాతడు తనవెంట కొని యేగినాడు.

తనవెంట వచ్చిన సైన్యమును కోటబయట నుంచి కొండవీడునందున్న ప్రతాపరుద్రగజపతికి తానాదిల్‌షా పంపగా వచ్చిన దూతనని కబురు పంపినాడు.

తనకోటపై మొన్న దాడిచేసిన ఆదిల్‌షా సేనాపతి షితాబుఖాను తనవద్దకు కొలదికాలమునసే దూతగా నరుదెంచుట గజపతి కత్యాశ్చర్యమును కలిగించినది.

అతడా దూతను ప్రథమమున తిరస్కరించుటకే నిశ్చయించుకొనినాడు. కాని కుమారుడు వీరభద్రగజపతియు మంత్రియు ఆవిషయమేమియో వినదమనినమీదట మరునాడు సభకు రాను షితాబుఖానున కాజ్ఞపోయినది.

తాను గొనివచ్చిన ఆభరణములు, సువర్ణము, విలువగల వస్త్రములు గలిగిన పెట్టెలను పట్టించుకొని గజపతియెదుటి కరిగినాడు షితాబుఖానుడు.

నేలకంట సలాములొనర్చి వినయవిధేయతలతో ఆదిల్షా పంపిన నజరానాల నర్పించుకొనినాడు.

"బిజాపురసుల్తాను లే లాభమాసించి మాకింతలేసి కానుకలంపినారో సేనాపతి తెలియజేయవచ్చును." గజపతి యనినాడు.

"మా సుల్తానులు తమ స్నేహమునుమాత్రమే గోరుచున్నారు." షితాబుఖానుడనినాడు.

"నిన్నటివరకును మాపై శత్రుత్వమును వహించి మా దుర్గములపై శత్రుసైన్యలనడిపిన ఆదిల్‌షాకింతలో నింతటి స్నేహము పుట్టుకొని వచ్చుటలోని యాంతర్యమే మాకు బోధపడకున్నది." గజపతి యనినాడు.

"ఆ పొరపాటును సరిదిద్దికొనుటయే ఈ నా యాత్రలోని అంతర్యము. మహారాజా! మా బిజిలీఖానుడు మీ సరాదారుడు ఉద్దంఖానుని వలలో జిక్కి ధనాశాపీడితుడగుటయే ఉదయగిరిపై యాతని ముట్టడికి కారణము. దాని ఫలితము నాతడనుభవించినాడు. అందుకై ఆ విశ్వాస హీనునికొఱకై మేము చింతించుటలేదు." అనుచు ఆదిల్షా యొసంగిన ఉత్తరమును మహారాజులకడ నుంచి చిత్తగింపుడనినాడు షితాబుఖానుడు. ఆతని వినయప్రవర్తనము మాత్రము మహారాజ హృదయమును లోగొనినది. ఆ జాబును మహారాజందుకొని మహామంత్రి కొసంగినాడు.

శ్రీశ్రీశ్రీ సర్వకళింగ సార్వభౌములు ప్రతాపరుద్ర గజపతుల సన్నిధికి, బిజాపురసుల్తాను ఇస్మైల్ ఆలీ ఆదిల్‌షా వ్రాయు లేఖార్థములు. మా సరదారుడు బిజిలీఖానుని వలన జరిగిపోయిన క్షంతవ్యముకాని యపరాధమునకు మా పరితాపమును తెలుపుకొనుచున్నాము. ఉదయగిరిని ముట్టడింప వచ్చుచున్న రాయలసైన్యమును మధ్యలో ముట్టడించి చీకాకుపరచుటకై, తద్వార అదవాని దుర్గమందలి తిమ్మనకు కొంత వెసులుబాటు కల్గించుటకై బిజిలీఖానుని ముప్పదివేల సైన్యముతో నంపినాము. కాని బిజిలీఖానుడు మీ సరాదారుడుద్దంఖానుని వలయందు పడిపోయినాడు. ఉద్దంఖానుడు చూపిన ధనాశమూలమున బిజిలీఖాను దటు పోవలసిన సైన్యమును ఉదయగిరిపైకి నడిపినాడు. ఆతని విశ్వాసఘాతుకత్వమునకు తగిన శిక్ష యాతడనుభవించినాడు. కాని మా ద్వారా యనుభవింపవలసిన

శిక్ష మా శత్రువుద్వారా పొందుటయే మా యభిమానమునకు అఘాత మైనది.

"ఆ రాయలు తానే సర్వసమర్థుడుగా విఱ్ఱవీగుచున్నాడు. అతడు తమకొనర్చిన యవమానము మీ శత్రువులకైనను బాధను కల్గించునది. స్నేహితుడనగు నేను బాధనొందుటయం దాశ్చర్యమేమున్నది? తాము లేని తరి దొంగతనముగా కుమార్తెను గొని యేగి వివాహమొనర్చుకొనిన ఆ రాయలను అభిమానధనులగు మీరు క్షమింపజాలరని నే నెరుగుదును. అంతియేకాదు. రాయలయందున్నట్టి రాజ్యకాంక్షయే ఈ కార్యములన్నిటి కిని మూలము. అతడీ దక్షిణహిందూదేశమునకే చక్రవర్తి కాగోరు చున్నాడు. అంతటి రాజ్యకాంక్షాపరుని యావేశమును మొదటనే త్రుంచి వేయకున్న మన రాజ్యముల కేనాటికైనను అపాయము తప్పదు. దామి విషయమును దీర్ఘముగ నాలోచించి యొక నిర్ణయమునకు రాగోరు చున్నాను. మన ఉమ్మడిశత్రువైన రాయలను ప్రతిఘటించుటలో తాము ముందంజవైచిన నా సమస్త సైనిక ధన సంపదలను తమ కొఱకై వినియోగింపగలను. లేక మీరట్లు సహాయపడుటకై వాగ్దానమొసంగిన నేనే ముందంజవైచి రాయల నెదుర్కొనుటకు సంసిద్ధుడను. నే మహమ్మ దీయుడను కావచ్చును. రాయలకు హిందూమహమ్మదీయ విచక్షణములేదు. అతనికి కావలసినది రాజ్యముమాత్రమే. దూరమాలోచించి తమ నిర్ణయ మును తెలియజేయగలరు.

— ఇట్లు. స్నేహపాత్రుడు. ఇస్మైల్ ఆలీ ఆదిల్షా."

ఉత్తరమును చదివి వినిపించినాడు మహామంత్రి. నెమ్మదిగా ఆ ఉత్తరమందలి విషయము గజపతి తలకెక్కినది. గజపతి యభిమాన మెచ్చట దెబ్బతినునో యా పట్టులందే ఆ సంధిసబంధములందే నొక్కినా డా దిల్షా. గిలగిలలాడినాడు గజపతి. అతని పౌరుషము. అతని యభిమా నము సర్వము నాశనమైపోయినట్లు భావించినా డాతడు. అతడొక నిర్ణ యమునకు వచ్చినాడు. "మహామంత్రు లేమందురు?" గజపతియడిగినాడు.

"కుటిలుడైన యాదిల్షా మంత్రాంగమే నన్నాశ్చర్యపరచుచున్నది." మహామంత్రి యనినాడు.

"తమ హృదయమును వినగోరుచున్నాము." మహారాజు గజపతి యడిగినాడు.

మహామంత్రి కనుసన్న యెనర్ప సేవకుడొకడు షితాబుఖాను నావలకు కొనిపోయినాడు. అతనికప్పట చల్లని పానీయములు హంకా-నొసంగినదొక యవనసూనిని.

"మహారాజా! లీవిషయమున దూరదృష్టితో చింతించుట యవసరము. నయముననో వేరువిధముననో మన యన్నపూర్ణ వారియింటి కోడలైనది. రాయలామెను చెట్టబట్టి మహారాజుల పిల్లుడెనాడు. ఇకపై సామముననే మన కార్యములను సాధించుకొనుట మంచిదిగా నాకు దోచుచున్నది. దక్షిణమున తమరాజ్యము నభివృద్ధిపఱచుకొనుటకై కుటిలురగు మహమ్మదీయులవలంబించెడి పన్నుగడ యిది. కళింగ, విజయనగర సామ్రాజ్యాధిపతు లొక్కటియైన నీమహమ్మదీయుల నిటనుండి పరిపారవేయుట సులభము. ఈవిషయమందు రాయలు మనతో నేకీభవింపకపోవుట కంత వివేకహీనుడు కాడు. మనము కవ్వించని యాతడికపై మన రాజ్యముపైనె త్తివచ్చునని నే భావింపను. ఈ అదిల్షాతోడి పొత్తు మన కాపదను కొనివచ్చునదేకాని మేలును కల్గించునదిమాత్ర మెన్నటికిని కాదు." మహామంత్రి యవినాడు.

"అదిల్షా తానే రాయలపై కరిగెదననుచున్నాడుకదా?"

"ఈ రెండురాజ్యము లీ బంధుత్వముమూలమున నేకమగునని యాతని భయము. మనమధ్య వివరవలుండుటయే యాతని యభిమతము."

"తుప్పుడై దొంగతనముగా చెల్లెలి నెత్తుకొనిపోయి బలవంతముగ వివాహమాడిన యా నీచుని నరికాల నెఱుకపోయిన నీ యవమానము తీరునా మనకు?" రుద్రమూర్తియై యనినాడు యువరాజు వీరభద్రుడు.

"అన్నపూర్ణయే యాతని ప్రేమించి యాహ్వానించినట్లు తెలియుచున్నది. తిరుమల రాహుత్తరాయలీ విషయమై నెఱుంగునని నా యనుమానము. ఆ ప్రేమికులను విడదీయ నిష్టములేకనే అతడు బందీయై యుండవచ్చును." మహామంత్రియనినాడు.

మహారాజా చకితుడేయైనాడు.

"అట్లయిన నాతని విశ్వాసఘాతకునిగా పరిగణింపవలసినదే." వీరభద్రుడనినాడు.

"యువరాజులు రాజకీయముల మరొకింత నిమిత్తముగ నాలోచించు టవసరము. అనవసర కార్పణ్యములు దేశాభివృద్ధికి ఆటంకములు. మానవమారణహోమకార్యములు యుద్ధములు. ప్రజలెప్పుడును శాంతినే వాంఛింతురుకాని యుద్ధముల కోరరు." మహామంత్రి యనినాడు.

"మన సంబంధము ననుసరించి రాయలు మన ఉదయగిరి దుర్గమును మనకిప్పుడు స్వాధీనమొనర్చునా? ఆతడంతటి విశాలహృదయుడా? ఆతనికి కావలసినవి బంధుత్వము కాదు. రాజ్యము, మహాసామ్రాజ్యము!" అనినాడు వీరభద్రుడు కోపముతో.

'తన కుమారుని ప్రశ్నకు మంత్రి ఏమని సమాధానము చెప్పునో' యనుకొనినాడు ప్రతాపరుద్ర గజపతి.

"దాని కొకింత కాలము గడువవలయును. మనమాతనితో సఖ్యముగా నున్నట్లాతడు కూడ ననుకొనవలయును గదా?" మహామంత్రి యనినాడు.

"ఆ దాసీపుత్రుడు మన వంశగౌరవమును మంటగలుపుటకే మన కన్యను గొనిపోయినా డనిపించుచున్నది. అట్టివానితోడి బంధుత్వము కన్నను విరోధమే మంచిది. విజయనగరసామ్రాజ్యము సర్వనాశనమగుటయే నా మనోరథము." వీరభద్రు డనినాడు.

ఆతనిలో నెంతటి పగ ప్రజ్వరిల్లుచున్నదో యూహించినాడు ప్రతాపరుద్ర గజపతి. తానిప్పుడేమనినను తన కుమారుడు ప్రతిఘటింపక మానడు. ఆదిల్లానిట్లే దువ్వియుంచి అనుకూలసమయమున ప్రయోగింప నిశ్చయించినాడు గజపతి.

"మహామంత్రుల భావములు వా కర్థమైనవి. యువరాజనినట్లు రాయల రాజ్యకాంక్షయందు అనుమానము లేదు. ఆదిలా స్నేహము నిట్లే యుంచి మనముపయోగించుట శ్రేయస్కరముగా తోచుచున్నది." గజపతి యనినాడు.

"ఈ స్నేహము రాయలను రెచ్చగొట్టునట్టిదికదా?" మహామంత్రి యనినాడు.

"అందులకై మనము భయపడవలసిన పనిలేదు." వీరభద్ర గజపతి యనినాడు తీవ్రముగ.

మహామంత్రి యూరకొనినాడు. షితాబుఖానుడు పిలిపింపబడినాడు.

"మీ యాదిల్షా సుల్తానులతోడ మైత్రికి మే మంగీకరించుచున్నాము. దానికి చిహ్నముగా మా సైన్యమును ఆధునికపద్ధతులలో తీర్చిదిద్దుటకై అనుభవపరులగు మా సేనాపతులలో నొక్కనిగా నియమించ గోరుచున్నాము."

అమూల్యాభరణములు కానుకగా నొసంగినాడు షితాబుఖానునకు గజపతి. మహామంత్రి ఆలోచనలను లెక్క చేయలేదాతడు.

తమ సుల్తానుల యనుజ్ఞపొంది షితాబుఖానుడు గజపతి సైన్యమందు సేనాపతిగా చేరినాడు. విజయనగర గూఢచారులీ వృత్తాంతమును తిమ్మరుసునకు తెలుకపఱచినారు. ఈ విపరీతపు స్నేహ మెంతటి విషాదకర స్థితిలోనికి దేశమును లాగుకొనిపోవునో యని భయముజెందినారు విజయనగర మంత్రులు.

## ఇరువదియారవ

ఆనాడు విజయనగరమంతయు నొకవిధముగ పండుగ నొనర్చుకొనినది. పెద్దనార్యుడు రచించిన మనుచరిత్రగ్రంథ మానాడు రాయలు కృతినందును. రాయలు కృతిభర్తగా ఆస్థానకవివర్యుడురచించిన ప్రథమ ప్రబంధమట.

ఆస్థాన పౌరోహితుడు రంగనాథ దీక్షితులు ముహూర్తముంచినాడానాడు. భువనవిజయ సభయందు కృతిప్రదాన మహోత్సవముజరుగును.

సర్వపరివార బృందముతో మంత్రి సామంతులతో కవిపండిత గాయకులతో భువనవిజయము కిటకిటలాడినది. రాజవేశ్య ముద్దునాగ, రాజనర్తకి మేఖల సభాకార్యక్రమమునకు హాజరైనారు.

అత్యాధునిక పద్ధతిని రచింపబడిన ప్రబంధమును విని యానం

దించుటకై రాజ్యమందలి పండితులు, కవులు, గాయకులు ఆహ్వానింప బడినారు.

సభాభవనము మంగళతోరణములతో రంభాస్తంభములతో ముత్యాలజాలరులతో కళకళలాడుచున్నది.

రాయలానాటి వఋవాత నిద్ర మేల్కాంచి అభ్యంగనస్నాన మాచరించి, విఠలస్వామి, పంపాపతి, రామస్వామి యాలయముల పూజలొనర్చినారు. ఉదయము జాముప్రొద్దెక్కినప్పటికి సభాభవనపు మోసాల గంటలు మ్రోగినవి.

రాయలు తన యాస్థానమందలి పండితబృందముతో మహామంత్రి సేనాపతులతో గదలి పెద్దన గృహమునకు బయలుదేరినారు. రాయలధివసించిన మదకరీంద్రము వెనువెన్కనే ముత్యాలపల్లకి నవరత్న స్థగితమై వారి ననుగమించుచున్నది.

పెద్దన వేకువనే మేల్కనినాడు. తన గురుదేవులగు శఠగోప యతీశ్వరుని ధ్యానించుకొనినాడు. అభ్యంగనస్నానమొనర్చి పట్టుదువ్వలువలు దాల్చి ముఖమున కస్తూరికాతిలకము ధరించి యిష్టదైవమును ధ్యానించుచున్నాడు.

తనకొఱకు రాయలంపు పాలకికొఱకాత డెదురుచూచుచున్నాడు. తన రచన మీనాడు సభయందు పఠింపవలయును. కవిపండితులు దాని నెట్లు విమర్శింతురో.

ఇంతలో వీధియందు నగారానౌబతులు మ్రోగినవి. చొక్కనామాత్యు లాశ్చర్యపరవశుడైనారు. ప్రభువులే యరుదెంచుచున్నారనువార్త నొకసేవకుడు వచ్చి తెల్పి యరిగినాడు.

పెద్దన గృహాంగణమున కాశ్మీరపు తివాసీ పరువబడినది. మహారాజు లుపవిష్టులగుటకు సింహాసన మమర్పబడినది.

మహారాజే స్వయముగ నిట్లరుదేరునని యెవ్వరనుకొనలేదు. పెద్దన విషయమున మహారాజు తాను మహారాజుగ నడచుకొనుటలేదు. అది

యొక యాత్మీయత, ఒక గౌరవము, ప్రాణములొసంగెడి స్నేహము, పొరపొచ్చెములులేని మమత.

మంగళవాద్యములతో ఉత్సవము పెద్దనయింటిముం దాగినది. పెద్దన చొక్కనామాత్యు లెదురేగి మహారాజులను తోడ్కొనివచ్చినారు గృహములోనికి. రాజువెంటనున్న అంగరక్షకుడు పీనుమల్లు కన్నులు మిలమిలలాడినవి. తన స్నేహితున కేరాజునకు, ఏ మహామండలేశ్వరున కే కవికి, పండితునకు జరుగనంతటి మహాగౌరవ మీనాడు జరిగినది. సర్వవిజయనగర సామ్రాజ్య చక్రవర్తి స్వయముగా కవితాకన్యను కృతి కర్తను సభకు గొనిపోవుటకు వచ్చుట మహాగౌరవము గాదేమి? ఆభావ మా కన్నులలో ప్రతిఫలించినది ఆతడొకింత గర్వమునొందినాడుకూడ. పెద్దన చిరునవ్వుతో నాతని బలుకరించినాడు.

మహారాజులు సింహాసనమున నుపవిష్టులైనారు. ప్రక్కనున్న యాసనమున మహామంత్రి తిమ్మరుసులవారు కూర్చుండినారు.

"క్షమింపవలయును. మహారాజులకు తగిన మర్యాదలొనర్ప సమర్థులము కాము." అనుచు కస్తూరితో పరిమళించు గంధమును మహారాజుల చేతులం దొసంగినాడు చొక్కనామాత్యుడు వినయముగ.

"చొక్కనామాత్యులు మాకొనర్పు మర్యాదయేమి? మేమే వారి కెంతయో ఋణపడియున్నాము."

"మహారాజులంతటిమాట యనవలదు. ఇవి మహారాజులకొఱకైన శరీరములు." చొక్కనామాత్యుడనినాడు.

బంగారుపువ్వులుతాపిన సరస్వతీపీఠముపై మనుచరిత్రగ్రంథ ముంచబడినది. అది మహారాజుల కెదురుగా నున్నది. కవిపండితులకు చందనతాంబూలములు సమర్పింపబడినవి.

"పెద్దనా! ముత్యాలపల్లకి సిద్ధముగనున్నది. ముహూర్తసమయ మాసన్నమగుచున్నది. బయలుదేరుదము." మహామంత్రి యనినాడు.

పెద్దన శిష్యులు తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరన యిరువురును లేచి నిలచినారు. ఆ యిర్వురును పదునైదు పదునారేండ్ల బాలకులు. పెద్దనవద్ద కవిత్వతత్వ మభ్యసించుచున్నారు. రామకృష్ణుడు అత్యు

త్సాహసంతుడు. ఆవేశపడుట వెనుకముందు చూచు స్వభావము కాదత నిది. ఆ పాలారు ముఖమండలి తేజము చూచువారలకొక యాకర్షణము, పింగళి సూరన వామనవాయు మేనివాడు. అ కన్నులలోని తళతళలాతని నొక శృంగారపురుషునిగా కన్పింపజేయును. ఊర్ధ్వపుండ్రములా ముఖ మున కొక వింతసొబగును గొనివచ్చినది. ఆతడంత మాటకారి కాడు. కలముగొని వ్రాయుటలోని యాతనినేర్పు రామకృష్ణునందు లేదు. రామ కృష్ణుని యాకుపునంపలి పటిమ సూరనయందు కానము.

కృష్ణరాయల దృష్టు లొకటిరెండు పర్యాయములు రామకృష్ణునిపై కదిగినవి. ఆతడాకించుక సిగ్గుతో తలవంచికొనినాడు. సూరన రాయలపై దృష్టినే నిలుపజాలకపోయినాడు.

తిమ్మరుసు పింగళి సూరనపైకి తన దృష్టిని మరల్చినాడు.

"ఈ బాలకు లెవ్వరు పెద్దనా?" చెవులందలి కుండలాల కాంతులు చౌకళింప నంది తిమ్మనార్యు డనినాడు.

"వీరిరువురును నా శిష్యులు. ఈతడు గార్లపాటి రామకృష్ణుడు. ఆశుకవిత్వ మిప్పటున అభ్యాసమొనర్చుచున్నాడు." అనినాడు పెద్దనా మాత్యుడు.

"రామకృష్ణా! నాపైనొకపద్యమును చెప్పెదవా'" తిమ్మనార్యు డనినాడు.

ఇంతయ కవిపండితులలో తాను పద్యము చెప్పుటా? చెప్పిన తప్పేమి? చెప్పమంచురా యన్నట్లు గురువుగారివైపు చూచినాడు రామ కృష్ణుడు. తిరిగి రాయలవైపు జూచినాడు.

"పెద్దనా! శిష్యుడు పద్యముచెప్పుట కనుజ్ఞను కోరుచున్నాడు" తిమ్మరు సనినాడు.

"రామకృష్ణా! ప్రభువులు మెచ్చునట్లుగా చక్కని పద్యమునను ము, నంది తిమ్మనార్యు దసమానుడగు కవీశ్వరుడు."

రామలింగడు ప్రభువునకు నమస్కరించి నిలచినాడు. ఆ స్వర మున పారిజాతముల జల్లులు కురిసినవి. వీణాతంత్రుల ధ్వనులు వెలువడి నవి. మోహనవంశీనినాదములు విస్తరించినవి_

"మా కొలది జానపదులకు
నీ కవితాకీవి యబ్బునే కూప నట
ద్భేకములకు గగనధునీ
శీకరముల చెమ్మ? నంది సింగయ తిమ్మా?"

అల్లన విచ్చు క్రొవ్విరుల నెత్తావుల నలముకొని గగనధు నీశీకరముల చల్లదనముల లయించుకొని కవిత్వ మలయమారుత మా సభపై వీచినది. ఆహా యనిపించినది.

రాయలాశ్చర్యమగ్న మానసుడై నాడు. ఈ బాలకుడేమి ? ఈకవిత్వమేమి ? అతని మోము ప్రపుల్లమైనది. దయార్ద్రదృష్టుల నాతనిపై పరపినాడు.

నందితిమ్మనార్యునకా ప్రశంస అందరు కవిపండితులయెదుట జరుగుట అపూర్వానందమునే కల్గించినది.

"చిరంజీవివగుము రామకృష్ణా! కొలదికాలములో అత్యున్నత స్థానము నందగల్గు భాగ్యమున్నది నీలో!" ననినాడు తిమ్మన.

బయట నగారానౌబతులు మ్రోగినవి. రంగనాథదీక్షితులు లేచినాడు. చేత ఎఱ్ఱనీరు నుంచుకొని మేఖల యరుదెంచినది. ఆమె వెనువెన్క ఉమాదేవి యరుదెంచి భర్తముఖమున కుంకుమ నిడినది. పెద్దన తండ్రిపాదములకు నమస్కరించినాడు. ఆనందబాష్పములతో లేవనెత్తినాడు చొక్కనామాత్యుడు

పెద్దనశిష్యు లిర్వురును సరస్వతీపీఠాంతరాసహా స్వారోచిష మనుసంభవ ప్రబంధమును మోసుకొని ముత్యాలపల్లకికడ కరుదెంచినారు, రాయలచ్చటనే నిలచియున్నాడు. తెచ్చెడు గ్రంథమును తా నందుకొని రాయలు పల్లకియందిడినాడు. పెద్దన యరుదెంచినాడు,

"రమ్ము పెద్దనా! ఈ పల్లకియం దధివసింపుము." రాయ లాహ్వానించినాడు.

"ప్రభువులు గజారోహణమొనర్పుడు ప్రథమమున." పెద్దన యనినాడు నవ్వుచు.

"అట్లుకాదు. ఆంధ్ర కవితాపితామహులు మీరు. ఈనాడు మీకు ముందుగా మేమెవ్వరము వాహనములెక్కజాలము." అనినారురాయలు. పెద్దన మోమెత్తి రాయలపై చూచినారు. చిఱునవ్వుదక్క అందేమియు లేదు.

"నే సామాన్యుడను. నా కంతటి మర్యాద యక్కఱలేదు." పెద్దన యనినాడు.

"మర్యాదకోఱిన వచ్చునదికాదు పెద్దనా! సమయము మీఱుచున్నది. కానిమ్ము" అనినాడు మహామంత్రి తిమ్మరుసు. పెద్దన ముత్యాలపల్లకి యందాసీనుడైనాడు.

బోయీలొకవైపున నెత్తినారు. వెనుకవైపున నెత్తిన బోయీలతో రామకృష్ణుడును సూరనయు చేయికల్పినారు. ముందువైపు ఎత్తిన బోయీలతో రాయలే పల్లకి తన కేలబట్టి యెత్తినాడు.

ఈ చర్య రాజ్యాధికారులను, కవి పండితులను, మంత్రి సామంతులను విస్మయానందమగ్నుల నొనర్చినది. పెద్దనకన్నులశ్రుసిక్తములే యెనవి.

వెనుక పల్లకీనెక్కవచ్చిన ఉమాదేవి పైటచెఱగుతో కన్నులు తుడుచుకొనినది. విరిసిన సహస్రపత్రకమలమే యైనదాతరుణి వెమ్మోము. మేఖల యానందమునకు హద్దులు లేవు.

"జయ ఆంధ్రకవితా పితామహా!

జయ అల్లసాని పెద్దన కవీంద్రా! జయ!"

అని జయ జయ ధ్వనులొనర్చినారు వారు, ఇరువైపుల శిష్యులు రామకృష్ణ సూరనలు వింజామరలు వేయుచుండ ముత్యాలపల్లకి రాజమార్గమున మహోత్సవముతో సాగిపోయినది. మదగజముపై రాయలరుదెంచినాడు.

రాయలు సింహాసనాసీనుడైనాడు. అంతఃపురాంగనలు అవని కాభ్యంతరమునుండి సభయందలి కార్యకలాపముల దిలకించుచున్నారు. అన్నపూర్ణాదేవి సరసనే ఉమాదేవి యున్నది. తిరుమలదేవి వద్ద కూరుచున్నది మేఖల. ముద్దునాగ తనస్థానము నందున్నది.

పురోహితుడు అప్పుడు నారికేళముంచి విఘ్నేశు నావాహన మొనర్చి అవిఘ్నమస్తని పూజ నొనర్చినాడు. పురోహితుని స్వస్తి వాచకము లైనవి. శాస్త్రోక్త రీతిని అల్లసాని పెద్దనామాత్యుడు తన కావ్య కన్యను శ్రీ తిరుమల వేంకటేశ్వరునికి ప్రీత్యర్థముగా శ్రీ వీరకృష్ణదేవ రాయలకు కన్యాదాన మొసంగినాడు. ఆతడా గ్రంథమును ధారాపూర్వకముగా రాయలను కృతిపతిగా సంభావించి దానమొనర్చినాడు. ఇప్పటియే గాని పుచ్చుకొనుట వెలుగని రాయలు దానమును కొనినాడు.

రాయలు కావ్యకన్యకను పరిగ్రహించి తన కీర్తి ఆచంద్రతారార్కమాంధ్రభూమిపై నెలకొనియుండు సప్తసంతానములందొకటి యగు కృతి పతిత్వమందినాడు.

పెద్దనకు రాయలు ధారాపూర్వకముగా కోకటగ్రామమును సర్వకర పరిహారముగ నగ్రహారమొనరి దానమొనర్చినాడు. ఆనాడు రాయలు పెద్దనకొసంగిన ధనము ఏనుగులపై పెద్దనయింటికి జేర్పబడినది.

రాయల స్వంతభోజనశాలయందు ఆ సభయందలి వారలందఱకు వారివారి కులక్రమాగతముగ నాడు విందుభోజన మొనర్పబడినది. కవి పండితులందరానాడు పుష్కలముగ బహూకరింపబడినారు. భోజనానంతరము పెద్దన తానొనర్చిన మను చరిత్రను పఠించి రాయలకు విన్పును. సభ పూర్ణగర్భిణివలె నున్నది. ఇసుకవైచిన రాలని జనము. సూదివైచిన వినబడునంతటి నిశ్శబ్దము. రత్నకంబళములు సభనిండుగ కవి పండిత బృందములకు వేయబడినవి. అందరందు సుఖోప విష్టులైనారు.

పెద్దనార్యుడు రెండువైపుల శిష్యులు వింజామరలతో వీచుచు తన్ను పరివేష్టింప రాయలకెదురుగా కూరుచున్నాడు. సరస్వతీ పీఠముపై మనుచరిత్ర ప్రబంధమున్నది. కందుకూరి రుద్రకవియు, నాతని శిష్యుడు నాగండ్ల చిట్టెప్ప సభయందున్నారు.

ధూర్జటి కవియు, నాతని ప్రక్కన నంది తిమ్మనయు నుపవిష్టులైనారు. మాదయగారి మల్లన, చింతలపాటి యెల్లనార్యుడు, తిమ్మణ్ణయను కన్నడకవి, ఇరుసమయవిళక్కమ్ అను గ్రంథమును వ్రాసిన హహారతి

దారుడు, మంజరిప్స్రా గ్రంధమును వ్రాసిన జ్ఞాన ప్రకాశకవి, చూడామణి నిఘంటుకర్త మండలపురుషకవి, కావ్యసార గ్రంధరచయిత అభినవవాది విద్యానందుడను జైనకవి ఆనాటి సభయందలి ముఖ్యులు.

రాజశాసనరచయిత సభాపతి, ఆతని తండ్రి అభిరామకవి, శాసన లేఖకులు మల్లన, వీరణాచార్యుడు నాసభయందున్నారు.

సంగీతసూర్యోదయ గ్రంధకర్త బందం లక్ష్మీనారాయణ సభ నలంకరించినాడు.

రాయల రాజకీయాధికారులలో కొందరు కవులున్నారు. మహామంత్రి తిమ్మరుసు స్వయముగా కవి పండితుడు. ఈతడగస్త్యబాల భారతమునకు మనోహరమగు వ్యాఖ్యనురచించెను. చంద్రికవ్యాఖ్యానకర్త నాదిండ్ల గోపమంత్రి, మహిమ్నస్తవ వ్యాఖ్యాత దేచయామాత్యుడు వీరితోగూడా నితర రాజకీయాధికారులు ఆసభ నలంకరించినారు.

రాయలు విచ్చేసి సింహాసన మధిష్ఠించినాడు, "పెదన కవీంద్రా! సభయంతయు నీ కావ్యరసామృతాస్వాదనకై ఆతురతతో వేచియున్నది." రాయలనినాడు.

"ప్రభూ నిరాశ్రయులైన పండితులు, లతలు, వనితలు, శోభింపవందురు. మీ యాలంబనమున నాకావ్యకన్యక కీర్తికెక్కుచున్నది." పెద్దన తన కృతజ్ఞతను మాటలలో వెల్లడించినాడు.

"మహాకవీ! కానిండు మీ కావ్యగానమును," మహామంత్రి యప్పాజీ యనినాడు.

"మహామంత్రుల యాజ్ఞ" పెద్దన మొదలిడినాడు—

"కరుణాకర వేంకటవిభు చరణస్మరణ ప్రసంగ సంగత మతి కీ
శ్వర నరసింహ మహీభృద్వరనందన కృష్ణరాయ ధరణీపతికిన్!
అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన స్వారోచిషమను సంభవంబను మహాప్రబంధంబునకు గధాక్రమంబెట్టిదనిన—

"వరణాద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధ సుధా ప్రభాధవళిత ప్రాలేయరుఙ్మండ లీ

హారిణంబై యరుణాస్పదంబనగ నార్యావర్త దేశంబునన్
బురిమొప్పున్ మహికంఠహార తరళస్ఫూర్తి విడంబింపుచున్.
"ఆ పురి నాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీ
క్షాపరతంత్రు డంబురుహ గర్భకులా భరణాం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యు డలేఖ్య తనూవిలాసుడై,

"మేఖల తలయెత్తి అలేఖ్య తనూవిలాసుడగు నా యల్లసాని ప్రవరుని గాంచినది.

"ఆప్రవరాఖ్యుడు_

"వరణాతరంగిణీ దరవికస్వర నూత్నకమల కషాయగంధము వహించి ప్రత్యూషపవనాంకురములు పైపైనువేళ వామనస్తుతి పరత్వమున లేచి -

సభికులు కథయందు లీనమైనారు, ప్రవరుడొనర్చెడి వామనస్తుతి వారి కర్ణముల సోకి, మానసముల స్ఫురించినది.

"హేమాద్రిశిఖరాకారం శుద్ధస్ఫటిక సన్నిభం
పూర్ణచంద్రనిభం దేవం ద్విభుజం వామనం స్మరేత్.
"సూర్యకోటి ప్రతీకాశం చంద్రకోటి సుశీతలం
చంద్రమండల మధ్యస్థం విష్ణుమచ్యుత మవ్యయం.
"శ్రీవత్సకౌస్తుభోరస్కం దివ్యరత్న విభూషితం
పీతాంబర ధరం దేవం వనమాలా విభూషితం.

"అజిన దండ కమండలు మేఖలారుచిరపావన వామనమూర్తయే
విగతజగత్త్రితయాయ జితారయే నిగమ వాక్పటవే నమః.

"శ్రీభూమి సహితం దివ్యం ముక్తాహార విభూషితం
నమామి వామనం దేవం భుక్తిముక్తి వరప్రదం
వామనో బుద్ధిదాతా చ ద్రవస్థో వామన స్మృతః
వామన స్తారకోభాభ్యాం వామనాయ నమో నమః."

ప్రవరుడు సంధ్యావందనాది కృత్యము లొనర్చినాడు. ఛాత్రులను బిలచినాడు_ఆకావ్య పఠన మొక నాటకముగా నవభాసించినదచట. కావ్యమందలి పాత్రలు తనుముందుండి నటించినట్లే తాము కాంచినట్లే భావించినారు సభికులు.

"ఛాత్రులారా! ఫలములు కుశలు కొనివచ్చినారా, రండి యింటి కరుగుదము." ప్రవరుడనినాడు.

వేవురు వచ్చినను వండివార్చి వడ్డించు నర్ధరాత్రియైనను ప్రవరుని భార్య. ఆమెవచ్చి భర్తకు సమస్కరించినది. తండ్రీ, నమస్కారమనుచు తండ్రికి నమస్కరించినాడు ప్రవరుడు. దీర్ఘాయుష్మాన్భవ యనిదీవించినాడు ప్రవరునితండ్రి. యోగసిద్ధుడొకడు ప్రవరాఖ్యుని గృహమున కరుదెంచినాడు. ఎవ్వరు? ఎవ్వరో యోగసిద్ధుడు. "స్వామీ! రండు రండు ఇది ప్రవరాఖ్యుని గృహము. నన్నే ప్రవరాఖ్యుడందురు. స్వామీ, సుఖోపవిష్టులు కండు. నేటికి నా యాతిథ్యమును స్వీకరింపుడు" ప్రవరు డతిథిని ఆహ్వానించినాడు.

"సుఖీభవ నాయనా! మావంటి తెరికులకు మీవంటి గృహస్థుల సుఖజీవన మేకదా యాలంబనము!" యోగి యనినాడు

"ఎచ్చటనుండి యెచ్చట కరుగుచు యిచ్చట కరుదెంచి నా మందిరము పావనమొనర్చితిరి స్వామీ! తమవంటి యోగిజనులు స్నానపానముల సంతుష్టులైనగదా మా భాగ్యవైభవముల కృతార్థత!"

"మౌని నాథ, కుటుంబజంబాలపటల
మగ్న మానసుశ గృహమేధి మండలంబు
నుద్ధరింపగ నౌషధ మొందుగలదె
యుష్మదంఘ్రి రజోలేశ మొకటిదక్క"

ప్రవరాఖ్యుడనినాడు - "స్వామీ! తామే యే దేశములు చూచినారు! ఏ పుణ్యక్షేత్రముల సందర్శించినారు? ఏ నదులందు మునిగినారు. ఆచ్చటి వింతలను మహాత్మా! నాకెఱిగింపరా?" అడిగినాడు ప్రవరుడు.

"ప్రవరాఖ్యా! నే తిరుగని దేశములు పుణ్యక్షేత్రములు లేవు.

ఈ దేశ మా దేశ మననేలనయ్యా! సమస్త భూవలయమును జుట్టివచ్చినాను"

"భూవలయమంతయు జుట్టివచ్చితిరా స్వామీ? వేఱుగ దలంపకుడు. మీ మహిమ లెరుంగుట మా వశమా స్వామీ? ఇంత చిన్నవయసు ననే .. _ _ _" సంకోచింపుచు ఆగినాడు ప్రవరాఖ్యుడు.

"ఎట్లింతమారము తిరిగివచ్చితి రందువా నాయనా! అది పరమ రహస్యము. అయినను దాపక చెప్పెదను వినుము. యోగసిద్ధులమైన మాకు పాదలేపనమనెడి దివ్యౌషధము ఈశ్వరసత్కృపవలన గల్గినది. ఆ ఔషధప్రభావమున ఎంతదవ్వైనను శమలేక వాయువేగ మనో వేగముల నరుగగలము." తన రహస్యమును యోగసిద్ధుడు నుడివినాడు.

"యోగీశ్వరా! నా తప్పును క్షమించి నా ప్రశ్నములు సహించి తమ శిష్యునిగాగొని తీర్థయాత్రలొనర్చుశక్తి ననుగ్రహింపుడు."

"ప్రవరాఖ్యా, నీ సత్కార్యములు మా మెప్పునకు వచ్చినవి. ఇదిగో, పాదలేపనము. నీవు కోరిన స్థలమును వలంచుకొనుము మనో వేగమున నందు జేరగలవు. మేము పోయివత్తుము. జై మహేశానా!"

"కృతార్థుడను స్వామీ!"

కృష్ణరాయప్రభూ! అవధరింపుడు_

"ఆ మందిడి యతడరిగిన
భూమీసురు డరిగె మహిన భూధరశృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీఝరీనిరీక్షాపేక్ష"

"లేదమంపాకునందలి లాలిత్యము కుంభి కుంభములందలి బిగియు జూపించినాడవీ కవిత్వమున పెద్దనార్యా!" తన మెప్పును ప్రకటించినాడు రాయలు.

"ఈ ప్రత్యక్షరప్రతిభ యప్రతిమానము పెద్దనా! జాతిరత్నము సానబెట్టుకొలది ప్రకాశించును." తిమ్మరుసనినాడు.

"మిత్రుడా! నేటి నాయానందమున కవధులు లేవు!" తన యానందమును వెల్లడించినాడు రాయలు.

"చక్రవర్తీ! నా ప్రవరుడు హిమాలయములు జేరినాడు" పెద్దన

ప్రవరుడు సంధ్యావందనాది కృత్యము లొనర్చినాడు. ఛాత్రులను బిలచినాడు_ఆకావ్య పఠన మొక నాటకముగా నవభాసించిన దచట. కావ్యమందలి పాత్రలు తనముందుండి నటించినట్లే తాము కాంచినట్లే భావించినారు సభికులు.

"ఛాత్రులారా! ఫలములు కుశలు కొనివచ్చినారా, రండి యింటి కడుగుదము." ప్రవరుడనినాడు.

వేపురు వచ్చినను వండివార్చి వడ్డించు నర్ధరాత్రియైనను ప్రవరుని భార్య. ఆమెవచ్చి భర్తకు సమస్కరించినది. తండ్రీ. నమస్కారమనుచు తండ్రికి నమస్కరించినాడు ప్రవరుడు. దీర్ఘాయుష్మాన్భవ యనిదీవించి నాడు ప్రవరునితండ్రి. యోగసిద్ధుడొకడు ప్రవరాఖ్యుని గృహమున కరుదెంచినాడు. ఎవ్వరు? ఎవ్వరో యోగసిద్ధుడు. "స్వామీ! రండు రండు ఇది ప్రవరాఖ్యుని గృహము. నన్నే ప్రవరాఖ్యుడందురు. స్వామీ, సుఖోప విష్టులు కండు. నేటికి నా యాతిథ్యమును స్వీకరింపుడు" ప్రవరు డతిథిని ఆహ్వానించినాడు.

"సుఖీభవ నాయనా! మావంటి తైర్థికులకు మీవంటి గృహస్థుల సుజీవనమేకదా యాలంబనము!" యోగి యనినాడు

"ఎచ్చటనుండి యెచ్చట కరుగుచు యిచ్చట కరుదెంచి నా మందిరము పావనమొనర్చితిరి స్వామీ! తమవంటి యోగిజనులు స్నాన పానముల సంతుష్టులైనగదా మా భాగ్యవైభవముల కృతార్థత!"

"మౌని నాథ, కుటుంబజంబాలపటల
మగ్న మాదృశ గృహమేధి మండలంబు
నుద్ధరింపగ నౌషధ మొండుగలదె
యుష్మదంఘ్రి రజోలేశ మొకటిదక్క"

ప్రవరాఖ్యుడనినాడు - "స్వామీ! తా మే యే దేశములు చూచినారు! ఏ పుణ్యక్షేత్రముల సందర్శించినారు? ఏ నదులందు మునిగినారు. ఆచ్చటి వింతలను మహాత్మా! నాకెఱిగింపరా?" అడిగినాడు ప్రవరుడు.

"ప్రవరాఖ్యా! నే తిరుగని దేశములు పుణ్యక్షేత్రములు లేవు.

ఈ దేశ మాదేశ మననేలనయ్యా! సమస్త భూవలయమును జుట్టివచ్చినాను"

"భూవలయమంతయు జుట్టివచ్చితిరా స్వామీ? వేఱుగ దలంపకుడు. మీ మహిమ లెఱుంగుట మా వశమా స్వామీ? ఇంత చిన్నవయసు ననే -- — — —" సంకోచింపుచు ఆగినాడు ప్రవరాఖ్యుడు.

"ఎట్లింతమూరము తిరిగివచ్చితిరందువా నాయనా! అది పరమ రహస్యము. అయినను దాపక చెప్పెదను వినుము. యోగసిద్ధులమైన మాకు పాదలేపనమనెడి దివ్యౌషధము ఈ శ్వరసత్కృపవలన గల్గినది. ఆ ఔషధప్రభావమున ఎంతదవ్వైనను శమలేక వాయువేగ మనో వేగముల నరుగగలము." తన రహస్యమును యోగసిద్ధుడు నుడివినాడు.

"యోగీశ్వరా! నా తప్పును క్షమించి నా ప్రశ్నలను సహించి తమశిష్యునిగాగొని తీర్థయాత్రలొనర్చుశక్తి ననుగ్రహింపుడు."

"ప్రవరాఖ్యా, నీ సత్కార్యములు మా మెప్పునకు వచ్చినవి. ఇదిగో, పాదలేపనము. నీవు కోరిన స్థలమును దలంచుకొనుము మనో వేగమున నందు జేరగలవు. మేము పోయివత్తుము. జై మహేశానా!"

"కృతార్థుడను స్వామీ!"

కృష్ణరాయప్రభూ! అవధరింపుడు—

"ఆ మందిడి యతడరిగిన
భూమీసురు డరిగె దుహిన భూధరశృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షాపేక్ష—"

"లేదమంపాకునందలి లాలిత్యము కుంభి కుంభములందలి బిగియు జూపించినాడవీ కవిత్వమున పెద్దనార్యా!" తన మెప్పును ప్రకటించినాడు రాయలు.

"ఈ ప్రత్యక్షరప్రతిభ యప్రతిమానము పెద్దనా! జాతిరత్నము సానబెట్టుకొల్దది ప్రకాశించును." తిమ్మరుసనినాడు.

"మిత్రుడా! నేటి నాయానందమున కవధులు లేవు!" తన యానం దమును వెల్లడించినాడు రాయలు.

"చక్రవర్తీ! నా ప్రవరుడు హిమాలయములు జేరినాడు" పెద్దన

యనినాడు.

"కవీంద్రులు మమ్మే రసలోకములందు జేర్చబోవుచున్నారు. కానిండు" తిమ్మన యనినాడు.

"అట జని కాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుటనటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
గటకచరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్."

ఈ హిమాలయములెంతటి మనోహరములు. హిందూదేవతల నివాసస్థానమీ పర్వతరాజము. దేశౌన్నత్యమునకు చిహ్నమీ పర్వత రాజము. వేదభూమియగు నార్యావర్తమునకు జీవిక. ఆర్యావర్త వేదమత సంస్కృతి యీ పర్వతమందే నిక్షిప్తము.

"తలమే బ్రహ్మకునైన నీనగమహత్త్వంబెన్న నేనియ్యెడన్
గల చోద్యంబులు రేపు గన్గొనియెదన్ గాకేమి నేడేగెదన్
నళినీబాంధవ భాను తప్తరవికాంతస్యందినీహార కం
దళ చూత్కార పరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నమున్
దెల్పెడిన్.

అనుకొనుచు ప్రవరు డిలు జేరగోరినాడు. పాదలేపనము నీహారవారి బెరసి కరిగిపోయినది. ప్రవరుడు దీనుడైనాడు. "ఈశ్వరా! సిద్ధునివ్యాజమున నన్నీ ఘోరవనప్రదేశమున బడవైచితివా? ఎక్కడి యరుణాస్పదపుర మెక్కడి తుహినాద్రి. అక్కటా! శ్రోత్రియులు బుద్ధిజాడ్యజనితోన్మాదులుకదా? నాకిలు జేరు నుపాయముదెల్పువారెవ్వరు"

దూరమునుండి వీణాధ్వని వినిపించినది, ప్రవరునకాశారేఖ మొలకెత్తినది. వీణపై సన్ననిగొంతుకతో వరూధిని రాగాలాపన మొనర్చినది. ప్రవరుడట జేరినాడు.

అదిగో స్త్రీ స్వరము. ఎవ్వరీమె? గంధర్వ స్త్రీగాదుకదా?

వరూధినికన్నులింతయొనర్చుకొని ప్రవరునిగాంచినది. "ఎవ్వరీతడు? నలకూబరుడా? కంతుడా? వసంతుడా? ఏమి వీని సోయగము. నా హృదయమేల నిట్లవశ మగుచున్నది? నన్నీతడు పరిగ్రహించిన

మన్మథుని బంటుగా నేలనా?" ఆలోచించినది వరూథిని।

"ఈమె సహాయమున నే నిలుజేరగల్గిన ధన్యుడను." అనుకొని ప్రవరాఖ్యుడు వరూథినికడ జేరినాడు.

"ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ యొంటిజరించెదోట లే
కివ్వనభూమి భూసురుడ నే బ్రవరాఖ్యుడ ద్రోవదప్పితిన్
గ్రొవ్వన నిన్నగాగ్రమునకున్ జనుదెంచి పురంబుజేర నిం
కెవ్విధిగాంతు దెల్పగదవే తెరువెద్ది? శుభంబు నీ కగున్"
వరూథిని కలకలనవ్వినది.

"ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియగాక నీ వెరుగవే మును వచ్చిన త్రోవ చొప్పు నీ
కింత భయంబులే కడుగ నెల్లిదమైతిమె మాటలేటికిన్."

అనుచు నర్మగర్భముగా బల్కినది వరూథిని. మరల యామెయే యనినది "విప్రకుమారా! నాపేరు వరూథిని. రంభా, ఊర్వశీ తిలోత్తమలు నా సఖురాండ్రు —

"భూసుర కైతవ కుసుమ శ
రాసన. మాయింటి విందవై తివి గైకొ
మ్మా సముచితమ్మణిభవ
నాసీనత సేదదేరి యాతిథ్యమ్మున్."

అని కోరినది వరూథిని,

"వరూథినీ, నీవొనర్చు సపర్యలు మాకు నచ్చినవి, నే నిలుజేరు నుపాయము దెల్పి పుణ్యమున బొమ్ము."

"ఊరు ఊరంచు వాపోయెదరేల స్వామీ!

"ఎక్కడి యూరు? కాల్నిలువకింటికి బోయెదనంచు బల్కె దీ
వక్కట మీ కుటీరనిలయంబులకున్ సరిరాకపోయెనే
ఇక్కడి రత్నకందరము లిక్కడి నందన చందనోత్కరం
బిక్కడి గాంగసైకతము లిక్కడి యీ లతలీ నికుంజముల్"

అనుచు హేళన మొనర్చినది వరూథిని.

యనినాడు.

"కవీంద్రులు మమ్మె రసలోకములందు జేర్పబోవుచున్నారు. కానిండు" తిమ్మన యనినాడు.

"అట చని కాంచె భూమి సురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుటనటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
గటకచరత్కరేణు కరికంపిత సాలము శీతశైలమున్."

ఈ హిమాలయములెంతటి మనోహరములు. హిందూదేవతల నివాసస్థానమీ పర్వతరాజము. దేశౌన్నత్యమునకు చిహ్నమీ పర్వతరాజము. వేదభూమియగు నార్యావర్తమునకు జీవిక. ఆర్యావర్త వేదమత సంస్కృతి యీ పర్వతమందే నిక్షిప్తము.

"తల్పమే బ్రహ్మకునైన నీనగమహత్వంబెన్న నే నియ్యెడన్
గల చోద్యంబులు రేపు గన్గొనియెదన్ గాకేమి నేడేగెదన్
నలినీబాంధవ భాను తప్తరవికాంతస్యందినీహార కం
దళ చూత్కార పరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నమున్
దెల్పెడిన్,

అనుకొనుచు ప్రవరుడు ముందు జేరగోరినాడు. పాదలేపనము నీహారవారి బెరసి కరిగిపోయినది. ప్రవరుడు దీనుడైనాడు. "ఈశ్వరా! సిద్ధునివ్యాజమున నన్నీ ఘోరవనప్రదేశమున బడవైచితివా? ఎక్కడి యరుణాస్పదపుర మెక్కడి తుహినాద్రి. అక్కటా! శ్రోత్రియులు బుద్ధిజాడ్యజనితోన్మాదులు కదా? నాకిలు జేరు నుపాయముదెల్పువారెవ్వరు"

దూరమునుండి వీణాధ్వని. వినిపించినది, ప్రవరునకాశారేఖ మొలకెత్తినది. వీణపై సన్ననిగొంతుకతో వరూథిని రాగాలాపన మొనర్చినది. ప్రవరుడట జేరినాడు.

అదిగో స్త్రీ స్వరము. ఎవ్వరీమె? గంధర్వ స్త్రీగాదుకదా?

వరూథినికన్నులింతయొనర్చుకొని ప్రవరునిగాంచినది. "ఎవ్వరీతడు? నలకూబరుడా? కంతుడా? వసంతుడా? ఏమి వీని సోయగము. నా హృదయమేల నిట్లవశ మగుచున్నది? నన్నితడు పరిగ్రహించిన

మన్మథుని బంటుగా నేలనా?" ఆలోచించినది వరూధిని.

"ఈమె సహాయమున నే నిలుజేరగల్గిన ధన్యుడను." అనుకొని ప్రవరాఖ్యుడు వరూధినికడ జేరినాడు.

"ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ యొంటిజరించెదోట లే
కివ్వనభూమి భూసురుడ నే బ్రవరాఖ్యుడ ద్రోవదప్పితిన్
గ్రొవ్వన నిన్నగాగ్రమునకున్ జనుదెంచి. పురంబుజేర నిం
కెవ్విధిగాంతు దెల్పగదవే తెరువెద్ది? శుభంబు నీ కగున్"
వరూధిని కలకలనవ్వినది.

"ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియగాక నీ వెరుగవే మును వచ్చిన త్రోవ చొప్పు నీ
కింత భయంబులే కడుగ నెల్లిదమైతి మె మాటలేటికిన్."

అనుచు నర్మగర్భముగా బల్కినది వరూధిని. మరల యామెయే యనినది "విప్రకుమారా! నా పేరు వరూధిని. రంభా, ఊర్వశీ తిలోత్తమలు నా సఖురాండ్రు—

"భూసుర కైతవ కుసుమ శ
రాసన, మాయింటి విందవై తివి గైకొ
మ్మా సముదంచన్మణిభవ
నాసీనత సేదదేరి యాతిధ్యమ్మున్."

అని కోరినది వరూధిని,

"వరూధినీ, నీవొనర్చు సపర్యలు మాకు నచ్చినవి, నే నిలుజేరు నుపాయమ్ము దెల్పి పుణ్యమున బొమ్ము."

"ఊరు ఊరంచు వాపోయెదరేల స్వామీ!

"ఎక్కడి యూరు? కాల్నిలువకింటికి బోయెదనంచు బల్కెదీ
వక్కట మీ కుటీరనిలయంబులకున్ సరిరాకపోయెనే
ఇక్కడి రత్న కందరము లిక్కడి నందన చందనోత్కరం
బిక్కడి గాంగసైకతము లిక్కడి యీ లతలీ నికుంజముల్"

అనుచు హేళన మొనర్చినది వరూధిని.

"బాగుగనున్నదీ సరసము. అగ్నికార్యము మిగిలియున్నది. తల్లిదండ్రులు ముసలులు. నేనాహితాగ్నిని. ఇలు జేరకుండిన సర్వధర్మములు జెడవా?" ప్రవరుడు ప్రార్థించినాడు.

"స్వామీ! నా విన్నపము మరియేదురా?" సిగ్గుతో క్రీగంట జూచినది వరూథిని —

"నిక్కము దాపనేల ధరణీసురనందన యింక నీపయిం
జిక్కె మనంబు నాకు, నను జిత్తజు బారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల చూఱలదాటలు వాడు తేంట్ల పొం
పెక్కిననయట్టి పూపొదరింట్లను గౌగిట గారవించెదో."

"నే వైదికకర్మనిష్ఠుడను నను కాముకునిగ భావింపక మీ దివ్య శక్తితో నిలుజేర్పుము."

"బ్రాహ్మణకుమారా! ఈ వైదికకర్మనిష్ఠలన్నియు మా కౌగిళ్ళలో సుఖించుటకేగదా? వెన్నెల నేవగించుకొనును అంధుడు. దేవతాస్త్రీల పొందును తిరస్కరించెదరా?"

"అదంతయును కాముకుని పద్ధతి: నీ వెఱింగిన మార్గము జూపింపుము."

"ఏమి స్వామీ! నా కోరిక దీర్పక నన్నలయించి మరణింప జేయుదురా? ఆనందో బ్రహ్మ యను వేదవాక్యమునైన స్మరింపరాదా?"

"అహా వేదాంతమునకర్థము నెట్లూహించితివి?" నిస్పృహతో నవ్వి యడిగినాడు ప్రవరుడు.

"ఈ పాండిత్యము నీకునక్క మఱియెందే గంటిమే కామశా
స్త్రోపాధ్యాయిని నా వచించెదవు మేలోహో త్రయీధర్మముల్
పాపంబుల్ రతి పుణ్యమంచు నిక నేలా తర్కముల్ మోక్ష ల
క్ష్మీపత్యాగమసూత్రపంక్తికివె పో మీ సంప్రదాయార్థముల్."

"ఘూసుర కుమారా! నన్నిక వెతలం బెట్టకుము. మదనతాపము నోర్వజాలను. వనిత తనంత వలచి వచ్చిన యేరికైన చులకనగదా? నన్ననుగ్రహించి యేలుకొనుడు."

"తరుణీ! మీ పాలఁబడే వెనెలవంటి ఈ తుచ్ఛసుఖముల సంగతులు

నాకు జెప్పకుము. నాకు దర్భలు అరణులు అగ్నులవలె అన్యములు ప్రియములుగావు."

అంతులేని మదనతాపమున పాలిండ్లు పొంగారగా, ఈవీబంధము జారగా, విరులు చిందగా తనూలత పులకింపగా ప్రవరుని కౌగిలించుకొని అధరమాసించినది వరూధిని.

"హా శ్రీహరీ- శ్రీహరీ" యనుచు బ్రాహ్మణప్రవరుడా వరూధినిని తన కౌగిలినుండి నెట్టివైచినాడు. ఆలంబనములేని లతవలె నేలపై పడి పోయినదామె.

"కృపారహితాత్మకా! పాటున కింతు లోర్తురా? నీ కొనగోరు తగులుటచే కలిగిన రక్తపుజార నిటు చూడు" మనుచు వరూధిని కలస్వన మున యేడ్చినది.

ప్రవరుడామెను తిరస్కరించి యరిగినాడు, వరూధిని కౌగిలించి నపుడంటిన జవ్వాదిమైపూత కడుగుకొనుటకు.

ప్రవరాఖ్యుడు అగ్నిహోత్రుని ప్రార్థించినాడు —

"దాన జపాగ్నిహోత్ర పరపంత్రుడనేని భవత్పదాంబుజ
ధ్యానరతుండనేని బరదార ధనాదుల గోరనేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోన గ్రుంకకయమున్న రయంబున హవ్యవాహనా!"

అనిపదివి యాగినాడు పెద్దన.

"మహాప్రభూ! నా ప్రవరు డిలు జేరినాడు." అనినాడు పెద్దన.

"ఏ రసలోకములందో విహరించి మా హృదయ మిప్పుదే స్వస్థానమందు జేరుచున్నది." రాయలానందపారవశ్యమున ననినాడు.

"ఇనుపకచ్చడమును ధరించితివేమి పెద్దనా!" కొసరినట్లనినాడు. ఆప్పాజీ.

"ఆధ్యాత్మిక కాముకభావఘర్షణము నెంత చక్కగా చిత్రించి నాడవు పెద్దనా! ఆంధ్రకవితాపితామహుడను బిరుదము నీయందు తగి యున్నది" నంది తిమ్మన యనినాడు

"భాషావైదుష్యము కల్పనాచా. తుర్యము వెల్లివిరియనిపద్యమేలేమ

"బాగుగనున్నదీ సరసము. అగ్నికార్యము మిగిలియున్నది. తల్లిదండ్రులు ముసలులు. నే నాహితాగ్నిని. ఇలు జేరకుండిన సర్వకర్మములు జెడవా?" ప్రవరుడు ప్రార్థించినాడు.

"స్వామీ! నా విన్నపమును వినుమా?" సిగ్గుతో క్రీగంట జూచినది వరూథిని —

"నిక్కము దాపనేల ధరణీసురనందన యింక నీపయిం
జిక్కె మనంబు నాకు, నను జిత్తజు బారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల చూఱలఁబాటలు పాడు తేంట్ల పొం
పెక్కినయట్టి పూవుబొదరిండ్లను గౌగిట గారవించెదో."

"నే వైదికకర్మనిష్ఠుడను నను కాముకునిగ భావింపక మీ దివ్య శక్తితో నిలుజేర్పుము."

"బ్రాహ్మణకుమారా! ఈ వైదికకర్మనిష్ఠలన్నియు మా కౌగిళ్ళలో సుఖించుటకేగదా? వెన్నెల నేవగించుకొనును అంధుడు. దేవతాస్త్రీల పొందును తిరస్కరించెదరా?"

"అదంతయును కాముకుని పద్ధతి. నీ వెఱింగిన మార్గము జూపింపుము."

"ఏమి స్వామీ! నా కోరిక దీర్పక నన్నలయించి మరణింప జేయుదురా? ఆనందో బ్రహ్మ యను వేదవాక్యమునైన స్మరింపరాదా?"

"అహా వేదాంతమునకర్థము నెట్లూహించితివి?" నిస్పృహతో నవ్వి యనినాడు ప్రవరుడు.

"ఈ పాండిత్యము నీకుడక్క మఱియెంచె గంటిమే కామశా
స్త్రోపాధ్యాయిని నా వచించెదవు మేలోహో త్రయీధర్మముల్
పాపంబుల్ రతి పుణ్యమంచు నిక నేలా తర్కముల్ మోక్షల
క్ష్మీపర్యాగమసూత్రపంక్తికివె పో మీ సంప్రదాయార్థముల్."

"భూసుర కుమారా! నన్నిక వెతలం బెట్టకుము. మదనతాపము నోర్వజాలను. వనిత తనంత వలచి వచ్చిన యేరికైన చులకనగదా? నన్ననుగ్రహించి ఏలుకొనుడు."

"తరుణీ! మీ పాలపైదేనెలవంటి ఈ తుచ్ఛసుఖముల సంగతులు

నాకు జెప్పకుము. నాకు దర్భలు అరణులు అగ్నులవలె అన్యములు ప్రియములుగావు."

అంతులేని మదనతాపమున పాలింద్లు పొంగారగా, ఊపీబంధము జారగా, వివశల్ చిందగా తనూలత పులకింపగా ప్రవరుని కౌగిలించుకొని అధరమాసించినది వరూధిని.

"హా శ్రీహరీ- శ్రీహరీ" యనుచు బ్రాహ్మణప్రవరుడా వరూధినిని తన కౌగిలినుండి నెట్టివైచినాడు. ఆలంబనములేని లతవలె నేలపై పడి పోయినదామె.

"కృపారహితాత్మకా! పాటున కింత లోర్తురా? నీ కొనగోరు తగులుటచే కలిగిన రక్తపుజార నిటు చూడు" మనుచు వరూధిని కలస్వనమున యేడ్చినది.

ప్రవరుడామెను తిరస్కరించి యరిగినాడు, వరూధిని కౌగిలించి నపుడంటిన జవ్వాదిమెపూత కడుగుకొనుటకు.

ప్రవరాఖ్యుడు అగ్నిహోత్రుని ప్రార్థించినాడు—

"దాన జపాగ్నిహోత్ర పరపంత్రుడనేని భవత్పదాంబుజ
ధ్యానరతుండనేని బరదార ధనాదుల గోరనేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోన గ్రుంకకయమున్న రయంబున హవ్యవాహనా!"

అనిపదివి యాగినాడు పెద్దన.

"మహాప్రభూ! నా ప్రవరు డిలు జేరినాడు." అనినాడు పెద్దన.

"ఏ రసలోకములందో విహరించి సూ హృదయ మిప్పుడే స్వస్థానమందు జేరుచున్నది." రాయలానందపారవశ్యమున ననినాడు.

"ఇనుపకచ్చడమును ధరించితివేమి పెద్దనా!" కొసరినట్లనినాడు. అప్పాజీ.

"ఆధ్యాత్మిక కాముకభావఘర్షణము నెంత చక్కగా చిత్రించి నాడవు పెద్దనా! ఆంధ్రకవితాపితామహుడను బిరుదము నీయందు తగి యున్నది" నంది తిమ్మన యనినాడు

"భాషాపై మిష్యము కల్పనాచా. తుర్యము వెల్లివిరియనిపన్యమేలేమ

కదా?" అప్పాజీ యనినాడు.

"కవీశ్వరా! నీ కవిత్వపు జిగియు బిగియు గాంచిన ఆంధ్రభాష యందొక కావ్యమును వ్రాయుటకు ఇచ్ఛ బొడముచున్నది." రాయ లనినాడు. అతనిలోని యా వాంఛ అంకురించి ఆకులువైచి మొగ్గదొడిగి వికసించిన నాక్షణముననే.

"ప్రభువులు దయచేసిన సత్యావధూప్రీణన మాధారముగా నొక స్వతంత్ర ప్రబంధమును వ్రాయుటకు అనుజ్ఞ కోరుచున్నాను." అనినాడు తిమ్మన.

"అవశ్యము. ఆ గ్రంథము ముద్దులొలుకు-పలుకు-లతో నాకధునీ శీకరముల వలువ నిమిడ్చికొనవలయును."

"కరుణాకర వేంకట విభుచరణస్మరణ ప్రసంగ సంగతమతి
ఈశ్వర నరసింహ మహీభృద్వరనందన కృష్ణరాయధరణీనాధా"
వంది పఠించినాడు.

"ఈ సాహితీసభ నిక నేటికి చాలింతమా?" రాయలడిగినాడు.

రాయల యనుజ్ఞగొని మేఖల యరుదెంచినది.

"మనుచరిత్ర యంతటి రసవత్తరముగ రచింపబడుటకు కారణ మీవు మేఖలా! మా మిత్రుడు ప్రవరునంతటి కృపారహితాత్ముడు కాడు" అనుచు పెద్దనవైపవలోకించినాడు రాయలు.

పెద్దన తలవంచినాడు.

"మేఖలా! అందుకొను మీ బహుమానము" ననుచు సువర్ణములు నిండించిన పళ్ళెరమును మేఖల కందించినాడు రాయలు."

కన్నీటితో నందుకొనినది మేఖల యా సువర్ణములను.

పెద్దనకామె కన్నీరు యావేదనను కల్పించినది.

"నీవు త్యాగశీలివి మేఖలా! నీయెడ నావైఖరిని మార్చుకొన ప్రయ త్నింతును" అనుచు రాయలు తనకొసంగిన ముత్యాలసరము నా మేఖల కంఠమునందు వైచినాడు పెద్దనార్యుడు.

రాయల బిగుతుమీసములమధ్య నొక లేతనవ్వు తళుకుమనినది.

నగరిమోసాల గంటలు మ్రోగినవి, సభ చాలింపబడినది.

# ఇరువది నాలుగు

రాత్రి తొలియామము గడచినది. మహారాజు కోటకు ఎదురు చూచినది మహారాణి అన్నపూర్ణ. అంతఃపురోద్యానప్రాంగణము నుంచి మోహనమురళీగానం తెరలు తెరలుగా అతఃపురాన్ని కమ్ముతున్నది. ఆ గానస్రవంతిలో సమ్మోహిత అయినది మహారాణి అన్నపూర్ణాదేవి. ఆమె గానలోల. సంగీతశాస్త్రవేత్త లక్ష్మీధరుల శిష్యురాలామె. మురళీగానమా మహారాణి కత్యంతప్రియతమమైనది.

మోహనవంశీగాన మట్లే ప్రవహించి యామె నానందసాగరమున ముంచుచున్నది. ఆ గానవాహినీ కారకుడైన కళాస్రష్టను చూడవలెననే ఉత్కంఠ ఆమెను నిలువనీయలేదు. చెలికత్తె మల్లికతో ఉద్యానవనమునకు అరిగినదామె. ఆ సమయమున మహారాజులరాకను జ్ఞప్తి యొనర్చినది మల్లిక. కాని యన్నపూర్ణాదేవి పెడచెవి నిడినది. మహారాజులు వచ్చునంతలో తిరిగిరావచ్చునని భావించినదా గానలోల. పశువులైన పసిపాపలైన నాకర్షించు సంగీతము ఆ శాస్త్రమందు అభిమానము గల్గిన స్త్రీ నాకర్షించుటలో విచిత్రమేమి?

ఆ కళాకారుని సంభావించి అతని గానవాహినిలో మైమరచి యొక్కక్షణమట నుండి తిరిగివచ్చినది మహారాణి యన్నపూర్ణాదేవి.

అప్పటికే యంతఃపురమునకరుదెంచిన రాయల కామె చర్య అనుమానాస్పదమైనది. మహారాజు రుద్రుడైనాడు "మల్లికా ఈఅర్ధరాత్రి అసూర్యంపశ్యలైన మీ మహారాణి వారెక్కడ పయనించి వచ్చారు?" క్రోధంతో అడిగాడు రాయలు.

మల్లిక భయంతో వణికింది.

"చెప్పు మల్లికా! మనం చూచివచ్చినదేమో మహారాజులకు తెలియజెయ్యి." ఆజ్ఞాపించింది అన్నపూర్ణ.

"ఉద్యానవనంలోకి వెళ్ళవచ్చాం మహారాజా!" వణకుతో అన్నది మల్లిక.

"పోవడానికి కారణం? అర్ధరాత్రి అంతఃపురం వదలడం క్షంతవ్యం

కదా?" అప్పాజీ యనినాడు.

"కవీశ్వరా! నీ కవిత్వపు జిగియు బిగియు గాంచిన ఆంధ్రభాషయందొక కావ్యమును వ్రాయుటకు ఇచ్ఛ బొడముచున్నది." రాయలనినాడు. అతనిలోని యా వాంఛ అంకురించి ఆకులువైచి మొగ్గతొడిగి వికసించిన క్షణముననే.

"ప్రభువులు రచించిన సత్యావధూప్రీణన మాధారముగా నొక స్వతంత్ర ప్రబంధమును వ్రాయుటకు అనుజ్ఞ కోరుచున్నాను." అనినాడు తిమ్మన.

"అవశ్యము, ఆ గ్రంథము ముద్దులొలుకు పలుకులతో నాకరుణా శీకరముల పలువ నిమిడ్చికొనవలయును."

"కరుణాకర వేంకట విభుచరణస్మరణ ప్రసంగ సంగతమతి
ఈశ్వర నరసింహ మహీభృద్వరనందన కృష్ణరాయధరణీనాథా"
వంది పఠించినాడు.

"ఈ సాహితీసభ నిక నేటికి చాలింతమా?" రాయలడిగినాడు.

రాయల యనుజ్ఞగొని మేఖల యరుదెంచినది.

"మనుచరిత్ర యంతటి రసవత్తరముగ రచింపబడుటకు కారణ మీవు మేఖలా! మా మిత్రుడు ప్రపయనంతటి కృపారహితాత్ముడు కాడు" అనుచు పెద్దనవైపవలోకించినాడు రాయలు.

పెద్దన తలవంచినాడు.

"మేఖలా! అందుకొను మీ బహుమానము" ననుచు సువర్ణములు నిండించిన పళ్ళెరమును మేఖల కందించినాడు రాయలు."

కన్నీటితో నందుకొనినది మేఖల యా సువర్ణములను.

పెద్దనకామె కన్నీరు యావేదనను కల్పించినది.

"నీవు త్యాగశీలివి మేఖలా! నీయెడ నావైఖరిని మార్చుకొన ప్రయత్నింతును" అనుచు రాయలు తనకొసంగిన ముత్యాలసరము నా మేఖల కంఠమునందు వైచినాడు పెద్దనార్యుడు.

రాయల బిగుతుమీసములమధ్య నొక లేతనవ్వు తళుకుమనినది.

నగరిమోసాల గంటలు మ్రోగినవి, సభ చాలింపబడినది.

# ఇరువది నాలుగు

రాత్రి తొలియామము గడచినది. మహారాజుకొఱకు ఎదురు చూచినది మహారాణి అన్నపూర్ణ. అంతఃపురోద్యానప్రాంగణము నుంచి మోహనమురళీగానం తెరలు తెరలుగా అంతఃపురాన్ని క్రమ్ముతున్నది. ఆ గానస్రవంతిలో సమ్మోహిత అయినది మహారాణి అన్నపూర్ణాదేవి. ఆమె గానలోల. సంగీతశాస్త్రవేత్త లక్షీధరుల శిష్యురాలామె. మురళీగానమా మహారాణి కత్యంతప్రియతమమైనది.

మోహనవంశీగాన మట్లే ప్రవహించి యామె నానందసాగరమున ముంచుచున్నది. ఆ గానవాహినీ కారకుడైన కళాస్రష్టను చూడవలెననే ఉత్కంఠ ఆమెను నిలువనీయలేదు. చెలికత్తె మల్లికతో ఉద్యానవనమునకు అరిగినదామె. ఆ సమయమున మహారాజులరాకను జ్ఞప్తి యొసర్చినది మల్లిక. కాని యన్నపూర్ణాదేవి పెడచెవి నిడినది. మహారాజులు వచ్చునంతలో తిరిగిరావచ్చునని భావించినదా గానలోల. పశువులైన పసిపాపలనైన నాకర్షించు సంగీతము ఆ శాస్త్రమందు అభిమానము గల్గిన స్త్రీ నాకర్షించుటలో విచిత్రమేమి?

ఆ కళాకారుని సంభావించి అతని గానవాహినిలో మైమరచి యొక్కక్షణమట నుండి తిరిగివచ్చినది మహారాణి యన్నపూర్ణాదేవి.

అప్పటికే యంతఃపురమునకరుదెంచిన రాయలకామె చర్య అనుమానాస్పదమైనది. మహారాజు రుద్రుడైనాడు "మల్లికా ఈ అర్ధరాత్రి అసూర్యంపశ్యలైన మీ మహారాణి వారెక్కడ పయనించి వచ్చారు?" క్రోధంతో అడిగారు రాయలు.

మల్లిక భయంతో వణికింది.

"చెప్పు మల్లికా! మనం చూచివచ్చినదేమో మహారాజులకు తెలియజెయ్యి." ఆజ్ఞాపించింది అన్నపూర్ణ.

"ఉద్యానవనంలోకి వెళ్ళివచ్చాం మహారాజా" వణకుతో అన్నది మల్లిక.

"పోవడానికి కారణం? అర్ధరాత్రి అంతఃపురం వదలడం క్షంతవ్యం

కాని అపరాధం." క్రోధమానుడైన రాయలన్నాడు.

"అకరణీయమైన మురళీగానం నేసటు వెళ్ళడానికి కారణం ప్రభూ! ప్రభువుల కీర్తికి కళంకమాపాదించే క్షంతవ్యంకాని అపరాధమేమీ నావలన జరగలేదు." అభిమానంతో అన్నది అన్నపూర్ణ!

"మహారాణి రహస్యమార్గాన రాకపోకలు జరపడం శంకాస్పదం, విచారణీయంకూడా."

"ప్రభువులంతటి నిర్దయ చూపకండి. వ్యర్థకళంకము నాపాదించి నన్ను క్షోభపెట్టడం సమంజసంకాదు."

"నీవు కుటిలవు. ఇంతటి ఆంధ్రసామ్రాజ్యానికి మహారాణివి. నీవు కోరితే ఈ రాజ్యంలోని ఏగాయకుడు నీ పాదాలవద్ద గానం చేయడు? గానం వినడానికనే నెపంతో అర్ధరాత్రి పరపురుషునితో విహరించి రావడం ....... " ఇక మాటాడలేక ఊరుకున్నాడు రాజు.

"ప్రభువులింతవరకు నాహృదయా న్నర్థంచేసికొనకపోవడం నా దురదృష్టం. తల్లిదండ్రులనుకూడ వదలి తమ పాదసేవకొఱకు వచ్చిన నన్ను యింత నిర్దయగా మాటాడేకన్నా, ఒక్కసారి మీ ఖడ్గంతో ఖండించివేయండి."

"లేదు, కులటారక్తం నా ఖడ్గం చవిచూడదు."

"ప్రభువులిక ఆగండి. ఆపదం నాపై ప్రయోగించడం నా వంశానికే కళంకం. నాది మచ్చలేని గజపతివంశం." అన్నపూర్ణ అభిమానంతో అన్నది.

ఆమాటలు రాయలమనసున కింకొకవిధంగా ధ్వనించినవి. ఆమె తన వంశగౌరవాన్ని ఎత్తిపొడిచినట్లు భావించాడా ప్రభువు. "ఛీ! నా అంతఃపురంలో ఉండే అర్హత లేదు నీకు, నీ తండ్రివద్దకే వెళ్ళిపో." రాయ లరిచాడు.

"అది యిక ఈ జీవితంలో జరిగేది కాదు. జీవించడమో మరణించడమో నాకిక్కడనేకాని అక్కడ కాదు." తన స్థిరనిశ్చయాన్ని వెల్లడించింది అన్నపూర్ణ.

క్రోధఘూర్ణితమానసుడై రాయలు, ఆవేశపరుడై అంతఃపురం వదలి వెళ్ళిపోయినాడు. చేయని అపరాధానికి శిక్ష విధింపబడింది మహారాణి అన్నపూర్ణాదేవికి. శంక కళంకిత హృదయాలు నిజానిజాలను గ్రహింపలేవు.

కృష్ణరాయ సార్వభౌముడు రహస్యాలోచనా మందిరమందు మహామంత్రికొఱ కెదురుచూచుచున్నాడు. అతని హృదయము మహారాణి లోని దోషాన్ని నిర్దోషిత్వాన్ని నిరూపించి నిర్ణయింపలేక ఆవేదనాయుత మగుచున్నది.

చక్రవర్తి ఆజ్ఞతో మహామంత్రి రహస్యమందిరంలోనికి ప్రవేశించాడు. "చక్రవర్తులింత పెంపలకడ వర్తమానమంపిన కారణము గొప్పదిగా నుండవచ్చు!" తిమ్మరుసు అడిగినాడు.

"అప్పాజీ! హృదయవిదారకమైన విషయము నేవిధంగా తెలిపేది మీకు ?" అతివిషాదముతో నన్నాడు మహారాజు.

"ప్రభువులంతటి బాధ చెందదగిన విషయము నాకు ఆకళింపుకు రాకపోవడం ——" అప్పాజీ ఊరుకున్నాడు.

"మీరూహింపని విషయాలవి అప్పాజీ."

"అవి రాజ్యపాలనా సంబంధములై యుండకపోవచ్చు." అప్పాజీ యనినాడు.

"అవునప్పాజీ! ఇది స్వవిషయము. ఈ దారుణ పరిణామము నా యశస్సుకే కళంకమాపాదించునది."

"ప్రభువులు రాణులలో నెవరినైన శంకించుచున్నారా ?"

"అమాత్యులు పరేంగితావగాహులు!"

"అతి భయంకర పరిణామము. దోషి యెవరు ప్రభూ ?"

"ఆ గజపతి పుత్రిక అన్నపూర్ణ!"

"అన్నపూర్ణ దోషియా ప్రభూ ? ఎక్కడనో పొరబాటున్నది."

"ప్రత్యక్షసాక్షులము మేము. పొరపాటున కవకాశమే లేదు."

"అర్థమొనర్చు కొనడంలో ఈ వైపరీత్యము జరిగి యుండవచ్చును."

"అంత త్వరపడి నిర్ణయానికి వచ్చుట బహుగలేదు అప్పాజీ. ఆమెతో నా వంశమునకు సంబంధించిన కళంకము మాయలేదు. అది ఆమె మాట లతో ధ్వనించినది." రాయలనినాడు.

"ఆ సమయము ప్రభువులనట్లాలోచింప నొనర్చియుండును." మహామంత్రి యనినాడు.

"అమాత్యులు మమ్మనుమానించుచున్నారు. అర్ధరాత్రి రహస్య మార్గమున ఉద్యానవనమునకు ప్రయాణించినది. మురళీగానము వినుటకని కారణమును తెల్పినది. దగావ్యాజంతో అయోగ్యంపశ్య అకార్యకరణము నకు ఒడిగట్టింది." అనినాడు క్రోధంతో రాయలు.

"మహారాణి నిజంగా అపరాధి కాకపోవచ్చు. తమరాక నెటింగి కూడ అలస్యమైనప్పి దోషిగా దొరకిపోవటంలోనే ఆమె నిర్దోషిత్వము వెల్లడి అవుతున్నది. ఎప్పటనో పొరపాటున్నది ప్రభూ!"

"ఆమె అపరాధి. న్యాయాన్నే ఎల్లప్పుడూ వాంఛించే మా హృదయము సాక్ష్యము మా కాధారము. ఆమెను పుట్టినింటికి పంపివేయండి."

"ప్రభువులు త్వరపడవద్దని మనవి. కొంతకాలము ప్రభువులోపిక పట్టవలయును. మహారాణి దోషియైన శిక్ష ననుభవింపగలదు." తిమ్మరు సనినాడు.

"ఆమె నిర్దోషియని ఋజువగునంత దనుక ఆమెను నా అంతః పురమునుండి తప్పించుడు" గంభీరముగ నన్నాడు రాజు.

"ఈ విషయమై ప్రభువులు మనసును గాయపటచికొని తీవ్రతర నిర్ణయములకు రారని భావింతును."

అచటినుండి మహామంత్రి అన్నపూర్ణ మందిరమున కరిగినాడు. అన్నపూర్ణాదేవి జరిగిన విషయమును తెల్పినది.

"మహారాణి దళా హృదయాన్నర్థం చేసకొన జాలకపోయినారు. మహారాజు" అనినాడు తిమ్మరుసు.

"అప్పాజీ! నా నిర్దోషిత్వాన్నెట్లా ఋజువుపరచునానేది. ఇక నా ప్రభువు నాముఖాన్ని చూడదా అప్పాజీ" ఆక్రందించింది. అన్నపూర్ణ.

"ఈ క్రోధము తాత్కాలిక మమ్మా. నిర్దోషివైన నిన్ను శిక్షించి

మహారాజు సుఖపడలేదు. ఆయన అంతరాత్మ ఆతనిన్ని బాధిస్తున్నవి."

"శిక్ష విధించినారా ప్రభువులు?' ఆత్రముగా అడిగినది అన్నపూర్ణ.

"అవునమ్మా! మీ తండ్రియింట విడిచిరమ్మని ఆజ్ఞ. నేను నీకు తండ్రివంటివాడను మహారాణీ.'

"ఆపదలో ఆదరించినవారే తల్లిదండ్రులు. పదండి, నేను సంసిద్ధురాలిని" వగరుస్తు అన్నది అన్నపూర్ణ.

(ఈ ప్రకరణము కథగా పత్రికయందు ముద్రితము - అందువలన భాష మార్పు)

## ఇరువది ఐదు

అన్నపూర్ణా బహిష్కరణము గజపతి నత్యాంత కోపోద్రిక్తు నొనర్చినది. గూఢచారులద్వారా తెలిసిన విషయముననుసరించి ఆమెను కంభంప్రాంతమునకు ప్రవాసమంపినట్లు గజపతికి తెలిసినది.

కాని తనకుమారు డొనర్చిన చర్యయే అన్నపూర్ణ యందనుమానమునకు కారణమని గజపతి యెఱుంగడు.

రాయలు సంగీతపిపాస. చక్రని సంగీత మాతని నవశుజేయును, సంగీతమును ఎఱగా జూపి రాయలను ఒంటరిగా ఉద్యానములోనికి రప్పించి హత్యనొనర్చుటకు, తద్వారమున తమకొనర్చిన అవమానమునకు ప్రతీకారమొనర్చుదమనియు వీరభద్రుని యుద్దేశము. అన్నపూర్ణ అంతఃపురమందలి ఉద్యానవనమునకు తోటమాలి కళింగుడు. అతడు వీరభద్రుని గూఢచారి. రాయలరుదెంచు సమయమునాతడు తెల్పినాడు. లక్ష్మీధరుని శిష్యునొకనిని మురళివాయింప నియోగించి తద్వార రాయల నాకర్షింప బూనినాడు వీరభద్రుని గూఢచారి రాయలానాడు రాచకార్యముల మూలమున కాలాతిక్రమణ మొనర్చినాడు. మోహనవంశీ వినాద మాతని బదులు మహారాణి యన్నపూర్ణాదేవినే యాకర్షించినది. తరువాత రాయల రాకను గమనించిన ఆ సంగీతవేత్తయు గూఢచారియును పారిపోయినారు. తోటమాలిగానున్న గూఢచారి ఆరాత్రి జరిగిన విషయము లన్నియు విని విశేషములను తన శాఖకు చేర్చినాడు. మహామంత్రికీ విషయము లుదయ

మునసే తెలిసి వి. తోటమాలి వెంటనే బంధింపబడినాడు. నిజమేమియో మహామంత్రి తెలిసికొనినాడు. కాని రాయల హృగయము మారవలయును. అంతదనుక సూరకుండ తలచినాడు అప్పాజీ.

గజపతి కీ విషయము తెలిసిన రాయలపై నాతడు యుద్ధమును ప్రకటించును. అన్నపూర్ణ యందలి వైముఖ్యమా యుద్ధమున జయముగా మార్చుకొనదలచినా డప్పాజీ. కృష్ణానదీతీరము వఱకును విజయనగర సామ్రాజ్యము కావలయునను నదియే తిమ్మరుసు యభిలాష. దానికి అన్నపూర్ణ ప్రేమ యడ్డుకారాదు. అందుచే నీ రాజరహస్యము మహామంత్రియే స్వయముగా బయల్పరచినాడు. అన్నపూర్ణ ప్రవాస విషయమును నాతడు కల్పించినదే.

తనకుమార్తె పాటు వినిన గజపతి యపరరుద్రుడే యైనాడు. అతడొక లేఖను కృష్ణరాయలకడకు దూతద్వారా పంపినాడు. అందు దాసీపుత్రుడగు కృష్ణరాయలు చిన్నదుర్గము నొకదానిని స్వాధీనపరచుకొనుట దోపిడిదారు చేయు పనివంటిది. అతడు కొనియేగిన తన పుత్రిక అన్నపూర్ణాదేవిని సగౌరవముగ తనకడకంపని యెడల సమస్త సేనా వాహినితో కదలివచ్చి విజయనగరమును సర్వనాశన మొనర్చి అన్నపూర్ణాదేవిని కొనిపోవుదుననియు. ఆ విధముగ వినాశోన్ముఖుడవుగాక వెంటనే ఉదయగిరిదుర్గమును అన్నపూర్ణాదేవిని తమకప్పగించునది - అని వ్రాసి పంపినాడు గజపతి. ఆ జాబుగాంచిన మహారాజు కలకల నవ్వినాడు. గజపతిపై నాతని హేళన పారము దాటినది.

గజపతు లింతదూరము శ్రమపడివచ్చుట యలవికానిదనియు,సర్వ సైనికసన్నాహములొనర్చుకొని కొండవీడు దుర్గమున నుండిన తామేవారిని గాంచవచ్చుచున్నామనియు. యుద్ధమందు జయించికొనిన రాజ్యమును రామను తిరిగి యుద్ధమున జయించి తీసికొనుటయే సుక్షత్రియుల లక్షణముగాని యాచింపరాదనియు. గజపతుల పొగరణచుటకై విజయనగర సింహము వచ్చుచున్నదనియు స్పష్టముగ వ్రాసి పంపినాడు రాయలు.

గజపతి యుద్ధసన్నద్ధుడై నాడు.

రాయలు అఖండసేనావాహినీ సమేతుడై గజపతి దుర్గముల

నాటినుండొక్కటే స్వాధీనమొనర్చుకొనుచు వచ్చుచుండెను.

అద్దంకి, వినికొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరం దుర్గములు రాయల సమూహానికి కోట శిరములు వంచినవి, ఆ పట్టున రాయలు కొండవీడు ముట్టడికై తన సైన్యమును నడపినాడు.

షితాబుఖానుడు కొంత సైన్యముతో రాయల నెదుర్కొనుటకై యేగినాడు. షితాబుఖాను వచ్చుచున్న వార్తను గూఢచారులందింపగా రాయలాతని నెదుర్కొనుటకు ముందుకరుగుట మాని వెనుదిరిగెను.

తమకు రాయలు పన్నైన యోజనముల మూలమున కొండవీడు వైపున కరుగుచుండినట్లు తెలిసికొనిన షితాబుఖానుడు కనుమలలో నా సైన్యము నెదుర్కొన దలచెను.

కొండవీటిమార్గమున సైన్యము పోవలయుననిన రెండు ఎత్తైన కొండలమధ్యనుండి యరుగవలయును. రాయల సైన్యమచట కరుదెంచి యగునప్పుడు కొండలపైనుండి రాయల సైన్యమును నాశనమొనర్ప వచ్చునని షితాబుఖానుడాలోచించినాడు. తన సైన్యమును రెండుభాగములొనర్చి కొండల పై భాగములందు నిల్పినాడు షితాబుఖానుడు.

షితాబుఖానుని సైన్య ప్రస్థానమును గూఢచారులద్వారా గమనించినాడు రాయలు.

తిమ్మరుసు ఆజ్ఞ ప్రకారము అగ్రగామిసైన్యదళమొకటి లోయయందు గుడారములు నిర్మించినవి. రాయల శిబిరము లోయమధ్యభాగమున నిర్మింపబడినది.

ఇది విన్న షితాబుఖానుని యానందమునకంతమే లేదు. సాయంకాలమగునప్పటికి లోయయంతయు గుడారములతో నిండిపోయినది.

సైన్యము సైన్యాధిపతులు లోయలోనికి వచ్చి చేరినారు, రాయల రాకకొరకు షితాబుఖానెదురుచూచుచున్నాడు. రాయలు డేరాలో చేరిన తర్వాత నాతని హతమార్చుటో పట్టివేయుటో చేయవచ్చునని షితాబుఖానుడు మిన్నకున్నాడు.

డేరాలలో కాగడాలు వెలిగింపబడినవి. సైనికులు వంటలొనర్చుకొనినారు, కాని రాయలుమాత్రము రాలేదు. తామిప్పుడు త్వరపడి

సైన్యముపై దాడి యొనర్చిన బయటనున్న రాయలు తమపై బడవచ్చును. అందుచే రాయలా లోయలోనికి వచ్చునంతవరకు వేచియున్నాడు ఖానుడు. జాముప్రొద్దు పోవుసరికి సైన్యపరివేష్టితుడైన రాయలు వందిమాగధుల కైవారములతో వచ్చి తెలిపట్టుగుడారమును ప్రవేశించినాడు.

ఒక్క గడియకాలమైనది. షితాబుఖానుడు తన సైన్యమును సగము బయటనుంచి మిగిలిన సగముతో లోయలో నతినిశ్శబ్దముగ ప్రవేశించినాడు. సైన్యమన్నిగుడారములను కమ్మినది; కాని గుడారములలొక్క సైనికుడు లేడు.

అప్పటికే రాయల సైన్యము ఒకవైపునుండి కొండపైకి చేరినది. లోయ మొనలను కమ్మినది.

లోయలో నెటువైపునకు రుపటకు వీలులేదు. పారిపోవుటకు లోయను రెండుమొనలందును రాయలసైన్యములు కాచినవి. కొండపైకి చేరిన రాయలసైన్యములు లోయలోనికి రాళ్ళను దొర్లించినవి ధానుష్కుల బాణములు శత్రుసైన్యములలో నెవ్వరో యొకనిని పడగొట్టుచున్నవి. రెండవ వైపు కొండపైనున్న షితాబుఖానుని సైన్యము తామేమొనర్చుటకును తోచక నిలచిపోయినది.

క్షణక్షణమును షితాబుఖానుని సైన్యము తరిగిపోవుచున్నది. బయటపడుటకై షితాబుఖానుడు ప్రయత్నమొనర్చినాడు. ఆతని గుఱ్ఱము వెనుదిరిగి వాయువేగమున లోయమొగను దరిసినది. లోయమొగనావైపున గోవిందరాజు సైన్యము కాచినది. అంతటివేగముతో వచ్చుచున్న ఆ గుఱ్ఱమును తనవద్దనున్న బల్లెముతో పొడిచినాడు గోవిందరాజు. గుఱ్ఱము పడిపోయినది. పైనున్న షితాబుఖానుని శిరము ఏసామాన్య సైనికుని ఖడ్గమునకో ఎరయైనది. లోయలోని సైన్యమంతయు మరణించినది. తెల్లవారినతరువాత మిగిలినసైన్యము మల్లాఖానుని నాయకత్వమున వెనుదిరిగి పారిపోయినది. రాయలా సైన్యమును తరుముకొనిపోయి కొండవీటి కోటను దరిసినాడు. రాయలు కొండవీడును సాధించుటకు మూడునెలలు పట్టినది.

కొండవీటియందు వీరభద్రపాత్రుడు ప్రహరేశ్వరపాత్రుడు ఖైదీలుగా జిక్కినారు. శరణువేడుటచే వారలను క్షమించి పసలినాడు రాయలు.

కొండవీటి పతనానంతరము రాయలు గజపతిసైన్యములను తరిమి పొట్నూరికడ జయస్తంభమును నెలకొల్పి తిరిగివచ్చునపుడు విజయవాడకు మకరసంక్రాంతిదినమున విచ్చేసెను.

కృష్ణవేణీతీరమున ఉండవిల్లి అనంతశయనస్వామికి బెజవాడ మల్లిఖార్జునదేవునకు పదివేల వరాహములు ధారాపూర్వకముగా నర్పించినాడు.

తరువాత రాయలు శ్రీకాకుళనికేతనుండగు నాంధ్ర మధుమథను సేవింప నరిగెను. హరివాసర ఉపవాసవ్రత మచ్చటకావించి ఆలయంబునసే నా రాత్రి నివసించినాడు. ఆరాత్రి చతుర్థయామమున రాయలొక్క కల గాంచినాడు. ఆస్వప్నమందు తానెచ్చటకో కొనిపోబడినాడు. ఎచ్చటకో? ఆ కొనిపోవునదెవ్వరో? తెలియదు. పోవుకొలది యా పథ మాహ్లాదకరముగనున్నది. తెలియని యానందమేదియో నాతని నావహించినది. అట్లు పోయి పోయి విశాలమగు సముద్రముపతీరమున నాగినాడు. తను ఆ నీలమైన సముద్రము ఎంతదూరము గాంచిన నంతియే. అదియే వర్ణము. సముద్రమధ్యమున దూరమున నొక వటపత్రమందొక బాలకుడు. ఆ బాలకుడెవ్వడు? ఆ మఱ్ఱియాకంతకు పెఱిగిపోవుచున్నది. దాని యందలి బాలకుడుకూడ పెరిగిపోయి బ్రహ్మాండమంతయు నిండునట్లు న్నాడు. ఆ తేజమును కాంచజాలక రాయలు కనులు మూసినాడు.

ఆ సానమున శ్రీకాకుళనాథుడు ఆంధ్ర మధుమథనుడు ప్రత్యక్షమైనాడు. శంఖ చక్ర గదా శార్ఙ్గములతో ప్రసన్నములగు దృష్టులతో నా భగవంతుడు రాయలను సంబోధించినాడు— "రాయా!"

రాయలు కనులు దెఱచినాడు. ఎదుట శ్రీకాకుళనికేతనుడు! రాయలు సాగిలి మ్రొక్కినాడు.

"కృష్ణరాయా! నీ వాంధ్రనృపుడవు. సంస్కృతాంధ్రములందసమానపండితుడవు. ఆంధ్రభాషయందొక్క కృతి నొనర్చి మా కంకిత మొనర్పుము."

"ధన్యుడను స్వామీ! భవల్లీలలనే గ్రంథముగా రచింప నమజ్ఞ నౌసంగుడు."

"కాదురాయా! శ్రీరంగనాయకులు ఆండాళ్ళు కళ్యాణమహోత్సవ సంబంధియగు గాథను ఆంధ్రభాషయందే నుడువుము; తెనుగుదాస యేలనందువా?

"తెలుగదేలయన్న దేశంబు తెలుగేను
తెలుగువల్లభుండ తెలుగొకండ
యెల్ల నృపులు గొలువ నెఱుగవే బాసాడి
దేశభాషలందు తెలుగు లెస్స.

"ఆంధ్రదేవుడను నేను. ఆంధ్రభాష నాది. నీ వాంధ్ర విభుడవు. ఆంధ్రకవిత్వమే నేగోరునది నాయనా! నీ కా వేంకటపతి యిలవేలుపు. నేనే వేంకటేశ్వరుడను వేంకటేశ్వరునకే నీ వొనర్చు ఆముక్తమాల్యదా గ్రంథము నంకితమిమ్ము. రేపటిదినమే చక్కని ముహూర్తము గంధారంభమునకు. ఇక కాలోచితకృత్యంబుల దీర్చుకొని గ్రంథమునారంభింపు" మనుచు రాయల వీపుపై చరచి యదృశ్యుడైనాడాంధ్ర విష్ణుడు.

రాయల స్వప్నము కరిగినది. కన్నుదెఱచి చూచిన నేమున్నది! రాత్రి వేగుచున్నది.

కాలకృత్యంబుల దీర్చుకొని, ఆంధ్రమధుమథనుని శ్రీకాకుల నాథుని భక్తితో సేవించి ఆతనిసమ్ముఖముననే గ్రంథారంభమొనర్చినాడు రాయలు. ఇష్టదేవతా స్తుతియైనది. ఆంధ్రవిష్ణుడు సూచించిన కథాప్రశంస యైనది. గ్రంథకర్త ప్రశంసను వ్రాయు తరుణము వచ్చినది.

తనను దాను పొగడుకొనుట ఆత్మహత్యాసదృశము. గ్రంథ రచనములదంట్లు కాకపోయినను తనవంటివానికది సమంజసముగా కన్పించలేదు. తాను కృతినొన్న మనుచరిత్రయందు తన వంశవర్ణనము, తననుగుఱించికూడ పెద్దనామాత్యుడు వర్ణించినాడు. అవియే తన గ్రంథ మందిముద్చుకొనిన? ఈ యాలోచనము బాగుగదోచినది రాయలకు.

విజయయాత్రకు తనవెంట వచ్చిన కవిపండితులకు ఆంధ్రకవితా

పితామహులకు కబురుపంపినాడు రాయలు. మహామంత్రి తిమ్మరుసుల వారును వచ్చినారు.

కవిపండితులందరు అరుదెంచినారు. వారికి ఆ పిలుపులోని భావ మర్థముకాలేదు. పెద్దనామాత్యులు, అప్పాజీ యరుదెంచినారు.

రాయలు తన స్వప్న వృత్తాంతమును వారి కెఱుకపఱచి, శ్రీకాకులాంధ్రదేవుని నిర్ణయమును వినిపించెను. తానొనర్చిన గ్రంథారంభమును వారికి వినిచినాడు రాయలు.

"పెద్దనామాత్యా! గ్రంథకర్త వంశవర్ణనము, స్వవిషయవర్ణనములందు ఆత్మశ్లాఘ్యమొనర్చుకొనుట నా కిష్టముకాదు. అట్లని స్వవిషయమును మరుగుపరచుట గ్రంథలక్షణము కాదు. అందుచే మనుచరిత్రమందలి మీచే రచింపబడిన కృతిపతివర్ణనము, వంశవర్ణనా పద్యములను నాగ్రంథమున జేర్చుకొనుట కనుజ్ఞ నీ వీవలయును."

"అవశ్యము ప్రభువులు వానిని గ్రహింపవచ్చును." పెద్దన తన యామోదమును తెల్పినాడు.

"భావిచరిత్రకారులు దానినెట్లు తలంచెదరో!" తనలో యనుకొని నట్లనినాడు అప్పాజీ.

"మీ యనుమానమేమి యప్పాజీ?"

"మనుచరిత్రమందలి పద్యములే ప్రభువుల గ్రంథమందుండిన గ్రంథకర్తృత్వమును భావితరములవారెట్లూహింతురో యని!" అప్పాజీ తన యనుమానమును తెల్పినాడు.

"అప్పాజీ! ఆముక్తమాల్యదను ఆంధ్రకవితాపితామహులే వ్రాసిరని యందురనియా? లేక మనుచరిత్రమును రాయలే వ్రాసియుండవచ్చు ననుకొందురనియా? మా యిరువురలో నెవరైన నేమప్పాజీ! కవితా పితామహుడు, ఆతని కవిత జీవించియుండు ననంతకాలము రాయలును, రాయల చరిత్ర కవిత జీవించియుండునంతకాలము పెద్దనయు జీవించియుందురు." అనినాడు రాయలు.

ఆ పెద్దనామాత్యునితోడి తన సంబంధమునట్లు నిర్వచించుకొని నాడు రాయలు. ఆ నిర్వచనము వినిన కవిపండితుల కాతని హృదయ

మెంతటి స్నిగ్ధమో తెలిసినది.

"పెద్దనయే ఆ పద్యములను తనగ్రంథమునుండి యుపసంహరించుకొనిన ఈ సమస్యయే యుదయింపదు." తిమ్మన యనినాడు.

"అది యాత్మవంచనకార్యము తిమ్మనా! అట్లెన్నటికిని కాదు. నాకు ఆంధ్రకవితాపితామహునందలి గౌరవముచే నాతని పద్యములనే నా గ్రంథమున నిక్షేపించుకొంటిననియే భావిప్రజ యనుకొనవలయును. అంతియే. ఏమందువు పెద్దనకవీశ్వరా?" రాయలడిగినాడు.

"అఖండకీర్తి సాంద్రుడగు రాయలతోనవి ముడిబడి మనియుండుట నా యదృష్టమందును" గద్గదమందిన కంఠముతో ననినాడు పెద్దనామాత్యుడు.

"ఈ పుణ్యసమయమున నీ యుపకృతికి మారుసేతగా నీకు తానెంపూడి గ్రామమును సర్వకరపరిహారముగా నగ్రహారమొనర్చి దానముచేయ సంకల్పించినాను."

పెద్దన మాటాడలేమి.

ఆనాడుమొదలు ఆముక్తమాల్యదా గ్రంథరచనము సాగిపోవుచునది.

రాయలు గ్రంథమారంభించునప్పుడు ప్రతిదినమును తాను వ్రాసినంతదనుక పెద్దనకు వినిపించును. వారిరువురు ఆ పద్యముల నిగ్గుదీసి పసతేల్తురు. పసగాలేని పద్యమును రాయలే తీసివేయువాడు.

## ఇరువది ఆరు

ప్రొట్నూరికడ ఆంధ్రసామ్రాజ్య దిగ్విజయస్తంభ మెత్తించి తిరిగి రాజధానిని చేరినాడు రాయలు. అన్నపూర్ణ బహిష్కరణ మాయామనోహ్రదాన్ని కలచి కలగుందు నొనర్చుచున్నది. విషపరాధినిత అన్నపూర్ణ అనునదాతని శంక. ఆ యనుమానము తీరకనే రాయల ఆవేదన. రాయలలోని ఆవేదనను పసిగట్టినాడు పెద్దన.

తిమ్మన పెద్దనతో కలసి మహామంత్రుల గృహమున కరుదెంచినాడు. "మా అన్నపూర్ణవిషయమై మహామంత్రులే మాలోచించుచున్నారు?" తిమ్మన యడిగినాడు.

"తిమ్మనా! అది అంతఃపురమునకు సంబంధించిన విషయము. మహారాజుల హృదయము బాగుగ గాయపడినది. కాలమే ఆగాయమును మాన్పగలిగినది." అనినాడు తిమ్మరుసు.

"ఐన మహారాణి అన్నపూర్ణ అట్లు కుమిలిపోవలసినదేనా?" తిమ్మన యడిగినాడు.

"మహారాజుకూడ ఆవేదననందుచుండుట నేను గమనించినాను. మహారాణి నిరపరాధియా యనునది రాయల అనుమానము. అనుమానమే కాదు, ఆయమ నిరపరాధి. గానలోలత్వయే ఆమెలోని లోపము. ఆ గానమునకు కారణము అన్నపూర్ణ సోదరుని కుట్రయే. రాయల నాకర్షింప బూనిన సంగీతము అదృష్టవశమున అన్నపూర్ణ నాకర్షించినది. సర్వ విజయనగరసామ్రాజ్యమే రక్షింపబడినది." తిమ్మరుసనినాడు.

విషయమేమియో అర్థముకాలేదు తిమ్మనకు.

"మహారాజుపైననే కుట్ర జరిగినదా?" పెద్దన యడిగినాడు.

"ఔను పెద్దనా! ఆ విషయము లిప్పుడు బయటపడరాదు. అవి రాజ్యసంబంధులు." అనినాడు మహామంత్రి.

"మహారాజును సంగీతలోలుదేకదా? దాని నాధారమొనర్చుకొని తామేల మహారాజును మందలింపరాదు?" అడిగినాడు పెద్దన.

"బాగుగనున్నది. మహారాజు నాకర్షింపగలు సంగీతవేత్త యుండ వలయునుగదా పెద్దనా?" పెద్దన యాలోచనను గ్రహించిన మహామంత్రి యనినాడు,

"భట్టుమూర్తి సంగీతసాధకుడు. వీణావాద్యనిపుణుడు. వేణుగాన మందత్యంత సమర్థుడు." పెద్దన యనినాడు.

"పెద్దనా! నీ యాలోచనము నాచరణమందుంచుటకు ప్రయ త్నింపుము. లాభము కలుగవచ్చును. రాయలమనసు మారిన అన్నపూర్ణా దేవి యదృష్టవంతురాలు."

తిమ్మరుసు యనుజ్ఞనంది పెద్దన తిమ్మనతో యరిగినాడు.

ఉద్యానసౌధమందున్నాడు రాయలు. అతని హృదయము అన్న పూర్ణా విరహముతో వేగుచున్నది. అర్ధరాత్రిమైనను ఆతడట్లే తిరుగు

చున్నాడు, ఆనాడు అన్నపూర్ణాదేవి పంపుకొనిన లేఖయే అతని యావేదనకు కారణమైనది. అనేకములగు విషాదభావనలా హృదయ మందుదయించి లయించిపోవుచున్నవి, అన్నపూర్ణాదేవి రచించిన విరహ గీతికలను. అన్యాపదేశముగా ప్రియు నుపాలంభించు వానిని చదువుటకై మేఖలను నియోగించినాడు పెద్దన.

భట్టుమూర్తి తన వేణువుపై నత్యంతవిషాదకరమగు రాగము నాల పించినాడు. మలయమారుతమందు నుడులుచుట్టుకొని ఆ గానము నిశ్శబ్ద వాతావరణమునంతను నలముకొనినది. ఆ విషాదగానము ప్రభువు విషాద హృదయపు లోతులను తాకి చూచినది. ఆగానమున మిళితమై ఒక కిన్నెరకంఠమొక విషాద విరహగీతిక నాలాపన మొనర్చనది—

"పరస్వనాంతే నవమంజరీషు
సషట్పదో గంధఫలీ మజిఘ్రత్
సా కిం న రమ్యా స చ కిం న రంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా ॥ *1

'చక్రాని కవనము. అన్యాపదేశముగా విరహిణి తన ప్రియుని దూరుచున్నది.' అనుకొనినాడు రాయలు. వ్యథసంబెడు హృదయమున కొకింత చెప్పినిచ్చినదా గీతము.

గీతమాగినవెంటనే మోహనమురళీనినాదము పరిదేశమును క్రమ్మి వైచినది.

అంత చక్రానిరాగాలాపనము వేరు వినియుండలేము. ఆ గాయకుని చూడవలయునను కోరిక యంకురించినది రాయల హృదయమున.

మరల నా కంఠము వినవైనది—

"మా కిం శుక ప్రకట యాత్మ నిమేషమాత్రం
మన్మస్తకే విహరతీతి మధు వ్రతోయం
కిం మాలతీ విరహవేదనయా త్వదీయం
దృష్ట్వా ప్రసూన మదిరాపనల భ్రమేణ॥" *2

ఆకంఠ మెచ్చటనో తాను వినినది. ఎంతచక్రాని కవనము. ఎంత మధురమగు నుపమానము. అర్ధరాత్రియందా గానమున కరమే

మియో రాయలు కర్థము కాలేదు.

తిరిగి మోహనవంశీనినాదము వినిపించినది. శివరంజనీరాగ మాలాపన జరిగినది. రాయల హృదయము కరిగిపోయినది.

తానెందరు గాయకుల రాగముల వినియుండలేదు? ఇంతగా హృదయమును కదలించిన వేణునిస్వన మరుయు. అఖండ ప్రతిభావంతుడా గాయకుడు. అఖండ సంగీత తపస్సంపన్నురాలా గాయని. అత్యుత్తమ కవిత్వమది- యనుకొనినాడు.

ఇక ఆ ప్రభుహృదయ మాగలేదు. లేచి వేణుగాన మరుదెంచు దిక్కునకరుగ నొక్కయడుగువైచినాడు రాయలు. మరళీనినాదమాగి గీతము మొదలైనది.

"కిం మాలతి మ్లాయసి విహాయ
మధుంబ తుంబీ కుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భి శ్చరణైః పశుశ్స్యాత్.
సషడ్భిరత్యర్థ పశుర్న కిం స్యాత్!" *3

గీతమాగి రాగము మొదలైనది. సర్వదుఃఖముల మరపింపజేసినదా రాగము. ప్రభువుద్రిక్తుడైనాడు. తనలోని గానసామర్థ్యమునా రాగమం దిమిడ్చి నినదింపజేసినాడు తన మోహనవంశిని భట్టుమూర్తి. అంతటి మహా గాయకుడు తనరాజ్యమం దజ్ఞాతముగా నుండుట న్యూనతగా తోచినది రాయలకు. సాహిత్య సంగీత ప్రియుడగు నా మహారాజు ఆ గాయకుని జూచి సన్మానింపవలెనను వాంఛ కట్టుకట్ట వేయలేకపోయినాడు. రాయలు ఆ గానతరంగములననుసరించి బయలుదేరినాడు.

రాయలరాకను గమనించిన మేఖల ప్రక్కకు తప్పుకొనినది. పెద్దన, తిమ్మనలుకూడ ప్రక్కలకు తప్పుకొనినారు. రాయలను గాంచిన భట్టుమూర్తి తన మురళీగానమునాపి లేచి నిలచినాడు.

"ఆపకు. నీ వేణునిస్స్వనమును నిరోధింపకు. ఏ రసలోకములకో పోయి ఆనందము ననుభవించు నా హృదయమును నిరుత్సాహ పరుపకుము."

భట్టుమూర్తి రాయలకు వందనమాచరించి లేచి నిలచినాడు.

"ప్రభువులు కోరిన నీ సేవకుడు తమ పాదమూలమునకు రాడా?" భట్టుమూర్తి యనినాడు.

"నీవొక కళామూర్తివి. ఇంతటి గానపై పుణ్యమున్న నీవు సేవకుడవు కారాదు. నీవెవరు యువకుడా?" రాయలడిగినాడు.

"ప్రభువుల దయను కోరినవాడను. తమ ప్రజాకోటిలోనివాడనే ప్రభూ!"

"ఇంతచక్కనిగానమును, హృదయము నుఱ్ఱూతలూపగల గానమెక్కడ నేర్చితివి?"

"సంగీత కవిత్వములు మా వంశమందలి విద్యలు ప్రభూ?"

"కృతార్థుడవయ్యా!" ప్రభువు మెచ్చుకొనినాడు.

"ప్రభువులు అర్ధరాత్రమున ఒంటరిగా యరుదెంచినారు."

"అవును. నీ గానమాధుర్య మంతవఱకు మమ్మాలోచింపనీయ లేదు."

"చక్రవర్తులు కళోద్విగ్నహృదయులు. అయినను కర్తవ్యమును విస్మరించినారు."

రాయలు కలకల నవ్వినాడు. "గాయకుడా! దీనికై శిక్షింపబడ వలసినవాడవు నీవు. నీ గానమాధుర్యమే నన్నింతదనుక కొనివచ్చినది."

"ప్రభువులానేరమునకు శిక్షను విధించిన సంసిద్ధుడను" భట్టుమూర్తి అనినాడు.

"శిక్ష విధింతును. మరొక గడియకాలము నీ వేణుగానమును విన్పించి క్షుభితమైన మా హృదయము నానందింపజేయుట నీకు శిక్ష."

"ధన్యుడను ప్రభూ!" అనినాడు భట్టుమూర్తి. అతని వేణువునుండి మధురనాదము లుద్భవించి దశదిశల వ్యాపించినవి. సర్వప్రపంచమును సమ్మోహనపరచినవి. రాయలానందతన్మయుడైనాడు. అవశుడైనాడా నాదోపాసకుడు. వేణుగాన మాగినది.

"ఇంత చిన్నవయసుననే యింతటి గానపై పుణిని సంపాదించిన నీవు నిజముగా గంధర్వుడవు. నీ గానమునకు బహూకరణయవసరము. కోరుకొనుము. ఆంధ్రసార్వభౌముడు నీ కోరిక నెరవేర్చును." అనినాడు.

రాయలు.

"కళకు హృదయానందమే ప్రతిఫలముకదా ప్రభూ!"

"నా యానందమునకొలకైన నీవొక కోర్కెను కోరవలయును." ప్రభువాజ్ఞాపించినాడు.

"కోరుదును ప్రభూ! కాని ... —" అనినాడు భట్టుమూర్తి.

"నీ వెనువెంట భృంగగీతికను గానమొనర్చిన యామెకూడ బహుమానమున కర్హురాలు." అనినాడు రాయలు.

"ఆమెను కొనివత్తును" యని పిలచినాడు భట్టుమూర్తి. మేఖల యరుదెంచి మహారాజునకు నమస్కరించినది మేఖలనుగాంచి యాశ్చర్యమందినాడు రాయలు.

"ప్రభువులు నాకోర్కెనుకూడ నెఱవేర్తురా?" మేఖలయడిగినది.

"అగును మేఖలా! ఈ అర్ధరాత్రి ఈ గానము, ఈ వేణువిస్వనములు, ఇవి నా పర్థమగుటలేదు" రాయలనినాడు.

"క్షమింపుడు ప్రభూ! తమ హృదయమునకు బాధాకరమైనను నేనొకవిషయ మిప్పుడు నుడువక తప్పదు." మేఖల యనినది.

"ఏమది మేఖలా?" వ్యగ్రుడై రాయలనినాడు.

"ధీరహృదయులు మహారాజులు. అట్టివారే అర్ధరాత్రిసమయమని యెంచజూడక, అంగరక్షకులు లేకుండ నిర్జనప్రదేశములోనికి సంగీతముచే ఆకర్షింపబడినారు. అబల, కళోద్విగ్నహృదయ, గానలోలయైన మహారాణి అన్నపూర్ణాదేవి ఆకర్షింపబడినదనిన శంకింతురా ప్రభూ?" మేఖల యనినది. ఆమెలో జంకులేదు, గొంకులేదు.

మహారాజు హృదయపు లోతులను తాకిచూచినవా మాటలు. అతని ముఖము దీనమైనది.

"శంకాగ్రస్త హృదయముతో అమాయకురాలి ననుమానించి యవమానించిన నేను రాక్షసుడను మేఖలా!" విచారముతో ననినాడు రాయలు.

"అంతమాటనకుడు ప్రభువులు. ఆ సమయమట్టిది. ప్రభువుల హృదయమును బాధించినందులకు శిక్ష విధింపవచ్చును."

"ఇంతకీ నాటకమునకు సూత్రధారులెవ్వరు మేఖలా!" రాయలు నవ్వుచు నడిగినాడు.

"పెద్దనామాత్యులు." అనినది మేఖల.

పెద్దన తిమ్మన లరుదెంచి మహారాజుకు నమస్కరించినారు.

"పెద్దనా! ఆ భృంగ గీతికల రచయిత యెవ్వరు?"

"మహారాణి అన్నపూర్ణాదేవివారు." అనినాడు పెద్దన.

"అంతటి సహృదయను బాధించినాను పెద్దనా! నాహృదయమునకిప్పుడది రంపపుకోతయైనది." అనినాడు రాయలు విచారముతో.

"మహారాణి నిరపరాధ. తమకొరకు పన్నిన వల యది. ఆనాడు మహారాణివారట్లగుటయే మహారాజులకు క్షేమకారణమైనది." అనినాడు పెద్దన.

రాయల యాశ్చర్యమునకు మేరలేదు.

"ఆ కుట్రకు ప్రతిఫలమే తమ కళింగదిగ్విజయము మహారాజా!" యనుచు అచటికరుదెంచినాడు అప్పాజీ!

అప్పాజీరాకకు పెద్దన యాశ్చర్యమందినాడు.

"మహారాణి అన్నపూర్ణాదేవి తమ తండ్రియింటినుండి అంతఃపురమున కరిగినది ప్రభూ!" అనినాడు అప్పాజీ నవ్వుచు.

"తాము అప్పాజీవారు కదా." యనినాడు పెద్దన.

"క్షమింపుడప్పాజీ!" రాయలనినాడు.

"అది మానవసహజమైన బలహీనత ప్రభూ! మహారాణి నిర్దోషి." అనినాడు అప్పాజీ.

"గ్రహించినాను అప్పాజీ. స్వయముగా గ్రహింపగల్గు విధము నొనర్చినారు. ఈ గాయకుడు నా కనులను తెరపించినాడు." అనినాడు రాయలు.

"ఈతడు గాయకుడే కాదు, కవియును." పెద్దన యనినాడు.

"మన ఆస్థానమునందు ప్రవేశపెట్టుము పెద్దనా. మణిపూసవంటి యువకుడు." అనుచు తన మెడయందలి రత్నహారమును భట్టుమూర్తి మెడయందు వైచినాడు రాయలు.

"మేఖలా! భృంగగీతములవియేనా?"

"మఱి రెండు మిగిలినవి ప్రభూ!"

"ఆ గీతికలలో అక్షరాక్షమున ఆమె గాయపడిన హృదయము ప్రత్యక్షమగుచున్నది మేఖలా! ఆ శ్లోకములు విన్పించు" రాయలుకోరినాడు.

"భ్రమర భ్రమతా దిగంతరాళే
క్వచి దాస్వాదిత మీక్షితం శ్రుతం వా
వద సత్య మపాస్య పక్షపాతం
యదిజాతీ కుసుమానుకారి పుష్పం. 4*

"కుసుమాని లిఖంతు నామ చిత్రే
కతిచిత్కారు విశేషసాధ నిష్ఠాః
సురభిత్వమమూని కిం లభంతే
కిముచైతేషు రసం పిబంతి భృంగాః." 5*

---

భృంగపంచకము :

*1 చరన్వనాంతే : (భావము)
వనాంతమున క్రొత్తపూగుత్తులందు విహరించు తుమ్మెద చంపకముసు వాసనయైన చూడదు. ఆ చంపకము రమ్యముగాదా? తాను రసికుడుగాడా? ఇంతకు నీశ్వరాజ్ఞ బలీయమైనదిగదా?

* 2. మాకింశుక ప్రకట : (భావము) కింశుకమా! తుమ్మెద నా చుట్టును విహరింపుచున్నదని గర్వము నొందకుము. మాలతీవిరహవేదనచే నీ పుష్పముల గాంచి అనలమను భ్రమచే నట్లొనర్చుట తెలియుము.

*3. కిం మాలతీ మ్లాయసి : (భావము) మాలతీ! ఏలబాధపడెదవు? నను విడచి తుమ్మెద తుమ్మిపూవును చుంబించుచున్నదనియా? లోకమున నాల్గుకాళ్ళున్ననే పశుత్వమబ్బుచుండ ఆరుపాదములుగల్గినచో నంతకు మించియుండుటేల యసంభవము?

*4. భ్రమర భ్రమతా : (భావము) భ్రమరమా! దిగంతరాళముల దిరుగుచు జాతీకుసుమానుకారియగు పుష్పము నెచ్చటనైన యాస్వాదించితివా? చూచితివా? వింటివా? పక్షపాతరహితముగ బల్కుము.

*5. కుసుమాని లిఖంతు : (భావము) దక్షులగు శిల్పులు పుష్ప

"ఇంతటి రసహృదయను ప్రేమైకజీవిని శంకించిన నేను పాపాత్ముడను అప్పాజీ! సెలవు." అనుచు రాయలంతఃపురముపైపు వెడలిపోయినాడు.

తామొక కుటుంబిని వ్యధను తీర్చితిమను సంతోషముతో తమ గృహముల కరిగినారు మిగిలినవారు.

## ఇరువది ఏడు

శ్రీ వీరకృష్ణదేవరాయలు తన కళింగ దిగ్విజయానంతరము రాజధానీనగరమున నుండి ఆముక్తమాల్యదారచన మతినిష్ఠతో నాగించుచున్నాడు. తాను చేపట్టిన విశిష్టాద్వైత మతసిద్ధాంత ప్రవక్తగా ప్రతిష్ఠాపకుడుగా తన యాముక్తమాల్యదయందలి విష్ణుచిత్తుని పాత్ర నిర్మాణమున నహరహము కృషి యొనర్చుచున్నాడు రాయలు.

రాయలు తీర్చి దిద్దుచున్న విష్ణుచిత్తుని మూర్తి కల్పనాపాత్రకాదు. పరవాదిభీకరుడై పాండ్యభూపతి సభాస్థానమున విశిష్టాద్వైత మతవిశిష్టతను చాటిచెప్పిన శ్రీభట్టనాథుని చరిత్రమే ఆముక్తమాల్యదారచనమున విష్ణుచిత్తుని చరితమును తీర్చిదిద్దినది.

భట్టనాథుడు ప్రప్రథమ దాక్షిణాత్య భక్తకవి. ఈతడొనర్చిన మంగళాశాసనమ్ (తిరుప్పల్లాణ్ణు) భట్టనాథ శ్రీసూక్తి (పెరియాళ్వార్

---

చిత్రముల జెక్కిన జెక్కవచ్చు. కాని వానికి సురభిత్వమీయగలరా? భృంగములు రసగ్రహణమునకై వానిని జేరునా?

పై శ్లోకములలో చరన్వనాంతే, భ్రమరభ్రమతా యనునవి వల్లభదేవుని సుభాషితావళియందు గలవు. (727, 755 శ్లో.) భ్రమరభ్రమతా యను శ్లోకము ముకుళభట్టు తన యభిధావృత్తిమాతృకలో సాదృశ్యలక్షణమున కుదాహరణముగా నిచ్చియున్నాడు. రాయలు వీనిని వినినవెనుక గజపతికుమార్తెతో పునస్సమాగమ మందెనట.

ఒకవేళ నీ శ్లోకములు గజపతి కుమార్తెయే సేకరించినను లేక పెద్దనయే రచించినను, సేకరించినను వారి వైదుష్యమున కెట్టి కొఱంతయు గలుగదు. .... రచయిత

తిరుమేళి) దివ్య ప్రబంధములు. మొదటి గ్రంథము పాండ్యరాజ మనో రంజనమొనర్చి గజారోహణ సమ్మానమందిన తన వైభవమును జూడ నేతెంచిన రమా రమామనోరమణుల కొనర్చిన విశిష్టమంగళాశాసనము. ఇది ద్రావిడవేదమునకు ప్రాణ స్థానము.

కృష్ణరాయల స్నేహబలమున నీ విశిష్టాద్వైతము వేయివెలుంగులు విరజిమ్మినది విజయనగర సామ్రాజ్యమున.

రాజకీయములను వదలి సాహిత్యజిజ్ఞాసయందు లీనమైనాడు రాయలు. మహామంత్రి తిమ్మరుసు రాజ్యరథమును ఒడిదుడుకులు లేకుండ నడపుచున్నాడు.

వసంతోత్సవములు సమీపించినవి. విజయనగరరాజ్యమున నత్యధిక కోలాహలమును కలిగించు ఉత్సవమయ్యది.

ఆనాడు వసంతోత్సవదినము. చిత్రరథస్వామి యుత్సవ మానాడుండును. మహారాజు తన రాణివాసపు స్త్రీలతో ఉద్యానవనమందలి చలువమేడలో నానాడుండును. చిత్రరథస్వామి యుత్సవము సాగిపోవు చున్నది. దాని వెంట జనులు వసంతములు జల్లుకొనుచు పోవుచుందురు.

రంగురంగుల నీరములు చిమ్మనగ్రోవులతో నొకరిపై నొకరు చిమ్ముకొనుట ఆనాటి వేడుకలలో నొకటి. సౌధములపై నిలచి ఉత్సవమును జూచువారలుకూడా ఈ రంగునీరముల బారినుండి తప్పించుకొనజాలకున్నారు. ఆనాడు పిన్నపెద్దల తారతమ్యము లేదు. ధనవంతులు బీదవారను విచక్షణము లేదు. అధికారులవి విడచిపుచ్చుటలేదు. అందరా రంగురంగుల నీరముల దోగి సంధ్యారుణాకాశము భూమిపైనున్నట్లు కన్పించవలసినదే.

సాయంసమయమైనది. రాయల ఉద్యానవనమున కవిసమ్మేళనము జరిగినట. ఆహూతులైన కవిపండితులే అందు పాల్గొనినారు. యువకవులలో తెనాలిరామకృష్ణుడు, సూరన, భట్టుమూర్తి కూడ యిందు పాల్గొనినారు.

ముత్యాలగద్దెయందధివసించినాడు రాయలు. చుట్టును విరుగబండిన మామిడివృక్షములు, పూచిన అశోకములు ఆ సభాబాహ్యప్రకృతికి వన్నె

మెచ్చుచున్నవి.

రంగుల ముసుగులు ధరించిన యవనకన్యలు మహారాజున కిరు వైపుల వీవనలతో విసరుచున్నారు. సుధర్మాసనస్థితుడగు దేవేంద్రుని చందమున నున్నాడు రాయలు.

"నందితిమ్మనార్యులు తమ ముద్దులొల్కు పద్దెములతో నీ సభను ప్రారంభింపగోరుచున్నాము." రాయలు కోరినాడు.

తిమ్మనార్యుడు చెవులందలికుండలములు చౌకళించుచుండగా లేచి నిలచినాడు. "మాకీనాడు కవితావస్తువు ప్రభువులే. అందుల కనుజ్ఞ నీయ గోరుచున్నాను."

రాయల ముఖమున చిఱునవ్వుల జల్లులు కురిసినవి. రాయలంగీక రించినాడు.

"ఈనాటి ఈసభ సర్వమనోరంజకముగ నుండవలయుననిన సర్వులకు ఆశువునందు స్వతంత్రత వలయును. అందున యువకవులగు నీ రామకృష్ణాదులను స్వేచ్ఛగా వదలుట మంచిది. వారిలోని చతురత విజ్ఞానాదుల నరయుట కదియే సరియగు పద్ధతి." అనినాడు తిమ్మన.

రాయలు పెద్దనవైపు గాంచినాడు. పెద్దన తన యామోదమును వ్యక్తపరచినాడు - "నా శిష్యునికి వచ్చు కీర్తి నాకీర్తియే. రామకృష్ణు డీనాడు తన ప్రతిభను జూపునుగాక." అనినాడు.

తిమ్మనార్యుడు ప్రారంభించినాడు—

"ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవినికర గుంభిత కావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూ ప్రసాదనరసికా॥

యాదవత్వమున సింహాసనస్థుడుగామి
సింహాసనస్థుడై చెన్నుమెఱయ
గొల్లయిల్లాండ్రతో గోడిగించుట జేసి
పరకామినీ సహోదరత జూప
మఱి జరాసుతునకై మధురవిడించుట జేసి

పరవర్గ దుర్గము ల్బట్టిమిగొనగ
పారిజాతము నాసపడి పట్టితెచ్చుట
నౌదార్యమున దాని నడుగు పఱుప
గోరి తొలు మేన దనకై న కొదువలెల్ల
మాన్చుకొనవచ్చి భువనైక మాన్యలీల
నవతరించిన కృష్ణు డేననగ మించె
నరస విభు కృష్ణరాయ భూనాయకుండు.

సభయందు సంతోషము వెల్లివిరిసినది. రాయలాలోచనామగ్ను డై నాడు. "రామకృష్ణ కవీ! నీ ఆశుకవితాధారతో నీవసంతసభాసమ్మేళనమునకు మెఱుగుపెట్టుమయ్యా" అనినాడు తిమ్మన.

రామకృష్ణుడు పెద్దనవైపు జూచినాడు. అంగీకారమును సూచించుచు పెద్దన చిఱునవ్వు నవ్వినాడు.

"యువకవీ! నీ ఆశుకవితను వినుటకు వేగిరపడుచున్నాము." రాయలనినాడు.

రామకృష్ణుడు లేచినిలచి —
"నరసింహ కృష్ణరాయని
కర మరుదగు కీర్తినొప్పె కరిభి ద్గిరిభి
త్కరి కరిభిద్గిరి గిరి
భిత్తురంగ కమనీయంబై."

రాయలానందసంద్రమున దోగినాడు. వేసవియందు చల్లని శీకరములజల్లు కురిసినట్లైనది.

"ఈనాడు పెద్దనకవీశ్వరులేలనో మిన్నకున్నాడు." మాదయగారి మల్లన యనినాడు.

"ఆంధ్రకవితాపితామహుల కృతిలేని సభ రాణింపదు. పెద్దనామాత్యులేల మిన్నకున్నారు?" రాయలనినాడు.

చిఱునవ్వుతో నిలచినాడు పెద్దనామాత్యుడు. "మహారాజా —
"నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క

> ప్పురవిడె మాత్మకింపయిన భోజన మయ్యెలమంచ మొప్పు త
> ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకో త్తముల్
> దొరికినగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే?"

సభ నిశ్శబ్దమైనది. రాయలూరకున్నాడు. సభయందలి కవులొకరిముఖమొకరు చూచుకొనినారు. కవి నిరంకుశుడాతని వాక్కునకెదురులేదు. రాయలేమనునో? సభ్యులకొసంగుటకు మల్లెల. సంపెంగల, జాజుల చండలు తెచ్చి యచటనుంచిన దొక యలరుబోడి. అగరు, కస్తూరి, కుంకుమ పూర్గ్రసపముల వాసించు గంధసారపు గిండియను గొనివచ్చి యిచట నుంచినదొక పుష్పగంధి. జాజికాయ, జాపత్రి. కుంకుమపూవు, కస్తూరి, పచ్చకప్పురములతో మడిచిన తాంబూలముల పళ్ళెరముల కులుకునడకల గొనివచ్చి దించినదొక వరారోహ. సువర్ణము లుంచిన పళ్ళెరమును గొనివచ్చినది చివరగా మేఖల. రాయలా సుకుమార సౌందర్యరాశిని గాంచినాడు. ఆతని పెదవుల చిఱునవ్వు లాస్యమాడినది.

"మేఖలా! పితామహుల కిప్పటికి రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడె మందుకొనవలయునను వాంఛ కలిగినది. నీవీ కర్పూరవిడెమందుకొనిపోయి పెద్దనార్యుని కీవలయును."

మేఖల తలవంచినది.పళ్లెరమందలి కర్పూర తాంబూలమందుకొని పెద్దనవైపు నడచినది. ఆమె హృదయము దడదడలాడినది. వెనుకటి దృశ్యము కనులముందు తిరిగినది.

చాచిన పెద్దన చేత కర్పూరవిడెముంచి తలయెత్తి ఆతని ముఖము వైపు గాంచినది మేఖల మందస్మితముతో వింతచెలువమును దిద్దుకొనిన పెద్దనవదన మామెనొకింత సేదదేర్చినది. అవశతతో తాంబూలముతో పెద్దన చేతియందుంచిన తనచేతిని తీసికొన మరచినదా సుందరి.సభ్యులు సంతోషమున చప్పటులు చరచినారు. ఆమెవేయి వెనుకకు లాగికొనినది.

"పెద్దనార్యా! రాజనర్తకి మేఖలను తమరు కోరిన రమణీప్రియ దూతికగా నొసంగుచున్నాము. అందులకామెగూడ అంగీకరింపగలదని మా భావము." అనుచు మేఖలవైపు జూచినాడు రాయలు.

"మహాప్రసాదముగ నంగీకరింతును." అనినది మేఖల. ఈ వ్యవహారము పెద్దనలో నొక బాధయు నొక యుత్సాహమును రేకెత్తించినది.

పుష్పపరీమళమును తనలో లయించుకొనిన నొక వాతపోతమా సభపై వీచినది. ఆమెపై విసరి ఆమె ముంగురుల నాడించినది. ఆమె ధరించిన సన్నని పైఁటాణి ఆ పిల్లతెమ్మెరకే లేచిపోఁజూనది. ఆమె సద్దుకొనినది.

"పెద్దనా ! హృదయములకింతటి యాహ్లాదమును కల్పించిన నీ వాతపోతమును వర్ణింపరాదా ?" తిమ్మన యనినాడు. సన్నని వీణాధ్వని ననుకరించినది పెద్దనస్వరము__

"ఈ కలకంఠిపై విసరె సీయెడ గంధనగేంద్ర సాంద్ర శా
రీక దరీపరీత శబరీ నిబరీ కబరీ సకేసరా
శీ కుహాళీ పరీమిళిత లీఢ విలీఢ శిలీముఖీ ముఖ
స్వీకర శీధుశీకర వశీకరణాకర వాతపోతమున్."

చల్లని వాతపోతము మేనులనుండి హృదయములను తాకినదా సభ్యులకు. హాయి యనిపించినది.

మేఖల హృదయము జిల్లుమనినది.

"మేఖలా ! ఆ దీనారముల పళ్లెరమిటు దెమ్ము."

మేఖల ఆ పళ్ళెరమును రాయలముందిడినది.

"కవులలో నెవ్వరైనను సరియే. ఆశువుగా దివ్యమగు సర్వశ్రేష్ఠమగు పద్యమును మాపై జెప్పి మమ్ము, సభనుకూడ మెప్పించి ఈ దీనారములను గొనవచ్చును. యువకవులుగూడ నిందు పాల్గొనవలయును. ముక్తపదగ్రస్తముగా మఱియొక పద్యమునకు మఱియొక పళ్ళెరము." రాయలనినాడు.

యువకవి భట్టుమూర్తి నిలచినాడు__

"శ్రీ లీలాత్మజ కృష్ణరాయ సమరోర్వన్ నీదువైరి క్షమా
పాలుర్వేగి హయాధిరూఢులగుచున్ బాఱన్ వనీశాఖి శా
ఖాలగ్నాయత కేశపాశులయి యూగం గేకిసల్గొట్టి యు

య్యాలో జొంపలో యంచు బాడుదురు భిల్లాంభోజ పత్రేక్షణా"
బాగనిపించినదా పద్యము సభికులకు.

పెద్దన నిలచినాడు__

"శరసంధాన బల క్షమాది వివిధైశ్వర్యమ్ములన్ గల్గి దు
ర్భర షండత్వ బిలప్రవేశ చలన బ్రహ్మాఘ్నతల్ మానినన్
నరసింహ క్షితి మండలేశ్వరుల నెన్నన్వచ్చు నీ సాటిగా
నరసింహ క్షితిమండలేశ్వరుని కృష్ణా! రాజ కంఠీరవా !"

"రాజకంఠీరవా" యనగనే రామకృష్ణుడు ముఖము చిట్లించినాడు. రాయలది గమనించినాడు. ఆతని హృదయము చివుక్కుమనినది ఈ యువకుడేల పద్యమైనంతనే బాధను సూచించినాడు? పద్యమందలి యలంకారమెంత గంభీరమెంతటి రమణీయము? రామకృష్ణుని బాధించిన యంశమందేదియ్యో తెలియనలచినాడు రాయలు - "యువకవీ! అంత రమణీయార్థ ప్రతిపాదకమగు పద్యమును వినికూడ బాధనందినావు. అందేమి దొసగున్నది?" రాయలడిగినాడు.

రామకృష్ణుడు పెద్దనార్యునివైపు గాంచినాడు.

"రామకృష్ణా! నీవు నా శిష్యుడవు. తండ్రి బిడ్డను, గురువు శిష్యుని తనకన్న మిన్నయగుటనే కోరునయ్యా! ఆలోచింపక మహారాజులకు ప్రత్యుత్తరమిమ్ము. అందు దొసగున్నను మా శిష్యుడే దానిని గ్రహించుట మాకు గర్వకారణము" పెద్దన యనినాడు.

"ప్రభువులు క్షమింపవలయును. మీరరాని తమ యాజ్ఞ మూలమున పలుకవలసివచ్చినది," తలవంచి రామకృష్ణుడనినాడు, "పద్యమందు నాకు గన్పించిన దోషము _. నరుడు, సింహము, క్షితిమండలము, ఈశుడు - ఈ నల్వురియందు నాలు దోషములున్నవి. అవి లేని యెడల వారు ప్రభువులతో సరివత్తురని గదా పద్యమందలి యర్థము. సింహమునకు బిలప్రవేశమున్నపుడు రాజకంఠీరవా యనుట దోషమగునని నా భావము."

"కంఠీరవ శబ్దమిట శ్లేషవాచకమగును కదా," తిమ్మన యనినాడు.

"అశ్లేషత్వమే పద్యమందు చెడినది." రామకృష్ణుడనినాడు.

ఆ విమర్శ రాయల హృదయము 'నౌరా' యనిపించినది.

"రామకృష్ణా ! నీవంతకంటె మంచి పద్యమును చెప్పగలవా ?" రాయలడిగినాడు.

"గురువుల యనుగ్రహమున ప్రయత్నింతును. —

"కలనన్ దావక ఖడ్గఖండిత రిపుక్ష్మా భర్త మార్తాండ మం
డలభేదం బొనరించి యేగునెడ తన్మధ్యమ్మునన్ హార కుం
డల కేయూర కిరీట భూషితుని శ్రీ నారాయణుంగాంచి లో
గలగంబారుచు నేగు నీవ యను శంకన్ కృష్ణరాయాధిపా !"

రాయలానందప్రహాసమున మురిసిపోయి బలుకుమై చెలినాడు. పెద్దన కన్నులానంద బాష్పముల వెలువరించినవి.

"యువకవీ ! నీ పద్యమునకు సరియైనది కాదీ పసనసే" ననుచు రామకృష్ణున కొసంగినాడు, దీనారముల పళ్ళెరము రాయలు.

తానందుకొనిన దీనారముల పళ్ళెరమును గొని రామకృష్ణుడు పెద్దన పాదములకడ నుంచి నమస్కరించి తన స్థానమున గూర్చున్నాడు.

"ఇక ముక్తపదగ్రస్తమున్నది." రాయలు హెచ్చరించినాడు.

"రామకృష్ణా ! ఇదియైన మాకు దక్కనిత్తువా?" నవ్వుచు తిమ్మన యనినాడు.

"నావంతైనది." ఊరకున్నాడు నవ్వుచు రామకృష్ణుడు.

పెద్దన నిలచి పద్యమును జెప్పినాడు—

"అతుల క్షాంతి గభీర
భీర హిత చిత్తాంభోజ
భోజ క్షమాపతి విద్యాపరిపాక
పాక రిపుకుంభదోర్భోగ
భోగాశివత్రితర స్ఫూర్త్యసుభావ
భావభరిత శ్రీకాంత
కాంతార పాతిత కాళింగ కులేశ
లేశతర వృత్తి క్షీణ వైరి వ్రజా—"

తిమ్మన కవీశ్వరులు నిలచినారు. తన మృదుతర శైలిని ముద్దుగా పల్కించినాడు తిమ్మన —

"దయామానాక్షీ విలోక
లోకహిత కృత్ప్రారంభ
రంభాకుచద్వయ దుర్గాధిపతి ద్విషత్పరిత గాధావ్యక్త దోస్సార
సార యశస్సాంద్ర దిశాంత
శాంతహృదయారజ్యన్న యాచార
సారయుతోపాయ విచార
చారణగణ ప్రస్తూయమానోదయా"

తొలి పద్యమందలి గంభీరమైన శైలిముందు తిమ్మన పద్యము మెత్త మెత్తగా ఉన్నది.

"ఈ బహుమానము పెద్దనగారందుకొనవలసినదే" యనుచు వరహాలు నిండుగా బోసిన పళ్లెరమును రాయలు పెద్దన కందించినాడు. చిఱునవ్వుతో పళ్ళెమందుకొనినాడు పెద్దన.

"రామకృష్ణా ! ఈ పద్యముల నేమందువయ్యా ?" రాయ అడిగినాడు.

"అల్లసానివారి యల్లిక జిగిబిగి
ముక్కు తిమ్మనార్యు ముద్దుపల్కు ... ...." అని యూరు కొనినాడు రామకృష్ణుడు నవ్వుచు.

సభ్యులు గొల్లుమని నవ్వినారు. అదేమియో అర్థముగాక నంది తిమ్మన తెల్లబోయినాడు. రామకృష్ణుని హాస్యస్వభావ మాతడెఱుగును.

"నందితిమ్మనగారి పేరునే మార్చి ముక్కు తిమ్మనగా నొనర్చినా వేమి రామకృష్ణా ?" పెద్దన నవ్వుచు యడిగినాడు.

"నానాసూన వితాన వాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కానన్ తపంబంది యో
షా నాసాకృతి బూని సర్వసుమన స్సౌరభ్య సంవాసియై
పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్"

రామకృష్ణుడా పద్యమును జదివినాడు. "తిమ్మనార్యు డొనర్చి

యీ పద్య మాతని యింటిపేరునే మార్చివైచినది." అనినాడు రామకృష్ణుడు. సభికులు నవ్వినారు.

"తిమ్మనా! అంతవక్రాని పద్య మక్షరలక్షలకు తగినది. కాను" మనుచు సువర్ణములొక పళ్ళెరమునిండ నిప్పించినాడు రాయలు. తిమ్మన సంతోషముగ స్వీకరించినాడు వానిని.

"ఈ బహుమాన మీవలకే తిమ్మనకు చెందవలసియున్నది."

"ఏమది రామకృష్ణా! తిరిగి ఏదో సంశయమును రేపినావు." రాయలడిగినాడు. రామకృష్ణునిపై ఆతని సర్వతోముఖ ప్రజ్ఞపై క్షణక్షణమునకు రాయల యాదర మెక్కువగుచున్నది.

"ప్రభువులు క్షమించవలయును. గురువులే దానిని తెల్పగలరు." రామకృష్ణుడనినాడు "తామడిగినది ముక్తపదగ్రస్తము."

రామకృష్ణుని యలోచనము పెద్దన కరమైనది.

"మహారాజా తామడిగినది ముక్తపదగ్రస్తము. నా పద్యమున 'ప్రజా!' అను పదముతో పద్య మంతరించినది. తిమ్మనపద్య మట్లుగాక మొదలిడిన 'దయ' చివరి 'ఉదయ' పదములో గ్రస్తమైనది. అది 'పరిపూర్ణము'. నా పద్యమట్లు పూర్తి కాలేదని రామకృష్ణుని భావమై యుండవచ్చును."

"పెద్దనా! గురువును మించినవాడీ శిష్యుడు. వయసున పిన్నయైనను సర్వతోముఖ పాండిత్య మీతనియందు స్ఫురింపుచున్నది. ఈతని నాస్థానకవిగా నొనరింపదలచినాను," రాయలనినాడు.

"అది నాకు గౌరవకారణము." పెద్దన యనినాడు.

"రామకృష్ణకవీ! ఇకపై నీవు రాయల భువనవిజయాస్థానకవిగా పదవిని స్వీకరింపుము. నీ కవితామృతాస్వాదనతో మమ్మనుదినము తృప్తుల నొనర్చుము."

వసంతోత్సవ శుభసమయమున నీ నియామక మందరకు సంతోషమునే కలించినది. కవులందరు సత్కరింపబడినారు.

శ్రీ వేంకట గిరి వల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ

జీవిత నాయక ! కవితా
ప్రావీణ్య ఫణీశ ! కృష్ణరాయ మహీశా !

వందియొకడా పద్యమును పఠించినాడు. సభావసానమును సూచించు ఘంటిక మ్రోగినది.

## ఇరువది ఎనిమిది

గజాశ్వములు రెండును యుద్ధమున ముఖ్యమని గమనించినాడు రాయలు. ఆశ్వికసైన్యము సభివృద్ధిపరుపబూని పారశీకాశ్వముల నెక్కుడుగా కొనుగోలు చేసినాడు.

రాయల అశ్వశాలకడ నిల్చినాడొక పారశీక బేహారి రెండు పారశీకాశ్వములను. ఆ యెత్తు ఆ సౌష్ఠవమూ చక్కదనము ఒకదానికొకటి తీసిపోవుట లేదు.

అందొకటి పాల నురుగువలె తెల్లనైనది. దాని శరీరమంతయు తెల్లనే. ముఖమున కస్తూరి తిలకమువలె ఎఱ్ఱనిమచ్చ యున్నది. కాలి గిట్టలభాగమును ఎఱ్ఱగనున్నది.

రెండవగుఱ్ఱము నీలజీమూతము. చేయెత్తు గుఱ్ఱము. సన్నని శరీరము. పరువు తూనీగవలె నుండవచ్చును. ఆ ముఖమున తెల్లనిమచ్చ. తోకచివర తెలుపుగనున్నది. అది సామాన్యుడగు ఆశ్వికునకు అలవియగునట్లులేదు.

ఈ రెండు గుఱ్ఱములను మహారాజునకు కానుకబెట్టుటకై కొని వచ్చినాడు పారసీకవర్తకుడు సిద్దీ మర్కయరు. వెనుక గుఱ్ఱముల తండా వచ్చుచున్నది.

గుఱ్ఱములను చూచుకొఅకు మహారాజరుదెంచినాడు. త్ర్యంబక నాయకుడు, రామరాయలు ఆశ్వికనిపుణులు. వారిరువురు. అంగరక్షకుడు వీరమల్లుడు రాయలవెంట నున్నారు.

సిద్దీమర్కయరు రాయలకు సలామొనర్చి గుఱ్ఱములనర్పించినాడు. "ఈ గుఱ్ఱము నింతవఱకు నెవ్వ రధిరోహింప జాలకపోయినారు," అనినాడు.

రాయలాశ్చర్యపడినాడు. "కారణము?"

"దాని స్వభావమట్టిది. దానికి తగిన రౌతు దొరుకలేదు."

త్ర్యంబకనాయకుడొక్క యడుగు ముందుకు వైచినాడు. గుఱ్ఱ మాతనివైపు మిఱ్ఱిమాదినది. దాని యర్థము నెఱుగును నాయకుడు. కళ్లెముసు పట్టుకొనినా డాతడు. విదిలించివైచినది అశ్వము. రాయలాశ్చర్యమును జెందినాడు. వీరమల్లు రాయల యనుజ్ఞగొని గుఱ్ఱమునధిష్ఠింప ప్రయత్నించినాడు. అది వానిని దరిజేరనీయలేదు. అలసిపోయి రొజుచు నిలచినాడు వీరమల్లు. వాని యాగ్రహమునకు మేరలేదు.

అశ్వశాస్త్రకుశలుడు పెద్దనామాత్యుడు, ఆతడు పిలిపింపబడినాడు.

పెద్దన గుఱ్ఱముయి జూడగనే నమస్కరించినాడు. గుఱ్ఱము తల వంచి సకిలించినది. పెద్దన చిఱునవ్వునవ్వినాడు. దగ్గఱకరిగి గుఱ్ఱముపై చేయివైచి దువ్వినాడు పెద్దన. సుడులు పరీక్షించినాడు. సర్వశ్రేష్ఠమగు ఆజానేయమది. "ఈ గుఱ్ఱము నెవరెవరు చూచినారు?" పెద్దన ప్రశ్నించినాడు.

"కళింగ గజపతి మహారాజులు చూచినారు. "మహారాష్ట్రాధిపతి గాంచినాడు, బిజాపుర సుల్తానాదిల్షా చూచినాడు."మరొక్కయరుపల్కినాడు.

"వీరిలో నెవ్వరు గుఱ్ఱమునెక్క ప్రయత్నము చేయలేదా?"

"వారి పరిజనులొక్కరిద్దరు విఫలమగుట దీనినెక్కుట కెవ్వరు ప్రయత్నము చేయలేదు."

"మహారాజులు దీనినెక్కవచ్చును." పెద్దన పల్కినాడు.

"మహారాజులా? అది కూడదు!" అంగరక్షకుడుగా వీరిమల్లా నిర్ణయమును వ్యతిరేకించినాడు తీవ్రముగా.

"మహారాజుల కపకారమగు నిర్ణయమును నేనొర్తునా వీరమల్లా! ఇది సర్వశ్రేష్ఠమగు ఆజానేయము. ఇట్టి అశ్వశ్రేష్ఠములు కోరినప్పుడు దొరుకవు. పూర్వమిట్టి గుఱ్ఱములు సవనాశ్వము లగుచుండెడివి. మహారాజులకిది తగిన యశ్వము" పెద్దన యనినాడు.

"రాయలశ్వమునకు నమస్కరించినాడు. అది సంతోషచిహ్నముగ సకిలించినది. కళ్ళెమందుకొనినాడు రాయలు, తలవంచి రాయల

వైపు చూచినది అశ్వము. ఎగిరి అశ్వముపైకి చేరినాడు రాయలు.

అశ్వము గరుత్మంతునివలె లేచినది. దానికి రెక్కలున్నవా? దానిగిట్టలు నేలపై తగులుచున్నవా? అందరాశ్చర్యమందినారు. అశ్వమొక అర్ధయోజన మఱిగినది. ఇక వెనుదిరుగుట మనుకొనినాడు రాయలు. అశ్వమాగినది. అది తన నధిరోహించిన యజమాని హృదయమును చదువగలిగినది. రాయలాశ్చర్యముతో వెనుదిరిగినాడు. ఒక క్షణములో అశ్వశాల వద్దకు చేరినాడు రాయలు మహదానందముతో. అశ్వము నుండి దిగినాడాతడు. "ఈ గుఱ్ఱము వెల యెంత?" బేహారి నడిగినాడు పెద్దన.

"దీనివెల రెండువందల వరహాలు. కాని మహారాజులకు దీనిని బహుమానముగా సమర్పించుకొనుచున్నాను." అనినాడు మర్కయపు.

"మహారాజులు దీనిని విలువికొనుట శ్రేష్ఠము." పెద్దన యనినాడు.

ఆ అశ్వము వెలను అంత మంచియశ్వమును తెచ్చినందులకు బహుమానమును వ్యాపారి కొసంగబడినవి.

"నీవద్దనున్న అశ్వములెన్ని?"

"నూటయిరువది."

"వానిలో తగినవాని నెన్నుము త్ర్యంబక నాయకా! మాకు మూడు నెలలలో నెన్నిగుఱ్ఱములనుతెచ్చియీయగలవు?"రాయలడిగినాడు బేహారిని.

"నాల్గువందల అశ్వములను తేగలను."

"అందులకెంత ధనమీయవలెను?"

"నలుబదివేల సువర్ణములు."

"గుఱ్ఱములు వచ్చునంతవఱకు నీవిచట పూటకాపుగా నుండవలయును." త్ర్యంబకనాయకుడనినాడు.

"అవశ్యము. నా సోదరుడే గుఱ్ఱముల కొనితేగలడు."

"అప్పాజీకి తెలియునప్పటికే సిద్దీ మర్కయరుకు నలుబదివేల సువర్ణములందినవి. ధనముతో నాతని సోదరుడు వెడలిపోయినాడు. సిద్ది మర్కయరును మాత్రము కాచియున్నారిరువురు సైనికులు.

పదిదినములు జరిగినవి. మర్కయరు పారిపోవునని యేరికి అను

మానసములేదు. ఆతడట్లు ప్రవర్తించినాడు. కావలివారల నొకింత యేమార్చి సిద్దీమర్కారుల్లాపు పలాయనమైనాడు. ఆతడు బిజాపుర నవాబువద్దకు చేరినాడు.

ఒకదినము పెద్దన నడిగినాడు రాయలు. "అశ్వము నన్నేల వెంకితనమొనర్పక స్వారి యొనర్పనిచ్చినది?" అని.

"సర్వతంత్ర స్వతంత్రుడైన సార్వభౌముడుకానీ, మహారాజు గానీ ఆ అశ్వము నెక్కగలడు. మరొకని నా అశ్వము తనపై కూర్చొనసీయదు. అది దాని లక్షణము." పెద్దన తెల్పినాడు.

అశ్వహృదయము తెలిసికొనుటలో పెద్దన సామర్థ్యము రాయలను ముగ్ధుని చేసినది

రామరాయల సామర్థ్యము దినదినమాతని మహారాజు హృదయానికి దగ్గరగా తెస్తున్నది.

తన కుమార్తె తిరుమలాంబ నొసంగి రామరాయలకు వివాహము చేసినాడు రాయలు. ఆర్వీటి రామరాయ అళియ రామరాయలైనాడు.

సిద్దీ మర్కాయరును పట్టియిచ్చుటకై రాయ లాదిల్షాను కోరినాడు. ఆదిల్షా అందులకొప్పుకొనలేదు. రాయలు యుద్ధమును ప్రకటించినాడు.

రాయచూరును ముట్టడించినవి రాయల సైన్యములు. రాయచూరు తుంగభద్రా కృష్ణానదులమధ్య నున్నది. కృష్ణకావలియొడ్డు బిజాపురము వారిది. తుంగభద్ర కీవలియొడ్డు విజయనగరమువారిది. రాయలు ముట్టడి కరుదెంచుసరికి కోటలో మూడుసంవత్సరములకు సరిపడు తినుబండార మున్నది. దుర్గరక్షణమున కెనిమిదివేల కాల్బలము నాలుగువందల యాశ్విక దళము కలదు. నూటయిరువది గజములున్నవి. శత్రువులపై శిలావర్షము గురిపించు ముప్పది యంత్రములు కోటగోడలపై నమర్పబడి యుండెను. బురుజులమధ్య పెద్దపెద్ద ఫిరంగు లమర్పబడి యున్నవి. అది శత్రుసైన్యములకు దుర్భేద్యమైనది.

ఆదిల్షా తనసైన్యములతో కష్ణానది కావలియొడ్డున విడిసెను. లక్షయిరువదివేల కాల్బలము, పదునెన్మిదివేల యాశ్వికులు నూటయేబది గజములున్నవి. తన ఫిరంగిబలముపై యాదిల్షాకు మంచి నమ్మకము.

అందుచే ఆదిల్షా నదినిదాటి రాయల సైన్యముల నెదిరింపఁదలంచెను.

అది యెఱింగి రాయలు తనసైన్యమున సూమివంతుల సైన్యముసు గొని ఆదిల్షాను తొమ్మిదిమైళ్ళ దూరమున విడిసెను.

కృష్ణరాయలు శనివారము వేఁకువ సతిరుపతి వేంకటనాథుని భక్తిలో సేవించి అదిల్షాసైన్యములను తలపడుటకు తనసేనల కాజ్ఞాపించెను. రెండు సైన్యములు తలపడినవి. సైనికుల కోలాహలధ్వనులు మిన్నుముట్టినవి. హయహేషలు, గజఘీంకారములు శ్రవణపుటములను బ్రద్దలొనర్చినవి.

ఆదిల్షా తన ఫిరంగిబలమును ముందుంచి తనవద్దనున్న సూటయేబది ఫిరంగులందు మందును గూర్చించి యొక్కసారిగ కాల్పించినాడు. రాయల సేనాముఖము విరిగి చెల్లాచెదరైనది. సైనికులు చీకాకు పడినారు. ఆదిల్షా పిరంగులు అగ్నిని వర్షించుచున్నవి. సైన్యము పారిపోవ సిద్ధపడినది.

పారిపోవుచున్న సైనికుల గాంచి రాయలాగ్రహోదగ్రుడైనాడు. పారిపోవు సైనికుల నందఱను వధింప నాజ్ఞాపించి వెంటనే ఉవ్వెత్తుగ ఆశ్విక సైన్యమును ఫిరంగుల నాక్రమింప నాజ్ఞాపించినాడు రాయలు. మెఱపు మెఱసినట్లు ఫిరంగులపై బడినాడు రాయల ఆశ్విక సైన్యాధ్యక్షుడు తన సైన్యముతో. అవి ఆక్రమింపఁబడినవి. సంకుల సమరమైనది. ఆదిల్షా సైన్యములు విచ్చి పారిపోయినవి. పారిపోవు సైన్యముల రాయల సైన్యములు తరిమినవి. ఆ సైన్యములు నదియొడ్డును జేరినవి. రాయల సైన్యములు వారిని నదియొడ్డునుండి నదిలోనికి తరిమినారు. కష్ణానది పీనుగుల పెంటయైనది. రక్త ప్రవాహముతో నెఱ్ఱనైనది.

అనవసరముగ ప్రాణములర్పించు మహమ్మదీయులను గాంచి రాయల హృదయము కరుణారసార్ద్రమైనది. యుద్ధమాపి హతశేషులగు నాదిల్షా సైనికులను అవలియొడ్డునకరుగ ననుజ్ఞనొసంగినాడు రాయలు. ఆదిల్షా అసాదుఖాను సాహాయ్యమున బారిపోయి బిజాపురమును జేరినాడు.

రాయలరాకకొఱకు కెదురుచూచుచున్నారు రాయచూరును ముట్ట

డించిన రామరాయలు, పెద్దనాదులు. ఆదిల్షాకు సహాయమైనట్టి నిజాం షాహి ఫిరంగిమందుతో నొక సేనావాహిని నంపినాడు. అకస్మాత్తుగా రామరాయలాతనిపై మెఱపుదాడి యొనర్చి ఫిరంగి మందును వశపఱచు కొనినాడు.

తరువాత కొలది దినముల ముట్టడితో రాయచూరుదుర్గము రాయల వశమైనది. రాయలకు హృదయశల్యమై బాధించిన రాయచూరు దుర్గము తిరిగి రాయల పరిపాలనము క్రిందికి వచ్చినది.

## ఇరువది తొమ్మిది

భువనవిజయమను నాస్థానమంటపము మణిమాలాలంకృతమై యుండినది. నేల చూడరాకుండ వివిధ వర్ణశోభితములగు రత్నకంబళులు పఱచబడినవి. ఇరుప్రక్కల నర్హాసనములమర్పబడినవి. అందు మహారాజధివసించు ఆసనము స్వర్ణమయమై ముక్తామణిమాలికాలంకృతమై తనరినది.

రాయలకించుక క్రిందనున్న యాసనముపై మహామంత్రి తిమ్మ రుసులవా రుపవిష్టులైరి. మహాకవులు, రాజోద్యోగులు, పురప్రముఖులు వారివారి యర్హతల ననుసరించి ఆసనములం దుపవిష్టులైనారు.

ఇంతలో వందిమాగధులు కైవారము లొనర్చుచుండ సాహితీ సమ రాంగణ సార్వభౌముడు, కవితాప్రవీణ్యఫణీశుడు శ్రీకృష్ణదేవరాయ లరుదెంచుచున్నట్లు వేత్రహస్తుడు ప్రకటించినాడు.

ప్రధాన మంత్రి తిమ్మరుసు, ప్రధాన దండనాధుడు గోవిందరాజు, ప్రధాన కవీశ్వరు డాంధ్రకవితాపితామహుడు పెద్దన, మహారాజున కెదు రేగి లోనికి గొనివచ్చిరి. మహారాజు సింహాసనస్థితుడైన తరువాత నొక సుందరీమణి పళ్ళెరము నొకదానిని గొనివచ్చి రాయలముందుంచి యరిగి నది. మంటపమంతయు అగరు ధూపవాసనా వాసితమైయున్నది. చాంపేయ మల్లికాద్యనేకపుష్ప సౌరభవిరాజితమైనది.

మహారాజు మాటాడదలిచినట్లు వేత్రహస్తుడు ప్రకటించినాడు, సభ నిశ్శబ్దమైనది. సుధర్మాసన మధివసించిన దేవేంద్రుననుకరించిన రాజ దేవేంద్రుని స్వరము ఘనాఘన గర్జన ననుకరించినది. "కవీశ్వరులెల్ల

రిందు పొగ్గొందురుగాక. సభ్యులందఱు సెబాసనునట్లు సభ్యుల హృదయములు సమ్మోహితములగునట్లు ఉత్పల మాలిక నొకదానిని ఆశువుగ జెప్పవలయును. ఆ కవిత్వమును సభ్యులు విమర్శించి నిగ్గుదేల్పవలయును. సర్వశ్రేష్ఠమగు ఉత్పలము నాశువుగా రచించినవారి గండపెండేరమందుకొనెదరుగాక."

అని రాయలు బంగరు పళ్లెరమందుంచిన హేమమయమగు గండపెండేరమును ఉన్నతమగు స్థానమున నుంచినాడు. విరుముప్వలతో పొదగబడిన యా పెండేరము జయజయమను సవ్వడులగావించి సభాసదులను విస్మయావిష్టుల నొనర్చినది.

భట్టుమూర్తికి పెద్దనామాత్యునిపై నొకవిధమగు నీర్ష్యయున్నది. పెద్దనయాధిక్యత ప్రతివిషయమున నాతనికి కన్నుకుట్టించుచున్నది. రాయల అష్టప్రధానులలో నొకడైన సాలగరాజు భట్టుమూర్తి యీ వ్యతిరిక్తతను గమనించి చేరదీసినాడు. రామరాయలు అళియ రామరాయలైన తర్వాత నతడును అష్టప్రధానులలో నొకడైనాడు. భట్టుమూర్తిపై నాతనికొకవిధమగు నభిమానమున్నది.

సాలగరాజు తనకొసంగు చేయూతను ఆధారమొనర్చుకొని ప్రతి విషయమున పెద్దన నెదురించుటకు భట్టుమూర్తి ముందునకు దూక మొనలిడినాడు.

భట్టుమూర్తి వైపునకు జూచి సాలగరాజు కనుసన్న నొనర్చినాడు. దానిని గమనించినాడు మహామంత్రి. తిమ్మనయు గమనించినాడు.

"ఈమహారాజ నిర్దిష్ట కార్యాచరణమునకు సమర్థులు పెద్దన కవీశ్వరులొక్కరే." తిమ్మన యనినాడు.

"తిమ్మన కవీశ్వరులు కవిత్వమును మాని పొగడ్తలలోనికి దిగినారేమి?" సాలగరాజనినాడు.

"పొగడుటకు నేనేమి బట్టునుగాదు."

తిమ్మన జవాబు సాలగరాజునకు చురుకుమనిపించినది. భట్టుమూర్తికి హృదయమున రంపపుకోత పెట్టినది. ఆతని కన్నులరుణములైనవి.

ఉత్పలమాలికను చెప్పుటకై కవులెవ్వరును నిలువలేరు. ఈ పరిస్థితి రాయల కరముగా లేదు. ఆస్థానము నిష్ణాతులున్న యీ సభలో నొక్కడును గండపెండేరమును గొనుటకు ప్రయత్నింపకుండుట యాశ్చర్యమైనది రాయలకు.

"ముద్దుగ గండపెండియరమున్ గొనుడంచు బహూకరింపగా నొద్దిక నాకొసంగుమని యొక్కడు గోరగరాడు తేరొకో." యని తన విచారమును వెల్లడించినాడు రాయలు.

వెనువెంటనే ఆంధ్రకవితాపితామహుడు నిలచినాడు_

"పెద్దనబోలు పండితులు పృథ్విని లేరని నీ వెరుంగవే
పెద్దన కీదలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా."

అని పద్యమును పూరించి రాయల సంశయము నివారించినాడు పెద్దన.

"కవిత్వము సంస్కృతాంధ్రముల సమముగ జెప్పి మెప్పింపనగదా గండపెండెరమిగలుట ?" భట్టుమూర్తి యనినాడు.

"చెప్పి గండపెండెరమును గొనుటకు మూర్తి కవియును సమర్థుడే" సాలగరాజనినాడు.

అతనిలోని పెద్దనపై వ్యతిరేకత మహారాజున కాశ్చర్యమైనది.

"సంస్కృతాంధ్రముల పొత్తునెఱుగక సంగీతమాధారముగా మహారాజుల మన్ననలందిన భట్టులకది అలవియగునని యే మంత్రులూహించుచున్నారా ?" పెద్దన శిష్యుడు సూరన యనినాడు.

సభయందు గుసగుసలు మెండైనవి.

వేత్రహస్తులు సభను నిశ్శబ్దమని హెచ్చరించినారు.

"కవిత్వమెఱింగినది సంస్కృతాంధ్రములపొత్తు నెఱింగినవాడొక్క పెద్దనయే కాదు. పండితులెందరో ఈ సభయందున్నారు." క్రోధారుణ నేత్రుడై నిలచినాడు భట్టుమూర్తి.

మణిమయములగు కంకణములు ఘల్లుమనినవి.

తన సహజహాస్య ప్రకృతితో రామకృష్ణుడనినాడు —

"కెంగేల మణులు దాపిన

బంగరు పడిగెంబులుండ బండిపుడగునా ?
జంగులు జల్లులు గల్గిన
సింగారపు టూరకుక్క సింగంబగునా ?"
అని నవ్వుచు పాడుచుండినాడు రామకృష్ణుడు.
సభలో నవ్వులు కురిసినవి. సభ యుద్రిక్తమైనది.
భట్టుమూర్తి కంఠమున యురుము ఉరిమినవి —
"రొట్ట యుదేవీమాట పెనురోఘులతో మొగమోట యేల ? తా
గొట్టరియున్న వృశ్చికము గుమ్మరపుర్వని యుంచురే పదా ?
పట్టపురాజు పట్టి నరపల్లె సరాసరి యీయకున్న నే
దిట్టరమాన నా మతము, తీవ్రమహోగ్ర భయంకరంబుగా
చిట్టితినా .. .... ... .. .. .... ....
దిట్టితినా సభాభవన ధింకృత భీమనృసింహరాడ్ద్విజా
లాట్టమహాట్టహాస చతురాస్య సముద్భ్రకుటీ తటీ నటీ
కోట్టణ రోషజాల హ్యాతికుంఠిత కంఠ గభీరనాద సం
ఘట్ట విజృంభమాణ గతిగావరె — — —

"భట్టుమూర్తీ ! తిట్టుదునని చెప్పుటకిది సభాభవనము. కవిత్వ తత్త్వమే యిందు ప్రధానాంశము." అనినాడు రామరాయలు. భట్టుమూర్తి యాగినాడు. ఆతని కోపముడిగినది.

— — — — — దీవనపద్యమిచ్చి చే
పట్టితినా మణీకనక భాజన భూషణ భాసురాంబరా
రట్ట తురంగ గంధ గజరాజదమూల్య ఘనాత పత్త్రి భూ
పట్టణ భర్మహర్మ్య భటపంక్తి చిరాయు వనామయంబునై
పట్టడి భట్టుమూర్తి కవిరాయని మార్గ మెఱుంగ జెప్పితిన్."

ఉరుముల మెరుపులతోడి జడివాన కురిసి వెలిసినట్లయినది. పెద్దనామాత్యుడా అశువును చిఱునవ్వుతో వినినాడు. రాయల ముఖమునం దేభావమును లేదు. పెద్దనామాత్యుడంతట లేచి నిలచినాడు. హిమాలయముల నుండి క్రిందకుఱుకు గంగానిర్ఝరిణి ననుకరించి కవితాపితామహుని ఉత్పలమాలికా ప్రవాహము సభాభవనమును ముంచెత్తినది —

“పూతమెఱుంగులుం బసరుపూప బెడంగులు సూపునట్టి వా
కైతలు జిగ్గునిగ్గు వెనగావలె, గమ్మన గమ్మనఁవలెఁ,
రాతిరియున్ బవల్ మఱుపురాని హొయల్ చెలియారజంపు ని
ద్దా తరి తీపులంబలెను దారసిలన్వలె లోదలంచినన్,
బాతిగ బైకొనన్వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్,
జేతికొలంది కౌగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్ని మే
ల్మోతల చన్నుదోయివలె ముచ్చటగావలె బట్టిచూచినఁ,
డాతొడ నున్న మిన్నుల మిటారపు ముద్దులగొమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవి గావలె బంటనూదినన్.
గాతల దమ్మిచూలి దొరకైవసపుం జవరాలి సిబ్బెపు
న్మేతెలియబ్బురంపు జిగి నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూతలనున్న కాయసరిపోడిమి కిన్నెరమెట్ల బంతి సం
గాతపు సన్నతంతి బయకారపు గన్నడ గౌళపంతు కా
నాతత తానతానల పసందిపుటాడెడు గోటమీటు బల్
మ్రోతలునుంబలెన్ హరువు మొల్లముగావలె నచ్చతెన్గు లీ
రీతిగ సంస్కృతంబు పచరించెడు పట్టుల భారతీ వధూ
టీ తపనీయ గర్భనికటీ భవదానన పర్వసాహితీ
భౌతిక నాటక ప్రకర భారత భారత సమ్మత ప్రభా
శీత నగాత్మజా గిరిజ శేఖర సీతమయూఖ రేఖికా
పాత సుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమ ఘుంఘుమార్భటీ
జాతక తాళయుగ్మ లయసంగతి చుంచువిపంచికా మృదం
గాతత తేహి తత్తహిత హాధిత ధంధణు ధాణు ధింధిమీ
వ్రాత నటానుకూల పదవార క్షుహూద్వహ హార కింకిణీ
నూతన ఘళ్ఘళాచరణ నూపుర ఝుళఝుళీ మరందసం
ఘాత వియద్ధునీ చకచకద్వికచోత్పల సారసంగ్రహా
యాత కుమారగంధవహ హారి సుగంధవిలాసయుక్తమై
చేతము జల్లజేయలె జిల్లున జల్లువలె న్మనోహర

ద్యోతక గోస్తనీఫల మధుద్రవ గోఘృత పాయసప్రసా
రాతి విసప్రసార రుచిరప్రసరంబుగ సారెసారెకున్."
తన యుత్పలమాలికను ముగించినాడు పెద్దన.

సభపై యుత్పలములజల్లు గురిసి వెలసినట్లయినది. సభ్యుల చేత ములు చల్లనై హాయి యనిపించినది. వారానందపరవశులైనారు.

భట్టుమూర్తి యుత్పలమాలికలోని రాలగావలె కావలెన్ వెలయ గావలెన్ అనువానినందుకొని పెద్దనార్యుడు అటువలెగా దిట్లుండవలెనని యుపదేశించినట్లున్నదా యుత్పలమాలిక. సంస్కృతాంధ్ర రచనాపద్ధతిని జూపి భట్టుమూర్తి యుత్పలమాలికలోని కొఱత నుద్ఘాటించి,కమ్మన గమ్మనన్వలెన్, సొగసుకోర్కులు రావలెన్, వావివి గావలెన్, చేతము పల్లజేయవలె – అని తెల్పినట్లున్నది.

రాయల ఆనందమునకు మేరలేదు. ఆతడు సంతోషతన్మయుడే యైనాడు.

"పెద్దనార్యా ! తామాంధ్రకవితా చతురాస్యులు. భారతీ వధూటి తమ రసనపై నాట్యమాడి మముబోటుల ననుగ్రహించుకొఱకిట్టి తత్త్వ దర్శనాపాదియగు కవితను విన్పించినది. గండపెండెరము గొనుటకు తగినవాడవు కవీశ్వరా !" అనినాడు రాయలు.

"రెండు విధములుగ కవితాపితామహుండీ మాలికను విరచించినారు. శబ్దపరముగ అచ్చతెనుగుకవిత నెట్లు వ్రాయవలయునో, సంస్కృతమున పచరించిన నెట్లో తెలియజెప్పుచు అర్థసంగతినిగూడ రెండుభాగములుగ నొనర్చి వినిచినారు.భౌతికమగు విషయప్రపంచమునుగూర్చి ప్రథమ భాగమున లౌకికముగాని వేదాంతతత్త్వమునుగూర్చి చరమభాగమున నుగడించినారు. కవిత వర్ణకముగా నుండక వస్తుకమై యుండవలెనను నభిప్రాయమిచట గన్పించును. ఇంద్రియ సౌఖ్యాపాదియగు ప్రియురాలివలె కవిత్వము హృదయానంద కారణముగా నుండవలెనినయు, భార్యవలె హితమును శ్రేయమును ఘటింపవలెననియు కవిభావనము." అనినాడు నంది తిమ్మనార్యుడు.

"మనుచరిత్ర రచనాకాలమునాటికంటె పెద్దనలో నొక మార్పును

భగవదన్వేషణయందొక చింతనయు, తాత్త్వికదృష్టియు, భౌతిక నాట
కముపై నాతని నిర్మోహత్వమును, తిక్కన కవిత్వముపై నాతని మక్కు
వయు నీ మాలిక మనకు కన్పింపజేయుచున్నది." అనినాఁడు ధూర్జటికవి.

"మాలిక తొలిభాగమున మనుష్య శృంగారమును వర్ణించి,
రెండవభాగమున దివ్యశృంగారమునే వర్ణించినారు కవీశ్వరులు. కవిత్వ
తత్త్వదర్శనము చేయింపవలెననియే కవిభావనమై యుండవచ్చును."
మాదయగారి మల్లన యనినాఁడు.

"మా హృదయమునకు పెద్దనామాత్యులిం కొకవిధమున కన్పించు
చున్నారు. ప్రథమార్ధమున రాగ తానములను. ద్వితీయార్ధమున తాళ లయ
లను తెల్పినారివట. ఆకాశతత్త్వమునుండి జన్మించిన సృష్టికి సంబంధించి
నంతవఱకు ఆకాశగుణమగు శబ్దమును గ్రహించి రాగతానములు, సృష్టి
కారణమగు మాయనుగూర్చి తాళ లయలను వివరించెనని ఊహింప
వచ్చును. వాగర్థములలో వాక్కును పార్వతియు అర్థమును పరమేశ్వ
రుఁడు ధరింతురు. మాలికలోని తొలిభాగమంతయు పార్వతియు అనగా
శబ్దవిన్యాసవైచిత్రియు, ఉత్తరార్ధమంతయు పరమేశ్వరుఁడనియు అనగా
అర్థస్ఫురణమును గమనింపవలయునని కవిభావనము. అర్ధనారీశ్వర
రూపమును, తన యుత్పలమాలికను పోల్చికొని సృష్టికారకమగు భగవ
త్స్వరూపమును నిరూపించుచున్నారని మా యూహ," పెద్దనామాత్యులు
ఉపనిషన్మార్గమున నడచిన తత్త్వదర్శకులు - అనుభవ రసికులు. అట్టి
ఆంధ్రకవితాపితామహుల బహూకరించుట మా భాగ్యముగ దలంచు
చున్నాము.

"రండు, ఆంధ్ర కవితాపితామహులు, ఈ సింహాసనమధిష్ఠింపుఁడు.
సర్వాంధ్ర సామ్రాజ్యచక్రవర్తి గండపెండెరముతో తమపాదము నలంక
రింప నుత్సాహితుఁడగుచున్నాఁడు." అనినాఁడు నవ్వుచు రాయలు.

చెవులనిడిన హేమకుండలముల కాంతులు ముఖమునకొక వింత
సొబగును కల్గింప మహారాజు సింహాసనము ప్రక్కనున్న మఱియొక
మణిమయాసనమున నుపవిష్టుఁడైనాఁడు పెద్దన. సర్వాంధ్రకర్ణాట సామంత
మకుట మణిప్రభాప్రభావిత చరణుఁడగు నాశ్రీకృష్ణదేవరాయ చక్రవర్తి పెద్దన

కవీశ్వరుని దక్షిణపాదమును మణిస్థగితమగు గండపెండెరముతో నలంకరించి నమస్కరించినారు.

ఆశీర్వదించినాడు పెద్దన. ఆనందబాష్పలోచనుడు, సంతోష తన్మయుడాతడు, —

"శ్రీరాంభోనిధియందు యోగసరణిం జిహ్వత్తకిం బ్రాపించి త
ద్గోరాజత్కుకుబద్గోపవిలసద్గోరాజ గోలోకతా
స్ఫారాలోకన తేజఘ్రతపలనస్వాంతాదిదంభోళి కృ
త్స్వారజ్ఞాన సనందనాది మునిబృందాధిక్య సామర్థ్యవా
ఘారాకారత నిస్తజెందు కటుకాంభోరాశి నిల్ గ్రోవుతన్."

కవులందరు కర్పూరతాంబూలములతో సత్కరింపబడినారు. గండపెండెరము కలుపసములతో తనకై వేచియున్న పల్లకికడ కరిగినాడు పెద్దన సభ ముగియగనే.

## ముప్పది

శరీరమున ద్వాదశోర్ధ్వపుండ్రములు. కట్టినది పీతాంబరము. బంగారును తిరస్కరించు శరీరవర్ణము. దృఢదీర్ఘ కాయము. తేజఃపుంజముతోడి ముఖము. చూపరుల నిట్టె యాకర్షించు మూర్తిమత్త్వము. నిండు సభలోనికరుదెంచినాడాతడు. దేవారికులాతని వారింపలేరు. మహారాజున కాతడు నమస్కరింపలేదు. ఎవ్వరాతడు? నలుబదేడుల వయసువాడు.

ఆతడట్లే మహారాజులముంగల కరుదెంచి నిలచినాడు.

లేచినించి కృష్ణరాయలా వైష్ణవోత్తమునకు నమస్కరించినాడు.

ఆతడాశీర్వదింపలేదు. చేయెత్తి పెంపినాడు.

"ఎవరు స్వామీ తాము?" ప్రశ్నించినాడు రాయలు.

"నేను శఠగోపయతీశ్వరుల శిష్యుడను."

"తాము వ్యాసరాయలా స్వామీ?" లేచినిలచి ప్రశ్నించినాడు పెద్దనార్యుడు చేతులు ముకుళించి.

"అవు"ననుచు ఒక సన్నని చిరునవ్వును ప్రసరింపజేసినాడు వ్యాసరాయలు. వ్యాసరాయని కీర్తి నంపదెఱుంగుదురు. కాని యాతని నెఱింగినవారెవ్వరును లేరట. పెద్దనామలందఱును లేచినిల్చి నమస్కరించినారు.

వ్యాసరాయలు మహారాజునుద్దేశించి పల్కినాడు ... "మహారాజా! ఈ రాజ్యపాలనము నొసెర్పు నీవిప్పుడర్హుడవు కావు."

ఈ వాక్యము సభయందలివారికి అగ్నిపర్షమైనది. అందు కొందరి కన్నులెఱ్ఱవారినవి. అప్పాజీయు నవ్వుచూచుచుండినాడు. ఆ మాటలకాతడులికిపడి వ్యాసరాయనిపై పునిశితవీక్షణముల బరపినాడు.

"అప్పాజీమంత్రులాగ్రహింతురా? నా వాక్యములు బాధాకరములా?" వ్యాసరాయలే యనినాడు.

"ఆమాటల కప్పాజీకేకాదు, సర్వాంధ్రలోకమునకు కన్నులెఱ్ఱవారును. తామనినదేమో గ్రహించినారా? వాక్పారుష్యము సజ్జనులకు నిషిద్ధము." తనలోని యాందోళనమును వెలిబుచ్చుచు ననినాడు ధూర్జటి.

వ్యాసరాయలు నవ్వినాడు. "కారణరహితముగ చక్రవర్తి యెవ్వరైన అంతటిమాట లందురా కవీశ్వరా? తన ప్రజల మతమును, వారి సాంఘికాచారములను, వారి దేవాలయ దైవతములను కాపాడజాలని చక్రవర్తి యెవ్వరైన నేమనవలయును?" వ్యాసరాయలు ప్రశ్నించినాడు.

రాయలకన్నులెఱ్ఱవారినవి. "నా రాజ్యమున నా దైవతమూర్తుల జోలికిపోయిన ప్రాణములపై నాశలేని మూర్ఖుడెవ్వడు స్వామీ?" రాయలడిగినాడు.

"నేననిన మాటల కిదొక్కకారణము మాత్రమేకదు. తరువాత యాకారణమును వివరింతును. ప్రస్తుతము శ్రీరంగనాథ దేవాలయమునకు బుడతకీచులవలన ప్రమాదము కల్గనున్నది. మారాజ్యమున సామంతులున్నను లేనివారే, గ్రామగ్రామములందలి దేవాలయములు ఆబుడతకీచులచే కొల్లగొట్టబడుచున్నవి. ఒక చిన్న దండు శ్రీరంగదేవాలయమును దోపిడి

నొసర్ప రాగా ప్రజలు వారిని వెల్లావెదకొనసర్చినారు. ఈ పర్యాయము పెద్దయెత్తుముట్టడికి వారాయత్తపడుచున్నారు." అనుచు వ్యాసరాయలు శఠగోపయతీశ్వరులొసంగిన శ్రీముఖమునొసంగినాడు. శఠగోపయతీశ్వరులు శ్రీరంగవైష్ణవపీఠాధిపతి. మహారాజసన్నిభుడు.

"శ్రీశ్రీశ్రీ సర్వాంధ్రకర్ణాట సార్వభౌములు శ్రీవీరకృష్ణదేవరాయలకు - సర్వవైష్ణవపీఠాధిపతి శఠగోపయతి వ్రాయు శేఖార్థములు—

వత్సా! ఆశీస్సులు!

మతేతరులగు మ్లేచ్ఛుల నేదో కొలది లాభమునాశించి నిట కాలుంచుట కనుజ్ఞనొసంగుటలోనే దోసగున్నది. అది భావిరాజ్యపరిపాలకులకు తొలగింపజాలని ఆపద కాగలదు. విమతధూర్తులగు వారలు మన ఆలయములను దోపిడి నొసర్చి, మనలను మతవిశ్వాసములనొనర్ప సహకరించుట ప్రయత్నించుట జరుగుచున్నది. దైవవశమున మొన్నటి వారి దాడిని త్రిప్పికొట్టగలినాము. సర్వకల్పకళానిలయము, వైష్ణవ అవిముక్తమునగు శ్రీరంగక్షేత్రమును, ఆ క్షేత్రస్వామిని కాపాడుకొనుట వశముదప్పిన కార్యమైనది. ఈ పాశ్చాత్యులు తెగించి ధనముకొఱకీ దుర్జయములుకావించుచుండ సామంతులకు చీమకుట్టినట్లైన లేదు. హిందూమతోద్ధరణకొఱకవతరించినది విజయనగరసామ్రాజ్యము. ఇట్టి సమయముననే హిందూదేవతల కపచారములు జరుగుచున్న ప్రజలేమనుకొందురు? రాజధాని దూరముగనున్న కారణమున ఈవిషయమై హెచ్చరింపవలసివచ్చినది. మరికొన్ని విషయములు రహస్యములు. అప్పాజీతో కలసి వ్యాసరాయలతో చర్చింపుము. అతడు నాశిష్యుడే; కాని అఖండ తపఃప్రభావసంపన్నుడు. ఇట్లు, —శఠగోపయతి."

జాబును చదివికొని అప్పాజీకొసంగినాడు రాయలు.

"పోర్చుగీసులంత తెగించినారా? వారి సైన్యబలమెంతయున్నది?" రాయలు ప్రశ్నించినాడు.

"వేలపైనున్నది."

"గోవిందరాజా! సైన్యమునాయత్తపఱచి శ్రీరంగనాథుని దర్శించి రమ్ము. పోర్చుగీసువారొక్కరైన మిగులకుండ మట్టుపెట్టవలయును. వారు దోపిడిగొనర్చిన దేవాలయముల ధనమంతయు నా యాలయములకొప్ప గించి తిరిగిరావలయును. పెద్దనా, నీవును ఈ సైన్యముననుసరించి గురుదేవులగు శరగోపయతీశ్వరులకు మా కానుకలర్పించి, రాబోవు పట్టాభిషేక మునకు వారిటకరుదెంచి యువరాజుల నాశీర్వదింప గోరుము" అని యాజ్ఞాపించినాడురాయలు.

కొలువు ముగిసినది. రాయలరహస్యాగారమున అప్పాజీ వ్యాస రాయలతో సమావేశమైనాడు. "ఆ రహస్యవిషయమేమి?" అప్పాజీ యడిగినాడు.

"ఈసమయము గ్రహచారరీత్యా మహారాజులకు అతిక్లిష్టసమ యము. వారికి రాజ్యభ్రష్టత సిద్ధింపజేయుటకు తగిన గ్రహములకు బలిమి చిక్కినది. ఆవిషయమై హెచ్చరింపగోరినారు గురువులు. నారాక కిదియే ముఖ్యకారణము."

"ఆ గ్రహకూటమి ఎంతకాలముండును?"

"ఏడుదినములు మాత్రముండును. అది ఈపూర్ణిమతో మొద లగును."

వ్యాసరాయల వాక్యములు రాయలను కలోలపఱుపలేదు.

"రాజ్యభ్రష్టత కల్గించుకారణములీ కొద్దిదినములలో సంభవించు ననుటకు ఆధారములు నాకు కన్పించుటలేదు." తిమ్మరుసనినాడు.

వ్యాసరాయల ముఖముపై చిరునవ్వులు విరిసినవి. "ఏడుదినముల కాలములో నెంతటి విచిత్రములు కలుగవు? రాయలు సింహాసనభ్రష్టుడు కాకుండిన ఈ ఏడుదినములలో నాయుడు మరణించుట నిజము. ఈ పరాల విజయనగరసామ్రాజ్యము నాథుడులేక నిరాశ్రిత యగుట కూడదు. అంతియేకాదు అప్పాజీ, రాయలయనంతర మెంతోకాలమీ సామ్రాజ్యము నిలువదు. అతఃకలహములతో భిన్నాభిన్నమైపోగలదు. మహమ్మదీయుల మారణహస్తమీ విద్యానగరమును..." నిక నాతడు పల్కలేక పోయినాడు. మూతబడిన యా కన్నులవెంట బొటబొట కన్నీరు

కారినవి. రెండునిమేషములతర్వాత నతఁడు స్వస్థతచెందినాడు.

రాయల హృదయమునందలి నిట్టి భక్తిగౌరవము లినుమడించినవి.

"కాలవాహిని నడ్డగింప నెవరికి సమర్థులప్పాజీ! ఇక నేవిషయములు నన్నడుగకుము ప్రస్తుతము మీ కర్తవ్యము రాజరక్షణము." వ్యాసరాయలనినాడు.

"నా యీ రాజభానీగనుచు మేమగుదు స్వామీ?" ఆవేదనవే పలిన మెన వ్యాసరాయని ముఖముఁను గాంచుచు ఆందోళనాపూరితుఁడై ప్రశ్నించినాఁడు రాయలు.

"కృష్ణరాయా! నీ కాందోళనము వలదు. నీవు జీవించియుండునంతవరకు నీ యీరాజ్యమును కన్నెత్తి చూచువాఁడు లేడు, తరువాతి విషయములను నీవు చూడలేవు."

"ప్రస్తుతము కర్తవ్యమేమి స్వామీ?" అప్పాజీ ప్రశ్నించినాఁడు.

"రాబోవు పూర్ణిమ మొదలు షష్టితిథివరకు రాయలు రాజ్యమును త్యజింపవలె. ఈమధ్యసమయమున కృష్ణరాయల ప్రాణముల నతిజాగరూకతతో రక్షించుకొనుట. సింహాసనమందెవ్వరొకడుండి పరిపాలనము సాగించుట. ఈసమయమున నా సింహాసనమెక్కు సామాన్యుడెవ్వడైన మరణించును. అది తెలిసినవాఁడు సింహాసనమెక్కుట అవసరము."

"తాము తపఃప్రభావసంపన్నులని శఠగోపయతీశ్వరులు వ్రాసినదానిలోని యాంతర్యమిప్పుడు బోధపడుచున్నది. స్వామీ! మీరే విజయనగరసింహాసనమీ మధ్యకాలమున నధివసింపుడు."

"నే సింహాసన మధివసించిన రాయల రక్షణమొనర్చు శక్తి మీకు కలదా?" వ్యాసరాయలు ప్రశ్నించినాఁడు అప్పాజీని.

"మహారాజులకు వజ్రకవచమువంటుదును స్వామీ! మీరేమియు భయము నందనవసరములేదు." అనినాడు అప్పాజీ.

క్షణకాలము నిమీలితలోచనుడైనాడు వ్యాసరాయలు.

"కృష్ణరాయా! నీ కత్యంత ప్రియతమమైనదానిని బోగొట్టుకొందువయ్యా! నీ ప్రాణములు రక్షింపబడును." అనినాడు వ్యాసరాయలు

మరునాడు వ్యాసరాయలు విజయనగర సామ్రాజ్యాధిపతిగా నభిషే కింపబడినాడు. రాయలాతని గురువుగా చేకొని సర్వ సామ్రాజ్య మాతనికి దానమొనర్చినాడనియు ఒక పక్షమురోజులు ఆతడు చక్రవర్తిగా నుండు ననియు ప్రకటింపబడినది.

"శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య।
పదవాక్య ప్రమాణజ్ఞ।
దుర్వాది గర్వ సర్వస్వాపహార।
శ్రీమద్వైష్ణవసిద్ధాంత ప్రతిష్ఠాపకాచార్య।
సకల విద్వజ్జన మనఃపద్మవన సౌపసిక।
శ్రీ వ్యాసరాయ కర్ణాటక సింహాసనాధీశ్వరా।"

అని వందిమాగధులు కైవారములొనర్చు చుండ నాతడు సింహా సన మధిష్టించెను.

ఏడవదినము గడుచుచున్నది. రాయలు ముద్దునాగతో మలయప వన భవనమున నున్నాడు. ఈ ఏడుదినము లేరాజకీయముగు నొత్తిడులు లేక ముద్దునాగతో సర్వభోగములతో గడపినాడు మహారాజు. ముద్దునాగ మహారాజునకు ప్రాణసమాన. 'చిన్నాయని' పిలచువాడా మె నాతడు. నాగకు మహారాజుదక్క వేరు లోకము లేదు. అది కులమునకుమాత్రము వేశ్య. ఈ ఏడుదినములనుండి సహస్రనయనములతో మహారాజును కనిపెట్టి యున్నది నాగ. రాజును చూచుటకై ఎవ్వరికినసుజ యీయలేదు నాగ.

"నాగా! నీ వీనాడు నాట్యమాడవలయును. నే వీణ వాయించెదను." రాయలు కోరుచునే ఆజ్ఞాపించాడు.

"రేపటిదినము కూడదా ప్రభూ!"

రాయలు నవ్వినాడు. తా మొనర్చినదంతయు నొక పిచ్చిపనిగా నాతనికి తోచినది. "ఇంక నా విషయమె ఆలోచించుచున్నావా నాగా! అది అప్పాజీవారికి నాయందలి అతిప్రేమకు నిదర్శనము. భయములేదు. వాద్యనిపుణులను పిలిపింపుము." రాయలాజ్ఞాపించినాడు.

ముద్దునాగ మాటాడలేకపోయినది. ఒక దాసి భరతనాట్యమునకవసర మగు ప్రకర్ష వాయిద్యములవారిని పిల్చి తెచ్చినది. ఎప్పుడు వాయించెడి

మార్దంగికుని బయలు పఱిమొకడపడెందినాము లోనికి. అతడు కొత్త వాడు. ఈతడెవ్వడనునట్లు చూచినది నాగ వానివైపు.

"మన మార్దంగికుడు జబ్బుగానున్నాడు. అతని స్థానమున నీత డపడెందినాడీ దినమున" అని ఆమె సందేహమును దీర్చినది దాసి.

నాగ అతని ముఖముపైపు జూచినది. ఆ ముఖమందే లక్షణములునులేవు.

"మొదలిడుము నాగా!" యనుచు వీణ నందుకొనినాడు రాయలు.

తాళ్ళపాక విన్నన్న పదము నొకదాని నందుకొని యభినయించి నది నాగ.

గానము యా ప్రాసాదమును మందిరమెత్తినది. చిరుమువ్వల మంజుల శింజితములా పరిసరములనే పులకింపజేసినవి. ప్రవిమల వీణా నాదము గాలియందు తేలి విశ్వవ్యాప్తియై విశ్వమోహనకరమై కోమల కోపరీ గాత్రనాదమున లయించి సర్వప్రకృతిని పులకరింపజేసినది. కాల వాహిని యట్లే నిలచిపోయినదా సంగీతనాట్యములు పెనవైచుకొనిన క్షణములందు.

మృదంగము ఝణఝణలాడినది. దాని శబ్దమే విలక్షణముగా నున్నది. ప్రతినిమేషమును ఆ మృదంగమునుండి యుద్భవిల్లు శబ్దము లామెచెవుల కేలనో భయంకరములుగా తోచుచున్నవి.

అట్లే నిలద్రొక్కుకొని ముద్దునాగ నాట్యమొనర్చుచున్నది. ఆమె యందు పరవశత ఎక్కువగుచున్నది.

మార్దంగికుడు కూడ అట్లే మృదంగమును వాయించుచున్నాడు. ఆతనిలోని యాలోచనమాతని ముడివడిన భృకుటి తెల్పుచున్నది.

వ్యాసరాయలానాడు సభకు బోవలేదు. అతడు సమాధినిష్ఠుడై ఒక మందిరమున తపమొనర్చుచున్నాడు.

సమాధినిష్ఠుడు కాకపూర్వము అప్పాజీతో నాతడు తెల్పినా డీవిధ ముగ - "మహామంత్రులు సుస్థిరులై యుండుటవసరము. ఈ తరుణమున సింహాసనమధిష్ఠించిన మేమో లేక రాయలకు పరమప్రియులైనవారొకరో మరణింమట సర్వసత్యము. మరణించునదెవ్వరనునది మృత్యుదేవీనిర్ణ యము. మహారాజునకుగాని యువరాజునకుగాని అపాయము రాదు."

వ్యాసరాయని వాక్యములు తిమ్మరసును కలతసందించినవి. మరణించునదెవ్వరు ? అది యాలని ప్రశ్న.

నాట్యమాడుచున్న ముద్దునాగ రూపము వ్యాసరాయలముందు ప్రత్యక్షమైనది., మృదంగము మ్రోగుచున్నది.

మృదంగమాతని కనులముందు సాక్షాత్కరించినది. మార్దంగికుడు దాని యందునుండి చురియ నొకదానిని బయటకు తీసినాడు.

ముద్దునాగ అవశత జెందియున్నది. రాయలు తన్మయులై వీణియ మీటుచు నామె నాట్యమును గాంచుచున్నారు.

ఆ దృశ్యము మారిపోయినది వ్యాసరాయల జ్ఞాననేత్రముముందు.

పోర్చుగీసులతో యుద్ధము జరుగుచున్నది. గోవిందరాజు సైన్యములతో పోర్చుగీసుల నాక్రమించుచున్నాడు. గుఱ్ఱముపై నెక్కి పెద్దన సైన్యముల కాదేశమిచ్చుచున్నాడు. పోర్చుగీసు సైన్యాధిపతికెట్లును పాలుపోలేదు, తామీ చక్రబంధమున పడుదుమని యూహింపలేము. ముందీ సేనాపతుల నిర్మూలను మట్టుపెట్టిన ! ఒక పోర్చుగీసు సైనికునితో నేమోతెల్పి తన గుఱ్ఱమును పెద్దనపై కురికించినాడు ఫిగరేడో అను నా సేనాని. పెద్ద బల్లెముతో నిలువరించినాడు పెద్దన యాతని. వెనుకనుండి వెనుకటి పోర్చుగీసు సైనికుడు పెద్దనపై తుపాకిని గురిపెట్టినాడు.

ఆ గురిపెట్టిన తుపాకి. యుద్ధమొనర్చుచున్న పెద్దన - వ్యాసరాయలకు తోచినారు.

ప్రక్కనే చురియ చేతగొని రాయలపై విసరబోవుచున్న మార్దంగికుడు కన్పించినాడు.

వ్యాసరాయల యందాందోళన మెక్కువ యైనది. వీరిరువురును రాయలకు ప్రియతములు. ఆతని ముఖమున చెమటలు క్రమ్మినవి. ఆతని తనువు ప్రళయమారుతాఘాతమున లతవలె వణకిపోయినది.

ఒక్క క్షణములో నిర్ణయమొనర్చుకొనిన యా తపశ్శక్తి ఆచరణకు కడంగినది.

చెమటతో నిండిన ఆ ముఖమును వణకిపోవు నా శరీరమును గాంచి ఆందోళితుడైనాడు తిమ్మరుసు. విజయనగరరాజ్య శ్రేయస్సు కొఱకీతడే తన ప్రాణములను బలి యీయనున్నాడా ?—అనుకొనుచు ఆ తేజస్వంతమగు ముఖము వైపు చూచుచున్నాడు మహామంత్రి.

ఒక్క క్షణము.

"నాగా !" ఒక్క కేకవైచినాడు వ్యాసరాయలు. ఆ గదియంతయు దద్దరిల్లిపోయినది ఆ కేకకు. అప్పాజీ యులికిపడినాడు.

అనంత విశ్వవ్యాప్తమైన యా ధ్వని నాట్యమాడు నాగ చెవులకు సోకి నట్లయినది. ఆమె జాగృతమందినది.

మృదంగ మాగినది. మార్దంగికుని వైపు చూచినదామె. అతడు చురియ విసరినాడు రాయలపై.

"స్వామీ !" యనుచు రాయలను తన యాలింగనమున పొదువు కొనినది నాగ. చురియ రాయలను జేరులోపలనే రాయల శరీరమునకు తన మేను జేర్చినదామె. వెనువెనుకనే చురియ నాగ వీపున దిగిపోయి వక్షమున పొడచూపినది.

ఆ క్షణముననే పోర్చుగీసుసిపాయి వదలిన తుపాకి గుండు పెద్దన వీపునుండి దూసుకొనిపోయినది.

గుఱ్ఱముపైనుండి క్రిందపడిపోయినాడు పెద్దన.

వ్యాసరాయల ముఖమందలి యాందోళన మధికమై యుపశ మించినది. అతడు కన్నులు తెరచినాడు.

"మహామంత్రీ ! నాగ మరణించినది. రాయలు రక్షింపబడినాడు. పెద్దన క్షతగాత్రుడై మరణోన్ముఖుడైనాడు. గురువులు పెద్దనను రక్షింప గలరు" అనినాడు. ఆ ముఖమున ఆందోళనలేదు, ఆవేశము లేదు, విచా రము లేదు, ఆనందము లేదు, నిర్లిప్తతమాత్రమే తాండవించినది.

అప్పాజీ చకితుడైనాడు. వ్యాసరాయలతో మలయపవన ప్రాసా

దముపైపున కరిగినాడతాడు. బంధించుకొనివచ్చు మార్గంగిపడెమరైనాడు వారలకు.

రక్తసిక్తమైన నాగ భౌతికదేహము నట్లే కౌగిలియందుమిడ్చుకొని యున్నాడు రాయలు. నిర్విణ్ణుడాతడు. క్షణములో జరిగిపోయిన యా మృన్ణ యము ఆతనికాఘాతమైనది.

"నాగ మరణించినది మహారాజా!" యనినాడపట ంకుమెంచిన ఆస్థానవైద్యుడు.

రాయలు నెమ్మదిగా నాగ కళేబరము నట నేలపై పరుండబెట్టి నాడు. ఆతని కన్నుల బాష్పములూరినవి.

మహారాణులను తాను మహారాణులనువలెనే గాంచినాడు. జీవిత మున నిజమగు నానందము, అరమరికలేని యనురాగము స్వార్థమెఱుగని ప్రేమను తనకందించినది తన ప్రియురాలు నాగ. తన నంతగా నిక ప్రేమించువారెవ్వరు? ఈ భావమాతని కాఘాతమేయైనది.నీరునిండిన కను లెత్తి అప్పాజీవైపు జూచినాడు రాయలు.

మహారాజా! మరొక దుర్వార్త తెలియపరచుట యవసరమైనది. మన పెద్దన యుద్ధమున క్షతగాత్రుడైనాడు" అనినాడు అప్పాజీ.

"ఇదేమి? తన కత్యంత సన్నిహితులీ యిర్వురు. వారిరుపురును మరణింతురా యేమి? తన సర్వస్వము తన కర్పించినది నాగ. చివరకు ప్రాణములును తనకొరకే యర్పణ జేసినది. పెద్దనయు తన విష్రగహ పాటమికి ఆహుతియగునా?.. .హృదయము గునపముతో పొడిచినట్లయి నది రాయలకు.

పట్టుబడిన హంతకుడు ఏదియో మ్రింగి మరణించినాడని తెల్పి నాడు లోనికరుదెంచిన దౌవారికుడొకడు.

కుట్రనుగూర్చి యాలోచించుచున్న మహామంత్రి కావిషయ మాశా భంగమును కలిగించినది.

"స్వామీ! నా పెద్దనయెన నాకు దక్కునా?" దుఃఖపూరితుడై వ్యాసరాయల నడిగినాడు రాజు చేతులు జోడించుచు.

"మహారాజా! అచట శఠగోప యతీశ్వరులున్నారు. భయమున

కాస్కారములేదు. పెద్దనపై వారి కరుణ యపారము. పెద్దనకు గురువులపై భక్తి యత్యధికము." అనినాడు వ్యాసరాయలు.

రాయలహృదయము కరుగబడినది. "మహామంత్రులు నాగకు జరుగవలసిన సంస్కార విషయములను చూడవలసినది. ఆమె మహారాణి. మహారాణులకంటె యధికమగు మర్యాద నందవలసినది. తగినట్లు దహనాదికను లొనర్పజేయుడు. ఆ త్యాగశీలి స్మృత్యర్థముగా నొక పట్టణమునే నిర్మింప తలంచుచున్నది నాకు. ఆమెపేరున నాగపురముగా నా పట్టణము నా జీవితములో ముడివడి భావి యాంధ్రజనుల కనులపండువొనర్పవలయును. ప్రయత్నము లొనర్పుడు." యనినాడు.

నాగముఖముపై పొక్కమారు చూచినాడు రాయలు. "నీవు సామాన్య మానవ వనితవు కావు నాగా! నా కొరకై జన్మించిన దేవతవు." అనుచు ఆ ప్రాణరహిత కళేబరమునకు నమస్కరించినాడు రాయలు. అతనిలోని దుఃఖము పారము దాటినది. అతడుద్విగ్నుడైనాడు.

దాసీజనులు మహామంత్రి కనుసన్న నా స్వార్థరహిత రాజనర్తకి కళేబరము నటనుండి తరలించినారు.

"నా వచ్చిన కార్యము పూర్తియైనది.మహారాజులిక నేను వెనుదిరిగి పోవుటకు అంగీకరింపవలయును." వ్యాసరాయ లనుమతి నర్థించినాడు.

"ప్రాణాపాయమునుండి రక్షించిన ప్రాణదాతలు మీరు. ఆహూతులుగాకనే రాజ్యోన్నతిని గోరి తామొనర్చిన ఉపకారమునకు తగిన ఉపాయనమర్పించుటకేమున్నది? శ్రీరంగక్షేత్రము నానుకొని స్వామికి సంబంధించని డెబ్బదిగ్రామములను, సర్వకరపరిహారముగ తమకొసంగ గోరుదును. మహామంత్రులు దానపత్రికను సిద్ధమొనర్తురు. తాము నిస్సంగులు. అయినను కాదనక స్వీకరింప ప్రార్థింతును." చేతులు జోడించి యనినాడు రాయలు.

వ్యాసరాయ లంగీకరించినాడు.

## ముప్పదిఒకటి

శఠగోపయతీశ్వరుని మఠవాటికయందే క్షతగాత్రుడైన పెద్దనను

వదలి యరిగినాడు గోవిందరాజు. పెద్దన యచటనే ఆరునెలలున్నాడు విశిష్టాద్వైత సిద్ధాంతముల మర్మముల నాకళించుకొనుచు.

పెద్దనలో నొక మార్పు వచ్చినది. తన హృదయమును భగవత్ చింతనలోనికి త్రిప్పుకొనినాడు.

"కావేరీ విరజాతోయం వైకుంఠం రంగమందిరమ్
పరవాసుదేవో రంగేశం ప్రత్యక్షం పరమంపదం"

అనుకొనువాడా శ్రీరంగమునుద్దేశించి పెద్దన, శ్రీరంగేశుడాతని హృదయమంతయు నిండిపోయినాడు.

"స్వామీ ! నాకీ సంసారముపై రోత కల్గుచున్నది. ప్రశాంతమగు నీ యాశ్రమమందే నా జీవితశేషమును గడపివేయ నిప్పు బొడముచున్నది స్వామీ !" యని తన హృదయవాంఛితమును వెలిబుచ్చినాడు పెద్దన గురువులు శఠగోపయతీశులతో.

"పెద్దనా ! నీ కోరికకింకను కాలము పరిపక్వము కాలేదు. మరి కొంతకాలము లౌకికవ్యాపారముల నీ దృష్టి నుంచుట యవసరము. ఇక రాబోవునవి విజయనగర రాజ్యమునకు గడ్డుదినములు. ఈ కాలమందే రాజ్యమునకు నీ సేవ యవసరమయ్యా ! నీవు ఋణపడిన నీదేశము విస్మరింపరానిది. ఐహికాముష్మికములనైన మానుకొని అవసరముల పట్ల దేశసేవయొనర్చుట కర్తవ్యముగాదా పెద్దనా ?"

గురుదేవుని మాటలు పెద్దనలో నొక యాందోళనమును రేపినవి. ఆతడు తమాయించుకొనినాడు. "గురుదేవా ! నా రాజునకు, రాజ్యమునకివి ప్రమాద దినములా ? అవి తీరు నుపాయమే లేదా?"

"భగవన్నిర్ణయమును దాటుటకెవ్వరు సమర్థులు పెద్దనా ? ముద్దు నాగ మరణముతోడనే రాయల సుఖదినము లంతరించినవి. ఇకపై రాయలు వెనుకటి విధముగ సంతోషపారవశ్యమున తేలిపోవ జాలరు. నవనవ సాహిత్య కవితారీతులందు పాల్గొనడు. ఆతడికపై విచారతప్తుడె మనును. ఆతని యనంతరమీ విజయనగరసామ్రాజ్యపు పునాదియే కదలిపోవును. కాని........" ఆగినాడు శఠగోప యతీశ్వరుడు.

"కాని....తరువాత యేమి స్వామీ ? " ఆతురతతో ఆవేదనతో తలమునకలైనాడు పెద్దన.

"కాని యదృష్టవశమున ఆ విజయనగర పతనము మాత్రము మనము చూడము."

"ధన్యుడను స్వామీ ! ఇది కీడులో జరిగిన యొక చిన్న మేలు. స్వామీ ! నాదొక చిన్న కోరిక, అనుగ్రహింప కోరుదును."

"ఏమది పెద్దనా ?"

"శ్రీకృష్ణరాయ సార్వభౌముడు మనుచరిత్రంబందుకొనువేళ కోకటగ్రామము నాకు దానమొసగి యున్నాడు. స్వామీ ! నేను తమ శిష్యపరమాణువును. తమకు తగిన గురుదక్షిణ నొసంగ సమర్థుడను కాను. ఆ కోకటగ్రామమును శరగోపపురముగా నన్వర్థనామధేయమై పరగునట్లు తమకు గురుదక్షిణగా నొసంగ సంకల్పించినాను. గురుదేవులు తిరస్కరింపక యనుగ్రహింపుడు." అనుచు హస్తములు జోడించినాడు ఆంధ్ర కవితా పితామహుడు పెద్దన.

రాయలవద్దనుండి యరుదెంచిన వార్తాహరుడొక డొకలేఖను పెద్దనకడ కరుదెంచి యొసంగినాడు. అది విప్పగా నందు వేరొక లేఖ యున్నది.

"మూరురాయరగండ శ్రీశ్రీశ్రీ వీరకృష్ణదేవరాయ, సార్వభౌముల యాజ్ఞాపన —

"ఆంధ్రకవితాపితామహులు అల్లసాని పెద్దనామాత్యులకు. రాబోవు శ్రావణ శుద్ధ విదియనాడు నా కుమారులు శ్రీ తిరుమలరాయులకు యువరాజ్య పట్టాభిషేక ముహూర్తము నిర్ణయింపబడినది. మీరు వెంటనే బయలుదేరి వచ్చి రాజధానియందలి మీ పదవి నాశ్రయింపవలసినది."

రాజముద్రతో నందిన యీ లేఖ అందరు దండనాధులకు పంపినది. రెండవలేఖ విప్పినాడు పెద్దన. అది రాయల స్వహస్త లిఖితము —

"ప్రియమిత్రమా !

నీరాజు అత్యంత క్లిష్టమగు స్థితియందున్న సమయమున నీవు

ప్రశాంతముగ గురుదేవులతో ఆధ్యాత్మిక చింతనము నొనర్చుచున్నావుక ఈ విజయనగరసామ్రాజ్యాధిపతి భోగాధిదేవత మరణించినది. నీకు అతిప్రియ మగునది నీనుండి లుప్తమగు నీకాలమున నని వ్యాసరాయ గురుదేవులు తెల్పినారు. నాకత్యంతప్రియతమమైనది నా నుండి జారిపోయి స్వర్గధామము నధిష్ఠించినది అది నాలోని యుత్సాహము, సంతోషము, ధైర్యములనుగూడా తనవెంట గొనిపోయినది. అవిపోగా సత్త్వహీనుడగు ఉత్సాహపతితుడగు నీరాయలిట జీవచ్ఛవమువలె మిగిలియున్నాడు. ఇక నీవైన యరుదెంచి ఈ కళేబరమునకు ప్రాణప్రతిష్ఠ నొనర్పవలయును. నే మహారాజును. నన్నితరులు మహారాజువలె జూతురు. నా యాంతరిక విచార సంతోష ముల బయల్పరచుకొనువార లియ్యరున్నారు. నీవు, నాగ. అందు నాగ నను వదలి యేగినది. నీవు దేశాంతరమందున్నావు. నా హృదయపరితాప మును బయల్పరచి భారమును దించుకొందమన్నను నాకలవిగానిదైనది. సర్వాంధ్రకర్ణాటక చక్రవర్తి నే నొకయాప్తుడైన లేనివాడు. మహారాణు లున్నారు. వారు మహారాణులు. వారట్లే ప్రవర్తింతురు. నన్నట్లే ప్రవ ర్తింపజేయుదురు. నాగకు నేను భర్తను. ప్రియుడను. స్నేహితుడను. హితుడను. మిగిలిన వీరందఱకు నేను చక్రవర్తిని మాత్రమే.

"ఈ ఉత్తరమును వ్రాసి నాలోని భారము నొకింత బాపుకొనినాను.

"రాబోవు శ్రావణమునయువరాజునకు పట్టాభిషేక మొనర్ప నేలనో బుద్ధికలిగినది. ఇంత చిన్నవయసుననే నేల యందువేమో? కారణము నే నూహింపజాలను. నా ఊహలందు దౌర్బల్యమొకింత యావహించినదేమో। ఆ వాంఛ అంతకంతకు బలపడి ఈ నిర్ణయమునకు దారితీసినది.

"నీవు నాప్రతినిధిగా గురువర్యుల పీఠాధిపతులు శఠకోపయతీశ్వరు లకు మా యాహ్వానమందించి వారి నీ పట్టాభిషేకోత్సవమునకు రాగోర వలసినది.

"కోరిన వెంటనే నీవు విజయనగరమున నా సమ్ముఖమున నుండ వలయును. విపతులగు పోర్చుగీసులతో పోరాడి ఓడించి క్షతగాత్రుడ వైననీకు స్వాగతమొసంగ నుత్సుకత నందుచున్నాను.

ఇట్లు, —నీ రాయలు."

"నా రాయలు తనలోని యాందోళనమంతయు నీ ఉత్తరమున పొంచివినాడు గురుదేవా" అనుచు రాయల ఉత్తరమును శఠగోపయతీశ్వరులకందించినాడు పెద్దన. చదివి తిరిగి యొసంగినాడాతడు.

"స్వామీ ! తమ యాజ్ఞానుసారము విజయనగరమున జరుగుచును. తాము పట్టాభిషేకమునకు దయచేయవలయును."

శఠగోపతాపసుని ముఖముపై పేలవమగు నవ్వు విరిసినది, "నాయనా ! ఈ పట్టాభిషేకము జరుగునది కాదు. దాని కాటంకము తథ్యము. రాయల ఈ సంకల్పమే విజయనగర పతనమునకు నాందిప్రస్తావనము. విధినతిక్రమింపజాలము. అవశ్యమనుభోక్తవ్యమ్ కృతం కర్మ శుభాశుభమ్." అనినాడు.

"ఈ పట్టాభిషేకమునకు కల్గు నాటంకమేమి స్వామీ ?" ప్రశ్నించినాడు పెద్దన.

"అది తెలియరేము పెద్దనా ! దాని కెన్నెని కారణములుండవచ్చును. ఇకపై నీ వా ప్రశ్న యడుగరాదు." గురుదేవుడు ఆనపెట్టినాడు.

"మరి నేనెప్పటికిక్కడ కరుదెంచి మీ పాదసేవ నొనర్చుకొనగల్గుదును స్వామీ,"

"రాయల మరణానంతరమే పెద్దనా ! ఆపై నీకు విజయనగరమున స్థానము లేదు. శ్రీరంగనాథుని పాదసేవాకైంకర్య మప్పటినుండియు నీకు ప్రాప్తము కాగలదు." అనినాడు శఠగోపయతి.

"తమ రాకసుగూర్చి మహారాజునకు నేనేమి తెల్పవలయును?"

"కారణాంతరములచే వారు రాజాలమని తెల్పిరని తెల్పుము. శ్రీరంగనాథప్రసాదమని ఈ చిన్నివస్త్రమును యువరాజుల కర్పింపుము. దీనినాతడు పట్టాభిషేక సమయమున తప్పక ధరింపవలయునని మాత్రము తెల్పుము." అనుచు శ్వేతవస్త్రము నొకదానిని నొసంగినాడు యతీశ్వరుడు. భక్తితో నందుకొనినాడు పెద్దనార్యుడు.

"క్షమింపుడు గురుదేవా ! చిరంజీవి యువరాజుల కనామయమగునట్లు దీవింపుడు. నాకంతియే చాలును!" తనలో ఏమూలనో పొటమరించిన యనుమానలేశమును వెలిబుచ్చినాడు పెద్దన.

"విధి తన కర్తవ్యమును నిర్వర్తించుకొని పోవును. మానవ మాత్రుల యాశీర్వాదములకది కట్టుబడదు. పట్టాభిషేకసమయమున శ్రీరంగనాథప్రసాదమగు నీ శ్వేతవస్త్రమును ధరించిన యువరాజున కేయాపదయును రాదు నాయనా!" శఠగోపతాపసు లనినారు.

"స్వామీ! తాము పరిపూర్ణముగ యువరాజును దీవించుటలేదా?" ఆవేదనాపూరిత హృదయుడై యడిగినాడు పెద్దన.

"ఇకనా ప్రస్తావనను వదలివేయుము పెద్దనా! నా యోపినంతకు యువరాజున కేయపాయము కలుగకుండుటకు ప్రయత్నమొనర్చినాను. ఆపై దైవయత్నము. ఈవిషయములన్నియు నీలోనే యిమిడిపోవలయును. ఇది గురువుల ఆజ్ఞ."

చిత్తమనినాడు పెద్దన అస్వచిత్తముతో. మరుదినమున రాయలు తనకొసంగిన కోకట గ్రామమును శఠగోపపురముగా మార్చి గురువులకు గురుదక్షిణగా సర్వకరపరిహారముగ దానమొనర్చినాడు పెద్దన.

"పెద్దనా! నా కేరిడిన యీ గ్రామమును సగము వైష్ణవమతములకు, మరిసగము బ్రాహ్మణులకు నా యానతిన దానమొసంగుము. నీవు విజయనగర మరగిన తర్వాత సమయము ననుసరించి దీని నొనర్పుము. ఆ మేరకు శాసనము రచించి నిల్పుము." అని అజ్ఞాపించినారు శఠగోపయతి.

"కొలుతున్ మదురు విద్యా
నిలయున్ గురుణాకటాక్షనిబిడ జ్యోత్స్నా
దళితాశ్రితజన దురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి శఠగోపయతిన్"
అనుచు ఆ యాజ్ఞను శిరసావహించినాడు పెద్దనార్యుడు.

## ముప్పదిరెండు

ఆది విజయనగర ప్రజలు శుభదినముగా భావించిన దుర్దినము. సర్వకర్ణాటాంధ్ర సామ్రాజ్యపతనమునకు నాందిప్రస్తావన గావించిన ప్రళయదినము. మూరురాయరగండడగు శ్రీకృష్ణదేవరాయని మనశ్శాంతిని

పరిపూర్ణముగ హరించిన దినము. తన జీవితమంతయు ఆంధ్రదేశోన్నతికై ధారవోసిన మహామంత్రి తిమ్మరుసుల జీవితము నా వృద్ధాప్యమున అస్తవ్యస్తమొనర్చిన దినము. ఆంధ్రలోకమునకే ఆంధ్రప్రజలకే తీరని అపచారమొర్చిన దినము.

అది తిరుమలరాయల పట్టాభిషేకదినము.

నగరమంతయు ఉత్సాహముతో కలకలలాడిపోవుచున్నది. పచ్చని తోరణములతో చిత్రవిచిత్రములుగ రచింపబడిన పుష్పమాలలు రంభాస్తంభములతో గృహములన్నియు నలంకరింపబడినవి. కస్తూరి జవ్వాజి కల్పిన కలయంపి ఘుమ ఘుమలు వీధివీధులనిండి వినువీధి దేవతల నాకర్షింపుచున్నవి. సుసంపన్నులు ముత్యాలమాలలతో అణిముత్తెముల రంగవల్లులతో తమ గృహముల నలంకరించుకొనినారు. మనోహర సౌధరాజంబుల నెక్కి వీధులందలి వినోదముల గాంచుచున్నారు. వీధులందు వీరులగు యువకులు శరీరమున రక్తచందన మలమికొని కాసెకోకలు బిగించి తెగవారెడు వెండ్రుకల ముడియందు విచ్చిన గులాబుల దండ నలంకరించుకొని నడుములందలి పటకాల దంతపు పిడిబాకుల జెక్కుకొని సన్నని నల్లనైన మీసముల మెలివెచికొనుచు మత్తేభముల పోలిక సౌధముల పైనుండి తమ్ముగాంచు శృంగారవతుల నాకర్షించుకొనుచు నరుగుచున్నారు.

ఇదేమియువకుడా! ఈ మందారముల దండను ధరించి రాజసభకేగిన సరివారు నవ్వరా? రమ్ము సొగసుమీరి నెత్తావుల గ్రుమ్మరించు గులాబుల పూగండను ధరించి పొమ్మనుచు తను బిలచు నొక పుష్పలావికాసౌందర్యమున కాకర్షితుడై యట్టెనిలచిపోయిన యా యువకుని తోడివారలు పరిహసించుచున్నను నాతడట్లే యా యతివను చూచుచుండ సిగ్గున దోగినదా కన్నెమిటారి.

విజయనగర ప్రజ ప్రవాహమై భువనవిజయ సభాసంద్రమునకు మూర్ఛిల్లుచు ఘోషలెత్తుచు ప్రవహించినది. పూర్ణిమనాటి చంద్రదర్శనమున ఉత్తుంగ తరంగతాడితమై ఉప్పొంగు మహోదధివలె సభాభవనము

ఆనందోత్సాహములతో పొంగిపొరలినది. గంగా, యమునా, బ్రహ్మపుత్ర, గోదావరి, కృష్ణ, కావేరి నదీజలములు, పుణ్యక్షేత్రములైన కాశీ, రామేశ్వర లింగాభిషేకోదకములు, శ్రీ వేంకటనాధుని పుష్కరిణీజలము, శ్రీశైలము, విజయవాటిక దైవతముల పాదతీర్థములు, చతుస్సముద్రముల జలములు బంగారుబిందెలనుంచి తెప్పించినారు.

సభాభవనమంతయు కిటకిటలాడిపోయినది జనులతో. ఇసుక వైచిన రాలని జనము. మంత్రిసామంత దండనాయకులు, దూరసుమారము లందలి సేనాపతులు పట్టాభిషేకమున కరుదెంచినారు. అష్టదిగ్గజము లనబడు కవులు, కన్నడ తమిళ కవి పండితులు ఆ సభనలంకరించి యున్నారు. మహా మహిమాన్వితులగు లొల్ల లక్ష్మీధరపండితు లాహ్వానించినను సభకు రాజాలని తమ యశక్తతను తెల్పినారు.

మహామంత్రి తిమ్మరుసు పెద్దన యాదేశముపై సభాభవనమును, అందలివారి ప్రాణముల కాపాడుటకు సహస్రాక్షునివంటి త్ర్యంబకనాయకుని సహస్రభట పరివృతుడై యుండునట్లొనర్చినాడు. పెద్దన యాదేశముపై మేఖల యువరాజును కాపాడుటకు నియమింపబడినది.

తానెంత కట్టుదిట్టము లొనర్చినను యువరాజున కేమగునో పట్టాభిషేకవేళ నిలచిపోవునో యను శంకలచే పెద్దన హృదయము కొట్టుమిట్టాడుచున్నది. ఇతరులతో చెప్పరాని యపాయ మిది.

సర్వసేనాపతులు నాగమనాయకులు, గోవిందరాజులు సహస్ర నయనులై సభను వీక్షించుచు సర్వసన్నాహము లొనర్చుచున్నారు. ముహూర్త మాసన్నమైనది, పురోహితులు మంత్రముల నుచ్చరించుచున్నారు.

పెద్దనార్యుడు యువరాజులను దరిసినాడు. "యువరాజులీ శ్వేత వస్త్రమును ధరింపవలయును." అనుచు నందీయ బోయినాడు.

యువరా జందుకొనుటకు చేయి చాచినాడు.

పురోహితుడు వారించినాడు. "ఇది పట్టాభిషేకములం దుపయోగించు రాజలాంఛనయుక్తమైనది కాదు. దానిని పట్టాభిషేక సమయమున యువరాజులు ధరింపరాదు. ఆచార వ్యతిక్రమణ కూడదిట్టి సమయము

లందు " తన నిర్ణయమును తెల్పినాడు.

"ఇది శ్రీరంగనాథ ప్రసాదము. శ్రీ వ్యాసరాయలకు గురువులగు శఠగోప యతీశ్వరు లొసంగినవి." అనినాడు పెద్దన ఆందోళనతో.

"ఏమైన సంప్రదాయము కానిదానిని ధరించుట భావి రాజ్యపాలకునకు శుభము కాదు" రామాదీక్షితు లందుకొని యనినాడు.

పెద్దన యాందోళితుడైనాడు. శఠగోపయతీశ్వరుల వాక్యము లు తప్పునట్లులేదు. "దైవప్రసాదమును తిరస్కరించుట కూడదు. ఇది యువరాజులకొరకు ప్రత్యేకముగ కొనివచ్చినది. వారు ధరింపక తప్పదు."

మంత్రము లాగిపోయినవి. పెద్దన యెందులకంత పట్టుపట్టు చున్నాడో అర్థముకాలేదు రాయలకు. ప్రజలకు, చివరకు మహామంత్రులకుకూడ.

"పెద్దనా! ఎందులకంతటి పట్టుదల? ఆచారము కానప్పుడు వదలి వేయుట యుక్తము. వేరొకవిధమగు నాచారము నిట ప్రవేశపెట్టుట మంచిదికాదు" అనినాడు అప్పాజీ.

"మహామంత్రులు క్షమింపవలయును. ఇది యువరాజులకు వజ్ర కవచము. దైవమొసంగినది" తన స్థిరనిశ్చయమును పునరుద్ఘాటించినాడు పెద్దన.

రాయలాలోచనామగ్నుడైనాడు. ఈవిధమగు పెద్దనను వారెరు గరు. కారణము నూహింపలేని తిమ్మరుసు ఆక్రోశత ఆవేదనతో సత మతమగుచున్న పెద్దనను గాంచినాడు.

పెద్దన మాటలలోని యాంతర్యమును సాళగరాజు గ్రహించినాడు. ప్రతిఘటించినాడా కార్యమును. "సామాన్యుడొక డొసంగిన సామాన్య వస్త్రమును ఈ పవిత్రసమయమున యువరాజు ధరించుట సామంతరాజ మండలము నవమానించినట్లగును. ఇది కూడని పని." అంతవరకా యాలోచనమే లేని సామంతరాజుల మస్తిష్కములు పనియొనర్ప మొద దిలినవి.

"వ్యాసరాయలు మనకు ప్రాణదాత. వారి గురువర్యులొసంగిన

ఈ వస్త్రమును యువరాజు ధరించిన కలుగు నవమానమేమి ?" రామ రాయ లాలోచించి యనినాడు.

"సామంతరాజు లొసంగిన వస్త్రములనే యిట ధరింపరాదు. ప్రత్యేకముగ పట్టాభిషేకమునకైన వస్త్రములే ధరింపవలయును. సార్వభౌములు, వారి యన్నగారు విజయనగర సింహాసన మధిష్ఠించిన వారందరా వస్త్రములే ధరించినారు. ఆచార వ్యతిక్రమణము శుభము కాదు." తన మనము నందలి మాటను బయల్పరచినాడు సామంతమండలేశర్వొకడు.

చివరకు నిర్ణయ మొనరించువంతు రాయలదైనది. పెద్దన పట్టుదల, అంతకంటె మిన్నయగు నాచార వ్యతిక్రమణము. రాయల కేమియు పాలుపోలేదు. దీనమగు పెద్దనముఖమును గాంచినాడు రాయలు. అంతటి ఆందోళనమునకు కారణ మూహింపజాలకపోయినాడు రాయలు.

తాను ధరింపలేనా వస్త్రము. తన కాలము మహావైభవముగ చెల్లినది. ఆచార వ్యతిక్రమణ మొనర్పనేల ? సామంతునిమాట నచ్చినది రాయలకు.

పెద్దన తన పట్టుదల వదలుటకు, ఆచార సంప్రదాయసిద్ధముగనే పట్టాభిషేకము జరుగుటకును రాయలు నిర్ణయించినాడు.

ఆ నిర్ణయమును వినిన పెద్దనకు నవనాడులు కృంగిపోయినవి. అతడా వస్త్రమును చేతులం దిడుకొని యున్నాడు. విచారముచే వణకినాడాతడు. అతని వేడి కన్నీటిబిందువులా పైవదత్తమగు శ్వేతవస్త్రముపై రాలి పడినవి.

"విధివిలాసమును మాన్ప నెవరితరము ప్రభూ ? నేను నిమిత్తమాత్రుడను. విధి కెదురీది నే నొనర్పకల్గిన దేమున్నది ? భగవల్లీలలు విచిత్రములు." అని పై వస్త్రమున ప్రవహించు కన్నీటిని తుడుచుకొని తన యాసనము నధిష్ఠించినాడు పెద్దన.

అనాటి యాతని వింత ప్రవర్తనము, పసివాడి మ్లానమైన అతని వదనమును చూచువారల కాశ్చర్య భయముల కల్పించినది.

అతి గంభీరుడగు పెద్దన పసివానివలె సభయందే కన్నీరుగార్పుట

జూచిన తిమ్మరుసు ఆందోళన మతిశయించినది. ఏదోనొక విషయ మాతడు దాయుచున్నాడని ఆతని మనోవేదన కదియే కారణమని ఊహించినాడు మహామంత్రి. మహామంత్రి మనసు కలగుండుపడిపోయినది.

భద్రదంతావళి మరునెంచి యువరాజును గంగాజలముచే నభిషేకించి యరిగినది. కృష్ణరాయలు పంపావిరూపాక్ష పానతీర్థముచే తిరుమలరాయని అభిషేకించినాడు. తదుపరి తిరుమలదేవి, అన్నపూర్ణాదేవు లభిషేకించినారు. అప్పాజీ యు నభిషేకించినారు.

జలాభిషేక కార్యక్రమము పూర్తియైనది.

యువరాజు ధరించు మకుటమును పురోహితు డందఱచే స్పృశింప జేసినాడు. మహారాజు కృష్ణరాయలా నవరత్న ఖచిత కిరీటమును యువరాజు శిరస్సుపై నుంచినాడు. యువరాజు సింహాసనమునుండి లేచి తండ్రి పాదములకు నమస్కరింప తనవద్దనున్న యువరాజలాంఛనమగు వజ్ర కంఠికను రాయలాతని మెడయందు ధరింపజేసినాడు.

యువరాజు సింహాసనస్థుడైనాడు.

వంది యొకడు కృష్ణరాయ సార్వభౌముని బిరుదావళి పఠింప మరి యొకడు యువరాజు బిరుదముల నుచ్చరించి జయమనినాడు.

సభానిర్వాహకుడు సామంతనృపుల నొక్కొక్కరినే పేరున బిలువ వారరుదెంచి యువరాజునకు కానుకలర్పించి వెడలుచున్నారు. సామంత నృపులైనంతనే స్నేహిత స్వతంత్రనృపతులు పంపిన కానుక లందు కొనుట యారంభమైనది.

తమతో నిర్యుద్ధసంధి నొనర్చుకొని రాయచూరుపై తన హక్కును వదలుకొనిన బిజాపూరు సుల్తాను ఆలీ ఆదిల్షా పంపిన ప్రతి నిధివర్గము కానుక లమితముగ కొనివచ్చినారు.

వారు పిలువబడినారు. ప్రతినిధివర్గ నాయకుడు యువరాజునకు పాదములంట సలాము నొనర్చి నిలచినాడు. తాము తెచ్చిన నగలు, వస్త్రములు, మణులుతాపిన ఖడ్గము, ఒరయు, వజ్రఖచితమగు చురియయు యువరాజునకు సమర్పింపబడినవి.

చివరగా నాయకుడొక పెట్టెను తెరచినాడు. అందొక పుష్ప

మున్నది. దాని యందము వర్ణనాతీతము. పెట్టెమూత తీయగనే పుష్ప సౌరభము లనేకవిధముల సభాభవనమును క్రమ్మినవి.

"మా సుల్తాను ఆదిల్షా ప్రభువులు ఈ అపురూపమగు మొక్కను అరేబియా దేశమునుండి తెప్పించి తమ తోటయందు స్వయముగ పెంచు చున్నారు. ఇది సంవత్సరమున కొక్క పూవు మాత్రమే పూయును. మొక్కనుండి కోసినతరువాత మూడు నెలలవరకును వాడిపోవదు. ఇది యువరాజులకు ప్రత్యేకమగు కానుక" అనుచు తిరుమలరాయలచేత నుంచినాడు పుష్పమును.

ఆ పుష్పరామణీయకమున కచ్చెరువందుచున్న యువరాజు పుష్పము చేతికందగనే వాసనచూచినాడు. తిమ్మరుసు కేమో అనుమాన మైనది. అతని హృదయమేలనో ఆందోళితమగుచున్నది. కారణము తెలి యని ఆవేదన యిది. ఈ ఉపయమునుండి అంతియే. ఎంత యణచు కొందమనుకొనినను తపన ననుభవించుచున్నాడాతడు.

ఆ వాసనకు మత్తిలిన యువరాజు ఆ పుష్పమును మరొక్క మారు గట్టిగా నాఘ్రాణించినాడు. చైతన్యరహితుడై సింహాసనముపై పడిపోయినాడు తిరుమలరాయలు. రాయలు కుమారుని పొదువుకొనినాడు, త్ర్యంబకనాయకుడా కానుకలు గొనితెచ్చిన భటులను బంధించినాడు. తిమ్మరుసు యువరాజు సింహాసనముకడకు పరువెత్తినాడు. రాజవైద్యు లరుదెంచి యువరాజును గాంచునప్పటికే ఆతని ప్రాణవాయువులీ యనంత వాయువుల లీనమైనవి. సభ విచ్ఛిన్నమైనది. ప్రజలందరును పంపివేయ బడినారు.

"ముక్కుపచ్చలారని పసిపాపని హత్యనొనర్చుటకు చేతులెట్లాడి నవిరా మూర్ఖుడా" యనుచు ఆ భటనాయకుని శిరమును తన నిశితకర వాలమున ఛేదించినాడు గోవిందరాజు.

"ఆగు సేనాపతీ! వారు దండనార్హులైనను కుట్రకారణము వారి మూలముననే తెలియవలసియున్నది." ఆతని వారించినాడు అప్పాజీ.

క్షణము క్రితము వరకు కలకలలాడుచుండిన సభాభవనము గగ్గోలు నందిపోయినది. తిరుమలదేవి కుమారుని శవమును పొదివికొని యాక్రం

దించుచున్నది. ఏకపుత్రవిషయమగుటచే మహారాజు విచారమున కవధులు లేవు.

పెద్దన తన యాసనముపైనుండి దిగలేదు. అతని కండ్లనుండి నీరు కారిపోవుచున్నది. ఇక ఆంధ్ర సామ్రాజ్యమున శాంతి లేదా? ఆంధ్రరాజ్యరమ అనాథ కానున్నదా? అది యాతనిలోని శంక.

అతడు లేచి దుఃఖితుడైన మహారాజుకడ కరిగినాడు.

"మహారాజా! ఇది సంకటసమయము. తాము సహింపవలయు నీ పరితాపమును' అనినాడు పెద్దన.

"పెద్దనా! నీవొసంగిన ప్రజకవచము ధరింపని ఫలితమాయిది? నీకీ విషయమై ముందే తెలియునా పెద్దనా?" రాయలు కన్నీరు గార్చుచు నడిగినాడు.

"శఠగోపయతీశ్వరు లెట్లయిన పట్టాభిషేక సమయమున యువరాజుచే నీ శ్వేతవస్త్రమును ధరింపజేయ నాజ్ఞాపించినారు. ఇది యువరాజు ధరించిన పట్టాభిషేక మెట్టి యాటంకము లేకుండ జరిగిపోవునని వారు తెల్పినా రందులకే నేనంత పట్టుపట్టినది" గద్గదస్వరముతో ననినాడు పెద్దన.

"నే దురదృష్టవంతుడను పెద్దనా! నా నిర్ణయమైన నీ కనుకూలముగ రారాదా?" రాయలు వనవిపనవి దుఃఖించినాడు.

"విధి నిర్ణయమున కెదురీదగల సమర్థు లెవ్వరు ప్రభూ!"

కుట్రదారులు రప్పింపబడినారు. రాయలకన్ను లెఱ్ఱవారినవి వారిని గాంచగనే. "దుర్మార్గులారా! ఈ కుట్ర నొనర్చిన దెవరు?"

"మేము - మేము...." అందొకడు నణిగినాడు.

"మీరు బ్రతికియుండగనే మీ చర్మము లొలిపింతును. నిజము పల్కుడు."

"మే మాదిల్షా భటులము" అందొక డనినాడు.

"వీరి యుచ్చారణము మహమ్మదీయులకువలె లేదు. వేషములు మహమ్మదీయులవి" అనినాడు త్ర్యంబకనాయకుడు.

నిశితముగ వారివైపు గాంచినారు రాయలు. "మీరెవ్వరి -సేవ

కులు ?" గర్జించినాడు రాయలు. "త్ర్యంబక నాయకుడా ! వీరిచే నిజము పలికింపుము" రాయలాజ్ఞాపించినాడు.

త్ర్యంబకనాయకుని చేతియందలి కొరడా ఛెళ్ళుఛెళ్ళు మనినది. ఒకని శరీరముపై చర్మము పెచ్చులుగా లేచివచ్చినది. ఆతడు నిజము పల్కెదు ననినాడు.

"మీ రెవ్వరి భటులు ? ఎవ్వరు ఈ కుట్రకు కారకులు ?" మహారాజనినాడు.

భటు డటునిటు చూచినాడు. "మహామంత్రి అప్పాజీ భటులము !" వారిమధ్యన పిడుగుపడినట్లయినది. అందరొక్కపర్యాయము ఉలికిపడినారు.

"అప్పాజీ ! దుర్మార్గులారా ! మీ తలలను తీయించెదను. కుట్రలో నిదియొక భాగము." రాయలఱచినాడు.

"మేము హిందువులము. మహామంత్రుల సేవకులము. చంపినను ఇది నిజము." మఱియొక డనినాడు.

అప్పాజీ వారిని నిరసితముగా వీక్షించినాడు. కృష్ణరాయలవైపు చూచినాడు.

రాయలు ముఖము త్రిప్పుకొనినాడు.

ఆ వృద్ధామాత్యుడు బంధింపబడిన సింహమువలె రోజినాడు.

"మహారాజా !" తిమ్మరుసు పిలచినాడు.

రాయలిటు ముఖమును త్రిప్పలేదు.

"ప్రభువులు రెండుదినములు గడువిప్పించిన కుట్రదారుని బంధింపగలను."

"ఇంతటి కుట్ర జరిగిపోవుచుండ కనులు మూసికొనిన మహామంత్రులు కుట్రదారులను పట్టుకొందురా ?" ఆ వాక్యమున వ్యంగ్యము ధ్వనించినది.

"ప్రభువులు నన్ననుమానించుచున్నారా ? ఎవరో నీచులగు సేవకుల మాటలు నమ్మి నన్ననుమానించుచున్నారా ?"

"నిరపరాధులని ఋజువగునంతవఱకు దోషి తేలునంతవఱకు ప్రత్యక్ష సాక్ష్యమును నిరాకరించుట రాజధర్మము కాదు. తన మహా

మంత్రి లాంఛనము లన్నియు తీసి రాయలముందుంచినాడు తిమ్మరుసు. "త్ర్యంబకనాయకుడా! నన్ను బంధించి కారాగృహమునకు కొనిపొమ్ము. విధివిలాసము అతి విచిత్రము." అనినాడు తిమ్మరుసు. మహారాజు ఆజ్ఞకొఱకు జూచినాడు త్ర్యంబకనాయకుడు. రాయల కాశ్చర్యమైనది. అనుమానమైనది.

"వలదు నాయకా! వారు దోషియైనను, నా కుమారుని హత్యాకారకులైనను వారిని కారాగారమున నుంచు నిచ్ఛ నాకు లేదు. వారు తమ గృహమునకు వెడలిపోవచ్చును."

తలయెత్తి రాయలవైపు చూచినాడు తిమ్మరుసు.

"రాయా..." అది చిన్ననాడు తన్ను పిలచిన పిలుపు.

"ఈ యపనింద నా సర్వశక్తులను సమూలముగ నాశనమొనర్చినది. నేనిక జీవించు కాలము నెక్కువలేదు. కాని యది యిప్పుడు చెప్పుట కలవికానిది. నా మరణానంతరమే నేను నిర్దోషిగా నీవు తెలియగలవు. తరువాత పశ్చాత్తప్తుడవగుదువు."

తిమ్మరుసు సాంప్రాంతమునుండి యడుగులో యడుగు వైచుకొనుచు తన గృహమును జేరినాడు. పెద్దస యొక్కడే తిమ్మరుసు ననుసరించి యాతని యింటికరిగినది.

క్షణముక్రితమువరకు అవిచ్ఛిన్నముగ విజయనగరసామ్రాజ్యమును తన కనుసన్నలనాడించిన మహామంత్రి మఱుక్షణమున నిర్బంధితుడు. యువరాజ హంతకుడను అపనిందతో కుమిలిపోవు హృదయముతో మరణవేదనా సమానమగు వేదన నందుచున్నాడు. కాలప్రభావము, ఓడలు బండ్లును బండ్లోడలును నగునందురు. ఎంతటి రాజాధిరాజైననేమి? ఎంతటి మహామంత్రులైననేమి? కాలవాహినియందు కట్టుబడవలసినదే. ఆ కాలదేవతాప్రభావముముందు తల వాల్చవలసినదే.

## ముప్పదిరెండవనాడు

త్రపనింతవరకు కన్నబిడ్డవలె కనులందిడుకొని కాచి రక్షించిన అప్పాజీ తన కన్నబిడ్డనే హత్యచేయించునా? హత్య నొనర్పించిన

నాతనికి కల్గు ఫలితమేమి ! రాజ్యాశయా ? రాజ్యమొనర్చుచున్న నను హత్యచేయించిన జరిగెడి కల్లోలములో బాలకుని త్రోసిరాజని తాను రాజ్యమునకు రావచ్చును.కాని నన్ను మనజేసి తానేమిచేయదలచి కుమారుని హత్యగావించినాడు ? దీని నెట్లూహించుట ? పుత్రశోకముతో మరణింతునని తలచినాడా ? అంత వెఱిగా నూహించుట కాతడేమి సామాన్యుడా ? ఎంత బాధించిన నెంతటి చిత్రవధకు పాల్జేసినను హంతకులు తాము తిమ్మరుసు భటులమే యనుచున్నారు. వారి నెఱింగినవారొక్కరిందు లేరుగదా ? న్యాయనిర్ణయ మొనర్చుటెట్లు ! తిమ్మరుసు రాజద్రోహియా ?

"ఛీ ! కృష్ణరాయా ! అత్యంత స్నేహస్నిగ్ధమైన నీ హృదయమేల యింతటి విషాలోచనలకు తావొసంగుచున్నది ?" అతని అంతరాత్మ ప్రశ్నించినది.

"తిమ్మరుసు రాజద్రోహి కాడా ? రాజద్రోహమాతని కుగుబాలతో వచ్చినది. మీయన్న నీ కనుల నూడబెఱికి తెమ్మనినపుడాత డొనర్చిన దేమి ? రాజద్రోహము కాదా ? అతడెప్పటికిని రాజద్రోహియే." అనిన దాతని మనస్సు,

"నీయందలి స్నేహమది.సర్వసమర్థుడవని సర్వాంధ్రసామ్రాజ్యాధినేతవగుటకు తగినవాడవని దిక్కులేని రాజవంశీయుడవని, నిను రక్షించినాడు. నీ తల్లి మరణించునపుడు మహామంత్రిగా నాతడు నీ ప్రాణ రక్షణ నొనర్తునని చేసిన వాగ్దానము నిల్పుకొనుటకును నిను రక్షించినాడు. అది రాజద్రోహమా ?" అనిన దాతని యాత్మ.

"ఆతడెప్పటికిని కుటిలుడే. కళింగయుద్ధమున నేమొనర్చినాడు? పాత్రుల నెట్లు హతులనొనర్చినాడు ! రాయచూరు యుద్ధమున నాతడొనర్చినదేమి ?" అనిన దాతని మనస్సు.

"అదంతయు రాజనీతి. లేనియెడల నీ రాజ్యము నిలచునా ? ఇంతటి ఔన్నత్యము నందునా ? నీ కింతటి కీర్తిప్రతిష్ఠలు కల్గుటకు నీ సామ్రాజ్యమింతగా విస్తరించి స్వర్ణమందిరమై సస్యశ్యామలమై తనరుటకు కృషియొనర్చిన నీ మహామంత్రి ఈ వృద్ధాప్యమున రాజద్రోహ మొనర్చునా ? ఒనర్చి ఆతడు పొందు లాభమేమి ?" ప్రశ్నించిన దంతరాత్మ.

"యువరాజ మరణానంతరము రాజ్యమునకు వారసుడుండడు. సర్వశిరశ్శ్రప్రధాని నీ యనంతరమో, నిను మట్టు బెట్టియో రాజ్యము నాక్ర మించుట కేమి యభ్యంతరము? సైన్య మాతని చేతిలోనిది" మనస్సని నది.

"రాజ్యమునే ఆక్రమింపదలచిన నెప్పుడో నాతడా పని యొనర్చి యుండును. ఇదంతయు కుట్ర. ఆత దెరుంగకుండ జరిగించినది. కుట్ర కారణము నాతడు గ్రహించి యుండవలయును. యువరాజు మరణ మెవ్వరికి లాభము? నీపై నతిశత్రుత్వమున్న దెవరికి? వారొనర్చి యుండరాదా? ఏమైన తిమ్మరుసు ఇట్టి ద్రోహము నొనర్చి తాను పెంచిన సామ్రాజ్యమునే అస్తవ్యస్తమొనర్ప తలపడుట అనూహ్యము. నీవు కుట్రవిషయమై పరిశోధింపుము. ఆ వృద్ధుడు మరణించుటకుపూర్వమే ఆతని నిర్దోషిత్వమును ఋజువుపరపుము" అనిన దంతరాత్మ.

అన్నపూర్ణాదేవి ప్రవేశించిన దటకు. "ప్రభూ! మహామంత్రు లను దోషిగా నిర్ణయించుట ఆతనికి శిక్షను విధించుట కేవలము నిరపరాధు లను దండించుటమాత్రమే."

"ఆత డపరాధి కాడని నిరూపింపనపు డాత డపరాధియే" రాయ లనినాడు.

"ఆతడపరాధియని మీ యాత్మ యొప్పుకొనుచున్నదా ప్రభూ?" అన్నపూర్ణ యడిగినది.

"ఇందు ప్రమేయము లేదు. న్యాయస్థాన మనవలయును నిర్దోషి యని."

మేఖల లోని కరుదెంచినది. "ప్రభువులనుజ్ఞ నొసంగిన మూడు దినములలో మహామంత్రుల నిర్దోషిత్వమును ఋజువుపరుపగలను నేను."

ఆశ్చర్యముగ జూచినాడు రాయలామెవైపు. "మీరందరు నాపై శత్రుత్వము వహించినారా?" రాయ లడిగినాడు కోపముతో.

"లేదు ప్రభూ! ఈ రాజ్యమున నిరపరాధులు శిక్షింపబడకూడదు. అదియే మా అక్కకోరిక. ఆ కోరికను నేనును కోరుకొనుచున్నాను.

మేఖల యనినది.

"పొమ్ము మేఖలా! మహామంత్రులను నిర్దోషులుగా ఋజువు పరపుము. వారిని శిక్షించుటకు మాకును చేతులు రాకున్నవి."

పెద్దన లోనికి ప్రవేశించుటకు అనుజ్ఞవేడుచున్నాడని తెల్పినాడు ద్వారపాలుడు.

పెద్దన యరుదెంచినాడు.

"ఏమి పెద్దనార్యా! నిన్ననంతయు తమకొరకెదురుచూచినాను" రాయలనినాడు

"మరణశయ్యనున్న మహామంత్రులకడ నున్నాను."

"ఆతడిప్పుడు మహామంత్రి కాడు. శిశుహత్యాపరాధమున నున్న హంతకుడు."

"హత్యనొనర్చిన దొకరు. నింద మరియొకరికి! తెలియకనే ఒకరిపై నిందమోపుట సజ్జనలక్షణము కాదు" పెద్దనయు తీవ్రముగనే యనినాడు.

ఆ తీవ్రత మహారాజున కాశ్చర్యమునే కలిగించినది.

"ఏమి పెద్దనా! మా సజ్జనత్వమునే శంకించుచున్నావా? రాజద్రోహితోడి సాంగత్యమును రాజద్రోహమగును" రాయలనినాడు.

"రాజద్రోహియని మహామంత్రులపై ఋజువైననాడు ఆ ముఖమైనను చూడను నేను. కాని ఆతడు నిరపరాధియని నాకు నమ్మకమున్నది. నిరపరాధికి శిక్షను విధించుటె బాధాకర విషయము. శఠగోప తాపసులు నుడివినది అక్షరాక్షరమున సత్యమగుచున్నది."

"ఏమి తెల్పినాడాతడు?"

"ఈ పట్టాభిషేకమున కాటంకము కలుగుననియు, ఇది విజయనగర సామ్రాజ్యనాశమునకు నాందిప్రస్తావనమనియు తెల్పినారు."

రాయలులికిపడినాడు. ఆతని హృదయము దడదడలాడినది. కంఠము గద్గదమైనది. "విజయనగర సామ్రాజ్యనాశనమున కిది నాందిప్రస్తావనయా? పెద్దనా! ఆ సర్వనాశనమును నే జూడవలసినదేనా? అది నాకు భరింపరానిది. ఇదంతయు నా స్వయంకృతాపరాధ కారణము కాదు

గద ?" అతని దుఃఖమునకు కనులవెంట బయల్వెడలినది.

"ఆందోళన మందకుడు ప్రభువులు. మీరును, నేనును ఆ నాశనము చూచుటకు మిగులమనియును గురుదేవులు తెల్పినారు."

"బ్రదికిపోయినాను. నా సామ్రాజ్యము నాకాలమున పతనము కాకుండిన జాలును. కాని ఈ పునాదులంత త్వరగా కదలునవి కాదు పెద్దనా ? విద్యారణ్యుల తపఃఫలముగ నుద్భవించిన ఈ హిందూ సామ్రాజ్య మంత తేలికగా విచ్ఛిత్తినందుట జరుగదు" రాయలు తన విశ్వాసమును వెలిబుచ్చినాడు.

"మరణశయ్యపై నున్న అప్పాజీవారి కొక్క-పర్యాయము దర్శన మిప్పించుటకు మిమ్ము గోరుటకై యరుదెంచినాను. అతడు తన నిర్దోషిత్వమును ఋజువుపరచుకొను స్థితియందు లేడు. ఒక్క-పర్యాయము మిమ్ములను చూడగోరినాడు" అనినాడు పెద్దన.

"నేనా హంతకుని జూచుటకై రావలయునా ? అది జరుగునది కాదు."

"మహామంత్రిగా నాతడొనర్చిన సేవల నప్పుడే మరచినారా ప్రభువులు ? తాము విధించిన శిక్ష నా వృద్ధుడు సహింపగలడా ?"

"నా కన్నియు గుర్తున్నవి. కాని యాతడు రాజద్రోహి యనుటకు అతని పూర్వప్రవర్తనమే సాక్ష్యము."

"ప్రభువులా విషయము లన్నియు మరచి అంత్యదశయందా వృద్ధునకు మనశ్శాంతి నొసంగవలయును. చిరకాల సాన్నిహిత్యముననైన మీ రా కోరిక తిరస్కరింపరాదు."

"పెద్దనా ! ఇకపై నిన్నును తిరస్కరింపక తప్పదు. రాజద్రోహిని వెనుకవైచికొని వచ్చి నీవును రాజద్రోహివి కాబోకుము."

"అగును ! తమను రక్షించిననాడే నా తండ్రి రాజద్రోహియైనాడు. సార్వభౌమునిగా బెంచి తిమ్మరుసు రాజద్రోహియైనాడు. స్నేహితమొనర్చి నేసీనాడు రాజద్రోహి కాబోవుచున్నాను. ప్రభువులు నడచుచున్నది అభ్యంతరకరమగు మార్గము. తనపై మోపబడిన యపనిందను తొలగించుకొను శక్తి కలుగువరకైన నిందితుని కరుణతో చూచుట న్యాయవిధి. నా

ప్రాణములకై నాకు భయములేదు. కాని నా ప్రభువు నిరపరాధుల శిక్షించెడు అన్యాయవర్తనుడని భావించెదరేమో యనుకొనుటమాత్రము నే సహింపజాలనిది."

వీరమల్లుతో గలసి విజయుడు లోన ప్రవేశించినాడు. వారి ముఖములం దాతృత కొట్టవచ్చినట్లు కన్పించినది. విజయుడిప్పుడు గూఢచారాధ్యక్షుడు.

"మొన్న యువరాజులకు కానుకలు గొనివచ్చినవారిలో నొక ముఖ మెచ్చటనో కాంచినట్టిది. అనుమానించి వారిని బంధించిన కొట్టునందే నన్నును బంధింపజేసికొంటిని, వారు నా బంధనమును గూర్చి పదేపదే ప్రశ్నించినారు. చివరకు యువరాజు హత్యావిషయమున బంధింపబడినానని నిన్న తెల్పినాను. వారికి నాయందు సమ్మకము కలిగినది. ఆ చిరపరిచితమగు వ్యక్తి నే నెరింగినవాడేనని గ్రహించినాను."

"వారినుండి విషయమెట్లు రాబట్టితివి?" రాయలు ప్రశ్నించినాడు.

"పట్టాభిషేక సమయమున విషలిప్త బాణముతో యువరాజును గొట్టుటకై నేను నియమింపబడినానని తెల్పినాను. నియమించినది అజపర్కాతిమ్మన, వీరభద్రగజపతులనియు తెల్పినాను. వారందరులికిపడినారు. మేముగాక నిన్నింకొకనిని నియమించినారా యనినాడు నా పరిచితుడు. మీ ప్రయత్నము విఫలమైన నా బాణప్రయోగమున యువరాజు మడిసి యుండెడివాడని తెల్పినాను. అజపర్కాతిమ్మన యానుపాయములన్నియు తెల్పినమీదట వారు తమ నిజవృత్తాంతము నొప్పుకొనినారు. వారిని బంధనమునుండి తప్పించుటకే వీరభద్రగజపతి నన్ను కారాగారమున బంధింపజేసినట్లును తెల్పుటచే వారు పూర్తిగ నన్ను నమ్మినారు. నిన్నరాత్రి నా పరిచితుని నెమ్మదిగా నచటనుండి తప్పించి మరొకచోట బంధించినాను. ఈ కుట్ర యంతయు తిమ్మన, వీరభద్రగజపతు లొనర్చినది. గోవిందరాజుచే చంపబడిన భటనాయకుడు వీరభద్రగజపతి గూఢచారుడు."

విషయమంతయు తెల్పి మిన్నకున్నాడు విజయుడు. వీరమలా

విషయమునంతను రూఢిపరచినాడు.

"ప్రభువు లిప్పటికైనను మహామంత్రులకు దర్శనమిత్తురా ?" పెద్దన యడిగినాడు.

ఆసవాని దుర్గమునుండి వచ్చి కుట్రసల్పినవానిని కొనివచ్చి సైనికులు ప్రవేశపెట్టి ఆతని కనులకు కప్పిన గంతను విప్పినారు.

ఎచ్చట తానున్నది ? మహారాజు ముందు. విజయుడు తమ్మెట్లు వంచించినాడో వాని కర్థమైనది. వారికి నిజము తెలిసినది. తానిక దాచి ప్రయోజనము లేదు. ఎదుట వీరమల్లు ఖడ్గహస్తుడై నిలబడియున్నాడు. వీరమల్లును గుర్తించినాడాతడు.

"నీ వెవ్వరి గూఢచారివి ? నిజమును పల్కుము. నీ ప్రాణములు రక్షింపబడును. మాకు విషయమంతయు తెలిసినది, ఇక మీ రాజులు తప్పించుకొని పోలేరు" రాయలు గర్జించినాడు.

"ఆదవాని గూఢచారిని" వణకుచు ప్రత్యుత్తరమిచ్చినాడు గూఢచారి.

"ఈ కుట్ర నొనర్చినందుల కెవరెంత ద్రవ్యమిచ్చినారు నీకు ?"

"తిమ్మన పదివేల వరహాలు, వీరభద్రగజపతి పదివేలు యిచ్చినారు. ఇందు ప్రాణములు బాసిన ప్రతియొక్కరి కుటుంబమునకు రెండు వేల వరహాల నెక్కువగా నిచ్చునట్లు ఒప్పుకొనినారు."

"వీనినిక కొనిపోయి యావజ్జీవ కారాగారశిక్ష విధింపుడు. మిగిలినవారందరు నిజము నొప్పుకొనిన ప్రాణములుంచి శిక్షవేయుడు. లేని యెడల మరణశిక్ష" రాయలు శిక్ష విధించినాడు.

రాయల దుఃఖమున కవధిలేదు. "పెద్దనా ! నిరపరాధి, కన్నతండ్రి కన్న మిన్నగా నను గాపాడినాడు. ప్రాణదాత ! అప్పాజీకి క్రూరమైన శిక్ష విధించితిని. నా పాపమునకు నిష్కృతి యున్నదా ?" పశ్చాత్తాపాగ్ని ఆతని దహించుచున్నది.

"ఆ శిక్ష నమలుపరచుటకు సమయము యింకను వారము దినములున్నది. రాజద్రోహియను అపవాదమే అప్పాజీవంటి దేశభక్తునకు మరణశిక్ష. ఆ మానసిక మరణశిక్ష నాతడప్పుడే యనుభవించినాడు.

మహారాజా ! ఈ చరమకాలమందైన ఆతని యాత్మకు శాంతి నొసగూర్పుడు." పెద్దన యర్థించినాడు.

"ఏముఖముంచుకొని యాతని ముందున కరుగుదును పెద్దనా ?" చేతులలో ముఖముంచుకొని యనినాడు రాయలు.

"కోపతాపములెరుగని రాజకీయ తాపసి యాతడు. తన రాజు కొరకు రాజ్యముకొఱకు తన సర్వస్వమును ధారపోసిన మహనీయుడాతడు. మనకు తండ్రివంటివాడు. పొరపాటులనెన్ని యాతడు క్షమింపలేదు ?" పెద్దన యనినాడు.

"మహామంత్రియే నను స్వయముగ చూడగోరినాడా పెద్దనా ? తనకింతటి ద్రోహము తలంచిన కృతఘ్నుడైన రాజును దర్శింపగోరి కాబోలును."

"లేదు మహారాజా ! తన చేత పెంచి పెద్దచేయబడిన కుమారుని చరమదశయందు చూడగోరుట మానవ నైజము."

"రాలేను పెద్దనా ! ఆ మహాత్ముని దర్శించు ధైర్యము నాలో లేదు." అని పెద్దగా విలపించినాడు రాయలు.

సేవకుడొకడు దుమారము వలె లోనికరుదెంచి మహారాజునకు మ్రొక్కినాడు. పరువెత్తుటచే రొప్పుచున్నాడతడు.

"ఏమైనది ?" పెద్దన యడిగినాడు.

"మహామంత్రి తిమ్మరుసులవారు........

చిత్రప్రతిమలవలె నాతనివైపు చూచుచు చేష్టలుడిగి నిలచినారు రాయలు పెద్దన.

"మరణించినారు !" పూర్తియొనర్చినాడు సేవకుడు.

"అప్పాజీ !" అని పెద్దగా కేకవైచి నేలపై విరుచుకొని పడిపోయినాడు కృష్ణరాయలు.

అంతఃపురమంతయు గొల్లుమనినది. రాజవైద్యు లరుదెంచినారు.

# ముప్పదినాల్గు

రెండు సంవత్సరములీ కాలగర్భమున కలిసిపోయినవి. అప్పాజీ మరణ మాంధ్రసామ్రాజ్యములోని, సామ్రాజ్యాధిపతిలోని శక్తి సామర్ధ్యముల హరించుకొని పోయినది.

ముద్దునాగ జ్ఞాపకార్థమై రాయలు తన స్వంతపర్యవేక్షణక్రింద నాగపురమును (నాగలాపురమును) నిర్మింపజేసినాడు. ఆ నగర సౌందర్యమును నాగసౌందర్యమునుపోల్చికొని మనశ్శాంతి నందువాడు రాయలు.

సాలగరాజు ప్రధాని యైనాడు. అళియ రామరాయలెల్లప్పుడు రాయలవెంట నుండువాడు పెద్దనను రాయలు వదలుట లేదు. వారిరువురు సమయము చిక్కినపుడు భగవదన్వేషణాచింతయందు మునిగిపోవుచుండెడివారు. ఐహికముకన్న ఆముష్మికచింతనయే వారియందెక్కువై నది.

అప్పాజీ మరణమునకు తాను కారకుడను నొక గాయమైనవా రాయని హృదయమందు. అది మానునట్టి గాయము కాదు. వైద్యులకు లొంగని మనోవ్యాధిగా నది పరిణమించినది. ఎందరెన్నివిధముల హెచ్చరించినను మహారాణులెంత ప్రార్థించినను రాయల హృదయబాధ తీరలేదు. అతడు రెండు పర్యాయములు తిరుపతియాత్ర కరిగి శ్రీ వేంకటనాథుని దర్శించుకొని వచ్చినాడు. తిరుమలేశుని ముందున్న కాలమంతయు ప్రశాంతమే. తిరిగి విజయనగరమున కాలిడగనే పూర్వస్మృతులతో నాతని హృదయము ఛిన్నాభిన్నమగుచున్నది.

రాయలు మంచము పట్టినాడు. ఆతడేదియో ఆలోచించును, ఏమో పలువరించును. పెద్దనామాత్యునితో మాటాడును. రాయల స్థితి నానాటికి క్షీణించిపోవుచున్నది.

అళియరాముడిప్పుడు సర్వసైన్యాధ్యక్షుడుగా అష్టప్రధానులలో రెండవవాడుగా నున్నాడు.

ఆనాడు కళకళలాడు విజయనగర రాజాంతఃపురములు వన్నెదక్కి సందడిలేక యున్నవి. అందెల చిరుమువ్వల రవళితో, మంజీర మంజుల ధ్వనులతో నడయాడు సుందరాంగులు కాలి మెట్టియల ధ్వనులుకూడ వినరానంత నిశ్శబ్దముగ నడుచుచున్నారు. సుఖసంతోషముల కాకరమై

ఆనందవిలసమగు నా మందిరము నిశ్శబ్దదేవతా మందిరమైనది. మృత్యుదేవత తన నిష్ఠురతర కబంధహస్తమును అటువైపు చాచినది.

మూరురాయరగండ శ్రీకృష్ణదేవరాయ నృపతి నాహ్వానించుచున్నది నిశ్శబ్దముగ ప్రశాంతముగ మృత్యుదేవి. రాయలతిప్రమాద స్థితియందున్నాడు. రాజవైద్యులందరు తమ మహారాజును బ్రతికించుకొనుటకై అహోరాత్రములు కృషియొనర్చుచున్నారు.

ఆయువు తీరిన తరువాత మృత్యుదేవతాహ్వానమైన పిదప ఆత్మయీ కళేబరమును వదలుటకు నిశ్చయించుకొనిన యనంతరము ఈపాంచభౌతికశరీరమున ప్రాణజ్యోతిని నిల్పుట కెవ్వరు సమర్థులు?

కృష్ణరాయలు కనులు తెఱచినాడు హఠాత్తుగా. అచట నున్నయందఱ ముఖములం దాశాజ్యోతి తళుక్కుమనినది. రాజవైద్యుని ముఖము మ్లానమై కళావిహీనమైనది. అతడాందోళనమందినాడు. సమయముగాని సమయమున వచ్చినదా తెలివి రాయలకు. చంద్రాస్తమయమునకింకెంతో కాలములేదు. ఆ చంద్రాస్తమయము తోడనే రాజచంద్రుడు అస్తమింపగలడు. రామరాయలా వైద్యుల యాందోళనమును గమనించినాడు. ఏమది యనునట్లు చూచినాడు ప్రధానవైద్యుని వైపు.

"మా సేవ పూర్తియైనది. తామిక మహారాజులతో మాట్లాడవచ్చును. ఇక రెండు గడియలకాలము మాత్రమే మిగిలియున్నది. విజయనగర సామ్రాజ్యచంద్రుడస్తమించుటకు." అనుచు దుఃఖాతిరేకమున వచ్చు కన్నీటిని దుడిచికొనినాడు ప్రధానవైద్యుడు.

"రామరాయా!" క్షీణస్వరమున బిలచినాడు రాయలు.

రామరాయలు మహారాజులకడకు నడచి నిలచినాడు.

"రామరాయా! ఈ సామ్రాజ్యమేమగును?" రాయలు ప్రశ్నించినాడు.

"తాము స్వస్థులగుదురు. తమ చల్లనిపాలనమున ఈరాజ్యము సుభిక్షమగును." వచ్చుచున్న దుఃఖమాపుకొని రామరాయలనినాడు.

పేలవమగు చిరునవ్వు రాయలముఖమున విరిసినది.

"రాయా! భగవానుడగు వేంకటశైలపతి నను బిలుచుచున్నాడు.

ఈ సామ్రాజ్యము నాతరువాత ఛిన్నాభిన్నము కారాదు. అందులకు నీవు ప్రతినగైకొనవలయును." రాయలనినాడు.

అచటివారలకు అర్థముకాలేదు ఆ వాక్యములు. రామరాయలనే రాజుగా నొనర్ప రాయలు కోరుచున్నాడని వారు తలంచినారు.

"తమ యాజ్ఞను శిరమున ధరించి నెఱవేర్తును. నను మీ రనుమానింప పనిలేదు. ఆజ్ఞ యిండు." రామరాయలనినాడు.

"నావంశమునమిగిలిన దచ్యుతరాయలు.ఆతడే సింహాసనమెక్కుట నావాంఛితము.ఆతనికిప్రధానిగానీవు నియుక్తుడవుకావలయునుఇదినా అజ్ఞ."

ఒరనుండి ఖడ్గమును లాగి ఖడ్గహస్తుడై ప్రతిననొనర్చినాడు రామరాయలు- "ప్రభువులాజ్ఞాపించుచున్నారు. ఈ సర్వ విజయనగర సామ్రాజ్యమునకు మహారాజుగా శ్రీ శ్రీ శ్రీ అచ్యుతదేవరాయలు నియమింపబడినారు. వారికి సర్వశిరఃప్రధానిగా రామలాయలనైన నన్ను ప్రభువులు నియమించినారు. ఈ రెండుకార్యములు నిర్వర్తించుటకు నా ప్రాణముల పణముబెట్టి కృషియొనర్తును." అనుచు ఖడ్గమంటి ప్రమాణ మొనర్చినాడు రామరాయలు.

"పెద్దనా !" రాయలు పిలచినాడు.

పెద్దన రాయలకడ నిలచినాడు. ఆతని చేతిని రాయలు తన చేతిలోనికి తీసికొనినాడు.

"మిత్రమా ! నా యనంతరమీ విజయనగరముననే నివసించి అష్టమంత్రులలో నొకరుగా నీ రాజ్యమును నీవు సేవించుట నా కోరిక ." యనినాడు రాయలు.

"మహారాజా ! కృష్ణరాయల యనంతరము మఱియొక రాజును సేవింపను. ఇంకొక రాజును గూర్చి ఒక్క పద్యమైన పలుకను. ఇకపై ఈ విజయనగరమందు నిలువను. తాములేని ఈ నగరము నాకు శ్మశానతుల్యము. నే నా శేషశైలవాసునిసేవింప నఱుగుట కనుజ్ఞ నొసంగుడు. తాముండునంతదనుకనే నాకిట స్థానము. అపై నాకిట నేమియు లేదు."కన్నీరు గార్చుచు ననినాడు పెద్దన.

రాయలాశ్చర్యముగ జూచినాడాతనివైపు. "నీ స్నేహమతిస్నిగ్ధము పెద్దనా ! శ్రీ వేంకటనాధుని శ్రీరంగనాధుని సుఖముగ సేవించుకొనుము. స్వర్గమున నీ కొఱకెదురుచూచుచుందును. నాకొఱకచ్చట నాగ వేచి యున్నది."

ఆతఁడొక్కక్షణము కన్నులు మూసికొనినాడు.

మహారాణులరుదెంచినారు. వారితో నొకటిరెండుసునయవాక్యములు పల్కి తన నిర్ణయమును వారికి తెలిపినాడు రాయలు.

తిరిగి యాతనికి ఆవశత కలిగినది. "గోవింద ! రమామనోరమణ ! వేంకటశైలపతీ! అనాధనాధా !" యనినాడు రాయలు.

"అప్పాజీ! ఎందులకా క్రోధము? ఈ నిర్ణయము నీకు బాధకల్గించినదా? అవును. నీవు నిరపరాధి వప్పాజీ, క్షమింపుము, క్షమింపు"మనినాడు రాయలు.

"నాయనా ! తిమ్మరాయా ! రమ్మురమ్మ"నుచు చేతులు జాపినాడు. ఆతని పెదవులపై చిరునవ్వు వెలిగినది.

"నాగా !" యనినాడాతడు బిగ్గరగా. "రమ్మునాగా, నీకొరకే వచ్చుచున్నాను. నీవులేని ఈ రాజ్యము రాజ్యము కాదు. రమ్ము నాగా రమ్ము! నీ ప్రభువు నీకొఱకు పడు బాధను చూడలేవా?" అనుచుచేతులు జాచి హృదయమునకు హత్తుకొనినాడు రాయలు.

ఆముఖమున చిరునవ్వు అట్లే యున్నది. విరిసిన పద్మమువలె నున్నదా ముఖము.

"వేంకటేశ్వరా ! రమాపతీ! శేషాచలపతీ ! నను బిలచుచున్నావా ! వచ్చుచున్నాను స్వామీ ! వ-చ్చు-చు-న్నా-ను-!-" ఆతని హస్తములు లేచి నమస్కరించిన వెవరికో ! నమస్కరించిన హస్తములొక్కక్షణము అట్లేయుండి వాలిపోయినవి. తిరిగి ఆ హస్తములు లేవలేదు.

సర్వాంధ్ర సామ్రాజ్యాధిపుడు అంతిమశ్వాసను విడచినాడు. ఆతని ప్రాణవాయువులీ యనంతవాయుపథమున లీనమైనవి.

అంతఃపురము రోదనలతో నిండిపోయినది. కోటయంతయు విచారమయమైనది, విజయనగర మంతయు విచారసంద్రమున దోగినది.

ఆంధ్ర కర్ణాట దేశమంతయు దక్షిణాపథమంతయు వనవి వనవి విలపించినది. దక్షిణహిందూదేశముననే విపార మేఘములు క్రమ్ముకొనినవి.

హిందూమాత మనాథయైనది. తనను పోషించి యాదరించు మహారాజునది కోల్పోయినది. నాటినుండి నేటివరకా లోటు తీరలేదు మహోన్నత మతమునకీ ఆంధ్రమున కర్ణాటమున.

కవిపండితుల కాకరమైన విద్యానగరము తన ప్రభువును కోల్పోయినది. దక్షిణహిందూదేశమే విద్యను కోల్పోయినది.

సర్వవిద్యాపారంగతుడైన, సర్వ కళాకుశలుడైన, కవిపండితుడైన. సకలరాజనీతివిశారదుడైన ప్రభువు తిరిగి జన్మింపలేడు. ఆతడు పునరావృత్తిరహిత మోక్షపథమున ప్రవేశించినాడుకాబోలు!

ఆతని మరణమును గాంచిన పెద్దన యిట్లు విలపించినాడు—

"బోరన యాచక ప్రతతి భూరి విపద్దశనందుచుండగా
నారయ శాలివాహన శతాబ్దము లద్రియుగాబ్ధి సోములం
దారణ వత్సరంబున నిదాఘదినంబున మాఘశుద్ధ ష
ష్ఠీ రవివాసరంబున నృసింహుని కృష్ణుడు జేరె స్వర్గమున్
ద్వారకనున్న కృష్ణు డవతార సమాప్తిని జెందుకైవడిన్!"

## ముప్పది యైదు

దుర్గదుర్గమున నున్న అచ్యుతరాయలరుదెంచి విజయనగర రాజ్యాభిషిక్తుడైనాడు.

రాయల మరణవార్త వినిన వీరభద్రగజపతి సేనతో విజయనగరమును ముట్టడింప నరుదెంచినాడు.

తిరుపతికి చేరబోవుచున్నాడు పెద్దన. ఉమాదేవి వెంట మేఖల బయలుదేరినది. వీరమల్లు తన పదవిని వదలుకొని పెద్దనవెంట సకుటుంబముగ బయలుదేరినాడు.

ఇరువదేడులు సర్వ సౌఖ్యముల నోలలాడించి అనంత యశమును సంపాదించిపెట్టిన ఆ విజయనగరమును వదలుట పెద్దనామాత్యునకు బాధకలిగించినది.

శఠగోప యతీశ్వరుడు తిరుమలనాథుని సేవించుట కరుదెంచి పెద్దనకు శ్రీముఖ మంపినాడు. దాని నందుకొని పెద్దన ప్రయాణమైనాడు శ్రీ వేంకటేశుని పాదపద్మముల సన్నిధికి.

విజయనగర ప్రజ కన్నీటితో నతనికి వీడ్కోలొసంగినది ముక్కు తిమ్మనార్యుడంతకుమునుపే పరమపదించినాడు.

కవిపండితులాతని వెలవు గైకొని వెనుదిరిగినారు.

అచ్యుతరాయల, రామరాయల ప్రార్థనములా ఆంధ్రకవితా పితామహు నాపజాలకపోయినవి.

ఆ కవీశ్వరుని చరమజీవితము సుఖముగా జరిగిపోవుటకై ధనము ఆతనికంటె ముందాతని గమ్యమునకు తరలించినాడు రామరాయల సలహాపై అచ్యుతరాయలు.

కోట దాటినాడు పెద్దన, విజయనగరమువైపు నీరునిండిన కన్నులతో చూచి చేతులెత్తి నమస్కరించినాడు.

సేవకుడొక్కడు రోజుచు వచ్చి నిలచినాడు. "వీరభద్ర గజపతి సైన్యములు వచ్చి కోట ముట్టడింపబోవుచున్నవి. తాము కోటలోనికి వచ్చుట శ్రేయస్కరమని సర్వసేనాపతి విన్నప" మని నుడివినాడు.

ఈ సమయమున గజపతి చర్యకు పెద్దనకాగ్రహావేశము కలిగినది. ఒక తాళపత్రముపై పద్యమును లిఖించినాడు—

"రాయ రాహుతగండ రాచయేనుగు వచ్చి
యారట్లకోట గోరాడునాడు,
సంపెటనరపాల సార్వభౌముడు శీవి
సింహాద్రి జయశిల జేర్చునాడు,
వెలగోలు సింహంబు జేరి దిక్కతి గంచు
తలుపుల గరులు డీకొల్పునాడు,
ఘనతర నిస్సర గండపెండెరమిచ్చి
కూతు రాయల కొనగూర్చునాడు,

నాడలెరుంగవా ? చచ్చితొ ? యుర్విలేవొ ?
చేరజాలక తల చెడి జీర్ణమైతొ,
కన్నడం బెల్లిచొచ్చెదు గజపతీంద్ర ?
తెరచినిలు కుక్క సొచ్చిన తెలుగురోవ.

తన సేవకునకొసంగి యీ పద్యమును వీరభద్రగజపతికిగాని ప్రతాప రుద్ర గజపతికిగాని నెవ్వరైన ఇచ్చుట కాజ్ఞాపించి, తిరుమలవైపు తమ ప్రయాణమును సాగించినాడు పెద్దన.

ఆ పద్యమును గాంచిన ప్రతాపరుద్ర గజపతి సిగ్గుతో తల వంచి నాడు. ఆతని యభిమానమే దెబ్బతినినది. తానొనర్చిన దెంతటి నీచ కార్యమో తెలిసికొనినాడాతడు. సైన్యములను వెనుకద్రిప్పుకొని వెడలి పోయినాడాతడు కళింగమునకు.

సందయాత్రనుగూర్చి వినిన రామరాయామలకిది చిత్రమును కల్గించినది. సేవకుడు పెద్దన పంపిన పద్యము విషయము తెల్పినాడు.

తిరుమలజేరిన పెద్దన పెదతిరుమలయ్య యింట విడిసిన శఠగోప యతీశ్వరులకడకే యరిగినాడు. అప్పటికి పెదతిరుమలయ్య సుదర్శన చక్రోపాసన మొనర్చుచున్నాడు —

"ఓంకారాక్షర యుక్తము చక్రము
సొంక మధ్య వలయాంతర చక్రము
సర్వఫలప్రద సహజము చక్రము
పూర్వకోణ సంపూర్ణము చక్రము
విహ్వలితనరక వీరకచక్రము
సైంహికేయగళ సంహారచక్రము
కల్హారమాలికాధర చక్రము
సిల్హధూప సంశ్లిష్టము చక్రము
భావించు సుజన పాలన చక్రము
శ్రీ వేంకటపతి చేతిది చక్రము (సుదర్శనర గడ)

తన్మయుడై పఠించుచున్నాడు తాళ్ళపాక పెదతిరుమలయ్య. ఆవశుడై వినినాడా సుదర్శన నుతిని పెద్దన.

"ఎవరు స్వామీ తాము?" పెదతిరుమలయ్య యడిగినాడు.

"నేనొక స్వామి సేవకుడను. పెద్దన యందురు నన్ను" అనినాడు పెద్దన.

"ఏ పెద్దన? అల్లసాని పెద్దన కాదుగద?" అనుచు లేచి నమస్కరించినాడు పెదతిరుమలయ్య.

"సుఖీభవ నాయనా! గురువులవారెచ్చట?"

తాను వినిన పెద్దనను గాంచుట తిరుమలయ్య కానందదాయకమైనది. లోనికరిగి శఠగోపయతికి పెద్దన రాకనుగూర్చి తెల్పినాడాతురతతో.

శఠగోప యతీశ్వరునికడకరిగి సాగిలి మ్రొక్కినాడు పెద్దన.

"ఎట్లున్నాడవు పెద్దనా?"

"నే నెట్లుందును స్వామీ! సకలాంధ్రసార్వభౌము డరిగినాడు!" అతని కన్నుల బాష్పప్రవాహము జాలువారినది. కంఠము గద్గదికనందినది.

"ఎదురైనచో తన మదకరీంద్రము నిల్పి
కేలూత యిచ్చి యెక్కించుకొనియె,
మనుచరిత్రంబందుకొనువేళ బురమేగ
బల్లకి తన కేల బట్టి యెత్తె,
బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదని నాదు పాదమున దొడిగె,
గోకట గ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమల యందు నిచ్చె,
నాంధ్ర కవితాపితామహ యల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్ను పిలచునట్టి
కృష్ణరాయలతో దివి కేగలేక
బ్రతికియున్నాడ జీవచ్ఛవంబనగుచు!"

అని తన యావేదనను వెలిబుచ్చినాడు పెద్దనార్యుడు.

"పెద్దవా! ఈ యశాశ్వత శరీరముకొఱకంగలార్చవలసిన పని లేదయ్యా. యశఃకాయుడైన నీ రాయలాంధ్రప్రజలలో నొక్కడు జీవించి

యున్నను తాను జీవించి యుండెడువాడు. ఆతనిగూర్చి విచారించుట ఆతని యాత్మ కపచారము గావించుటమాత్రమే. ఆంధ్రప్రజల రక్తములో అణువణువున రాయల యంశ చేరియున్నది! నాయనా అలసినవాడవు. విశ్రాంతినందు"మని తీర్థప్రసాదము లొసంగినాడు శఠగోపాచార్యుడు.

పెదతిరుమలాచార్యుని గానమాధురి మరునటి వేకువ పెద్దనను మేల్కొలిపినది. సర్వప్రకృతినా గానము జాగృతమొనర్చినది. శ్రీ తిరువేంగళనాథుడే మేల్కొనినాడు!

"శ్రీకర వేంకట క్షితిధరవాస!
నాకేశనుత! రమానాథ! మేల్కొనుము,
వసుదేవ దేవకీ వరగర్భ జాత!
కిసలయాధర! రామకృష్ణ! మేల్కొనుము.
భోజ కన్యా ముఖాంభోజద్విరేఫ!
రాజీవనయనాభిరామ! మేల్కొనుము
మంజుల సత్యభామా మనస్సంగ
రంజిత గోత్రసంరంభ మేల్కొనుము.
తారుణ్య మిత్రవిందాకుచ మధ్య
హార సంయోగవిహార! మేల్కొనుము.
కవిత నక్రగ్రాహ గంభీర జలధి
వలయిత ద్వారకావాస, మేల్కొనుము.
జలద నీరశ్యామ! జగదభిరామ!
వెలయ మేల్కొనుమని విన్నవించెదను"

మేల్కొల్పును వినుచు లేచివచ్చి, తంబురమీటుచున్న పెదతిరుమలయ్య కెదురుగ నిలచినాడు పెద్దనామాత్యుడు. ఆతనిలోని భక్తిని మేల్కొలిపినదా గీతము.

"రమానాథా! శ్రీ శేషశైల నివాసా! శ్రీనివాసా!" యనుచు వృద్ధుడైన తాళ్ళపాక అన్నమాచార్యుడు భక్తిగానము కావించు కొనుచున్నాడు. అది పెద్దన యాస్థితికి ఉపశాంతి నొసంగినది.

"ఆకటివేళల నలపైన వేళలను
తేకువ హరినామమే దిక్కు మరిలేదు (పల్లవి)

ఆపద వచ్చిన వేళ నారడి పడినవేళ
పాపపు వేళల భయపడినవేళ
ఓపినంత హరినామమొక్కటే గతిగాక
మాపుదాకా పొరలిన మరిలేదు దిక్కు—(ఆక)

సంకెల పెట్టిన వేళ చంప పిలిచిన వేళ
అంకిలిగా నప్పులవా రాగినవేళ
వెంకటేశు నామమే విడిపించ గతిగాక
మంకుబుద్ధి పొరలిన మరిలేదు తెలుగు—(ఆక)"

ఈ స్థితిలో తనకా కీర్తనము మార్గము చూపుచున్నది. తన కింక యుత్తరము లేదు. శ్రీవేంకటేశుని సేవయొక్కటియే తరణో పాయము.

పుష్కరిణియందు స్నానమాడి ప్రశాంతికాకరమగు శ్రీ వేంకటేశ్వరుని సన్నిధికరిగి చేతులు జోడించి నిలచినాడు భక్తితన్మయుడై ఆనందబాష్పయుతుడై — అల్లసాని పెద్దనామాత్యుడు! ఆంధ్రకవితా పితామహుడు!

మంగళమ్

సంపూర్ణము